# జె. కృష్ణమూర్తి



# ముందున్న జీవితం



సోల్ డిస్ట్రిబ్యూటర్స్:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాదు-500 001.

**MUNDUNNA JEEVITHAM** Telugu Translation of 'Life Ahead'
Translation into Telugu by **Sarojini Premchand**

ప్రతులు : 1000

తొలి ముద్రణ : కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియా, 1991

ద్వితీయ ముద్రణ : జనవరి, 1999



వెల: రూ. 60-00



ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్-500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్: 3229831

# ప్రస్తావన

జె. కృష్ణమూర్తి (1895–1986) విశ్వవిఖ్యాత తత్త్వవేత్త. ప్రపంచంలోని వివిధ దేశాలను పర్యటిస్తూ, అరవయి సంవత్సరాలపాటు ప్రజలకు జీవన సందేశాన్ని తమ ప్రసంగాల ద్వారా అందజేశారు.

"ఒక నిర్దిష్టమైన మార్గం ద్వారా 'సత్యాన్ని' చేరలేము. 'సత్యం' అనేది మార్గంలేని ప్రదేశం. సంస్థల ద్వారా, నమ్మకాల ద్వారా, పూజా పురస్కారాల ద్వారా, గురువుల ద్వారా దాని చెంతకు చేరలేము. ఆధ్యాత్మిక బోధనలవల్ల, మానసిక వికాసానికై చేసే ప్రక్రియల వల్ల దానిని అందుకోలేము. ఇతరులతో గల పరస్పర సంబంధాలు అనే దర్పణం సహాయంతో మనలను మనము పరిశీలన చేసుకొని అర్థం చేసుకొనడం ద్వారా మాత్రమే యీ పని సాధ్యం అవుతుంది."– అని వక్కాణించారు.

కృష్ణమూర్తి ఉపన్యాసాలు, రచనలు అన్నీ యింగ్లీషులోనే సాగాయి. భారతీయ భాషలు కొన్నింటిలోకి కొన్ని ప్రసంగాల, పుస్తకాల అనువాదం యిప్పటికే జరిగింది. కృష్ణమూర్తి ఆలోచనా స్రవంతిని యథాతథంగా, యితర భారతీయ భాషలలో సరళమైనశైలిలో అందించాలనే ఉద్దేశంతో కృష్ణమూర్తి ఫౌండేషన్ యిండియా స్వయంగా అనువాద కార్యక్రమాలను ఆరంభించింది. ఆ ప్రయత్నంలో భాగంగా తెలుగు, తమిళం, మలయాళం, కన్నడ భాషలలో అనువాదాల ప్రచురణను మద్రాసు కేంద్రంగా చేసుకొని నిర్వహిస్తున్నాము.

ఈ పుస్తకాల సహాయంతో కృష్ణమూర్తి ఆశించిన నవ మానవ ఆవిర్భావం, నవ్య సమాజ అవతరణ గురించి చదువరులు తమ తమ భాషల్లోనే చదివి అర్థంచేసుకొనడానికి వీలవుతుందని ఆశిస్తున్నాం. కృష్ణమూర్తి తత్త్వదర్శనాన్ని తరచి చూసుకొని, అవగాహన చేసుకొనడానికి, ఆచరణలోనికి తీసుకొనిరావడానికి యీ పుస్తకాలు దోహదం చేస్తాయి. పాఠకులు వీటిని ఆదరిస్తారని నమ్ముతున్నాము.

ఎ. గజాననరావు
సమన్వయకర్త
దక్షిణ భాషల అనువాద విభాగం
కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా

వసంత విహార్,
గ్రీన్ వేస్ రోడ్డు,
మద్రాసు – 600 028.

# విషయ సూచిక



# ప్రశ్నల సూచిక

## మొదటి భాగం

## రెండవ భాగం

### అధ్యాయం 1

## అధ్యాయం 2



## అధ్యాయం 3

★ ★ ★

# పరిచయం

రోజు రోజుకీ పెరిగిపోతున్న సంక్షోభాలతో, సమస్యలతో నిండివున్న మన ప్రపంచానికి ఒక సరిక్రొత్త తీరులో వుండే నీతి, నడవడిక; వీటితోపాటు జీవిత విధానాన్ని అంతటినీ ఆకళింపు చేసుకోవడంలోనుండి ఉద్భవించే ఒక కార్యాచరణ రావలసిన తక్షణావశ్యకత వున్నదని నాకు అనిపిస్తున్నది. రాజకీయ విధానాల ద్వారా, వ్యవస్థాపరమయిన విధానాల ద్వారా, ఆర్థిక సంబంధమయిన సర్దుబాట్ల ద్వారా, వివిధ రకాల సంస్కరణల ద్వారా యీ సమస్యలతో వ్యవహరించాలని మనం ప్రయత్నిస్తాం; ఇవి తాత్కాలికమయిన ఉపశమనాన్ని యివ్వగలవు తప్ప మానవ జీవితంలోగల సంక్లిష్టమయిన కష్టాలకు వీటిలో ఏ ఒక్కటీ పరిష్కారం చూపలేదు. సంస్కరణలన్నీ అవి ఎంత విస్తృతమయినవి అయినా, చిరకాలం నిలిచిపోయేవిగా కనబడినా, తిరిగి మరికొంత అల్లకల్లోలం సృష్టించి, మరికొన్ని సంస్కరణలు చేయవలసిన అవసరాన్ని కలిగిస్తాయి. సంక్లిష్టమయిన మానవ స్వభావం గురించి అవగాహన చేసుకోకుండా సంస్కరణలు జరిపితే, అస్తవ్యస్త పరిస్థితికీ, ఆపైన మరికొన్ని సంస్కరణల అవశ్యకతకు అది దారి తీస్తుంది. సంస్కరణలకు ఒక ముగింపు అంటూ వుండదు; ఈ మార్గం ద్వారా సమూలమయిన పరివర్తనం జరగదు.

రాజకీయ, ఆర్థిక, సామాజిక విప్లవాలు కూడా దీనికి సమాధానం కావు. ఎందుకంటే, అవి భయంకరమయిన నిరంకుశ పాలనలకు దారితీస్తాయి; లేదూ అధికారం, ఆధిపత్యం కేవలం వేరొక కూటమికి బదలాయింపు చేయడం మాత్రమే సాధిస్తాయి. ఇటువంటి విప్లవాలు మన అల్లకల్లోలాన్ని, సంఘర్షణలను రూపుమాపే మార్గాలు ఏనాటికీ కాలేవు.

మనం చిక్కుకుని పోయిన యీ అంతులేని నానా రకాల ఆదుర్దాల నుండీ, సంఘర్షణల నుండీ, ఆశాభంగాల నుండి బయటపడాలంటే ఒక విప్లవం – పూర్తిగా విభిన్నమయిన ఒక విప్లవం మాత్రం తప్పనిసరిగా జరగవలసి వుంది. ఈ విప్లవం సిద్ధాంతాలు, ఊహాకల్పనలతో ఆరంభమయినట్లయితే చివరకు నిరర్థకమయినదిగానే తేలిపోతుంది; అందువల్ల మనసులోనే ఒక సమూలమయిన పరివర్తనం జరిగి యీ విప్లవం ఆరంభం కావాలి. సవ్యమయిన విద్యావిధానం, మానవుని సర్వతోముఖ వికాసాల ద్వారా మాత్రమే అటువంటి సంపూర్ణ పరివర్తనాన్ని తీసుకొని రావచ్చును. ఈ విప్లవం ఒక్క ఆలోచనలోనే కాకుండా, మొత్తం మనస్సులోనే జరగవలసి ఉంది. ఆలోచన అనేది ఒక ఫలితమే తప్ప అదే అసలు మూలం కాదుగదా! మూలంలోనే సంపూర్ణమయిన మార్పు జరగాలి తప్ప, ఫలితాన్ని మార్చడంతో సరిపోదు. ప్రస్తుతం

మనం ఫలితాలను, లక్షణాలను మాత్రం కాస్త సవరించి చక్కబెట్టెయ్యాలని చూస్తున్నాం. కాని, ప్రధానంగా రావలసిన మార్పును తీసుకు రావడంలేదు. అంటే, పాత ఆలోచనాధోరణులను నిర్మూలం చేయడంలేదు; సంప్రదాయాల నుండి, అలవాట్ల నుండి, మనసును విముక్తం చేయడంలేదు. మనం అపేక్షించవలసినది యిటువంటి ప్రధానమయిన మార్పును; సవ్యమయిన విద్యావిధానం మాత్రమే దీనిని తీసుకొని రాగలుగుతుంది. తరచి విచారణ చేయడం, నేర్చుకొనడం మనసు చేసే పని. నేర్చుకొనడం అంటే నా అర్థం కేవలం జ్ఞాపకశక్తిని అలవర్చుకొనడంగాని, జ్ఞానాన్ని పోగు చేసుకొనడంగాని కాదు; స్పష్టంగాను, హేతుబద్ధంగాను, భ్రాంతికి లోనవకుండాను ఆలోచించ గలిగే శక్తి సామర్థ్యం; నమ్మకాలతో, ఆదర్శాలతో కాకుండా వాస్తవాలతో ఆరంభించడం. ఆలోచనలు కనుక నిర్ణయం. చేసివేసిన వాటినుండి ఆవిర్భవిస్తే అప్పుడు నేర్చుకోవడం అనేది వుండనే వుండదు. కేవలం సమాచారం గాని, జ్ఞానం గాని సంపాదించడం అనేది నేర్చుకోవడం కాదు. నేర్చుకోవడం అంటే అవగాహన చేసుకోవడంపై ప్రేమ; ఆ పని చేయడం అంటే ప్రేమ కాబట్టి చేయడం అని అర్థం. ఏ విధమయిన నిర్బంధమూ లేనప్పుడే నేర్చుకోవడం అనేది సాధ్యమవుతుంది. నిర్బంధం అనేక రూపాల్లో దర్శనమిస్తుంది. అవును కదూ? పలుకుబడిని ఉపయోగించడం ద్వారా, మమతా మమకారాల ద్వారా లేక బెదిరింపుల ద్వారా, చెప్పి ఒప్పించి ప్రోత్సహించడం ద్వారా, ప్రతిఫలం యివ్వజూపే మృదువైన పద్ధతుల ద్వారా నిర్బంధాన్ని అమలు జరుపుతూ వుంటారు.

ఒకరితో మరొకరిని పోల్చి తారతమ్యాలు చూపడం ద్వారా విద్యాభ్యాసాన్ని ప్రోత్సహించవచ్చని మనలో చాలా మంది అనుకుంటూ వుంటారు; అయితే వాస్తవం మాత్రం దీనికి విరుద్ధంగా వుంటుంది. పోల్చి చూడటం విద్యార్థులలో ఆశాభంగాలను కలిగిస్తుంది. పైగా అసూయను ప్రోత్సహిస్తుంది. దీనంతటికీ పోటీ అని ఒక పేరు పెట్టడం జరుగుతుంది. నచ్చచెప్పి వప్పించే యితర విధానాల మాదిరిగానే పోల్చి చూడటం కూడా నేర్చుకొనడానికి ఒక ఆటంకం అవుతుంది. భయభీతిని పెంచి పోషిస్తుంది. ఆకాంక్షా పరత్వం కూడా భయభీతిని పెంచి పోషిస్తుంది. వ్యక్తిగతమయినది అయినాసరే, సమష్టితో గుర్తించబడేది అయినాసరే, ఆకాంక్షా పరత్వం అనేది ఎప్పుడూ సంఘ విద్రోహకరమే. దీనితో పోలుస్తే మహోత్తమమయిన ఆకాంక్ష అని మనం చెప్పుకొనేది కూడా అత్యంత వినాశనకారకమయినది.

మనసును ఒక యోగ్యమైన మనసుగా వికాసం చెందడానికి ప్రోత్సహించడం అవసరం. జీవితంలో వున్న అనేక సమస్యల సమగ్ర స్వరూపంతో వ్యవహరించగల సామర్థ్యం కలిగినదిగా మనసు వికాసం చెందాలి. అంతేకాని, ఆ సమస్యలనుండి తప్పించుకొనడానికి ప్రయత్నించి, ఆపైన ఒకదానినొకటి ఖండించుకొనే విరుద్ధ భావాలతోనూ, ఆశాభంగాల వల్ల కలిగిన వ్యధలతోను, కరకుదనంతోను నిండిపోయి నిరాశాపూరితంగా తయారయే మనసుగా కాదు. మనసుకు తన అసలు స్థితిని గురించి, తన నిబద్ధీకరణత్వం (conditioning) అంటే సంప్రదాయబద్ధత గురించి, తన లోపలి ప్రేరణల గురించి, తన వ్యాపకాలను గురించి ఎరుక (awareness) వుండటం అత్యంత ఆవశ్యకం.

ఒక యోగ్యమైన దానిగా మనసును వికసింపజేయడమే మనం ప్రధానంగా అపేక్షించేది కాబట్టి, అధ్యాపకుడు ఎట్లా బోధిస్తున్నాడు అన్నది చాలా ముఖ్యం అవుతుంది. కేవలం సమాచారం యివ్వడమే కాకుండా, మనసుని సమగ్రంగా తీసుకొని వర్ధిల్లజేయడం జరగాలి. జ్ఞానాన్ని అందజేసే ప్రక్రియలోనే విద్యాబోధకుడు చర్చలను కూడా అహ్వానించాలి; విద్యార్థులలో విచారణశీలత్వాన్నీ, స్వతంత్రంగా ఆలోచించడాన్నీ ప్రోత్సహించాలి.

'అన్నీ తెలిసిన వాడిని' అనే ఆధిపత్య భావానికి విద్యాబోధనలో స్థానం లేదు. తమ నడుమనగల ఒక విశిష్టమయిన సంబంధం ద్వారా బోధకుడు, విద్యార్థి యిద్దరూ విద్యాభ్యాస్యం చేస్తూ వుంటారు; అంతమాత్రాన బోధకుడు తన ఆలోచనా సరళిలో ఒక క్రమబద్ధతను బొత్తిగా వదిలెయ్యాలని కాదు. జ్ఞాన సూక్తులను ఉద్ఘాటించి చెప్పడం ద్వారా క్రమశిక్షణను అమలుపరచి, ఆ విధంగా ఆలోచనలలో క్రమబద్ధతను తీసుకొనిరావడం జరగదు; తెలివితేటలు లేదా వివేకం వర్ధిల్ల జేయాలంటే స్వేచ్ఛాయుతమైన భావాలకు చోటివ్వాలని విద్యాబోధకుడు గ్రహించినప్పుడు సహజసిద్ధంగానే ఆలోచనలలో క్రమబద్ధత అనేది ఏర్పడుతుంది. అంటే, అర్థం ఎవరికిష్టమయినది వారు చేయడానికి స్వేచ్ఛ అని కాదు; ప్రతిదానిని గురించీ వ్యతిరేక భావంతో మాత్రమే ఆలోచించడం అని కూడా కాదు. ఇది ఎటువంటి స్వేచ్ఛ అంటే విద్యార్థికి తన రోజువారీ ఆలోచనలలో, కార్యకలాపాలలో బయటపడే తన లోపలి వాంఛలు, ప్రేరణలు గురించి తెలుసుకొని వుండటానికి సహాయపడే స్వేచ్ఛ.

క్రమశిక్షణకు లోనయిన మనసు స్వేచ్ఛగల మనసు కానే కాదు; కోర్కెలను అణచివేసుకున్న మనసు కూడా స్వేచ్ఛగలది కాదు. కోర్కె అనే ప్రక్రియను, దాని సమగ్ర రూపాన్ని అవగాహన చేసుకోవడం ద్వారా మాత్రమే మనసు విముక్తి పొందగలుగుతుంది. క్రమశిక్షణ మనసు పోకడను ఒక ప్రత్యేక ఆలోచనావిధానం లేదా నమ్మకం అనే చట్రానికి లోపలగా మాత్రమే ఎప్పటికీ పరిమితం చేసి వుంచుతుంది. వుంచుతుంది కదూ? ఇటువంటి మనసు వివేకాన్ని సంపాదించడానికి కావలసిన స్వేచ్ఛను ఎన్నటికీ పొందలేదు. క్రమశిక్షణ అధికారానికి లొంగిపోయి వుండటాన్ని అలవరుస్తుంది. అది విధి నిర్వహణను నిర్దేశించే సమాజం తయారుచేసుకున్న నమూనా పరిధిలో మాత్రమే పనిచేసే సామర్థ్యాన్ని యిస్తుంది తప్ప, స్వయంగా తనకు కొన్ని శక్తిసామర్థ్యాలు కలిగి వుండే ప్రజ్ఞను (తెలివిని) జాగృతం చేయదు. జ్ఞాపకశక్తి అనే శక్తిసామర్థ్యాన్ని తప్ప మరేదీ అలవరచుకోలేని మనసు, అత్యాశ్చర్యం గొలిపే నైపుణ్యంతోనూ, నిర్దుష్టతతోనూ పని చేసినా, వట్టి యంత్రం మాత్రమే అయిన ఆధునిక ఎలక్ట్రానిక్ కంప్యూటర్ వంటిది. అధికారం మనసుని ఒక నిర్దిష్టమయిన మార్గంలో ఆలోచించమని వప్పించగలుగుతుంది. అయితే, నిర్దేశించిన మార్గాలలో మాత్రమే ఆలోచించడము, ముమ్ముందుగానే నిర్ణయం చేసిపెట్టిన వాటికే అనుగుణంగా ఆలోచించడము, అసలు ఆలోచించడమే కాదు; వట్టి మానవయంత్రంలాగా పనిచేయడం; ఆశాభంగాలను, యితర దురవస్థలను వెంటతీసుకొని

వచ్చే ఆలోచనారహితమైన అసంతృప్తికి ఆలవాలమైన వట్టి మానవ యంత్రం లాగా పనిచేయడం మాత్రమే. అది ఆశాభంగాల బాధలను, యితర దురవస్థలను వెంట తీసుకొని వచ్చే, ఆలోచనా రహితమయిన అసంతృప్తికి ఆలవాలమయిన వట్టి మానవ యంత్రంలాగా పనిచేయడం మాత్రమే.

ప్రతి ఒక్క మానవుడి సర్వతోముఖ వికాసాన్ని మనం అపేక్షిస్తున్నాం; అంటే అతను తనకి స్వంతమైన శక్తిసామర్థ్యాలలో అత్యున్నత స్థాయినీ, పరిపూర్ణ స్థితినీ అందుకోవడానికి అతనికి దోహదం చేయడం – అంతేకాని, విద్యాబోధకుని దృష్టిలో ఒక ఊహగానో, ఒక ఆశయంగానో వున్న కాల్పనికమయిన శక్తిసామర్థ్యాలు అందుకోవడానికి కాదు. అతడు ఒక విజ్ఞాన శాస్త్రవేత్త అవబోతున్నా, లేదా ఒక తోటమాలి అవడానికి తయారవుతున్నా, పోల్చిచూడడం అనే పద్ధతి ఆ వ్యక్తి యొక్క సంపూర్ణ వికాసానికి అడ్డు తగులుతుంది. పోల్చడం, తారతమ్యాలు చూడటం లేనప్పుడు ఒక తోటమాలి సంపూర్ణమయిన శక్తిసామర్థ్యాలు, వైజ్ఞానికుని సంపూర్ణ శక్తిసామర్థ్యాలు – రెండూ సమానమే; తారతమ్యాల ప్రసక్తి రాగానే పరాభవభారం, ఆపైన ఒకరిపై మరొకరికి అసూయ, వీటి వలన మనిషికీ మనిషికీ మధ్యన ఘర్షణ జనించడం మొదలవుతాయి. దుఃఖం మాదిరిగానే ప్రేమను కూడా సామ్యాలు తెచ్చి కొలతల్లో చూపలేము; ఇంతకంటె ఎక్కువ ప్రేమ అనీ, యింతకంటె తక్కువ ప్రేమ అనీ మరొకదానితో పోల్చలేము. దుఃఖమంటే దుఃఖమే; ప్రేమ అంటే ప్రేమే – అది భాగ్యవంతులలో కానివ్వండి, పేదవారిలో అవనివ్వండి.

సమాజంలోని ప్రతి వ్యక్తీ సంపూర్ణంగా వికాసం చెందినపుడు సమసమాజపు నిర్మాణం జరుగుతుంది. ఆర్థిక స్థాయిలో – లేదూ ఏదో ఒక రకమయిన మానసిక స్థాయిలో సమానత్వం సాధించడం కోసం ప్రస్తుతం జరుగుతున్న సాంఘిక పోరాటం బొత్తిగా అర్థంలేనిది. సమానత్వం స్థాపించడంకోసం ఉద్దేశించిన సాంఘిక సంస్కరణలు కొన్ని సంఘవ్యతిరేక కార్యకలాపాలను పెంచిపోషిస్తాయి. సవ్యమయిన విద్యావిధానం వున్నప్పుడు సాంఘిక సంస్కరణల ద్వారా కాని లేదా యితర సంస్కరణల ద్వారా కాని సమానత్వం కొరకు ఆరాటపడవలసిన అవసరం వుండదు; ఎందుకంటే – అప్పుడు అసూయ, దానితోపాటుగా ఒకరి శక్తిసామర్థ్యాలను మరొకరి శక్తిసామర్థ్యాలతో పోల్చిచూడటం అనేవి అంతరించిపోతాయి.

మనం యిక్కడ పదవీ ధర్మాన్ని, హోదాను పూర్తిగా విడదీసి చూడాలి. పదవీ ధర్మాలలో ఉన్నతమయినవనీ, నీచమయినవనీ తారతమ్యాలు చూపడం వల్లనే 'హోదా' అనేది ఏర్పడటం; దానికి మానసికమయిన ప్రతిష్ఠ, అధిపత్య శ్రేణికి సంబంధించిన ప్రతిష్ఠ ఒనగూడటం జరుగుతుంది. ప్రతి వ్యక్తిలోనూ అతని లోపల వుండే శక్తిసామర్థ్యాలు సంపూర్ణంగా వికసిస్తూ వుంటే, అప్పుడు యిక పదవీ ధర్మాలలో తారతమ్యాలు వుండవు; ఒకరి శక్తిసామర్థ్యాలను గురించి, అతను అధ్యాపకుడు, ఇతను ప్రధానమంత్రి, లేదా తోటమాలి అని మాట్లాడుకుంటామే తప్ప హోదాని గురించి కాదు; కాబట్టి హోదాలో వుండే అసూయ అనే ముల్లు గుచ్చుకోవడం ఆగిపోతుంది.

ప్రస్తుతం పదవీనిర్వహణకు కావలసిన సామర్థ్యం కానీ, సాంకేతిక సంబంధమయిన సామర్థ్యం కానీ, ఒకరి పేరు వెనువెంటనే వున్న డిగ్రీ ద్వారానే గుర్తిస్తున్నారు. అయితే మానవుడి సంపూర్ణ వికాసం గురించి మనకు నిజంగా అక్కర కలిగివున్నప్పుడు మన దృష్టి కోణపు తీరే వేరుగా వుంటుంది. ఒక వ్యక్తి తన శక్త్యనుసారం ఒక డిగ్రీ సంపాదించి, తన పేరుకి వెనుక అక్షరాలు తగిలించుకోవచ్చును, లేదా మానేయనూ వచ్చును, అంతా అతని యిష్టానుసారమే. అయితే అతనికి తన లోపల నిగూఢంగా వున్న శక్తిసమర్థతలను గురించి తెలిసి వుంటుంది; ఇవి డిగ్రీ అనే చట్రంలో బిగించి వుండవు; సాంకేతిక పరిజ్ఞానం వలన సాధారణంగా పెంపొందే ఒక స్వార్థపూరితమయిన ధీమాగుణం యీ శక్తిసామర్థ్యాలు వుండటం వలన కలుగదు. ఇటువంటి ధీమా గుణం తారతమ్యాలు సృష్టించేది కాబట్టి సమాజానికి కీడు చేస్తుంది. కొన్ని ప్రయోజనకరమయిన పనులకోసం పోల్చి చూడటం అనేది ఉపయోగ పడవచ్చును. కానీ, విద్యార్థుల శక్తిసామర్థ్యాలను, ఒకరితో మరొకరివి పోల్చి చూసి; ఎక్కువ, తక్కువ విలువలు కలవిగా నిర్ణయించడం విద్యాబోధకుడు చేయవలసినది కాదు.

మనం అపేక్షించేది ఒక వ్యక్తి యొక్క సంపూర్ణ వికాసం కాబట్టి, తనకు యిష్టమయిన విషయాలనే ఎన్నుకొని చదవడానికి విద్యార్థిని మొదట్లో అనుమతించ లేకపోవచ్చును. ఎందుకంటే, యీ దశలో అతని ఎన్నిక త్వరగా మారిపోయే తాత్కాలిక మనోభావాలమీద, అపోహలమీద ఆధారపడి వుండవచ్చును; లేదూ శ్రమపడకుండా సులభంగా చదవగల విషయమే ఎన్నుకోవాలనుకోవచ్చును; లేదూ ఆ సమయంలో చాలా అవశ్యకమయినవిగా తోపింపజేసే ఒత్తిడుల ననుసరించి ఎన్నిక చేసుకోవచ్చును. అతనిలో అంతర్గతంగా వున్న శక్తిసామర్థ్యాలేమిటో అతనే స్వయంగా తెలుసుకొని, పెంపు జేసుకోవడానికి తోడ్పడితే, అతడు తప్పకుండా అతి సులువయిన విషయాలు కాకుండా, తన శక్తిసామర్థ్యాలను సంపూర్ణంగా, అత్యంత విస్తృతంగా అభివ్యక్తం చేసుకోవడానికి తగిన విషయాలనే ఎన్నుకుంటాడు. మొదటినుండీ విద్యార్థికి మానసికమైనవి, మేధాపరమయినవి, రాగద్వేషాలకు చెందినవి అయిన అనేక సమస్యలతో కూడివున్న యీ జీవితాన్ని ఒక సమగ్రదృష్టితో దర్శించడంలో తోడ్పడితే, అతనికి జీవితం అంటే భయము, బెదురు వుండవు. వివేకం అంటే జీవితపు సమగ్రస్వరూపంతో వ్యవహరించే సమర్థత వుండటం; విద్యార్థికి గ్రేడులు, మార్కులు యివ్వడం ద్వారా అతనిలో వివేకం వున్నదని గట్టిగా చెప్పలేము. పైగా యిట్లా మార్కులు, గ్రేడులు యివ్వడం మనిషికి వుండే ఆత్మగౌరవాన్ని కించపరుస్తుంది కూడా. ఈ విధంగా విద్యార్థులను ఒకరితో మరొకరిని పోల్చి, విలువలు కట్టడం అనేది మనసును గాయపరచి, అవిటిగా తయారుచేస్తుంది. అట్లాగని అధ్యాపకుడు ప్రతి విద్యార్థిలోని ప్రగతిని పరిశీలిస్తూ, ఒక నివేదికలో వ్రాసి పెట్టడం కూడదని కాదు. తల్లిదండ్రులు తమ పిల్లల పెరుగుదల గురించి తెలుసుకోవాలని ఆతురత చూపడం సహజం; అందుకు వారు ఒక నివేదికను కోరుతారు; దురదృష్టవశాత్తు, విద్యాబోధకుడు ఏంచేయడానికి ప్రయత్నిస్తున్నది వాళ్ళు అర్థం చేసుకోకపోతే, యీ రిపోర్టును (నివేదికను) వారు ఒక బెదిరింపు సాధనంగా,

తాము కోరిన ఫలితాలు రాబట్టడానికి ఉపయోగించకుంటారు; ఆ విధంగా విద్యాబోధకుడు చేసిన కృషి అంతా నిష్ప్రయోజన మవుతుంది.

పాఠశాలవారు తలపెట్టిన విద్యావిధానపు రీతి ఏమిటో తల్లిదండ్రులు అవగాహన చేసుకోవాలి. సాధారణంగా తల్లితండ్రులు ఒక జీవనోపాధిని తప్పకుండా లభింపజేసే ఏదోకరమయిన డిగ్రీని పొందడానికి తమ పిల్లలు కృషిచేస్తుంటే చూసి సంతృప్తిపడతారు. చాలా కొద్దిమంది మాత్రమే దీనిని మించిన అక్కర చూపుతారు. వారి పిల్లలు సంతోషంగా వుండాలని వారికి వుంటుంది, నిజమే; కాని యిటువంటి అనిర్దిష్టమయిన కోరికను మించి, పిల్లల సర్వతోముఖ వికాసాన్ని గురించి చాలా కొద్దిమంది యోచిస్తారు. చాలామంది తల్లితండ్రులకు తమ పిల్లలు వారి వృత్తిలో జయప్రదం అవాలి, పైకి పోవాలి అనే ఏకైక కాంక్ష మాత్రమే అన్నింటికన్న మిన్నగా వుంటుంది; అందుకోసం జ్ఞానార్జన చేయమని పిల్లలను భయపెట్టడమో, వాత్సల్యపూరితంగా బెదిరించడమో చేస్తారు; ఇందుకే పుస్తకానికి లేనిపోని ప్రాధాన్యత వస్తుంది; దీనితో వట్టి జ్ఞాపకశక్తిని మాత్రం వృద్ధి చేసుకోవడం, ఆలోచనాత్మకత అనే దానికి బొత్తిగా ఆస్కారం లేని చదివినది వల్లెవేయడం అనేవి మొదలవుతాయి.

తల్లిదండ్రులు ఒక విస్తృతమయిన, లోతయిన విద్యావిధానం ఎడల చూపే ఉదాసీన భావం బహుశ విద్యాబోధకునికి ఎదురయే అతి కఠిన పరీక్ష, కలుషితమయిపోయిన యిప్పటి సమాజంలోని చాలామంది తల్లితండ్రులు గౌరవప్రదమయిన పదవులు సాధించిపెట్టే పైపైవిజ్ఞానంకోసం తమ పిల్లలు కృషి చేస్తే చాలును అని అపేక్షిస్తారు. అందువల్ల విద్యాబోధకుడు పిల్లలకు సవ్యమయిన మార్గంలో విద్య గరపడమే కాకుండా పాఠశాలలో సాధించిన మేలును కాస్తా తల్లితండ్రులు పాడు చేయకుండా కూడా చూడాలి. అసలు పాఠశాల, యిల్లు (కుటుంబము) రెండూ కలసి సవ్యమయిన విద్యాబోధనకు సంయుక్త కేంద్రాలుగా వుండాలి తప్ప, తల్లిదండ్రులు కోరేది ఒకటయితే, విద్యాబోధకుడు అందుకు పూర్తిగా విభిన్నమైనదేదో చేస్తూ, పరస్పర వ్యతిరేకంగా పనిచేయడం ఏమాత్రం పనికిరాదు. విద్యాబోధకుడు చేసే పనిని గురించి తల్లిదండ్రులు క్షుణ్ణంగా తెలుసుకొని వుండటం చాలా ముఖ్యం; తమ పిల్లల సంపూర్ణ వికాసంలో గాఢమైన ఆసక్తిని కూడా వారు కలిగివుండాలి. ఇటువంటి విద్యాబోధన కొనసాగుతూ వుండేటట్లు చూడటంలో టీచర్లతోపాటు వారు సమానమయిన బాధ్యత తీసుకోవాలి; ఈ టీచర్లు యిప్పటికే మించిన బరువుబాధ్యతలు మోస్తున్నారు. టీచరుకి, విద్యార్థికి, తల్లితండ్రులకి నడుమన సవ్యమయిన సంబంధ బాంధవ్యాలు వున్నప్పుడే పిల్లల సర్వతోముఖవికాసం సాధించవచ్చును. తల్లితండ్రులలో క్షణక్షణం మారిపోతూ వుండే విచిత్రమయిన ఊహలకు, అసాధ్యమయిన కోరికలకు విద్యాబోధకుడు సమ్మతం చూపలేడు. కాబట్టి, వారే విద్యాబోధకుడిని అర్థం చేసుకొని, అతనితో సహకరించాలి తప్ప పిల్లలలో సంఘర్షణ, గందరగోళము కలిగించకూడదు.

పిల్లలలో స్వతస్సిద్ధంగానే కుతూహలం, నేర్చుకోవాలనే కాంక్ష మొదటినుండీ వుంటూనే వుంటాయి; వీటిని ఎప్పుడూ చాకచాక్యంతో ప్రోత్సహిస్తూనే వుండాలి,

అప్పుడే అవి సజీవంగాను, వక్రమార్గాలు పట్టకుండాను వుండి, క్రమక్రమంగా వారిని వివిధ రకాల విషయాలను అధ్యయనం చేయడానికి ప్రోత్సహిస్తాయి. పిల్లలలో నేర్చుకోవడం పట్ల వుండే యీ ఉత్సాహాన్ని సదా ప్రోత్సహిస్తూవుంటే, గణితము, భూగోళము, చరిత్ర, విజ్ఞానశాస్త్రము, లేదూ మరి ఏ యితర విషయమయినా అధ్యయనం చేయడంలో పిల్లలకు గాని, నేర్పించడంలో విద్యాబోధకునికి గాని ఏసమస్య వుండదు. సంతోషాన్ని కలిగించే వాత్సల్యానురాగాలు, శ్రద్ధతో కూడిన సంరక్షణలతో నిండిన వాతావరణంలో విద్యాభ్యాసం హాయిగా సాగిపోతుంది.

విద్యార్థి, తనకి టీచర్లతో గల సంబంధబాంధవ్యాలలో భద్రత వున్నట్లుగా భావించినప్పుడే, మానసిక నిష్కపటత (emotional openness), సున్నితత్వము లేక సంవేదనశీలత (sensitivity) అతను అలవరచుకోగలుగుతాడు. ఇతరులతో సంబంధాలలో భద్రతాభావం వుండటం అనేది పిల్లలకు కావలసిన ప్రాథమిక అవసరం. భద్రతాభావానికి, మరొకరిపై ఆధారపడి వుండే భావానికి నడుమ అపారమైన అంతరం వున్నది. ఉద్దేశ్యపూర్వకంగానో, అనాలోచితంగానో చాలామంది విద్యాబోధకులు ఆధారపడివుండే భావాన్ని లేక పరాధీనత్వాన్ని పిల్లలలో పెంపొందిస్తారు; యిది మెలమెల్లగా భయభీతిని కూడా ప్రేరేపిస్తుంది – తల్లితండ్రులు కూడా తమ అనురాగం చూపించో, తమ అధికారం చూపించో యీ పనే చేస్తుంటారు. పిల్లలు ఎట్లా వుండాలి, ఏం చేయాలి అనే విషయాల్లో తల్లితండ్రులు, టీచర్లు అధికారం చలాయించే ధోరణిని అవలంబించి పిడివాదపు ఆదేశాలు జారీ చేస్తూవుంటే వారిలో పరాధీనభావం చోటుచేసుకుంటుంది. ఈ పరాధీన భావాన్ని ఎప్పుడూ అంటిపెట్టుకునే వుంటుంది భయపు నీడ; యీ భయమే పిల్లలను విధేయంగా వుండమని, కట్టుబాట్లను అనుసరించమని, పెద్దల ఆదేశాలను, ఆజ్ఞలను ఆలోచించకుండా అంగీకరించమని ఒత్తిడి చేస్తుంది. ఇటువంటి పరాధీనత్వం గల వాతావరణంలో సున్నితత్వము (సంవేదనశీలత) నలిగి అణగారిపోతుంది; అయితే పిల్లలకు తాము భద్రంగా వున్నామని తెలిసి, ఆ విధంగానే వారు భావిస్తూ వుంటే అప్పుడు వారి మానసిక వికసనాన్ని భయభీతి భగ్నం చేయలేదు.

పిల్లలలోని యీ భద్రతాభావం సురక్షితంగా లేకపోవడానికి వ్యతిరేకమయినది అని కాదు. ఇది, తమ యింట్లో వున్నప్పుడుకాని, స్కూలులో వున్నప్పుడు కాని వారికి కలిగే హాయిగా వుండే భావం; యితరులనుండి ఏ విధమయిన నిర్బంధాలు లేకుండా తమలాగే తాము వుండవచ్చును అనే భావం; తాము చెట్లు ఎక్కవచ్చును, పడిపోయినా ఫరవాలేదు, ఎవరూ తిట్టరు అనే భావం. తల్లితండ్రులు, విద్యాబోధకులు పిల్లల పరిపూర్ణ సంక్షేమం ఎడల గాఢమయిన శ్రద్ధ వహించినపుడే వారిలో యిటువంటి భద్రతాభావం కలుగుతుంది.

పాఠశాలలో వుండవలసిన ముఖ్యమయిన లక్షణం ఏమిటంటే, బాలుడిలో లేక బాలికలో స్కూల్లో చేరిన మొట్టమొదటి రోజునుండీ, హాయిగా వున్నాము, పూర్తిగా భద్రంగా వున్నాము అనే భావం కలిగించడం. మొట్టమొదటగా కలిగే యీ భావమే అత్యంత ప్రాముఖ్యం కలది. కృత్రిమమయిన రకరకాల విధానాలు అవలంబించి పిల్లల

విశ్వాసం చూరగొనడానికి విద్యాబోధకుడు ప్రయత్నిస్తూ, పిల్లలను వారి యిష్టానుసారం చేయమని వదిలివేస్తే ఆయన వారిలో పరాధీనతత్వాన్ని పెంపొందిస్తాడు; పిల్లలలో తాము భద్రత కలిగివున్నామనే భావన కానీ, తమ పరిపూర్ణ సంక్షేమం గురించి గాఢంగా శ్రద్ధ వహించే వారివద్ద తాము వున్నామనే భావనగానీ విద్యాబోధకుడు వారిలో కలిగించడం లేదన్నమాట.

పిల్లలు యింతకు మునుపు ఎరిగివుండని యీ క్రొత్త బాంధవ్యం, పరస్పర నమ్మకం ఆధారంగా ఏర్పడిన యీ బాంధవ్యం, పెద్దలతో వారు ఒక సహజమయిన తీరులో భావప్రసారం (communication) చేయడానికి తోడ్పడుతుంది; వారు బెదిరిస్తారు, భయపెడతారు అనే భావంతో పెద్దవారిని పరిగణించడం కూడా తొలగిపోతుంది. భద్రతా భావం వున్న పిల్లలు తమకు స్వభావ సహజమయిన తీరుల్లోనే యితరుల ఎడల గౌరవం వ్యక్తీకరిస్తారు. విద్యాభ్యాసానికి యిది అత్యంతావశ్యకమైనది. ఈ గౌరవభావంలో అధికారం, భయభీతి అనేవి మచ్చుకయినా లేకుండా తుడిచివేయబడి వుంటాయి. భద్రతా భావం కలిగివున్నప్పుడు పిల్లల నడవడిక లేక ప్రవర్తన, పెద్దలు విధించారు కాబట్టి ఆ ప్రకారంగా అని కాకుండా, వారి విద్యాభ్యాస ప్రక్రియలో కలిసిపోయి వుంటుంది. టీచరుతో తమ సంబంధ బాంధవ్యాలలో భద్రత కలిగివుండటంవల్ల, పిల్లలు తప్పకుండా తమ టీచరు ఎడల సానుకూలత ప్రదర్శిస్తారు; ఇటువంటి భద్రత కలిగిన వాతావరణంలో మాత్రమే మానసిక నిష్కపటత, సున్నితత్వము వికసిస్తాయి. హాయిగా వుండి, భద్రతాభావం కలిగివున్న పిల్లలు తమకు యిష్టమయినవి ఆచరిస్తారు; అయితే యీ యిష్టమయినవి చేయడంలో, ఏది ఒప్పు అని తెలుసుకుని అదే చేస్తారు; ఇప్పుడు వీరి ప్రవర్తనలో ప్రతికూలత, మొండితనము వుండవు; అణచివేయబడినట్లుగా భావించడం, క్షణికోద్వేగాన్ని వ్యక్తంచేసే తొందరపాటు కూడా వుండవు.

సంవేదనశీలత (sensitivity) అంటే చుట్టూ వున్న వాటన్నింటి ఎడల స్పందిస్తూ సున్నితంగా వుండటం – మొక్కలు, జంతువులు, వృక్షాలు, ఆకాశం, నదిలో ప్రవహించే నీరు, ఎగిరే పక్షి – వీటన్నింటి ఎడల; అంతేకాదు, మన చుట్టూవున్న మనుష్యుల మనోభావాల ఎడల, దారిన పోతున్న అపరిచితుని ఎడల కూడా స్పందిస్తూ వుండటం. ఈ సున్నితత్వం వలన ఏ ప్రయోజనమూ ఆశించకుండా, స్వార్థరహితంగా స్పందించే గుణం కలుగుతుంది; అదే ఉత్తమమైన నీతి, సత్ప్రవర్తన. సున్నితంగా వుండటంవలన పిల్లల ప్రవర్తనలో నిష్కపటత్వం వుంటుంది, దాపరికం వుండదు; టీచరు ఒక సూచన యిస్తే చాలు, ఏ ప్రతికూలత, విరోధం చూపకుండా సులభంగా దానిని ఆమోదించేస్తారు.

మానవుని పరిపూర్ణ వికాసం కోసం మనం కృషి చేయదలుచుకున్నాం కాబట్టి, మేధని వుపయోగించి చేసే హేతువాదాల కంటె మరింత బలమైన అతని మానసిక ఉద్వేగాలను, ప్రేరణలను మనం అర్థం చేసుకోవాలి; వారిలో మానసికమయిన దృఢత్వాన్ని పెంపొందించాలే తప్ప వీటిని అణగ ద్రొక్కేయ్యాలని చూడకూడదు. మానసికమైనవే కాకుండా మేధా సంబంధమైన సమస్యలను కూడా మనం అర్థం

చేసుకొని తద్వారా వాటితో వ్యవహరించే సమర్ధత పొందినపుడు, వాటితో తలపడటానికి మనలో ఏ భయభీతి భావమూ వుండదు.

మానవుని పరిపూర్ణ వికాసం కోసం సున్నితత్వం పెంచి పోషించుకోవాలంటే, ఒక సాధన మార్గంగా 'ఏకాంతము' చాలా అవసరం అవుతుంది. ప్రతివారూ ఒంటరిగా వుండటం అంటే ఏమిటో, ధ్యానం చేయడం అంటే ఏమిటో, మరణించడం అంటే ఏమిటో తెలుసుకొని తీరాలి; ఏకాంతము, ధ్యానము, మరణము – వీటి అంతరార్థం ఏమిటో వాటిని అన్వేషించి కనిపెట్టడం ద్వారా మాత్రమే తెలుసుకోగలుగుతాం. ఈ అంతరార్థాలు ఏమిటి అనేది ఒకరు నేర్పించేది కాదు; ఎవరికి వారే స్వయంగా నేర్చుకోవాలి. ఇతరులు సూచన ప్రాయంగా చెప్పవచ్చును, కాని, సూచన ఆధారంగా తెలుసుకున్నది స్వయంగా ఏకాంతాన్ని, ధ్యానాన్ని అనుభవం ద్వారా తెలుసుకొనడం వంటిదికాదు. ఏకాంతం అంటే ఏమిటో, ధ్యానం అంటే ఏమిటో అనుభవం ద్వారా తెలుసుకోవడానికి మనం లోతుగా తరచి చూసే స్థితిలో వుండాలి; తరచి చూసే స్థితిలో వున్న మనసు మాత్రమే నేర్చుకొనడానికి తగిన సామర్థ్యం కలిగి వుంటుంది. అయితే, యీ తరచి చూడటం లేదా విచారణశీలతను యింతకు పూర్వం పొందిన జ్ఞానంతోగాని, మరొకరి అధికారంతోగాని, అనుభవంతోగాని అణగద్రొక్కి వేసినపుడు నేర్చుకొనడం అనేది కేవలం అనుకరణగా తయారవుతుంది. మనిషి తను స్వయంగా అనుభవం పొందకుండా, నేర్చుకున్నదానిని మళ్ళీ మళ్ళీ పునశ్చరణ చేయడానికి యీ అనుకరణే కారణభూతమవుతుంది.

అధ్యాపకత్వం (teaching) అంటే సమాచారాన్ని అందివ్వడం మాత్రమే కాదు, తరచి చూసే లేక విచారణ చేసే మనసును వర్ధిల్ల చేయడం కూడా. అటువంటి మనసు మతం అంటే ఏమిటి అనే ప్రశ్నను నిశితంగా పరిశీలిస్తుంది; అంతేకాని, స్థాపించుకొనిపోయిన మతాలను, దేవాలయాలు, పూజా పురస్కారాలతో సహా అంగీకరించి వూరుకోదు. దైవం కోసమో, లేదూ సత్యం కోసమో – లేదూ మీరు ఏ పేరు పెట్టి పిలవదలుచుకున్నా సరే, దానికోసం అన్వేషణ నిజమయిన మతం అవుతుంది తప్ప – ఒక నమ్మకాన్ని కానీ, ఒక అంధాచారాన్ని కానీ యథాతథంగా అంగీకరించడం కాదు, మతం అంటే.

విద్యార్థి ప్రతిరోజూ పళ్ళు తోముకున్నట్లుగానే, స్నానం చేసినట్లుగానే, క్రొత్త విషయాలు నేర్చుకున్నట్లుగానే, తాను ఒక్కడూ గాని, యితరులతో కలసి గాని, మెదలకుండా కూర్చునే కార్యక్రమం కూడా ఒకటి వుండి తీరాలి. ఉపదేశించడం ద్వారా, సంప్రదాయం అధికారంతో బయటనుండి చేసే ప్రేరేపణ ద్వారా, ప్రశాంతంగా కూర్చోవాలనే ఉద్దేశ్యం వుండీ ఒంటరిగా వుండలేని వారి ప్రోద్బలంచేత ప్రభావితం చెందడం ద్వారా యీ ఏకాంతం సిద్ధించదు. మనసుకు తన్ను తాను అద్దంలోవలె చూసుకొనడానికి ఏకాంతం వీలు కలుగజేస్తుంది. ఆకాంక్షలు వుండటం, అవి సాధించడానికి అనుసరించే స్వార్థపూరితమయిన పనులు, వాటి ఫలితంగా జనించే చిక్కులు, భయాలు, ఆశాభంగాలు మొదలైన అర్థరహితమైన ప్రయాసల నుండి మనసును విముక్తం చేయడానికీ తోడ్పడుతుంది ఏకాంతం. కాల ప్రమాణపు

కొలతలలో చెప్పలేని ఒక స్థిరత్వాన్ని, ఒక అచంచలత్వాన్ని ఏకాంతం మనసుకు యిస్తుంది. మనసుకు ఏర్పడే యీ నిర్దుష్టతే ఆ వ్యక్తియొక్క సౌశీల్యం (character). శీలం లేకపోవడం అంటే తనలో తనకు (అంతర్) వైరుధ్యాలు కల స్థితి.

సున్నితత్వం కలిగివుండటం అంటే ప్రేమించగలిగి వుండటం; 'ప్రేమ' అనే 'మాట' ప్రేమకాదు. దైవం ఎడల ప్రేమ, మనిషిపై ప్రేమ అని ప్రేమని విభజించకూడదు; ఒకరిపైన ప్రేమ, అనేకులయందు ప్రేమ అని కొలతలలో చూపకూడదు. ప్రేమ పుష్కలంగా ప్రేమని యిస్తూ వుంటుంది, పూవు పరిమళాలు వెదజల్లినట్లు; కాని మనం మాత్రం ఎప్పుడూ పరస్పర సంబంధాలలో ప్రేమకి కొలతలు కట్టి ప్రేమని హతమారుస్తూ వుంటాం.

సంస్కర్తగానీ సమాజ సేవకుడుగానీ తమ ప్రయోజనం కోసం ఉపయోగించుకొనే సరుకు కాదు ప్రేమ; సంచలనం కలిగించేందుకు వినియోగపడే రాజకీయ అస్త్రమూ కాదు. రాజకీయ నాయకుడు గానీ, సంస్కర్త గానీ ప్రేమను గురించి మాట్లాడినప్పుడు, వారు ఆ శబ్దాన్ని ఉపయోగిస్తున్నారు తప్ప దానిలోని సత్యాన్ని అందుకోవడంలేదు; ప్రేమని ఒక గమ్యం అందుకొనే సాధనంగా వాడుకోవడానికి వీల్లేదు; ఆ గమ్యం చేరువలోనిదయినా సరే, సుదూర భవిష్యత్తులోనిదయినా సరే. ప్రేమ వుంటే యీ భూప్రపంచం అంతటి మీదా వుంటుందే తప్ప ఒక మడికో, అడవికో పరిమితమయి వుండదు. సత్యం అంటే వుండే ప్రేమ ఏ ఒక్క మతం యొక్క సొత్తూ కాదు; వ్యవస్థీకృతం చేయబడిన మతాలు దీనిని ఉపయోగించుకున్నప్పుడు అది ప్రేమగా మిగలదు. సమాజాలు, వ్యవస్థీకృతమైన మతాలు, పెత్తందారీ ప్రభుత్వాలు తమ అసంఖ్యాకమైన కార్యకలాపాల సంరంభంలో మునిగిపోయి, తమకు తెలియకుండానే ప్రేమని అంతమొందిస్తాయి; వాటి కార్యకలాపాలలో ప్రేమ ఒక మానసిక ఉద్రేకం కింద తయారవుతుంది.

సవ్యమయిన విద్యావిధానం ద్వారా జరిగే మానవుడి సంపూర్ణ వికాసంలో ప్రేమతత్వాన్ని మొదటినుండి పోషించి, సంరక్షించాలి. ప్రేమ అంటే భావవృత్తి (sentimentality) కాదు, భక్తిశ్రద్ధలు కూడా కాదు. అది మృత్యువు అంత శక్తివంతమయినది. జ్ఞానంద్వారా ఆర్జించకలిగేది కాదు ప్రేమ; ప్రేమ లేకుండా జ్ఞానాన్ని ఆర్జించాలని ఆరాటపడే మనసు నిర్దయాత్మకంగా పనిచేస్తుంది; దాని లక్ష్యం కేవలం కార్యకుశలత సాధించడమే.

కాబట్టి విద్యాబోధకుడు మొదటి నుండీ ప్రేమ తత్వాన్ని గురించి శ్రద్ధ తీసుకోవాలి; ప్రేమతత్వం అంటే వినమ్రత, సౌమ్యత, ఉదారస్వభావం, సహనం, మర్యాద–మన్నన. అణకువ, మర్యాద– మన్నన సవ్యమయిన విద్య నభ్యసించిన విద్యావంతుని స్వభావసహజ గుణాలయిపోతాయి; జంతువులు, మొక్కలతో సహా అందరినీ అతడు ఔదార్యంతో చూస్తాడు; ఇది అతని నడవడికలోను, మాట్లాడే పద్ధతిలోను కనబడుతుంది.

ఈ ప్రేమ తత్వానికి విశేష ప్రాముఖ్యం యివ్వడం వలన ఆకాంక్షల్లో, మితిలేని అత్యాశల్లో, ఆర్జన పరత్వంలో మనసు మునిగిపోయి వుండటాన్నుండి విముక్తి

లభిస్తుంది. గౌరవము, సదభిరుచి అనే రూపాలలో అభివ్యక్తీకరింపబడే ఒక సంస్కార గుణం ప్రేమతో కలిసిపోయి వుంటుంది కదూ? దురభిమానంతో తన్ను తాను నింపుకునే లక్షణం గల మనసును నిర్మలంగా చేసే గుణం ప్రేమకు వున్నదంటే ఒప్పుకుంటారా? నడవడికలో సంస్కారం అంటే తను స్వయంగా తెచ్చిపెట్టుకున్న సర్దుబాట్లు కాదు; బయటనుండి చేసే ఒత్తిడుల ఫలితంగా కలిగేదీ కాదు; ఈ ప్రేమ అనే గుణం వలన అప్రయత్నంగా అలవడేది. ప్రేమ మూలంగా కలిగే సదవగాహన వలన కామ సంబంధమైన భావాలను, మానవ సంబంధాలలో వుండే యితరమయిన జటిలతలను, చిన్న చిన్న చిక్కులను అన్నింటినీ ఉద్రేకంతోను, భయాకులతతోను కాకుండా చిత్తస్థైర్యంతో ఎదుర్కొనవచ్చు.

మానవుని పరిపూర్ణ వికాసమే అత్యంత ప్రాధాన్యమయినదిగా తలచే విద్యాబోధకుడు, మన జీవితంలో ఒక అతి ముఖ్యమయిన అంశం అయిన కామ సంబంధమయిన ప్రేరణ గురించి, దానిలోని అంతరార్థాలను గురించి బాగా అవగాహన చేసుకోవాలి; పిల్లలలో యీ విషయం అంటే వుండే సహజమయిన కుతూహలాన్ని మొట్టమొదటి నుండే సమాధానపరచ గలిగివుండాలి; అయితే యిది వారిలో అనారోగ్యకరమయిన ఆసక్తిని రేకెత్తించకుండా చూడాలి. పిల్లల యౌవనారంభ దశలో శరీరానికి మాత్రమే సంబంధించిన సమాచారం అందిస్తే, వారిలో ప్రేమతత్వం అనేది నెలకొననప్పుడు, కామవాంఛల తృప్తికై చేసే ప్రయోగాలకు దారి తీస్తుంది. ప్రేమ మనసులోని దుర్మార్గాన్ని కడిగివేసి పరిశుభ్రం చేస్తుంది. విద్యాబోధకుడు పిల్లల ఎడల ప్రేమ, అవగాహన చూపకుండా ముళ్ళతీగల కంచెతో కాని, శాసనాలతో కాని మగ పిల్లలను, ఆడ పిల్లలను వేరుచేసి వుంచడం వలన వారిలోని కుతూహలం మరింత ఎక్కువవుతుంది. ఇది వారిలో తీవ్రమయిన వుద్వేగాలను రేకెత్తించడం, ఆపైన యీ కాంక్షలు హీనమయిన శారీరక తృప్తి కింద దిగజారిపోవడం తప్పదు. కాబట్టి ఆడపిల్లలు, మగపిల్లలు సవ్యమయిన రీతిలో కలిసిమెలిసి విద్య నభ్యసించడం చాల ముఖ్యం.

పిల్లలు తమ చేతులతో చేసే పనులలో కూడా, అంటే తోటపని, వడ్రంగం, చిత్రలేఖనం, హస్తకళలు మొదలైన వాటిలో యీ ప్రేమతత్వ భావం తప్పని సరిగా అభివ్యక్తం అవాలి; ఇంకా గ్రహణేంద్రియాల ద్వారా గ్రహించే వాటిలో కూడా, అంటే చెట్లను, పర్వతాలను, నేలలో దాగున్న సౌభాగ్య సంపదను, మనుష్యులు తమ తోడి మనుష్యులలో సృష్టించిన దారిద్ర్యాన్ని పరికించడంలోను; సంగీతాన్ని, పక్షులు పాడే రాగాలను, ప్రవహించే నీటి గలగలలను ఆలకించడంలోను అభివ్యక్తం అవాలి యీ ప్రేమభావం.

మనం అపేక్షించేది మనసును వర్ధిల్లజేయడం, మానసికమైన సున్నితత్వాన్ని మేలుకొల్పడం మాత్రమే కాదు; శరీరావయవాలన్నీ అన్ని విధాలా చక్కగా వికాసం చెందాలి – యీ విషయం గురించి కూడా మనం గట్టిగా యోచించాలి. శరీరం కనుక ఆరోగ్యంగా, సజీవశక్తితో నిండుగా లేని పక్షంలో ఆలోచనలు వికృతమవడం, ఆ పైన మనసు సున్నితత్వం కోల్పోవడం తథ్యం. ఇదంతా మీకు స్పష్టంగా

కనపడుతునే వుంటుంది, దీనిని గురించి మనం యింకా వివరాలలోనికి పోనక్కరలేదు.

శరీరం పరిపూర్ణమైన ఆరోగ్యంతో వుండటం, సవ్యమైన ఆహారం తీసుకోవడం, తగినంత నిద్రపోవడం – యివన్నీ చాలా ఆవశ్యకం. ఇంద్రియాలు జాగరూకంగా లేనట్లయితే శరీరం మానవుని పరిపూర్ణ వికాసానికి అడ్డు తగులుతుంది. చూడటానికి యింపుగా వుండే శరీరపు కదలికలను, స్వాధీనంలో వున్న కండరాలను, పటుత్వాన్ని పొందడానికి వివిధ రకాల వ్యాయామం, నృత్యం, ఆటలు వుండి తీరాలి. పరిశుభ్రత లేకుండా చీదరగా వుండే శరీరం, నిటారుగ నిలబడలేని అంగ విన్యాసం మనసుని, మనోభావాలను సున్నితంగా వుంచడానికి ఏ మాత్రం దోహదం చేయవు. శరీరం మనసు యొక్క ఉపకరణం (instrument) కాదు; శరీరం, ఉద్వేగాలు, మనసు కలిసి సంపూర్ణ మానవుడు ఏర్పడుతాడు; ఇవన్నీ సమశ్రుతిలో మేళవించుకొని జీవించకపోతే సంఘర్షణ అనివార్యం.

సంఘర్షణ వలన సంవేదనశీలత (సున్నితత్వం) కోల్పోవడం జరుగుతుంది. మనసు శరీరంపై ఆధిపత్యం చలాయించి యింద్రియాలను అణగద్రొక్కవచ్చును, కాని అందువలన శరీరం సున్నితత్వాన్ని కోల్పోతుంది; సున్నితత్వం లేని శరీరం మనసు యథేచ్ఛగా విస్తృతంగా అన్ని దిశలలో విహరించడానికి ఆటంకమవుతుంది. శరీరాన్ని శోషింపజేయడం చేతనావర్తం (consciousness) లోని లోపల పొరలను అన్వేషించడానికి అనుకూలించే మార్గం ఏమాత్రం కాదు; మనసు, శరీరం, ఉద్వేగాలు మూడూ ఒకదానితో మరొక దానికి పరస్పర వైరుధ్యం లేకుండా సమైక్యం చెంది సమన్వితమయినపుడు; ఏ ప్రయత్నం లేకుండానే, ఏ సిద్ధాంతం, నమ్మకం, ఆదర్శం వెనుకనుండి ఒత్తిడి చేయకుండానే అవి సమన్వితం అయినపుడు, అప్పుడు చేతనావర్తంలోని లోపలి పొరలను తరచి చూడటం సాధ్యమవుతుంది.

మనసును వర్ధిల్ల చేయడంలో, మనం ప్రాధాన్యం యివ్వవలసినది ఏకాగ్రత (concentration) కు కాదు; సావధానత (attention) కు లేక శ్రద్ధగా వినడానికి ప్రాధాన్యం యివ్వాలి. ఏకాగ్రత అంటే ఒక బిందువు మీదకు మనసును లగ్నం చేయడానికి నిర్బంధంతో మనసును కుంచింపజేసే ఒక ప్రక్రియ; సావధానత్వం (attention) అంటే ఎల్లలు లేని విశాలత్వం. ఏకాగ్రతలో ఒక అవధి లేక సరిహద్దు లోపలకు మనసు పరిమితమయి వుంటుంది; అయితే మనం అపేక్షించేది మనసు పరిపూర్ణత్వాన్ని అవగాహన చేసుకోవడం అయినప్పుడు, ఏకాగ్రత ఒక ఆటంకంగా తయారవుతుంది. సావధానత్వం అంటే పరిమితులు లేనిది; జ్ఞానపు సరిహద్దులు దానికి లేవు. జ్ఞానం సంపాదించడం ఏకాగ్రత ద్వారా జరుగుతుంది; జ్ఞానాన్ని విస్తృత పరచుకోవడం కూడా దానికిగల కొన్ని అవధులలోనే జరుగుతుంది. సావధానపు స్థితిలో మనసు జ్ఞానాన్ని ఉపయోగించకలదు, ఉపయోగించవచ్చును; యీ జ్ఞానం ఏకాగ్రత ద్వారా సాధించినదే అయివుండవచ్చును కూడా; కాని 'మొత్తం' లోని ఒక 'భాగం' సంపూర్ణమయినది ఎప్పుడూ కాలేదు; అనేక భాగాలను కూడబెట్టినంత మాత్రాన సంపూర్ణత్వాన్ని దర్శించడం సాధ్యంకాదు. ఒకదాని కొకటి చేర్చి, కూడగట్టుకోవడం వంటి ప్రక్రియ అయిన ఏకాగ్రత ద్వారా సాధించిన జ్ఞానంతో అప్రమేయమైన దానిని, అంటే కొలతలు లేని దానిని అవగాహన చేసుకోవడం

జరుగదు. ఏకాగ్రమయిన మనసు అనే కుండలీకరణాల (brackets) లోపల సంపూర్ణత్వం ఎప్పుడూ యిమిడి వుండదు.

కనుక సావధానత, లేక శ్రద్ధగా వినడం ముఖ్యమయినది; అయితే యిది ఏకాగ్రతను సాధనం చేయడంవల్ల కలగదు. పోగు చేసుకున్న అనుభవాలే జ్ఞానం. ఈ జ్ఞానం మనసులోని ఒక కేంద్రం చుట్టూ పేరుకుంటుంది. అటువంటి కేంద్రం అనేది లేకుండా, మనసు సదా నేర్చుకుంటూ వుండే స్థితినే సావధానత (attention) అనాలి. తన పైననే తనను కేంద్రీకృతం చేసుకుంటున్న మనసు, తన స్వీయ విస్తరణ కోసం జ్ఞానాన్ని సాధనంగా చేసుకుంటుంది; ఇటువంటి స్వీయ విస్తరణ స్వయం విరుద్ధంగాను, సంఘ వ్యతిరేకంగాను తయారవుతుంది.

ఆ మాటకి కల సరియైన అర్థంలో తీసుకున్నప్పుడు, 'నేర్చుకోవడం' అనేది అంతరికమయిన, బాహ్యమయిన నిర్బంధాలేవీ లేని సావధానస్థితిలో మాత్రమే సాధ్యమవుతుంది. మనసు సంప్రదాయాల, జ్ఞాపకాల దాస్యత్వంలో లేనప్పుడు మాత్రమే నవ్యమయిన ఆలోచనా రీతికి ఆస్కారం వుంటుంది. సావధానత కారణంగానే మనసులో మౌనానికి తావు ఏర్పడుతుంది; ఆ మౌనమే కవాటాలు తెరచి సృజనను ఆహ్వానిస్తుంది. ఇందువల్లనే సావధానత అత్యంత ప్రధానమయినది.

జ్ఞానం అవసరమే – లోక వ్యవహారాల నిర్వహణల స్థాయిలో మనసును పెంపొందించుకునేందుకు; అయితే జ్ఞాన సంపాదనే గమ్యంకాదు. మనం అపేక్షించేది విద్యార్థిలో ఏదో ఒక సామర్థ్యం వికసింపజేయడం కాదు; ఒక గణిత శాస్త్రజ్ఞుడిగానో ఒక వైజ్ఞానికుడుగానో, లేక ఒక సంగీతకారుడుగానో ఒక శాఖలోనే ప్రత్యేకత సాధించడం కాదు. మనం అపేక్షించేది, విద్యార్థి ఒక సంపూర్ణ మానవునిగా వికాసం చెందాలని.

సావధాన స్థితిని అందుకోవడం ఎట్లా? నచ్చచెప్పి ఒప్పించడం, యితరులతో పోల్చిచూడటం, ప్రతిఫలము – శిక్ష యీ పద్ధతుల్లో సావధానతను అలవర్చలేము; యివన్నీ నిర్బంధాలకు మారు రూపాలు. భయభీతిని తొలగించుకోవడమే సావధానతకు ఆరంభం. 'అవటంకోసం' లేదా 'ఏదో అవాలని' ఒక కాంక్ష వున్నంతవరకు భయభీతి వుంటూనే వుంటుంది. వైఫల్యాల వల్ల కలిగిన మనోవ్యధలతోను, అమిత బాధాకరమయిన పరస్పర వైరుధ్యాలతోను కూడుకొని వుండే విజయ సాధన కోసం పడే వెంపర్లాట అనేదే యీ కాంక్ష, అది వున్నంతవరకు భయం వుంటూనే వుంటుంది. ఏకాగ్రతను నేర్పించవచ్చును కాని, సావధానత నేర్చుకుంటే వచ్చేది కాదు; భయం నుండి విముక్తిని పొందడం ఎట్లా నేర్పించలేమో యిదీ అంతే; అయితే భయాన్ని కలిగించడానికి కారకమయినవి ఏవో అవి కనిపెట్టడం ఆరంభించవచ్చు; యీ కారణాలను అవగాహన చేసుకోవడంలోనే భయాన్ని తొలగించుకోవడం వుంది. కాబట్టి విద్యార్థి చుట్టూరా – సుఖశాంతులు, అతనిలో భద్రతా భావం, హాయిగా వున్నాననే నిశ్చింత, ప్రేమ మూలంగా కలిగే స్వప్రయోజనం ఆశించని క్రియాశీలత్వం గురించిన ఎరుక – ఇటువంటి వాతావరణం వున్నప్పుడు అప్రయత్నంగానే సావధానత్వం జనిస్తుంది. ప్రేమ పోల్చిచూడదు, కనుక 'ఏదో అవుదాం' (becoming) అనే దానిలో వుండే అసూయ, చిత్రహింస ఆగిపోతాయి.

మనలో యువకులు, పెద్దవారు అందరూ అనుభవించే సర్వసామాన్యమయిన అసంతుష్టి (discontent) ఏదో విధంగా తృప్తి చెందడం కోసం ఒక మార్గం వెతుక్కుంటుంది; యీ విధంగా మన మనసులను జోకొట్టి నిద్రపుచ్చుతాం. అప్పుడప్పుడు కలిగే బాధల వలన అసంతుష్టి మళ్ళీ మళ్ళీ మేలుకుంటూ వుంటుంది; అయితే మనసు మళ్ళీ దానిని తృప్తిపరచే పరిష్కారాన్ని వెతుక్కుంటుంది. మనసు యీ అసంతృప్తి, తృప్తిపర్చడం అనే చక్రంలో. చిక్కుకొని పోతుంది; బాధవలన మళ్ళీ మళ్ళీ అసంతుష్టి మేలుకొనడం కూడా మన అసంతుష్టిలో మరో భాగమయిపోతుంది. అసంతుష్టి మనం లోతుగా తరచి చూడటానికి దారితీస్తుంది; అయితే మనసు సంప్రదాయానికి, ఆదర్శాలకి తనని కట్టివేసుకొని వుంటే లోతుగా తరచిచూడటం అనేది వుండదు. ఈ తరచి చూడటమే సావధానత అనే ఒక ఆరని అగ్నిజ్వాల.

ఇక్కడ అసంతుష్టి అంటే నా అర్థం యిదీ – మనసు 'ఉన్న స్థితి'ని, అసలు యథార్థాన్ని అవగాహన చేసుకొని, యింకా ఎక్కువ కనుగొనాలని సదా తరచి చూసే స్థితి. అసంతుష్టి ఒక చలనం; ఉన్న స్థితి పరిమితులు దాటి ఆవలగా వెళ్ళడానికై చేసే చలనం అని చెప్పవచ్చు; మీరు కనుక అసంతుష్టి గొంతు నులిమివేయడానికో, దానిని అధిగమించడానికో రకరకాల మార్గాలు కనిపెడితే స్వార్థపూరిత కార్యకలాపాలలోను, మీరు నివసిస్తున్న సమాజంలోను వుండే లోటుపాట్లను మీరు ఆమోదించి వూరుకుంటారు.

అసంతుష్టి ఒక అగ్నిజ్వాల లాగా సంతృప్తి అనే చీడను కాల్చివేస్తుంది; కాని మనలో చాలా మందిమి దీనిని అనేక విధాలుగా వృథా చేయాలని చూస్తూ వుంటాం. అటువంటప్పుడు మన అసంతుష్టి 'మరింత ఎక్కువ' ను వెంటాడుతుంది. అంటే మరింత పెద్ద యిల్లు, మంచి కారు మొదలయిన వాటిని కోరుకుంటూ వుంటుంది; యివన్నీ అసూయను వుత్పన్నం చేసే రంగానికి చెందినవే; అసలు యీ అసూయ లేక ఓర్వలేని తనమే అసంతుష్టిని నశించకుండా పెంచి పోషిస్తుంది. కాని, నేను మాట్లాడుతున్న అసంతుష్టి వేరు – ఇందులో అసూయకి తావు లేదు, 'మరింత ఎక్కువ'కై ఆత్యాశ వుండదు, ఈ అసంతుష్టిని సంతృప్తి పొందడంకోసం పడే కాంక్ష పెంచి పోషించదు. అపసవ్యమైన విద్యావిధానం, తృప్తి పరచడానికి చేసే పరిష్కారాలు; ఆకాంక్షలు, ఆదర్శాల వెంట పరుగులు – వీటివలన మనం నిర్జీవం కానప్పుడు మనలో ప్రతి ఒక్కరిలోను వుండే ఏ కల్మషం అంటని స్థితి యీ అసంతుష్టి అనేది. నిజమైన అసంతుష్టి స్వభావ లక్షణాన్ని మనం అర్థం చేసుకున్నప్పుడు, సావధానత్వం యీ మండుతున్న అగ్నిజ్వాలలో ఒక భాగం అని తెలుసుకుంటాం; ఈ జ్వాల అల్పత్వాలను దహించి వేస్తుంది; స్వీయ లాభంకోసం, తృప్తితీర్చుకోవడం కోసం పడే ఆరాటాలు అనే ప్రతిబంధకాలనుండి మనసును విముక్తం చేసివేస్తుంది.

కాబట్టి స్వీయ ప్రయోజనాపేక్షలమీద, తృప్తి తీర్చుకోవడాలమీద ఆధారపడని విచారణ శీలత్వం (తరచి చూడటం) వున్నప్పుడే సావధానత్వం కలుగుతుంది. పిల్లలలో యీ సావధానతను చిన్నతనం నుండే అలవర్చాలి. ప్రేమభావం వున్నప్పుడు – వినమ్రత, మర్యాద–మన్నన, సహనం, సౌమ్యతల రూపాలలో

అభివ్యక్తీకరించుకునే ప్రేమభావం వున్నప్పుడు, సున్నితత్వపులేమి నిర్మించే అడ్డుగోడలు వెంటనే మాయమవుతాయని మీరు తెలుసుకుంటారు; కనుక పిల్లలలో చాలా పసితనం నుండే యీ సావధాన స్థితిని నెలకొల్పడానికి మీరు సహాయం చేయవచ్చు.

సావధానత అనేది నేర్చుకునేది కాదు, అయితే స్వయం వైరుధ్యాలు గల జీవితాన్ని తయారుచేసే నిర్బంధ భావాన్ని విద్యార్థి చుట్టూరా సృష్టించకుండా మీరు అతనిలో సావధానతను మేలుకొలపడానికి తోడ్పడవచ్చును. అప్పుడు అతని ధ్యాస ఏ క్షణంలోనయినా ఏ విషయంపైన అయినా లగ్నమవగలుగుతుంది. ఇది అర్జనపరత్వం లేదా ఔన్నత్య సాధనకోసం వుండే బలమైన ప్రేరణ ద్వారా జనించే సంకుచితమైన ఏకాగ్రత కాదు.

ఈ విధంగా విద్యను నేర్చుకున్న ఒక తరం వారంతా, తమ తల్లితండ్రులు, తాము జన్మించిన సమాజం అందిచ్చిన మానసిక వారసత్వం అయిన అర్జనపరత్వం, భయభీతుల నుండి విముక్తి పొందుతారు; ఈ విధంగా విద్యనభ్యసించిన వాళ్ళవడంచేత వారు వారసత్వంగా లభించే ఆస్తులపై ఆధారపడరు. అసలు యీ వారసత్వం అనే పద్ధతి నిజమైన స్వాతంత్ర్యాన్ని హరించివేసి, తెలివి తేటలను పరిమితం చేస్తుంది; ఒక అర్థం లేని ధీమాతనం యిచ్చి, నూతనమైనవేవీ వర్ధిల్లటానికి ఆస్కారంలేని ఒక అంధకారంతో మనసును నింపుతుంది. అయితే మనం యిప్పుడు చర్చించుకున్న ఆసాంతం విభిన్నమయిన విధానంలో విద్య నభ్యసించిన తరంవారు ఒక నవ్య నూతనమయిన సమాజాన్ని నిర్మిస్తారు; ఎందుకంటే భయంతో చుట్టూ కట్టి మూసివేయబడని వివేకంలో ప్రభవించిన శక్తిసామర్థ్యాలు వాళ్ళకు వుంటాయి.

విద్యాబోధన తల్లిదండ్రులపైనా, టీచర్ల పైనా కూడా వున్న బాధ్యత కాబట్టి, కలసి పనిచేసే కళను మనం అలవర్చుకోవాలి; మనలో ప్రతి ఒక్కరమూ సత్యం అనేది ఏమిటో గ్రహించినప్పుడే యిది సాధ్యమవుతుంది. సత్యదర్శనం మాత్రమే మనందరినీ ఒకటిగా చేయగలుగుతుంది తప్ప – అభిప్రాయాలుకాని, నమ్మకాలుకాని, సిద్ధాంతాలుకాని కాదు. ఉద్దేశ్యాలకు, యథార్థాలకు మధ్యన అపారమయిన అంతరం వున్నది. ఉద్దేశ్యాల వలన మనం తాత్కాలికంగా ఏకమవచ్చు, కాని మన యీ ఏకోన్ముఖం అవడం కేవలం నమ్మకాల మీద ఆధారపడినదయితే తిరిగి విడిపోవడం తప్పక జరుగుతుంది. సత్యం అన్నది మనలో ప్రతి ఒక్కరూ దర్శించినప్పుడు, సూక్ష్మాంశాల విషయంలో అసమ్మతి వుండవచ్చునేమోగాని విడిపోవడానికి మాత్రం అది ప్రేరణ అవదు. మూర్ఖులు మాత్రమే చిన్న చిన్న అంశాల కోసం విభేదాలు తెచ్చుకుంటారు. సత్యాన్ని అందరూ దర్శించినప్పుడు, చిన్న చిన్న అంశాలు విరోధాలను, కలహాలను రేకెత్తించేటంత సమస్యలు కానేకావు.

మనలో చాలా మందికి అధికార స్థానంలో వున్న వ్యవస్థకు అనుగుణంగా కలసి పనిచేయడమే అలవాటు. ఒక ఉద్దేశాన్ని చర్చించి, నిర్ణయించడానికి గాని, ఒక ఆదర్శాన్ని ప్రతిపాదించడానికి గాని మనం ఏకోన్ముఖం అవుతాం; దీనికి గాఢనమ్మకం, నచ్చచెప్పి ఒప్పించే శక్తి, ప్రచారం మొదలయిన వాటి ఆవశ్యకత వుంటుంది. ఒక ఉద్దేశం కోసమో, ఒక ఆదర్శం కొరకో యీ విధంగా కలసి పనిచేయడం వేరు; సత్యాన్ని దర్శించి, ఆ సత్యాన్ని ఆచరణలో పెట్టవలసిన

అవశ్యకత కారణంగా ఏర్పడే సహకారభావం వేరు – యీ రెండూ అమూలాగ్రం విభిన్నమయినవి. అధికారపు ప్రేరేపకత్వం కింద పనిచేయడం – అది ఆదర్శం యొక్క అధికారం అయినాసరే, లేదూ ఆ ఆదర్శానికి ప్రాతినిధ్యం వహించే ఒక వ్యక్తి యొక్క అధికారం అయినా సరే – అది నిజమైన సహకారం కాదు. అధికార కేంద్రస్థానంలో వుండి, అనేకం తెలుసుకున్న ఒక వ్యక్తిగాని, లేదూ ఒక బలమైన వ్యక్తిత్వం కలిగి, కొన్ని అభిప్రాయాలకు పూర్తిగా వశుడైన వ్యక్తిగాని తను ఆదర్శం అని పిలుచుకుంటున్న దానికోసం తనతోపాటు కలసి పనిచేయమని యితరులను బలవంతం చేయవచ్చు; లేదా అనునయంతో నచ్చజెప్పి ఒప్పించవచ్చు; అయితే యిటువంటిది జాగరూకత్వంతోను, జీవచైతన్యంతోను తొణికిసలాడే వ్యక్తులు కలిసి పనిచేయడం వంటిది కానే కాదు. అట్లా కాకుండా మనలో ప్రతి ఒక్కరూ స్వయంగా ఒక అంశంలోని సత్యాన్ని అవగాహన చేసుకున్నప్పుడు, మన అందరిలోను సమానంగా వున్న సత్యం యొక్క అవగాహన కార్యశీలత్వానికి దారితీస్తుంది; అటువంటి కార్యశీలత్వమే సహకారం అనిపించుకుంటుంది. సత్యాన్ని సత్యంవలె, అన్నృతాన్ని అన్నృతంవలె చూసి; అన్నృతంలోని సత్యాన్ని గ్రహించడం వలన సహకారం అందించే వ్యక్తికి ఎప్పుడు సహకరించకూడదో కూడా తెలుస్తుంది; యిది కూడా అంతటి ముఖ్యమైన విషయమే.

మనలో ప్రతి ఒక్కరూ, విద్యాబోధనలో విప్లవాత్మకమయిన పరిణామం రావలసిన అవశ్యకతను గుర్తించినట్లయితే, యిప్పుడు మనం చర్చిస్తున్న దానిలోని సత్యాన్ని గ్రహించినట్లయితే, ఏ విధమయిన నచ్చజెప్పి ఒప్పించే ప్రయత్నము లేకుండానే మనమంతా ఏకోన్ముఖమై పనిచేయగలుగుతాం. ఒకరు తను తీసుకున్న నిర్ణయాలనుండి అటు యిటూ కదలడానికి ఏ మాత్రం సమ్మతించనప్పుడే నచ్చజెప్పి ఒప్పించడం అనేది అవసరం అవుతుంది. అతనికి ఒక వట్టి ఊహలో గట్టి నమ్మకం ఏర్పడినప్పుడు లేదా ఒక అభిప్రాయంలో కూరుకొనిపోయినప్పుడు ప్రతికూలతలు తలలెత్తడానికి అతడు కారణభూతుడువుతాడు; అప్పుడు అతనిని కాని, ఆ మరొకరిని గాని నచ్చజెప్పడం ద్వారా ఒప్పించడం బలవంతం చేసో, ప్రేరేపణ చేసో అతని ఆలోచనా రీతిని మార్పించడం చేయవలసి వస్తుంది. మనలో ప్రతి ఒక్కరూ సత్యమైనదాన్ని స్వయంగా చూసి గ్రహించిప్పుడు యిటువంటి పరిస్థితి సంభవించనే సంభవించదు. మనం సత్యమైన దానిని చూడకుండా, కేవలం నమ్మకం పుట్టించే మాటల ఆధారంగా లేదా మేధావంతమయిన హేతువాదం ఆధారంగా నిర్ణయాలు తీసుకుంటే వాదవివాదాలు, ఒడంబడికలు, అసమ్మతులు యివన్నీ తప్పనిసరిగా పుట్టుకొస్తాయి; వీటితోపాటు విపరీతార్థాలు తీయడం, ప్రయోజనరహితమైన ప్రయాస వెంటనంటి వుంటూనే వుంటాయి.

మనం కలసి ఏకోన్ముఖంగా పని చేయడమనేది చాలా అవశ్యకం; యిది మనమంతా కలసి ఒక యింటిని కట్టడం వంటిది. కొంతమందిమి నిర్మిస్తూ వుంటే, మరికొంతమంది కూలగొడుతూ వుంటే, ఆ యింటి నిర్మాణం ఎన్నటికీ పూర్తవదు అనేది స్పష్టమే కదా! కనుక మనం అందరమూ, ఒక్కొక్క వ్యక్తి ప్రత్యేకంగానూ, స్పష్టంగా తెలుసుకోవలసిన దేమిటంటే – ఒక క్రొత్త తరాన్ని

తయారుచేసే విద్యావిధానం అవలంబించవలసిన ఆవశ్యకతను గ్రహించి, అవగాహన చేసుకోవాలనే విషయం; ఇటువంటి విద్యావిధానంలో విద్య నభ్యసించిన క్రొత్తతరం జీవితంలోని వివిధ అంశాలను, జీవిత సమగ్ర స్వరూపంతో సంబంధంలేని విడివిడి ఖండాలుగా కాకుండా, ఒక సంపూర్ణమైన విషయంగా తీసుకొని వ్యవహరించే శక్తిసామర్ధ్యాలు కలిగి వుంటుంది.

ఈ విధంగా ఏకోన్ముఖమై, నిజమైన సహకార విధానంలో పనిచేయగలిగి వుండటానికి, మనం తరచు కలుసుకుంటూ, సూక్ష్మాంశాలలో పడి మునిగిపోకుండా, మెలుకువ నవలంబించాలి. సవ్యమయిన పద్ధతి ద్వారా విద్యాభ్యాసం అనేది తీసుకొచ్చేందుకు మనస్ఫూర్తిగా అంకితం అయిన మనందరిమీదా, మనం అవగాహన చేసుకున్నదంతా ఆచరణలో చేసి చూపవలసిన బాధ్యతే కాకుండా, యితరులలో యీ అవగాహన కలిగించేందుకు తోడ్పడవలసిన బాధ్యత కూడా వున్నది. అధ్యాపకత్వం మహోత్తమమయిన వృత్తి – దానిని అసలు వృత్తి అని అనవచ్చును. అంటే, ఇది ఒక కళాకౌశలం; అయితే దీనికి మేధకు సంబంధించిన అర్హతలే కాకుండా అనంతమైన సహనం, అశేషమైన ప్రేమ కూడా కావాలి. నిజమయిన విద్యావంతుడు అంటే, మన జీవిత అస్తిత్వం అనే బ్రహ్మాండమయిన ప్రాంగణంలోని వివిధ అంశాలతో – డబ్బు, ఆస్తి, మనుష్యులు, ప్రకృతి అనే వాటితో మన సంబంధ బాంధవ్యం అవగాహన చేసుకున్నవాడు అని అర్థం.

సౌందర్యం యీ అవగాహనలో ఒక భాగం, అయితే సౌందర్యం అంటే కొలతలలో లేదు, రూపంలో లేదు, రసజ్ఞతలో లేదు, నడవడికలో లేదు. సౌందర్యం ఒక స్థితి; ఆ స్థితిలో మనసు 'తను' అనే కేంద్రాన్ని పూర్తిగా వదిలివేసి, సరళత్వం (simplicity) అనే గాఢోద్వేగంలో మునిగి వుంటుంది. సరళత్వానికి గమ్యం అనేది లేదు; నిరాడంబరత్వంలో మాత్రమే సరళత్వం వుంటుంది; అయితే ఆ నిరాడంబరత్వం ప్రయోజనం ఆశించి అవలంబించే క్రమశిక్షణ, యింద్రియ నిగ్రహాల వల్ల కలిగినదై వుండకూడదు. ఈ నిరాడంబరత్వం అంటే స్వప్రయోజనాన్ని పూర్తిగా పరిత్యజించడం; ఒక్క ప్రేమ భావం ద్వారా మాత్రమే యిది జరుగుతుంది. ప్రేమభావం లేకుండా మనం సృష్టించే నాగరకతలో అంతర్గతమైన సజీవశక్తి వుండదు; సరళమైన స్వార్థ పరిత్యాగం శీలత అనే నిరాడంబరత్వం వుండదు; కేవలం రూపసౌందర్యాన్ని మాత్రం ఆరాధించి, అందల మెక్కిస్తాం. మంచి పనులు చేయడం కోసం, ఆదర్శాలకోసం, నమ్మకాల కోసం తన్ను తాను బలిదానం చేసుకున్నప్పుడు అది స్వార్థ పరిత్యాగం అనిపించుకోదు. ఈ కార్యకలాపాలన్నీ స్వార్థం నుండి విముక్తం అయినట్లు కనబడినా, వాస్తవానికి స్వార్థం వీటిలో రకరకాల మారుపేర్లతో పనిచేస్తూనే వుంటుంది. నిర్మలంగానూ, అమాయకత్వంతోను వుండే మనసే మనకు తెలియని దానిని తెలుసుకొనడానికి విచారణ చేయగలుగుతుంది. అయితే, తెచ్చిపెట్టుకున్న అమాయకత్వం కొల్లాయిగుడ్డ కట్టవచ్చు గాక, కాషాయవస్త్రాలు ధరించవచ్చు గాక, అది మాత్రం స్వార్థ పరిత్యాగం అనే గాఢోద్వేగం కాదు. స్వార్థ పరిత్యాగంలో నుండి మన్నన–మర్యాద, సౌమ్యత, వినమ్రత, సహనం జనిస్తాయి. అవి అన్నీ ప్రేమను వ్యక్తం చేసే గుణాలు.

మనలో చాలా మందికి సౌందర్యం సృష్టించబడిన దానిలోనో, నిర్మించిన దానిలోనో మాత్రమే కనబడుతుంది – మానవ రూపంలోని సౌందర్యం, ఒక దేవాలయపు సుందరరూపం యిటువంటివి. ఒక వృక్షం, ఒక యిల్లు లేదా దూరాన వంపు తిరుగుతున్న నది అందంగా వున్నాయని అంటాం. పోల్చి చూడటం ద్వారా కురూపం అంటే ఏమిటో మనకి తెలుసు – కనీసం తెలుసు అని మనం అనుకుంటాం. కాని సౌందర్యాన్ని మరొక దానితో పోల్చగలమా? సౌందర్యం అంటే వ్యక్తం చేయబడినదీ, రూపందాల్చినదీనా? ఒక చిత్రపటాన్ని చూసినప్పుడు; ఒక కవితని, ఒక ముఖాన్ని చూసినపుడు అందంగా వున్నాయని అనుకుంటాం; ఎందుకంటే మనకు బోధించినదాని ద్వారానో, మనకు బాగా పరిచయం వుండటం వల్లనో, దానిని గురించి ఒక అభిప్రాయం ఏర్పరుచుకుంటాం కాబట్టి; సౌందర్యం అంటే యిదీ అని మనం తెలుసుకొని వుంటాం కాబట్టి. అయితే పోల్చిచూడటం ఆరంభిస్తే సౌందర్యం మాయమవదా? సౌందర్యం అంటే సుందరమైనది అని మనం ఎరిగిన దానిని ప్రత్యక్షంగా చూడటం, అంతమాత్రమేనా? ఒక సృజించిన రూపం వున్నా, లేకపోయినా మనలో కలిగే ఒక స్థితి కాదూ?

మనం ఎప్పుడూ సౌందర్యాన్ని వెంటాడుతూ వుంటాం, కురూపాన్ని తప్పించుకోవాలని చూస్తాం; ఈ విధంగా ఒకదాని మూలంగా పరిపుష్టం చెందాలని అపేక్షించడం, మరొకదానినుండి తప్పించుకోవాలని చూడటంవల్ల చివరకు జడత్వం (insensitivity) పుట్టి, పెరిగిపోవడానికి తప్పని సరిగా దారితీస్తుంది. సౌందర్యం అంటే ఏమిటో అవగాహన చేసుకోవడానికి, అనుభూతి చెందడానికి, 'సౌందర్యం' అని మనం పిలిచే దాని ఎడల, 'కురూపం' అని మనం పిలిచే దాని ఎడల మనలో సున్నితత్వభావం వుండటం తప్పనిసరి. ఒక మనోభావం అందమైనదీ కాదు, వికారమైనదీ కాదు, అది వట్టి మనోభావమే. అయితే దానిని మనం మత సంబంధమైన, సమాజ సంబంధమైన నిబద్ధత (conditioning)తో చూసి, దానికి ఒక పేరు తగిలిస్తాం; దానిని ఒక మంచి మనోభావం అనో, చెడ్డ మనోభావం అనో అంటాం; అట్లా దానిని వికృత పరచడమో, విచ్ఛిన్న పరచడమో చేస్తాం. మనోభావానికి ఒక పేరు కనుక తగిలించకపోతే దాని తీవ్రత తగ్గకుండా వుండిపోతుంది; అటు కురూపత్వం కాని, యిటు ఆవిర్భూతమయిన సౌందర్యం కాని అవనిదానిని అవగాహన చేసుకొనడానికి గాఢోద్వేగపూరితమైన తీవ్రత్వం (passionate intensity) చాలా అవశ్యకం. ఇక్కడ అత్యంత ముఖ్యమైన అంశం ఏమిటంటే – యీ మనోభావాన్ని, కేవలం శరీరాన్ని తృప్తిపరచే మోహకాంక్ష కానటువంటి యీ గాఢోద్వేగాన్ని కాపాడుతూండటం; ఎందుకంటే, యీ గాఢోద్వేగమే సౌందర్యాన్ని సృజిస్తుంది; యిది అసదృశమైనది కనుక దీనికి వ్యతిరేకమైనదీ లేదు.

మానవునిలో సర్వతోముఖ వికాసం కలుగజేయాలని మనం అపేక్షిస్తున్నప్పుడు, అతని చేతనావర్తంతోపాటుగ అచేతనావస్థను కూడా పరిగణనలోకి తీసుకోవడం తప్పని సరి అని చెప్పనక్కరలేదు. అచేతన మానసాన్ని అవగాహన చేసుకోకుండా చేతన మానసాన్ని మాత్రమే విద్యావంతం చేయడంవల్ల, ఆశాభంగాల బాధలకు మరెన్నో దురవస్థలకు కారణమయిన స్వయం వైరుధ్యాలను మానవ జీవితాల్లో

సృష్టించడమవుతుంది. పైపై పొరలలో వున్న మనసుకంటె లోపలగా దాగివున్న మనసు అత్యంత ప్రధానమైనది. విద్యాబోధకులలో చాలామంది పట్టించుకునేది ఉపరితలంలోని మనసుకు సమాచారం లేదా జ్ఞానం అందివ్వడం గురించి మాత్రమే; ఒక ఉద్యోగం సంపాదించుకొని, సమాజానికి అనువుగా సర్దుకుని పోవడానికి మనసుని సిద్ధం చేయడమే వారికి కావలసినది. ఇక దాగివున్న అజ్ఞాతమయిన మనసు జోలికే పోరు. మనం విద్యాబోధన అని గొప్పగా చెప్పుకుంటున్నది చేసే పని ఏదంటే, జ్ఞానాన్ని, నైపుణ్యాన్ని మనసుపైన ఒక పొరగా ముద్రించడం; చుట్టూవున్న పరిసరాలకు అనుగుణంగా సర్దుకునిపోయే ఒక సామర్థ్యాన్ని మనసుకు యివ్వడం.

ఉపరితలపు మనసు ఎంత సుశిక్షితమయినదయినా, సర్దుకొని పోయే సమర్థత కలదయినా, అజ్ఞాత మానసమే అంతకంటే ఎక్కువ శక్తివంతమయినది; దీనిలో మార్మికమయిన సంగతి ఏమీ లేదు. అజ్ఞాత లేక అచేతన మానసం జాతికి సంబంధించిన స్మృతులను దాచే తేనెతుట్టె వంటిది. మతము, అంధవిశ్వాసాలు, సంకేతం (symbol), ఒక్కొక్క జాతిలో వుండే విచిత్రమయిన రీతిరివాజులు, సాహిత్య ప్రభావం – (పవిత్ర గ్రంథాలు, లౌకిక గ్రంథాలు కూడా), ఆశయాలు, ఆశాభంగాల వ్యధలు, వింతయిన అలవాట్లు, రకరకాల ఆహారపదార్థాలు – యివన్నీ అచేతనలో వ్రేళ్ళూనుకొని వుంటాయి. బాహాటమయిన కోరికలు, రహస్యమైన కోరికలు, వాటి ప్రేరణ హేతువులు, ఆశలు, భయాలు, దుఃఖాలు, సుఖాలు, రకరకాలుగ రూపాంతరం తాల్చిన భద్రతాకాంక్ష ద్వారా సంరక్షింపబడుతూ వుండే నమ్మకాలు – ఇవన్నీ కూడా అజ్ఞాత మానసంలో వుంటాయి; ఈ అజ్ఞాత మానసానికి భూతకాలపు అవశేషాలను పట్టివుంచే అసాధారణమయిన ప్రతిభే కాకుండా, భవిష్యత్కాలాన్ని ప్రభావితం చేసే ప్రావీణ్యం కూడా వుంటుంది. వీటన్నింటిని గురించిన సూచనలు ఉపరితలపు మానసానికి, అది పూర్తిగా రోజువారీ ఘటనలలో మునిగిపోకుండా వున్నప్పుడు, స్వప్నాలు మొదలయిన అనేక మార్గాల ద్వారా అందివ్వబడతాయి.

అజ్ఞాత మానసం అంటే అదేదో అపవిత్రమైనదీ కాదు, భయపడి భీతిచెందవలసినదీ కాదు; తనను ఉపరితలపు మానసానికి ప్రదర్శించడానికి ప్రత్యేక నిపుణుడు వుండి తీరాలనీ యిది కోరదు. అయితే అజ్ఞాత మానసానికి గల బ్రహ్మాండమైన శక్తివలన ఉపరితల మానసం తన యిచ్ఛాప్రకారంగా దానితో వ్యవహరించలేదు. ఉపరితలపు మానసం, తనలో ఒక భాగం అయిన అజ్ఞాత మానసంతో పోల్చిచూస్తే, చాలా వరకు అర్భకమైనదనే చెప్పుకోవాలి. తప్పకుండా నెరవేర్చవలసిన సాంఘిక బాధ్యతల, వ్యాపకాల కారణంగా తీర్చిదిద్దాలనీ, అణచివుంచాలనీ ఎంతగా ప్రయత్నించినా సరే, ఉపరితల మానసం అజ్ఞాత మానసాన్ని కొద్దిగా పైపైన స్పృశించగలదు, అంతే; కనుక యీ రెండింటి నడుమ ఒక చీలిక లేక వైరుధ్యం వుంటుంది. ఈ గండికి క్రమశిక్షణ ద్వారానో లేక అనేక యితర విధానాలు, ఆజ్ఞల ద్వారానో వంతెన కట్టాలని ప్రయత్నిస్తాం; కాని యీ విధంగా వంతెన కట్టడం సాధ్యమయ్యేది కాదు.

చేతనావస్థలోని మనసు ప్రస్తుతంతో అంటే పరిమితులు గల వర్తమానంతో నిండిపోయి వుంటుంది; కాని అచేతనం శతాబ్దాల భారం మోసుకొస్తూ వుంటుంది. తక్షణావసరానికి దానిని ఆనకట్ట వేసి ఆపడం గాని, ప్రక్కకు మళ్ళించడం గాని

చేయలేము. అచేతన అగాధమైన కాలతత్వం కలది; చేతన మానసం తను క్రొత్తగా అలవర్చుకున్న సంస్కృతి వలన అచేతన మానసానికి అప్పుడప్పుడు కలిగే అగత్యాలకు అనుగుణంగా వ్యవహరించ లేదు. స్వయం వైరుధ్యాలు నిర్మూలించాలంటే, ఉపరితలపు మనసు యీ వాస్తవాన్ని అవగాహన చేసుకొని, స్థిమితంగా వుండాలి – అంటే అజ్ఞాత మానసపు అసంఖ్యాకమయిన ప్రేరణలకు ప్రోత్సాహం యివ్వమని మాత్రం అర్థం చేసుకొన కూడదు. బాహ్యపు మానసానికి, అజ్ఞాత మానసానికి మధ్యన విరోధం లేనప్పుడు అజ్ఞాతం, దానికి కాలం అంతటి సహనం వున్నది కాబట్టి, ప్రస్తుతంపై దాడి చేయదు.

అజ్ఞాతమైనది, అనావిష్కృతమైనది, అవగాహన చేసుకోబడనిదీ అయిన యీ అచేతన మనసు, 'విద్యావంతం' అయిన తనలోని ఒక భాగమే అయిన ఉపరితలపు మానసం ద్వారా ప్రస్తుత వర్తమానపు సవాళ్ళతో, ఒత్తిడి చేసే కోర్కెలతో సంధానం చెందడం జరుగుతుంది. ఉపరితలపు మానసం యీ సవాళ్ళకు తగినంతగా స్పందించవచ్చు; అయితే ఉపరితలానికీ అజ్ఞాతానికీ నడుమన పరస్పర వైరుధ్యం వున్నప్పుడు, ఉపరితల మానసం ఏ అనుభవానికి లోనయినా, అది ఉపరితలానికీ అజ్ఞాతానికీ మధ్యన గల సంఘర్షణను మరింత ఎక్కువచేసి తీరుతుంది. ఇది మరికొంత అనుభవానికి దారితీసి, వర్తమానానికి భూతకాలానికి నడుమన గల గండిని యింకా పెద్దది చేస్తుంది. ఉపరితల మానసం బాహ్యమైన దానిని అనుభవిస్తూ, అంతరికమైన దానిని అంటే అజ్ఞాత మానసాన్ని అవగాహన చేసుకోక పోవడంవల్ల, యింకా లోతయిన, యింకా పెద్దదయిన సంఘర్షణను తయారుచేస్తుంది.

మనం సాధారణంగా భావించే విధంగా అనుభవం మనసును విముక్తమూ చేయదు, సుసంపన్నమూ చేయదు. అనుభవం అనుభవిస్తున్న వాడిని మరింత బలంగా తయారు చేస్తున్నంతవరకు ఘర్షణ తథ్యం. అనుభవాలు పొందుతూ వుండటం ద్వారా, నిబద్ధీకరణం (conditioned) చెందిన మనసు నిబద్ధత మరికొంత గట్టిపడుతుంది; ఆ విధంగా వైరుధ్యం, బాధ కొనసాగుతూ వుంటాయి. మనసు, తనలోని సమస్త రీతులను అవగాహన చేసుకోగలిగినదయినప్పుడే, అనుభవించడం అనేది విమోచనకారకం అవుతుంది.

అజ్ఞాత మానసపు అనేక పొరలలో వున్న బలశక్తులు, సామర్థ్యాలు గ్రహించి, అవగాహన చేసుకున్నాక, ఆ పైన సూక్ష్మాంశాలను ప్రాజ్ఞతతోనూ, వివేకంతోనూ పరిశీలించవచ్చును. అన్నింటికంటే ముఖ్యమైనది అజ్ఞాత మానసాన్ని అవగాహన చేసుకోవడం; అంతేకాని అది ఎంత అవసరమయినా సరే, జ్ఞానం ఆర్జించడం కోసం మాత్రమే ఉపరితలపు మానసాన్ని 'విద్యావంతం' చేయడం అంత ముఖ్యం కాదు. అజ్ఞాత మానసాన్ని అవగాహన చేసుకోవడం సంపూర్ణ మానసాన్ని ఘర్షణనుండి విముక్తం చేస్తుంది. అప్పుడే ప్రజ్ఞ లేక వివేకం అనేది ఉదయిస్తుంది.

దైనందిన కార్యకలాపాల్లో జీవించే ఉపరితలపు మానసంలోని సంపూర్ణ శక్తిసామర్థ్యాలను జాగృతం చేయాలి; అజ్ఞాత మానసాన్ని కూడా అవగాహన చేసుకోవాలి. అజ్ఞాతాన్ని అవగాహన చేసుకోవడంలో సర్వసమగ్రమైన జీవితం వుంది; అప్పుడే ఒకదాని వెంట మరొకటి వరుసగా అనుసరించి వచ్చే సుఖాలు, దుఃఖాలతో

కూడుకున్న పరస్పర వైరుధ్యం మాయమవుతుంది. అజ్ఞాత మానసంతో పరిచయం పెంపొందించుకొని, అది పనిచేసే పద్ధతులు ఎరిగి వుండటం అత్యంత ఆవశ్యకం; అయితే దాని ధ్యాసలో పూర్తిగా మునిగిపోవడం, దానికి అసమంజసమైన ప్రాధాన్యం యివ్వడం తగదు అనే సంగతి కూడా అంతే ముఖ్యమైనది. మనసు ఉపరితలాన్ని, అజ్ఞాతాన్ని అవగాహన చేసుకున్నప్పుడే, అది (మనసు) తన పరిమితులను అధిగమించి ఆవలగా వెళ్ళి, కాలంతో సంబంధం లేని ఆ ఆనందాన్ని కనిపెట్టగలుగుతుంది.

- జె. కృష్ణమూర్తి.

★ ★ ★

# అధ్యాయం 1

మీకు విద్య నేర్పిస్తున్నది ఎందుకోసమో మీరెప్పుడయినా ఆలోచించారా? చరిత్ర, గణితము, భూగోళశాస్త్రము యింకా అటువంటివి ఎందుకు నేర్చుకుంటున్నారు? పాఠశాలల్లో, కళాశాలల్లో ఎందుకు చేరామని ఎప్పుడయినా ఆలోచించారా? ఇంతింత సమాచారం, విజ్ఞానం మీ తలల్లో కూరికూరి నింపుతున్నది ఎందుకొరకో తెలుసుకోవడం చాలా ముఖ్యమైన సంగతి కాదూ? అసలీ విద్యాభ్యాసం అనబడేదానికి ఏమిటి అర్థం? ఇటువంటి పరీక్షలే మీ తల్లిదండ్రులూ ఒకప్పుడు చదివి ఉత్తీర్ణులయి, రకరకాల డిగ్రీలు సంపాదించారు కాబట్టి, మిమ్మల్నీ యిక్కడకు పంపివుంటారు, అంతేనా? అసలు మీరు ఎందుకు యిక్కడికి వచ్చారో మిమ్మల్ని మీరే ఎప్పుడయినా ప్రశ్నించుకున్నారా? మీ అధ్యాపకులయినా మిమ్మల్ని ఎందుకు చదువుతున్నారని అడిగారా? అధ్యాపకులకు తాము యిక్కడ ఎందుకున్నారో తెలుసునా? ఈ ప్రయాస, పోరాటం అంతా దేనికోసమో తెలుసుకోవాలనే ప్రయత్నం మీరు చేయవద్దూ? - చదువుకోవడం, పరీక్షల్లో నెగ్గవలసి రావడము, యింట్లో కాకుండా ఎక్కడో అందరికీ దూరంగా ఒకచోట భయపడకుండా వుండి చదువుకోవడము, ఆటల్లో చక్కగా పాల్గొనడం, యింకా యిటువంటి వాటికోసం ప్రయాసపడటం ఎందుకో తెలుసుకోవద్దూ? కేవలం పరీక్షలకి తయారుచేయడమే కాకుండా యివన్నీ లోతుగా తరచి చూసి, తెలుసుకోవడానికి మీ టీచర్లు మీకు సహాయం చేయవద్దూ?

మగపిల్లలకు తెలుసు, వారు పెద్దయాక ఒక ఉద్యోగం సంపాదించాలి అని, జీవనోపాధికి డబ్బు సంపాదించాలి అని; అందుకే పరీక్షలు వ్రాసి పాసవుతారు. మరి ఆడపిల్లలు పరీక్షలు వ్రాసి పాసవడం ఎందుకు? మంచి భర్తలను సంపాదించడం కోసం చదువుకుంటారా? నవ్వకండి; దీనిని గురించి కొంచెం ఆలోచించండి. ఇంట్లో మీరు చేసే గోల భరించలేక మీ తల్లిదండ్రులు మిమ్మల్ని స్కూలుకి పంపించేస్తున్నారా? పరీక్షలు పాసు కావడంతోటే జీవిత పరమార్థమేమిటో అంతా మీకు అర్థమయిపోతుందా? కొంతమందికి పరీక్షలు వ్రాసి పాసుకావడంలో చాలా చాతుర్యం వుంటుంది. అంత మాత్రాన వాళ్ళంతా చాలా తెలివైనవారని చెప్పడానికి వీల్లేదు. తక్కిన వారికి, పరీక్షల్లో ఎట్లా ఉత్తీర్ణత సంపాదించాలో తెలియకపోవచ్చును గాని, వారికంటె ఎక్కువ తెలివయినవారయి వుండవచ్చును; వారి చేతుల్లో ఎక్కువ

నైపుణ్యం వుండి వుండవచ్చును; పరీక్షలు పాసవడంకోసమై బట్టీపడుతూ చదివే వారికంటే వారు ఎక్కువ గాఢంగా ఆలోచించి తెలుసుకోగలవారయి వుండవచ్చును.

చాలామంది మగపిల్లలు ఉద్యోగం సంపాదించడం కోసమే చదువుతారు; వాళ్ళ జీవితలక్ష్యం అంతా అదే. అయితే ఉద్యోగం సంపాదించాక ఏమవుతుంది? పెళ్ళి చేసుకుంటారు, పిల్లల్ని కంటారు – ఇక జీవితాంతం ఒక యాంత్రికమైన జీవనంలో చిక్కుకునిపోయి వుంటారు, అంతేకదూ? గుమాస్తాలుగానో, న్యాయవాదులుగానో, పోలీసు ఉద్యోగాల్లోనో స్థిరపడతారు; ఆపైన తమ భార్యా బిడ్డలతోపాటుగా అంతులేని జీవనపోరాటం కొనసాగిస్తూ వుంటారు. ఇక వారికి మృత్యువు ఆసన్నమయేవరకు జీవితం అంటే ఒక నిరంతర సమరమే.

సరే, యిక మీ ఆడపిల్లల సంగతేమిటి? పెళ్ళిళ్ళు చేసుకొంటారు – అదే మీ లక్ష్యం; మీ తల్లిదండ్రుల ఆరాటం కూడా మీ పెళ్ళిళ్ళు జరిపించాలనే – ఆపైన మీకు పిల్లలు కలుగుతారు. మీకు కాస్త డబ్బు కనుక వున్నట్లయితే, మీ ధ్యాస అంతా చీరలకోసం, మీ అందచందాల కోసం; మీ దిగులు అంతా భర్తతో వచ్చే చిన్నచిన్న కలహాల గురించీ, యితరులు మీ గురించి ఏమనుకుంటారో అనేదానిని గురించీ.

గ్రహిస్తున్నారా నేను చెప్తున్నది? మీ కుటుంబాల్లోనూ, మీ చుట్టుప్రక్కల ప్రపంచంలోనూ జరుగుతున్నది యిదే అనేది మీరు ఎరక్కుండా వున్నారా? ఎల్లకాలం యిదే విధంగా జరిగిపోతూ వస్తున్నదని గమనించారు కదూ! అసలు విద్య అంటే అర్థం ఏమిటో మీరు తెలుసుకోవద్దూ? ఎందుకు మీరు విద్య అభ్యసించాలో, ఎందుకు మీ తల్లిదండ్రులు మీకు విద్య నేర్పించాలనుకుంటున్నారో, యీ ప్రపంచంలో విద్య ద్వారా సాధించగలిగేది అంతా యింతా కాదని సుదీర్ఘమైన ఉపన్యాసాలు వాళ్ళు ఎందుకు యిస్తున్నారో – మీరు తెలుసుకోవద్దూ? బెర్నార్డ్ షా నాటకాలు మీరు చదవగలిగి వుండచ్చు, షేక్స్పియర్ లేదా వోల్టెయిర్ లేదా మరో ఆధునిక తత్త్వవేత్త రచనల గురించి మీరు సోదాహరణంగా మాట్లాడగలిగి వుండచ్చు; కాని మీలో స్వయంగా తెలివితేటలు లేకపోతే, మీలో స్వయంగా సృజనాత్మకత లేకుంటే యీ చదువుల వల్ల ప్రయోజనం ఏమిటి?

అందువలన, ఉపాధ్యాయులుగానీ విద్యార్థులు గానీ ఎట్లా వివేకంగా వుండాలి అనేది తెలుసుకోవడం ముఖ్యమైన విషయం కదూ? కేవలం చదవగలిగి వుండటం, పరీక్షలు పాసు కాగలగడం మాత్రమే విద్యాభ్యాసం కాదు. కాస్త చాతుర్యం వున్న ఎవరయినా యివి చేయవచ్చు. తెలివి తేటలు లేదా వివేకం లేదా ప్రజ్ఞ పెంపొందించుకోవడమే విద్యాభ్యాసం; అవును కదూ? అయితే, వివేకం అంటే గడుసుదనంగాని, జిత్తులమారితనంగాని ఎదుటివారిని మించిపోవడానికి అవలంబించే చాతుర్యమనిగాని కాదు నా అర్థం. వివేకం అనేది వీటికంటె చాల భిన్నమయినదని గట్టిగా చెప్పచ్చు. మీలో భయం లేనప్పుడే వివేకం వుంటుంది. అసలు యీ భయం అనేది మీలో ఎప్పుడు కలుగుతుంది? ఇతరులు మీ గురించి ఏమనుకుంటారో, మీ తల్లిదండ్రులు మీ గురించి ఏమనుకుంటారో అని మీరు ఆలోచించినప్పుడు మీలో భయం కలుగుతుంది; మిమ్మల్ని యితరులు విమర్శిస్తారని

భయం, శిక్షిస్తారేమోనని భయం, పరీక్షల్లో ఉత్తీర్ణత సాధించలేకపోతామేమోనని భయం. అధ్యాపకుడు తిట్టినప్పుడు లేదూ మీ తరగతిలో కానీ, పాఠశాలలో కానీ, మీ చుట్టూ వున్న ప్రపంచంలో గానీ మిమ్మల్ని అందరూ గుర్తించి, ఆదరించనప్పుడు మీలో భయం మెలమెల్లగా చోటు చేసుకుంటుంది.

వివేకానికి లేదా తెలివికి యీ భయభీతి అనేది ఒక ఆటంకం అని స్పష్టంగా తెలుస్తున్నది. అవును కదూ? అందుకని విద్యయొక్క తాత్పర్యం – విద్యార్థికి – అంటే మీకు, నాకు, అందరికీ, భయాన్ని గురించిన ఎరుక కలిగివుండటానికి, భయానికి గల కారణాలను అవగాహన చేసుకోవడానికి సహాయం చేయడమే. అప్పుడే ప్రతివారూ బాల్యం నుండే భయం లేకుండా జీవించడానికి వీలవుతుంది.

మీలో భయం వున్నదని మీకు తెలుసునా? మీలో భయం తప్పకుండా వున్నది, లేదంటారా? లేక మీరు భయాన్ని పోగొట్టుకో గలిగారా? మీ తల్లితండ్రులన్నా, మీ ఉపాధ్యాయులన్నా లేదా యితరులన్నావారు ఏమనుకుంటారో అనీ మీరు భయపడటం లేదూ? మీ తల్లితండ్రులూ, సమాజమూ గర్హించే పని ఏదయినా మీరు చేశారనుకుందాం. అప్పుడు మీరు భయపడకుండా వుంటారా? మీ కులానికో, మీ వర్గానికో చెందని వ్యక్తిని మీరు వివాహం చేసుకోవాలని అనుకుంటున్నారనుకుందాం; అందరూ ఏమంటారో అని భయపడకుండా వుంటారా మీరు? మీరు పెళ్ళి చేసుకోబోయే భర్త తగినంత సంపాదన లేనివాడయితేనో; అతనికి పదవీ, ప్రతిష్ఠ లేకపోతేనో మీరు సిగ్గుపడకుండా వుంటారా? స్నేహితులంతా మిమ్మల్ని చులకనగా చూస్తారేమోనని మీరు భయపడకుండా వుంటారా? వ్యాధులంటే, మరణం అంటే మీరు భయపడకుండా వుంటారా?

మనలో చాలామందికి యీ భయాలు వున్నాయి. అంత త్వరగా 'లేవు' అనకండి. ఇంతవరకు ఎప్పుడూ వీటిని గురించి ఆలోచించి వుండకపోవచ్చును. ఆలోచించి చూస్తే మాత్రం, యీ ప్రపంచంలో నివసిస్తున్న అందరినీ – పెద్దవారు కానివ్వండి, చిన్నపిల్లలు కానివ్వండి – ప్రతివారినీ ఏదో ఒక రకమైన భయభీతి గుండెల్ని పట్టి పీడిస్తూనే వుంటుందని గమనిస్తారు. కాబట్టే, ప్రతి వ్యక్తికి, భయం నుండి విముక్తి పొందడానికి సహాయం చేసి, ఆ విధంగా అతను వివేకవంతుడు అవడానికి తోడ్పడటమే విద్యయొక్క కర్తవ్యం కావద్దూ? పాఠశాలలో మనం ఉద్దేశించే లక్ష్యం అదే – అంటే ముందుగా అధ్యాపకులు భయం నుండి పూర్తిగా విముక్తులై వుండాలి. తమ యిరుగు పొరుగువారు తమను గురించి ఏమనుకుంటారో అనే భయం, తమ భర్తలంటే, లేదా తమ భార్యలంటే భయం టీచర్లకే వుంటే యిక వాళ్ళు నిర్భయత్వం గురించి ఎంత మాట్లాడినా ఏం మంచి ఒరుగుతుంది?

భయం వున్నట్లయితే సృజనాత్మకత అనే అర్థంలో అంతఃస్ఫూర్తి వుండదు. ఇక్కడ అంతఃస్ఫూర్తి అంటే ఏదయినా మౌలికమయినది చేయగలగడం – అప్రయత్నంగా, అతి సహజంగా చేయగలగడం – మరొకరి మార్గదర్శకత్వంలో గానీ, నిర్బంధంవల్లగానీ, కట్టుబాట్లకు లోబడిగానీ కాదు. ఒక పనిని – మీకు ఆ పని అంటే ప్రీతి కాబట్టి చేయడం. రోడ్డు మధ్యలో ఒక రాయి వుండటమూ, కార్లు దానిమీదకు

ఎక్కి ఎగిరిపడుతూ పోవడమూ మీరు అనేకసార్లు చూసి వుండవచ్చు. మీరు ఎప్పుడయినా ఆ రాయిని తొలగించారా? నడుచుకుంటూ వెళ్తున్నప్పుడు పేదవారిని, రైతులను, గ్రామీణులను ఎప్పుడయినా గమనించి చూశారా? వారిపై కాస్తయినా దయ చూపించారా? అప్పటికప్పుడు అప్రయత్నంగా, అతి సహజంగా, మీ హృదయ పూర్వకంగా – ఎవ్వరూ యిట్లా చెయ్యండి అని మీకు చెప్పకుండా – వారికి ఏ చిన్న ఉపకారమయినా చేశారా?

ఇదిగో చూడండి, మీలో భయం కనుక వున్నట్లయితే మీ జీవితంలో వీటన్నింటికీ అవకాశమే వుండదు. మీరు మోటుగా, అంటే ఏ స్పందనా లేకుండా తయారవుతారు, మీ చుట్టూరా ఏం జరుగుతున్నదో పరిశీలించరు. మీలో భయం వున్నట్లయితే మీరు సంప్రదాయంలో, రీతి రివాజుల్లో బంధితులవుతారు, ఒక నాయకుడినో, ఒక గురువునో మీరు అనుసరిస్తారు. మీరు సంప్రదాయంలో బంధితులై వుంటే, భార్య అంటేనో, భర్త అంటేనో భయపడుతూ వుంటే, ఒక వ్యక్తిత్వంగల మనిషిగా మీకుండే గౌరవాన్ని కోల్పోతారు.

కనుక, అది ఎంత అవసరమయినదయినా కావచ్చుగాక, కేవలం కొన్ని పరీక్షలు పాసు కావడానికి మిమ్మల్ని తయారుచేయడం మాత్రమే కాకుండా, మిమ్మల్ని భయంనుండి విముక్తం చేయడం విద్యాబోధన యొక్క ఉద్దేశమూ, కర్తవ్యమూ కాదూ? ముఖ్యంగా, లోతుగా ఆలోచించి చూస్తే, విద్యాబోధనకుగాని, ప్రతి అధ్యాపకుడికిగాని వుండవలసిన అత్యంత ప్రధాన లక్ష్యం అదే; మీ బాల్యం నుండే భయం నుండి పూర్తిగా విముక్తి పొందడానికి విద్య తోడ్పడాలి; అప్పుడే మీరు బయట ప్రపంచంలోకి ఒక వివేకంగల మనిషిగా, నిజమైన అంతఃస్ఫూర్తితో నిండివున్న మనిషిగా అడుగుపెడతారు. మీరు కేవలం మరొకరికి నమూనాగా తయారువుతున్నప్పుడు, సంప్రదాయంలో బంధితులయి వున్నప్పుడు, ఒక రాజకీయ నాయకుడినో, ఏదో ఒక మతానికి చెందిన స్వామీజీనో అనుసరిస్తూవున్నప్పుడు మీలో సహజంగా వుండే అంతఃస్ఫూర్తి అనేది నశిస్తుంది. ఎవరో ఒకరిని అనుసరించడం అనేది వివేకానికి తప్పకుండా హాని కలిగిస్తుంది. అసలు అనుసరణ అనే విధానమే భయ భావాన్ని సృష్టిస్తుంది; విపరీతమైన చిక్కులతో, పోరాటాలతో నిండి వుండి, ఎన్నో దుఃఖాలు, ఎంతో పేదరికం, ఐశ్వర్యం, సౌందర్యం – అంటే పక్షుల సౌందర్యం, నీటిమీద మెరిసే సూర్యాస్తమయ సౌందర్యం – ఇటువంటివన్నీ గల జీవితాన్ని అవగాహన చేసుకోకుండా భయం అడ్డుపడుతుంది. మీరు భీతి చెందివున్నప్పుడు, వీటన్నింటి ఎడల మీలో స్పందన వుండదు. మొద్దుబారిపోతారు.

మీకు ఒక సూచన చేసేదా? మనం యిప్పుడు మాట్లాడుతున్న విషయాలని గురించి ఇంకా వివరించి చెప్పమని మీ టీచర్లని అడగండి. అడుగుతారు కదూ? మీ టీచర్లకు యివి అవగతమయ్యాయా లేదా అనే సంగతి స్వయంగా మీరే తెలుసుకోండి – మీలోని తెలివిని వృద్ధి చేయడంలో, మీరు భయభీతి చెందకుండా వుండటంలో మీకు సహాయపడటానికి యిది వారికి తోడ్పడుతుంది. ఇటువంటి విషయాలలో మనకి బాగా తెలివి లేదా ప్రజ్ఞ, వివేకం కలిగిన టీచర్ల అవసరం వుంది. అంటే బి.యే., యం.యే., పరీక్షలు పాసయే తెలివితేటలు కాకుండా

నిజమైన తెలివి గల టీచర్ల అవసరం వుంది. మీకు ఆసక్తి కనుక వుంటే యీ విషయాలు మీ టీచర్లతో చర్చించి, మాట్లాడటానికి ఒక పిరియడును మీ దినసరి కార్యక్రమంలో కేటాయించమని అడగండి. మీరు ఒకనాటికి పెరిగి పెద్దవాళ్ళవుతారు కాబట్టి, ఒకనాటికి మీకు భార్యలు, భర్తలు, పిల్లలు వస్తారు కాబట్టి, అసలు యీ జీవితం – జీవనోపాధికై ప్రయాస పడవలసిన యీ జీవితం – దుర్భరమైన బాధలతో, అద్భుతమైన సౌందర్యంతో నిండివున్న యీ జీవితం – యిదంతా దేనికోసమో మీరు తెలుసుకోవాలి, అవగాహన చేసుకోవాలి; పాఠశాలే వీటన్నింటిని గురించి నేర్చుకోదగిన సరియైన ప్రదేశం. కేవలం గణితము, భూగోళశాస్త్రము, చరిత్ర, విజ్ఞాన శాస్త్రము మాత్రమే మీ టీచర్లు మీకు నేర్పిస్తుంటే అది సరిపోదని నేను స్పష్టంగా చెప్పగలను. మీరు ముఖ్యంగా గ్రహించవలసినది ఏమిటంటే, జాగరూకంగా, అంటే మెలకువగా వుండి, ప్రశ్నిస్తూ వుండటం, తెలుసుకోవడం; ఆ విధంగా మీలోపల సహజంగా వున్న అంతఃస్ఫూర్తి జాగృతమవుతుంది.

★ ★ ★

# అధ్యాయం 2

**భయం** అనే సమస్యను గురించి మనం చర్చిస్తూ వున్నాం. మనలో చాలా మందిమి భయపడుతూ వుంటామని తెలుసుకున్నాం. భయం మనిషిలో అంతఃస్ఫూర్తి లేదా చొరవ అనేది లేకుండా చేస్తుంది. ఎందుకంటే, భయం వల్ల ఒక తీగ చెట్టును అల్లుకొని వ్రేలాడినట్లుగా మనం వ్యక్తులను, విషయాలను, వస్తువులను వదలకుండా పట్టుకొని వ్రేలాడుతూ వుంటాం. మనం తల్లిదండ్రులనో, భర్తలనో, కొడుకులనో, కూతుర్లనో, భార్యలనో లేదా మన ఆస్తిపాస్తులనో, వస్తు సంపదనో గట్టిగా, వదలకుండా అంటిపెట్టుకొని వుంటాం. అదే భయానికి బాహ్య స్వరూపం. అంతర్గతంగా భయపడుతూ వుండటం వలన ఒంటరిగా నిలబడటానికి మనం సాహసించలేము. మనకు లెక్కలేనన్ని చీరలు, నగలు, యితర ఆస్తులు వుండచ్చు; కాని అంతర్గతంగా, మానసికంగా మనం చాలా పేదరికంలో వున్నట్లే. అంతర్గతంగా మనం ఎంత ఎక్కువ పేదవారమయితే అంత ఎక్కువగా యితర వ్యక్తులను, పదవిని, ఆస్తిపాస్తులను వదలకుండా అంటిపెట్టుకొని, బాహ్యంగానైనా సంపన్నులమవుదామని ప్రయత్నిస్తాం.

భయపడుతూ వున్నప్పుడు మనం బాహ్యంగా వుండే వస్తువులనే కాకుండా, అంతర్గతంగా వుండే సంప్రదాయం వంటి వాటిని కూడా వదలకుండా అంటి పెట్టుకుని కూర్చుంటాం. సాధారణంగా వృద్ధులైన వారికి, అంతరంగాల్లో చేతకానితనం, ఖాళీతనం వున్నవారికి సంప్రదాయం అంటే మహా మక్కువగా వుంటుంది. మీ మిత్రుల్లో, తల్లితండ్రుల్లో, అధ్యాపకుల్లో యిటువంటిది వుండటం గమనించారా? ఒకవేళ మీలోనే వున్నదేమో గమనించారా? భయం – అంటే అంతర్గతమైన భయం – కలిగిన మరుక్షణమే, ఒక సంప్రదాయాన్ని అనుసరించడం ద్వారా మీరు దానికి గౌరవప్రదమైన ముసుగు ఒకటి వేయాలని చూస్తారు; అట్లా మీలోని అంతఃస్ఫూర్తి మాయమవుతుంది. మీలో అంతఃస్ఫూర్తి లేదు కాబట్టి, కేవలం యితరులను అనుసరిస్తారు కాబట్టి, సంప్రదాయం చాలా ప్రాధాన్యం వహించి కూర్చుంటుంది. ప్రజలు మాటల్లో చెప్పుకునే యీ సంప్రదాయం, గడచిన కాలంనుండి అందివ్వగా వచ్చిన యీ సంప్రదాయం – చైతన్య శక్తినిగాని జీవితంలో ఉత్సాహాన్ని గాని కలిగించదు – ఎందుకంటే, అది అర్థంలేని వట్టి పునశ్చరణ కాబట్టి.

మనిషిలో భయం కలిగినప్పుడు సాధారణంగా అనుకరించడం అనే ధోరణి మొదలవుతుంది. ఆ సంగతి గమనించారా? భయపడుతూ వున్న మనుష్యులు యితరులని అనుకరించాలని చూస్తారు; సంప్రదాయాన్ని, అంటే రీతి రివాజులని, తల్లితండ్రులని, భార్యలని, అన్నదమ్ములని, భర్తలని వదలకుండా గట్టిగా అంటిపెట్టుకొని వుంటారు. అనుకరణ అంతఃస్ఫూర్తిని నశింపజేస్తుంది. మీకు తెలుసా, మీరు ఒక

చెట్టుని పూర్తిగా అనుకరించరు; ఆ చెట్టుని వున్నది వున్నట్లుగా ఒక నమూనాగా దించరు. అప్పుడది వట్టి ఫోటోగ్రఫి అవుతుంది. ఒక వృక్షాన్నిగాని, పూవును గాని, సూర్యాస్తమయాన్ని గాని స్వేచ్ఛగా ఒక వర్ణచిత్రంగా గీయాలంటే ఆ దృశ్యం మీకు ఏమి అందిస్తున్నదో దాని అనుభూతి మీలో కలగాలి; దాని ప్రాధాన్యం, దాని అర్థం గురించిన అనుభూతి మీలో కలగాలి. ఇది చాలా ప్రధానమైనది – చూసిన దానిని కేవలం నమూనాగా దించకుండా, మీరు చూసిన దానిలోని విశిష్టతను అందివ్వడానికి ప్రయత్నించడం; అప్పుడే మీరు సృజనాత్మక ప్రక్రియ మేలుకొల్పడం ఆరంభిస్తారు. దీనికి కావలసినది స్వేచ్ఛగల మనసు; సంప్రదాయంతో, అనుకరణల భారంతో వంగిపోయిన మనసు కాదు. ఒక్కసారి మీ జీవితాలకేసి, మీ చుట్టూరా వున్న జీవితాలకేసి పరికించి చూచుకోండి – ఎంత సంప్రదాయ బద్ధంగా, ఎంత అనుకరణ పూరితంగా వున్నాయో అవి!

కొన్ని విషయాల్లో అనుకరించడం అనేది మీకు తప్పనిసరియేమో; మీరు ధరించే దుస్తుల విషయంలో; చదివే పుస్తకాలు, మాట్లాడే భాష మొదలయిన విషయాల్లో లాగా, ఇవన్నీ అనుకరణకే రకరకాల రూపాలు. అయితే, యీ స్థాయిని దాటి పైకిపోవడం, మీ అంతట మీరే ఆలోచించి తెలుసుకొనడానికి స్వేచ్ఛాభావం కలిగి వుండటం అవసరం. ఆలోచనారహితంగా మరొకరు ఎవరో చెప్పినదానిని అంగీకరించకుండా వుండటం అవసరం; ఆ ఎవరో ఎవరయినా ఫరవాలేదు, – స్కూల్లో టీచరు, తల్లి లేదా తండ్రి లేదా గొప్ప మతగురువుల్లో ఒకరు – ఎవరయినా ఫరవాలేదు. ఒకరిని అనుసరించడం కాకుండా అన్ని విషయాలు మీరు స్వయంగా ఆలోచించి తెలుసుకోవడం చాలా ముఖ్యం; ఎందుకంటే – యింకొకరిని అనుసరించడం మీలో వున్న భయాన్ని సూచిస్తుంది, అవును కదూ? ఎవరో వచ్చి మీరు కోరుతున్నది ప్రసాదిస్తామని అన్న మరుక్షణమే అది దేవేంద్రలోకమో, స్వర్గమో, యిప్పుడున్న దానికంటే మంచి ఉద్యోగమో – అవి పొందలేమేమో అనే భయం మీలో చోటు చేసుకుంటుంది; అందువల్ల అన్నింటినీ ఒప్పుకోవడం, అనుసరించడం మీరు ఆరంభిస్తారు. ఏదో పొందాలని మీరు కోరుకుంటున్నంతవరకు మీలో భయం వుంటూనే వుంటుంది; ఆ భయమే మీ మనసుని అవకరం చేస్తుంది, దానితో మీరు యిక స్వేచ్ఛగా వుండలేరు.

స్వేచ్ఛగల మనసు అంటే ఏమిటో మీకు తెలుసా? మీ మనసుని మీరే ఎప్పుడయినా పరిశీలించి చూశారా? మీ స్నేహితులు మీ గురించి ఏమనుకుంటున్నారో అనేదే మీరు ఎప్పుడూ కనిపెట్టివుంటారు. చుట్టూరా కంచెనో, ముళ్ళతీగనో కట్టి మూసివేసిన యిల్లు వంటిది మీ మనసు. అటువంటి స్థితిలో క్రొత్తది ఏదీ జరగడానికి అవకాశమే లేదు. భయం అనేది లేనప్పుడే క్రొత్తది జరగడానికి అవకాశం వున్నది. మనసులో ఏ మాత్రం భయం లేకుండా వుండటమనే సంగతి చాలా కష్టసాధ్యమైనది. ఎందుకంటే, భయం లేకపోవడమంటే అంతరార్థం – మరొకరిని అనుకరించాలని, అనుసరించాలని కోరిక బొత్తిగా లేకపోవడం, బాగా ఐశ్వర్యం ఆర్జించి కూడబెట్టాలనుకునే యిచ్ఛ నిజంగా లేకపోవడం, సంప్రదాయానికి

కట్టుబడి వుండాలనే కోరిక కూడా పూర్తిగా లేకపోవడం; అయితే, దీని అర్థం చేయకూడని దుష్కార్యాలు మీరు చేసెయ్యాలని మాత్రం కాదు.

భయం లేనప్పుడు మనసులో స్వేచ్ఛాయుత భావం నెలకొంటుంది; గొప్పలు ప్రదర్శించాలనే కోరిక లేకుండా, పదవికోసం పేరు ప్రతిష్ఠల కోసం పన్నాగాలు పన్నుతూ వుండకుండా వున్నప్పుడే యిది జరుగుతుంది. అప్పుడు మనసులో అనుకరణ భావం కూడా వుండదు. అటువంటి మనసు – తనకు ఒక యాంత్రికమయిన అలవాటుగా మారిన యీ సంప్రదాయాన్నుండి నిజంగా విముక్తి చెందిన మనసు – వుండటం చాలా ముఖ్యం.

ఇదంతా చాలా కఠినంగా తోస్తున్నదా? మీ భూగోళ శాస్త్రం, గణితం అంత కఠినమయినదని నేను అనుకోను. అంతకంటె చాలా తేలికయినదే. అయితే మీరు యింతకు ముసుపు దీనిని గురించి ఆలోచించలేదు, అంతే. మీరు సుమారు పది, పదిహేను సంవత్సరాలు సమాచారం ఆర్జించడంకోసం పాఠశాలలో గడుపుతారు కానీ, ఒక వారం లేదూ ఒక్కరోజు అయినా యిటువంటి విషయాల్లో ఒక్కదాన్ని గురించయినా పూర్తిగా, సంపూర్ణంగా ఆలోచించడంకోసం తీరుబడి చేసుకోరు. అందువల్లే యిదంతా ఏదో చాలా కఠినమైనదిగా తోస్తుంది. నిజంగా చూస్తే యిది అంత కఠినమైనది కానేకాదు. కాకపోగా, మీరు కనుక కొంత సమయం దీనికి కేటాయిస్తే, మీ మనసు ఎట్లా పనిచేస్తుందో, ఏ విధంగా వ్యవహరిస్తుందో, ప్రతిస్పందిస్తుందో మీరే స్వయంగా చూడవచ్చు. మీరు చిన్నవయసులో వున్నప్పుడే మీ మనసుని అవగాహన చేసుకోవడం ఆరంభించడం చాలా ముఖ్యం; అట్లా కాకపోతే అర్థం పర్థంలేని ఏ సంప్రదాయాన్నో పట్టుకొని అనుసరిస్తూ పెరిగి పెద్దవాళ్ళవుతారు; అనుకరణ చేస్తారు, అంటే భయాన్ని పెంచి పోషించుకుంటారు; కాబట్టి మీరు స్వేచ్ఛగా ఎన్నటికీ వుండలేరు.

ఇక్కడ భారతదేశంలో మీరంతా ఎంత సంప్రదాయబద్ధులో గమనించారా? మీ వివాహాలు ఒక పద్ధతి ప్రకారమే జరగాలి; తల్లిదండ్రులే మీ భార్యనో, భర్తనో మీకోసం ఎంపిక చేస్తారు. మీరు కొన్ని పూజా పురస్కారాలు చేయాలి; వాటిలో ఏ అర్థమూ లేకపోయినా సరే, అవి మీరు ఆచరించవలసిందే. కొందరు నాయకులు వుంటారు, వాళ్ళని మీరు అనుసరించి తీరాలి. మీరు పరిశీలించి చూసినట్లయితే, మీ గురించిన సమస్తమూ ఒక ఆధిపత్యం క్రింద బాగా పాతుకొనిపోయిన జీవిత విధానమే అని మీరు కనిపెట్టవచ్చు. ఆ ఆధిపత్యం ఒక గురువుగారిది కావచ్చు; రాజకీయ కూటమిది కాని, తల్లిదండ్రులది కాని లేదా ప్రజాభిప్రాయపు ఆధిపత్యం కావచ్చు. నాగరకత ఎంత ప్రాచీనమయినదయితే, రకరకాల అనుకరణల భారం కూడా తోడయిన సంప్రదాయపు బరువు అంత ఎక్కువగా వుంటూ వుంటుంది. ఈ బరువు భారాలను మోస్తూ, మీ మనసు ఎన్నటికీ స్వేచ్ఛను పొందలేదు. మీరు రాజకీయమైన స్వేచ్ఛను గురించో, మరో స్వేచ్ఛను గురించో మాట్లాడవచ్చును, కాని ఒక వ్యక్తిగా మీరు స్వయంగా తెలుసుకోవడానికి నిజమైన స్వేచ్ఛ మీకు లేనేలేదు; ఎందుకంటే, మీరు ఎప్పుడూ అనుసరిస్తూనే వుంటారు – ఒక ఆదర్శాన్ని,

ఒక గురువుగారిని లేదూ ఏదో ఒక అవకతవక మూఢ విశ్వాసాన్ని పట్టుకొని అనుసరిస్తుంటారు కాబట్టి.

కనుక, మొత్తం మీ జీవితం అంతా కొన్ని అభిప్రాయాల ముళ్ళ కంచెతో చుట్టబడి పరిమితము, బంధితము అయివుంది; మీ లోపల, అంతరాంతరాలలో భయం వున్నది. ఒక ప్రక్కన భయం వుండగా మీరు స్వేచ్ఛగా ఎట్లా ఆలోచించ కలుగుతారు? అందుకని వీటన్నింటిని గురించిన చైతన్యం మీకు వుండటం చాలా ముఖ్యం. మీరొక పామును చూశారనుకుందాం; దానిలో విషం వుంది అని తెలుస్తే దానికి దూరంగా తొలగిపోతారు, దాని దరిదాపులకే పోరు. కాని మీలోని చొరవను, అంతఃస్ఫూర్తిని ఆటంకపరిచే అనేక రకాలయిన అనుకరణలలో మీరు చిక్కుకొనిపోయి వున్నారని మీకు తెలియదు; మీకు తెలియకుండానే మీరు అందులో చిక్కుకునిపోయారు. మీలో కనుక వాటిని గురించిన, అవి మిమ్మల్ని పట్టివుంచిన తీరు గురించిన చైతన్యం కలుగుతే – అందరూ ఏమనుకుంటారో అని భయపడుతూండటం వలన, మీ తల్లితండ్రులన్నా, మీ టీచర్లన్నా భయపడుతుండటం వలన మీరు అనుకరించాలనుకుంటున్నారనే యథార్థం గురించిన ఎరుక మీలో కలుగుతే – అప్పుడు మీరు చిక్కుకొనిపోయిన యీ అనుకరణలను మీరే పరికించి చూడవచ్చు, పరీక్షించవచ్చు; గణితశాస్త్రం యింకా యితర పాఠ్యాంశాలలాగా వాటిని అధ్యయనం చేయవచ్చు.

ఉదాహరణకి – మీరు స్త్రీ పురుషుల విషయంలో వ్యత్యాసంగా ప్రవర్తిస్తారు అనే చైతన్యం మీలో వుందా? స్త్రీలని మీరు ఎందుకు హీనంగా చూస్తారు? పోనీ, చాలా మంది పురుషులు అట్లా చూస్తూ వుంటారు, ఎందుకు? మీరు దేవాలయానికి ఎందుకు వెళతారు, పూజా పురస్కారాలు ఎందుకు చేస్తారు, ఎందుకు ఒక గురువుగారిని అనుసరిస్తారు?

చూడండి, ముందుగా మీరు యీ విషయాలన్నింటి గురించి ఎరుకగా వుండాలి; ఆ తరువాత వాటిని గురించి క్షుణ్ణంగా తెలుసుకోవచ్చు, ప్రశ్నించవచ్చు, అధ్యయనం చేయవచ్చు; అంతేకాని గత ముప్ఫయి శతాబ్దాలుగా అట్లా వుంది కాబట్టి మీరు గుడ్డిగా అన్నింటినీ స్వీకరిస్తే దానికి అర్థం లేదు, ఏమంటారు? ఈ ప్రపంచానికి కావలసినది మరికొంతమంది అనుకరించేవారు, మరికొంతమంది నాయకులు, మరికొంతమంది అనుయాయులు కానేకాదని గట్టిగా చెప్పవచ్చు. మనకు యిప్పుడు అవసరమైనది యిటువంటి సమస్యలన్నింటిని, పైపైగా, అంటీ ముట్టనట్టుగా కాకుండా, బాగా లోతుగా, బాగా గాఢంగా పరీక్షించడం ఆరంభిస్తున్న మీలాంటి, నాలాంటి వ్యక్తులు; ఆ విధంగా పరీక్షించడం వలన మనసు, సృజనాత్మకత సంతరించుకొనే స్వేచ్ఛను, ఆలోచించే స్వేచ్ఛను, ప్రేమించే స్వేచ్ఛను కలిగివుంటుంది.

ప్రకృతితో, యితర మానవులతో, తదితర విషయాలతో మనకు గల నిజమైన సంబంధ బాంధవ్యాలను అవిష్కరించుకునే ఒక మార్గమే విద్యాధ్యయనం అంటే. అయితే, మనసు కొన్ని ఊహలను సృష్టిస్తుంది; ఆ ఊహలు తరువాత ఎంత శక్తివంతంగా, ఎంత ప్రబలంగా తయారవుతాయంటే – వాటిని అధిగమించి మనం ఆలోచించడాన్ని అవి ఆటంకపరుస్తాయి. భయం వున్నంతకాలం సంప్రదాయాన్ని

పాటించడం వుంటూనే వుంటుంది. భయం వున్నంతకాలం అనుకరణ వుంటూనే వుంటుంది. కేవలం అనుకరణ. మాత్రమే చేసే మనసు యాంత్రికంగా తయారవుతుంది, అవును కదూ? ఒక యంత్రం లాగా తను చేయవలసిన పనులు నిర్వహిస్తూ పోతూంది; సృజనాత్మకత వుండదు, సమస్యలను పరిష్కరించలేదు. అటువంటి మనసు ఏదో కొన్ని కార్యకలాపాలు నిర్వహించవచ్చు, కొన్ని ఫలితాలను సాధించవచ్చు, కాని దానికి సృజనాత్మకత వుండదు.

ఇప్పుడు మనం చేయవలసినది ఏమిటంటే – మీరు, నేను, మనతోపాటు మీ టీచర్లు, మేనేజర్లు, యితర అధికారులు – అందరం కలిసి యీ సమస్యలన్నింటిని గురించి యోచించాలి. అప్పుడే యిక్కడ చదువు ముగించుకొని మీరు వెళ్తున్నప్పుడు, ఏదో ఒక సంప్రదాయపు మూర్ఖత్వాన్ని ఆశ్రయించుకొని నిలబడకుండా, అన్ని విషయాలను గురించి స్వయంగా ఆలోచించుకునే శక్తిసామర్థ్యాలు గల పరిణతి చెందిన వ్యక్తులుగా మీరు వుంటారు. అప్పుడు పూర్తిగా విముక్తి చెందిన మానవునికి వుండే ఆత్మగౌరవం మీరు పొందగలుగుతారు. విద్యాధ్యయనం యొక్క సమగ్రమైన లక్ష్యం అదీ – కేవలం కొన్ని పరీక్షలలో ఉత్తీర్ణులవడానికి మిమ్మల్ని తయారుచేసి, ఆ పైన ఒక లాయరుగానో, ఒక గుమస్తాగానో, గృహిణిగానో, పిల్లల్ని కనిపెంచే యంత్రంగానో, మీకు ఏ మాత్రం యిష్టం లేని పనిలో మిమ్మల్ని మీ జీవిత పర్యంతమూ చొరపెట్టి వుంచడం కాదు. భయం లేకుండా స్వేచ్ఛగా ఆలోచించడానికి ప్రోత్సాహమిచ్చేది, విచారణ చేసేందుకు, అవగాహన చేసుకునేందుకు తోడ్పడేది అయినటువంటి విద్యావిధానం కావాలని మీరు గట్టిగా పట్టుపట్టాలి; అది మీ హక్కుగా మీ టీచర్లను మీరు అడగాలి. అట్లా కానప్పుడు జీవితమే వ్యర్థా; కాదంటారా? మీరు విద్యావంతులవుతారు, మీరు బి.ఏ. లేదా యం.ఏ. పరీక్షలు పాసవుతారు, డబ్బు సంపాదించాలి కాబట్టి మీకు యిష్టంలేకపోయినా ఒక ఉద్యోగం సంపాదించి చేస్తూ వుంటారు; వివాహం చేసుకుంటారు, పిల్లలు కలుగుతారు – ఇక అంతటితో సరి, జీవితాంతం మీరు యిరుక్కొని పోతారు. మీ పరిస్థితి పరమ దారుణంగా, ఏ సంతోషమూ లేకుండా, పేచీలతో నిండి వుంటుంది; రేపటి కోసం ఎదురు చూడటానికి ఏమీ వుండదు; యింకా పుట్టుకువచ్చే పిల్లలు, మరింత ఆకలి, మరికొన్ని దురవస్థలు తప్ప. దీనిని మీరు విద్య యొక్క ఆశయం అంటారా? విద్య అంటే మీకు బాగా ప్రీతిపాత్రమైన పని మీరు చేయడానికి తగిన సునిశితమైన తెలివితేటలు మీరు పొందడానికి సహాయం చేయాలి తప్ప, మీ జీవిత పర్యంతం దుర్భరవేదనలో పడవేసే అవివేకంలో మిమ్మల్ని యిరికించడం కాదని గట్టిగా చెప్పవచ్చు.

అందుకే మీరు చిన్నవయసులో వున్నప్పుడే మీ లోపల మీరే అసంతుష్టి అనే జ్వాలను జాగృత మొనర్చుకోవాలి; తిరుగుబాటు చేసే మనః స్థితిలో మీరు వుండాలి. విచారణ చేసి తెలుసుకోవడానికి, వెదికి కనుగొనడానికి, ఎదుగుదలకు యిది సమయం; కాబట్టి మీ తల్లితండ్రులను, మీ టీచర్లను మీకు సక్రమంగా చదువు బోధించమని గట్టిగా పట్టుబట్టి అడగండి. తరగతి గదిలో హాయిగా కూర్చుని ఆ రాజు గురించీ, యీ యుద్ధం గురించీ సమాచారం నింపుకొనడంతో సంతుష్టి చెందకండి. అసంతుష్టితో

వుండండి. మీ టీచర్ల వద్దకి వెళ్ళండి. విచారణ చేయండి, తెలుసుకోండి. వారిలో కనుక తెలివితేటలు లేకపోతే మీరు విచారణ చేయడంవలన వారిలో తెలివితేటలు కలగడానికి మీరు సహాయం చేసిన వారవుతారు; మీరు స్కూలు వదిలి వెళ్ళే వేళకు పూర్తిగా పెరిగి పరిణతి చెందుతారు, నిజమైన స్వేచ్ఛను పొందుతారు. ఆపైన జీవితం పొడుగునా, మీరు చనిపోయేవరకు మీరు నేర్చుకుంటూనే వుంటారు, ఆ విధంగా సంతోషం, ప్రజ్ఞ (తెలివి) కలిగిన మానవులుగా మీరు తయారవుతారు.

**ప్రశ్న: భయరాహిత్యం అంటే భయపడకుండా వుండటం అనే అలవాటును మనం ఏవిధంగా సంపాదించగలుగుతాం?**

**కృష్ణమూర్తి:** మీరు ఉపయోగించిన మాటల వైపు ఒకసారి చూడండి. 'అలవాటు' అంటే మళ్ళీ మళ్ళీ పునరుక్తిగా చేసే ఒక పని అనే అర్థం వస్తుంది. ఒక పనిని మీరు పదే పదే చేస్తూ వుంటే దానివలన విసుగుదల తప్ప మరొకటి సంభవిస్తుందా? భయరాహిత్యం, భయం లేకపోవడం అనేది ఒక అలవాటా? జీవితంలో జరిగే సంఘటనలను సూటిగా ఎదుర్కొనగలిగి, వాటిని క్షుణ్ణంగా చర్చించి, పరిష్కరించుకొనగలిగినపుడు, వాటిని మీరు పరికించి, పరీక్షించగలిగినపుడు భయరాహిత్యం తప్పక సిద్ధిస్తుంది, అంతేతప్ప అలవాటులో చిక్కుకొనిపోయి, అలసి వేసారిన మనసుమూలకంగా కాదు.

అలవాటు ప్రకారం పనులు చేస్తూ, అలవాట్లలో జీవిస్తున్నారంటే, మీరు కేవలం అనుకరణ చేసే యంత్రాలు అన్నమాట. అలవాటంటే పునరుక్తి; అలోచన లేకుండా అదే పనిని మళ్ళా మళ్ళా చేయడం, అంటే మీ చుట్టూరా మీరే స్వయంగా ఒక గోడని కట్టుకొనే ప్రక్రియ. ఏదో ఒక అలవాటు ద్వారా మీరు మీ చుట్టూరా ఒక గోడని నిర్మించుకున్నంత మాత్రాన, మీకు భయంనుండి విముక్తి దొరకదు. పైగా, యీ గోడల మధ్యన జీవించడమే మిమ్మల్ని భయభీతులుగా చేస్తుంది. జీవితంలో సంభవించే ప్రతిదానినీ పరికించి చూసే – అంటే, ప్రతి సమస్యనూ, ప్రతి సంఘటనను, ప్రతి అలోచనను, భావోద్వేగాన్ని, ప్రతి ప్రతిచర్యను పరీక్షించి చూసే వివేకం మీలో వున్నప్పుడు – అప్పుడు భయం నుండి విముక్తి కలుగుతుంది.

★ ★ ★

# అధ్యాయం 3

మనం యిప్పటివరకు భయాన్ని గురించి, దానినుండి విముక్తి ఎట్లా పొందాలి అనే విషయం గురించి మాట్లాడుకుంటూ వున్నాం; భయం మనసుని ఎట్లా వికృతంగా మార్చివేస్తుందో, తద్వారా మనసుని స్వేచ్ఛ లేకుండా, సృజనాత్మకత లేకుండా ఎట్లా చేసివేస్తుందో చూశాం; ఆ విధంగా మనసు అత్యంత ప్రధాన గుణమయిన అంతఃస్ఫూర్తిని పోగొట్టుకుంటుంది అని కూడా తెలుసుకున్నాం.

అధికారం అంటే పెత్తందారీ తనం అనే విషయాన్ని గురించి కూడా మనం యోచించాలి. అధికారం అంటే మీకు తెలుసు; అసలు అది ఎట్లా ఆవిర్భవించిందో తెలుసునా? ప్రభుత్వానికి అధికారం వున్నది, వున్నది కదూ? రాజ్యాంగానికి వుండే అధికారం, చట్టానికి, పోలీసు భటుడికి వుండేది, సైనికుడికి వుండేది – యిట్లా అధికారం అనేక రకాలుగ వుంటుంది. మీ టీచర్లకీ, మీ తల్లిదండ్రులకీ ఒక రకమైన అధికారం మీ మీద వున్నది; మీరు ఏయే పనులు చేసితీరాలి అని వాళ్ళు అనుకుంటారో ఆ పనులు మీచేత వారు చేయిస్తారు; అంటే – మీరు రోజూ ఒకవేళకి నిద్రపోవాలి, మీరు సరియైన ఆహారం తీసుకోవాలి, సరియైన మనుష్యులనే మీరు కలుసుకోవాలి – యిట్లాగ. మిమ్మల్ని వాళ్ళు క్రమశిక్షణలో పెడతారు. అవునా కాదా? ఎందుకు? అది మీ బాగుకోసమే అని వాళ్ళంటారు. నిజమేనా? అదేమిటో చూద్దాం. అయితే ముందుగా యీ అధికారం అనేది అసలు ఏ విధంగా ప్రత్యక్షమవుతుంటుందో అవగాహన చేసుకుందాం – బలవంతం చేయడం, నిర్బంధించడం, ఒక వ్యక్తి తన బలిమి ద్వారా మరొకరిపై పెత్తనం చేయడం, కొందరు వ్యక్తులు చాలా మందిపై కానీ, చాలామంది కొందరిపై కానీ వారి బలిమి అధారంగా పెత్తనం చలాయించడం – యివన్నీ అధికారం క్రిందకే వస్తాయి.

మీరు నా తల్లి అవడంవల్లనో, నా తండ్రి అవడంవల్లనో మీకు నా మీద హక్కు వచ్చేస్తుందా? ఒకరికి మరొకరిని పురుగులాగా అతిహీనంగా చూసే హక్కు అసలు ఎట్లా వుంటుంది? ఏది యీ అధికారాన్ని సృష్టిస్తుందని మీరు అనుకుంటున్నారు?

చూడగానే ఒకటి చాలా స్పష్టంగా కనబడుతుంది; మనలో ప్రతి ఒక్కరికీ ఒక నిరపాయకరమైన ప్రవర్తన మార్గం అవలంబించాలనే కోరిక ఒకటి వుంటుంది; మనం ఏం చేయాలో యింకొకరు చెప్తే బాగుండునని వుంటుంది. కల్లోలమైన మనసూ, అనేకమైన చింతలూ వుండటంవల్ల తల్లినో, తండ్రినో లేదూ మరొకరినో ఆశ్రయిస్తాం; ఈ గందరగోళపు మానసిక స్థితి నుండి తప్పించుకునే మార్గాన్ని చూపమని కోరుతాం. మనకంటే అతను జ్ఞాని అని అనుకుంటాం కాబట్టి ఒక గురువుగారి వద్దనో, పండితుని వద్దనో చేరి, మనం ఏం చేయాలో చెప్పమని అర్థిస్తాం.

కాబట్టి ఏదో ఒక పద్ధతికి లోబడిన జీవన విధానం లేదూ ఒక ప్రవర్తన మార్గం అలవర్చుకోవాలని మనలో వుండే కోరికే యీ 'అధికారం' అనేదాన్ని తయారు చేస్తున్నది, అవును కదూ?

ఉదాహరణగా యిది చూద్దాం; నేను ఒక గురువుని ఆశ్రయిస్తాను. అతను మహాత్ముడు, సత్యాన్ని కనుగొన్నాడు, పరమాత్మను దర్శించాడు, అందువల్ల నాకు శాంతిని ప్రసాదించగలడు అనే ఉద్దేశ్యంతో నేను అతని వద్దకు వెళ్తాను. ఈ విషయాలను గురించి నాకు స్వయంగా ఏమీ తెలియదు; కనుక, ఆ గురువుగారి వద్ద చేరి, ఆయనకు పాదాభివందనం చేసి, పుష్పమాలలు సమర్పించి, నా భక్తి ప్రపత్తులు వెల్లడించుకుంటాను. ఓదార్పు పొందాలి, నేను చేయవలసినదేమిటో ఆయన నుండి ఆదేశం పొందాలి అని నాలోవున్న కోరికల వలన నేను యీ విధంగా ఒక అధికార స్థానాన్ని సృష్టిస్తున్నాను. నిజంగా యీ అధికారానికి వెలుపలగా అస్తిత్వమే లేదు నాకు.

మీరు చిన్నవయసులో వున్నప్పుడు మీకేమీ తెలియదని మీ టీచరు మిమ్మల్ని ఎత్తిపొడుస్తూ వుండవచ్చు. కానీ ఆయన కనుక నిజంగా ప్రజ్ఞావంతుడయితే మీలోనూ అటువంటి ప్రజ్ఞ పెంచడానికి ప్రయత్నం చేస్తాడు; మీ మనసులో వుండే గందరగోళాన్ని అవగాహన చేసుకోవడానికి మీకు సహాయం చేసి, మీరు ఒక అధికారపు పెత్తనాన్ని, ఆ అధికారం తనది (టీచరుది) అవచ్చు, మరొకరిది అవచ్చు – ఆ అధికారాన్ని ఆశ్రయించకుండా చూస్తాడు.

ఇక బాహ్యప్రపంచంలో కనబడే రాజ్యాంగపు అధికారం, చట్టం యొక్క అధికారం, పోలీసు అధికారం వున్నాయి. మనకి వున్న ఆస్తిపాస్తులను రక్షించుకోవాలనే ఉద్దేశ్యంతో మనం బాహ్య ప్రపంచంలో యీ అధికార వ్యవస్థని సృష్టించుకుంటాం. ఈ ఆస్తి మనది, దీనిని యితరు లెవరూ తీసుకోకూడదని మనం కోరుకుంటాం; అందుకని మనకు స్వంతమైనవన్నీ రక్షించుకోవడానికి ఒక ప్రభుత్వాన్ని ఏర్పరచుకుంటాం. ఈ ప్రభుత్వమే మనపై అధికారం చలాయించే శక్తిగా తయారవుతుంది; మనల్ని కాపాడటానికి, మన జీవిత విధానాన్ని కాపాడటానికి, మన తాత్త్విక ధోరణిని కాపాడటానికి యిది మనం స్వయంగా కల్పించుకొన్నది. క్రమక్రమంగా శతాబ్దాలు గడుస్తున్నకొద్దీ 'నన్ను', 'నాది' లను కాపాడుకోవడానికి ఒక చట్ట వ్యవస్థను, ఒక అధికార వ్యవస్థను మనం స్థాపించుకుంటాం – అవే రాజ్యాంగం, ప్రభుత్వం, పోలీసు బలగం, సైనిక బలం.

ఆదర్శం అనే యింకో అధికారశక్తి కూడా వున్నది. ఇది బయటకు కనబడేది కాదు, అంతర్గతంగా వుండేది. "నేను మంచిగా వుండాలి, ఒకరిని చూసి యీర్ష్య చెందకూడదు, అందరి ఎడల సహోదర భావం చూపాలి" అని మనం అన్నప్పుడు, మన మనసుల్లో ఆదర్శం అనే అధికారశక్తిని తయారుచేస్తున్నాం, చేస్తున్నాం కదూ? నేను కుతంత్రాలు పన్నేవాడిని, మూర్ఖుడిని, క్రూరుడిని అనుకుందాం; అప్పుడు, నాకే అన్నీ స్వంతం కావాలి, నాకు అధికార బలం కావాలి అనుకుంటాను. అసలు యథార్థం అదీ, నా వాస్తవ స్వరూపం అదీ. కాని మతాచార్యులవంటివారు ఉద్బోధించారు కాబట్టి, పైగా అది నాకు వీలుగా వుంటుంది కాబట్టి, అట్లా

మాట్లాడటం నాకు లాభసాటి కాబట్టి నేను అందరితో సహోదరభావంతో వుండి తీరాలని అంటాను; అందుకని సహోదర భావం అనే ఆదర్శాన్ని సృష్టిస్తాను. నాలో సహోదరభావం లేనేలేదు, అయినా అనేక కారణాల వల్ల అట్లా వుండాలని కోరుకుంటాను; ఆ విధంగా ఆ ఆదర్శమే నాపై అధికార శక్తిగా తయారవుతుంది.

ఇక ఆ ఆదర్శానికి అనుగుణంగా జీవించడం కోసం నన్ను నేను క్రమశిక్షణలో వుంచుకుంటాను. మీకు నా కోటుకంటే మంచి కోటు వున్నదనో లేదూ మీ చీరె నా చీరెకంటే చాలా అందంగా వున్నదనో, మీకు ఎక్కువ బిరుదులున్నాయనో మీరంటే నాకు యీర్ష్యగా వుంటుంది; అందుకని నేను యిట్లా చెప్పుకుంటాను: "నాలో యీర్ష్యాభావాలు వుండకూడదు, నేను సహోదరత్వంతో మెలగాలి" అని. ఆ ఆదర్శమే నాపై అధికారం చలాయించడం ఆరంభిస్తుంది, ఆ ఆదర్శానికి అనుగుణంగా జీవించడానికి నేను ప్రయత్నిస్తాను. దీనివల్ల ఏమవుతుంది? నా జీవితం అసలు నేను ఏమిటి, నేను ఎట్లా వుండాలి అనే రెండింటి మధ్యన ఒక ఎడతెగని సమరంవలె అయిపోతుంది. నన్ను నేను క్రమశిక్షణలో పెట్టుకుంటాను, ప్రభుత్వం కూడా నన్ను క్రమశిక్షణకు లోను చేస్తుంది. అది కమ్యూనిస్టు ప్రభుత్వం అవచ్చు, పెట్టుబడిదారీ ప్రభుత్వం అవచ్చు, లేదూ సమసమాజ ప్రభుత్వం అవచ్చు – నా ప్రవర్తన ఎట్లా వుండాలనే విషయంలో మాత్రం యీ ప్రభుత్వాలకి కొన్ని సిద్ధాంతాలుంటాయి. ప్రభుత్వం సర్వోన్నతమైనది అని కొందరంటారు. అటువంటి ప్రభుత్వం నడిపే దేశంలో కనుక నేను వున్నట్లయితే, అధికారిక సిద్ధాంతావళికి విరుద్ధంగా నేను ఏదయినా చేస్తే, ప్రభుత్వం నన్ను నిర్బంధిస్తుంది. ఇక్కడ ప్రభుత్వం అంటే – ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకున్న కొద్దిమంది అన్నమాట.

మనలో రెండు భాగాలు వున్నాయి – ఒకటి చేతన, రెండోది అంతఃశ్చేతన లేక అచేతన అంటే ఏమిటో మీకు అర్థమయిందా? మీరు రోడ్డుమీద నడుస్తూ ఒక మిత్రునితో మాట్లాడుతూ వున్నారనుకోండి. మీ మనసులోని చేతన భాగం మీ సంభాషణను నడిపిస్తూ వుంటుంది, మీలోని యింకో భాగం అచేతనంగా అంటే మీకు తెలియకుండానే అసంఖ్యాకమయిన దృశ్యాల ముద్రలను – చెట్లు, ఆకులు, పక్షులు, నీటిపై మిలమిలలాడే సూర్యకాంతి వంటి వాటిని పరిగ్రహిస్తూ వుంటుంది. బయటనుండి యీ విధమైన గాఢప్రభావము అచేతన మనసుపై ఎల్లవేళలా పడుతునే వుంటుంది; యీ సమయంలో చేతన మానసం యింకో వ్యాపకంలో మునిగివున్నా సరే; అచేతన మానసం పరిగ్రహించేవి చేతన మానసం పరిగ్రహించే వాటి కన్నా ఎక్కువ ప్రధానమైనవి. రెండింటిని పోల్చిచూస్తే చేతన మానసం పరిగ్రహించేవి చాలా తక్కువే. ఉదాహరణకి స్కూల్లో మీకు బోధించేవి మీ చేతన మానసం పరిగ్రహిస్తూ వుంటుంది, అది నిజానికి అంత ఎక్కువ కానేకాదు. అయితే అచేతన మానసం మీకూ టీచర్లకీ మధ్యన, మీకూ మీ స్నేహితులకీ మధ్యన జరుగుతున్న చర్య, ప్రతిచర్యలను నిరంతరంగా పరిగ్రహిస్తూనే వుంటుంది. ఇదంతా అంతర్గతంలో జరుగుతూ వుంటుంది. పైపైన ఉపరితలంలో జరిగే వాస్తవ సమాచార పరిగ్రహణం కంటే యిది మరింత అర్థవంతమయినది. అదే విధంగా, ప్రతి ఉదయం యీ ప్రసంగాలు జరుగుతున్నప్పుడు, చెప్పబడేదంతా

అచేతన మానసం నిరంతరంగా పరిగ్రహిస్తునే వుంటుంది. ఆపైన ఎప్పుడో ఒకప్పుడు, ఆ రోజో లేదూ ఆ తరువాత వారంలోనో యిదంతా అకస్మాత్తుగా మీకు గుర్తుకు వస్తుంది. దీనికి మీమీద, మీరు సచేతనంగా అంటే చేతన మానసంతో వినేదాని కంటే మరింత విశేషమైన ప్రభావం వుంటుంది.

ఒకసారి వెనక్కి వెళదాము; మనమే అధికార వ్యవస్థను తయారు చేస్తున్నాం – ప్రభుత్వం అనే అధికార శక్తిని, పోలీసు అధికారాన్ని, ఆదర్శాల రూపంలోని అధికార శక్తిని, సంప్రదాయాల రూపంలోని అధికార శక్తిని తయారుచేస్తున్నాం. ఒక పని చేయాలని మీరు అనుకుంటారు కానీ, మీ నాన్నగారు, "నీవాపని చేయకూడదు" అంటారు. అయన చెప్పినది మీరు శిరసావహించవలసిందే, లేదంటే ఆగ్రహిస్తారు; తిండి తిప్పల కోసం మీరేమో అయన మీద ఆధారపడి వున్నారు. అయన మిమ్మల్ని భయం ద్వారా అదుపులో పెడుతున్నారు. అవునా కాదా? కాబట్టి అయన మీపై అధికారం చలాయించడం సాగిస్తున్నారు. అదే విధంగా మిమ్మల్ని సంప్రదాయం కూడా అదుపు ఆజ్ఞలలో పెడ్తున్నది. – మీరు యిది చేయాలి, అది చేయకూడదు, మీరు చీర యీ పద్ధతిలోనే కట్టుకోవాలి; మీరు ఆడపిల్లలవైపు లేదా మగపిల్లల వైపు కన్నెత్తి చూడకూడదు. ఏం చేయాలో మీకు సంప్రదాయం చెబుతుంది. మరి సంప్రదాయం అంటేనో జ్ఞానం – జ్ఞానకోశం; అవునా కాదా? మీరేం చేయాలో చెప్పడానికి పుస్తకాలు వున్నాయి, ప్రభుత్వం మీరేం చెయ్యాలో చెబుతుంది, తల్లితండ్రులు చెప్తారు; సమాజం, మతం మీరు ఏమేం చెయ్యాలో చెప్తాయి. మరి మీ సంగతి ఏమవుతుంది? మీరు నలిగిపోతారు, విరిగి ముక్కలయి పోతారు. మీరు ఎప్పటికీ చైతన్యవంతంగా ఆలోచించరు, కార్యాచరణ చేయరు, జీవించరు. అట్లా చేయాలంటే మీరు భయపడతారు. విధేయంగా వుండటం మీకు తప్పదు, లేదంటే మీ పరిస్థితి మరీ నిస్సహాయంగా తయారవుతుందని మీరు అంటారు. అంటే దాని అర్థం ఏమిటి? మీరు ఒక సురక్షితమైన ప్రవర్తన మార్గం, భద్రమైన జీవిత విధానం కావాలని ఆశిస్తున్నారు కాబట్టి, యీ అధికార వ్యవస్థ అనే దానిని మీరు తయారు చేస్తున్నారు. భద్రత కోసం ఆరాటమే అధికార వ్యవస్థను తయారు చేస్తున్నారు. అందువల్లనే స్వంతంగా ఆలోచించే శక్తి, సృజన చేసే శక్తిసామర్థ్యాలు లేకుండా వట్టి బానిసలాగానో, యంత్రంలోని ఒక సీలలాగానో మీరు తయారవుతారు.

మీకు చిత్రాలు గీయడం అలవాటు వున్నదేమో నాకు తెలియదు. ఆ అభ్యాసం మీకు వున్నట్లయితే సాధారణంగా ఆర్ట్ నేర్పించే అధ్యాపకుడే మీకు చిత్రరచన ఎట్లా చేయాలో చెప్తాడు. మీరు ఒక చెట్టును చూసి, ఆ చెట్టు నమూనాను దించుతారు. కాని చిత్రరచన అంటే చెట్టుని చూసి, కాగితం మీద కాని, కేన్వాస్ మీద కాని మీలో ఆ చెట్టు కలిగించిన భావాలను అభివ్యక్తపరచడం, ఆ దృశ్యంలోని విశిష్టత ఏమిటి అనే దానిని అంటే గాలి గుసగుసగా ఆకులను పలుకరించినపుడు వాటిలో కలిగే కదలికల వంటి వాటిని అభివ్యక్త పరచడం. ఆ పని చేయాలంటే, కాంతి, ఛాయల కదలికలను అందుకోవాలంటే మీరు చాలా సున్నితంగా (సంవేదన శీలత్వంతో) వుండాలి. మీరు ఎప్పుడూ భయపడుకుంటూ, ఎల్లవేళలా, "నేను

యిది తప్పక చేయాలి, అది చేయడం తప్పని సరి, లేకుంటే యితరులు ఏమనుకుంటారు?" అని అనుకుంటూ వుంటే, దేన్నయినా చూసినప్పుడు మీలో సున్నిత భావం ఎట్లా కలుగుతుంది? అధికార ప్రయోగం వలన సౌందర్యం ఎడల మీలో వుండే సున్నితత్వం క్రమక్రమంగా నశించిపోతుంది.

ఇప్పుడిక ఉత్పన్నమయే సమస్య ఏమిటంటే – మన యీ రకమైన పాఠశాల మిమ్మల్ని క్రమశిక్షణలో పెట్టడం అవసరమా అని. అధ్యాపకులు, వారు నిజమైన అధ్యాపకులు కనుక అయితే – ఎదుర్కోవలసిన ప్రతిబంధకాలు ఎన్నో ఆలోచించండి. మీరు ఒక అల్లరి పిల్ల, లేదా ఒక అల్లరి పిల్లవాడు అనుకుందాం; నేనే ఒక అధ్యాపకుడిని అయితే మిమ్మల్ని క్రమశిక్షణలో పెట్టాలా వద్దా? అట్లా క్రమశిక్షణలో పెట్టడం వలన ఏమవుతున్నది? మీకంటే పెద్దవాడనవడం వలన, ఎక్కువ అధికారం బలం వుండటం వలన, యింకా దానితోపాటు వుండే అనేక విషయాల వలన, పైగా కొన్ని పనులు చేయడం కోసం నన్ను వేతనం యిచ్చి నియమించడం వలన, మిమ్మల్ని విధేయంగా వుండమని నేను నిర్బంధిస్తాను. ఈ విధంగా చేయడం వలన మీ మనసుని కుంటుపరుస్తున్నాను కదూ? మీలోని తెలివి తేటలని కూడా నేను నిర్మూలించడం ఆరంభిస్తున్నాను. కదూ? నేను ఒప్పు అనుకుంటున్నాను కాబట్టి అది మీరు చేయాలి అని మిమ్మల్ని బలవంతాన చేయించడం వలన మిమ్మల్ని వట్టి మందమతిగా తయారుచేయడం లేదూ? మీరు కూడా క్రమశిక్షణలో వుండటానికే యిష్టపడతారు, మరొకరి బలవంతం మీద పనులు చేయడానికే యిష్టపడతారు; పైకి మాత్రం కాస్త అభ్యంతరం చూపుతారు. ఇట్లా వుండటం మీలో ఒక భద్రతాభావం కలిగిస్తుంది. మిమ్మల్ని కనుక నిర్బంధించకపోతే మీరు చెడ్డవారుగానే వుండిపోతారని మీరు అనుకుంటారు, తప్పుడు పనులు చేస్తారని మీ నమ్మకం; అందుకని మీరు "దయచేసి నన్ను క్రమశిక్షణలో పెట్టండి, నన్ను సత్ప్రవర్తనుడిగా తీర్చిదిద్దండి" అని అంటారు.

మరి యిప్పుడు నేను మిమ్మల్ని క్రమశిక్షణలో పెట్టాలా, లేదూ మీరు ఎందుకు అల్లరి చేస్తారో, యింకా అవీ యివీ ఎందుకు చేస్తారో మీరే అవగాహన చేసుకొనేందుకు మీకు సహాయం చేయాలా? దీని అర్థం నిజంగా ఏమిటంటే – ఒక టీచరుగా కాని, తల్లిగా లేక తండ్రిగా కాని నేను మీమీద అధికారం ప్రయోగించకూడదు అని. మీరు మీ కష్టాలు, బాధలు అవగాహన చేసుకోవడానికి, మీరు ఎందుకు చెడ్డపనులు చేస్తారో, ఎందుకు తప్పించుకొని పారిపోతారో మొదలయిన విషయాలు మీరు అవగాహన చేసుకొనేందుకు మీకు సహాయ పడాలని నేను గట్టిగా కోరుకోవాలి; మిమ్మల్ని నిర్బంధించడం ద్వారా నేను మీకు సహాయం చేయలేను. మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడానికి ఒక టీచరుగా నేను సహాయం చేయాలని అనుకున్నట్లయితే, అప్పుడు దాని అర్థం – నేను కొద్దిమంది బాలురను, బాలికలను మాత్రమే చూసుకోగలను అని. అంటే నా క్లాసులో యాభైమంది పిల్లలు వుండటానికి వీలులేదు. కొద్దిమంది మాత్రమే వుండాలి. అప్పుడే ప్రతి బాలిక ఎడల, ప్రతి బాలుడి ఎడల వ్యక్తిగతమైన శ్రద్ధ కనబరచడానికి వీలవుతుంది. అటువంటప్పుడు నేను మీచేత పనులు బలవంతాన చేయించడం కోసం అధికార

వ్యవస్థను సృష్టించను; మిమ్మల్ని మీరు అవగాహన చేసుకున్నారంటే, యీ పనులన్నీ బహుశ మీ అంతట మీరే చేసేస్తారు.

అధికార బలం ఏ విధంగా తెలివితేటలను నిర్మూలిస్తుందో మీరు గ్రహించారని ఆశిస్తాను. స్వేచ్ఛ – ఆలోచించే స్వేచ్ఛ, పరిశీలించే స్వేచ్ఛ ప్రశ్నించే స్వేచ్ఛ వున్నప్పుడే వివేకం వికసిస్తుంది. అయితే, నేను మీపై నిర్బంధం ప్రయోగిస్తే నావంటి మందమతిలాగే మీరూ తయారవుతారు; సాధారణంగా పాఠశాలలో యిదే జరుగుతూ వుంటుంది. తనకే అంతా తెలుసుననీ, మీకు ఏమీ తెలియదనీ టీచరు అనుకుంటాడు. అసలు టీచరుకు ఏమి తెలుసు? గణితశాస్త్రం, భూగోళశాస్త్రం, యింకా కాస్త అదీ, యిదీ. అతను అత్యంత గంభీర సమస్యలేవీ పరిష్కరించలేదే; జీవితంలో పరమోత్కృష్టమయిన విషయాలను గురించి అతనేమీ ప్రశ్నించలేదే – అయినా అతను తానొక దేవతల గురువుననో, సకల సైన్యాధిపతిననో అనుకుంటూ మాత్రం గర్జిస్తాడు.

కాబట్టి యీ రకమైన పాఠశాలల్లో ముఖ్యంగా వుండవలసిన సంగతి ఏమిటంటే – కేవలం మరొకరు చెప్పినట్లుగా నడుచుకునే విధంగా క్రమశిక్షణకి లోనుచేయడం కాకుండా. – మిమ్మల్ని మీరు అవగాహన చేసుకొనడానికి, తెలివిగా, స్వేచ్ఛగా వుండటానికి మీకు సహాయం చేయాలి. అప్పుడే మీరు జీవితంలో తారసపడే సంకట పరిస్థితులన్నింటినీ ఏ భయమూ లేకుండా ఎదుర్కొన గలుగుతారు. దీనికి ప్రధానంగా కావలసినది యోగ్యుడయిన అధ్యాపకుడు – తన డబ్బు సంపాదన గురించి, తన భార్యాబిడ్డల గురించి దిగులు పడేవాడు కాదు; మీ బాగోగులమీద బాగా ఆసక్తి వున్నవాడయి వుండాలి. ఇటువంటి పరిస్థితులతో కూడిన వాతావరణం సృష్టించడంలో విద్యార్థులకీ, అధ్యాపకులకీ కూడా సమాన బాధ్యత వున్నది. ఒకరు చెప్పినది తు–చ తప్పకుండా చేయకండి; ఒక సమస్యని గురించి మీరే స్వయంగా ఎట్లా పరిష్కరించుకోవాలో యోచించి తెలుసుకోండి. "మా నాన్న చేయమని కోరారు కాబట్టి యీ పని చేస్తున్నాను" అని అనడం కాదు, అతడు మిమ్మల్ని ఆ పని చేయమని ఎందుకు కోరుతున్నదీ మీరు తెలుసుకోవాలి, అతను ఎందుకు ఒకటి మంచి అంటున్నారో, మరొక దానిని ఎందుకని చెడు అంటున్నారో తెలుసుకోవాలి. అతన్ని ప్రశ్నించండి; ఆ విధంగా మీలోని వివేకం మేలుకొనడమే కాక, అతడిని కూడా వివేకవంతునిగా చేయడానికి మీరు సహాయం చేసినట్లవుతుంది.

అయితే తండ్రిని ప్రశ్నించడం ఆరంభించగానే సాధారణంగా ఏం జరుగుతుంది? మిమ్మల్ని అతడు క్రమశిక్షణలో పెడతాడు, అవునా కాదా? తన పనులలో మునిగిపోయి అతడు తీరిక లేకుండా వుంటాడు. దానితో యీ జీవిత అస్తిత్వం, అందులో ఎదురయే అసంఖ్యాకమైన కష్టనిష్ఠురాలు, జీవనోపాధికై డబ్బు సంపాదించవలసి వుండటమూ, భార్యనో లేదా భర్తనో కలిగి వుండటమూ వంటి విషయాలను గురించి మీతోపాటు కూర్చుని తీరిగ్గా మాట్లాడే యిష్టంగానీ ఓర్పుగానీ అతడిలో వుండవు. ఇవన్నీ మాట్లాడేందుకు కొంత సమయం కేటాయించడానికీ అతడు ఒప్పుకోడు. అందుకని మిమ్మల్ని దూరంగా తోసేస్తాడు, లేదా పాఠశాలకు పంపించి

వేస్తాడు. ఈ విషయంలో అధ్యాపకుడు కూడా మీ తండ్రివంటి వాడే; అతనూ తక్కిన అందరివంటివాడే. మీలోని వివేకాన్ని వెలువరచడానికి సహాయం చేయవలసిన బాధ్యత టీచర్లపైనా, మీ తల్లితండ్రులపైనా, మీ విద్యార్థులందరిపైనా వున్నది.

**ప్రశ్న: మేము తెలివిగా, వివేకవంతంగా వుండాలంటే ఎట్లా?**

**కృష్ణమూర్తి:** ఈ ప్రశ్నలోని అంతర్భావం ఏమిటి? వివేకవంతంగా వుండటానికి అవసరమైన ఒక పద్ధతి కావాలి – అంటే దాని భావం, వివేకం అంటే ఏమిటో మీకు తెలుసు అని. మీరు ఒక చోటుకు వెళ్ళాలనుకుంటారు, మీకు మీ గమ్యస్థానం ఏదో తెలుసు – అప్పుడు మీరు ఆ ప్రదేశానికి చేరడానికి మార్గం ఏదో అడిగితే చాలు. అదే విధంగా వివేకం అంటే ఏమిటో మీకు తెలుసు అనుకుంటుండటం వలన వివేకవంతంగా వుండటానికి కావలసిన ఒక పద్ధతి కోసం అడుగుతున్నారు. పద్ధతి అనేదాన్ని ప్రశ్నించడమే వివేకం. భయం వివేకాన్ని నశింపజేస్తుంది. అవును కదూ? భయమే మిమ్మల్ని ప్రశ్నించనీయకుండా, పరీక్షించనీయకుండా, తరచి చూడనీయకుండా నిరోధిస్తుంది. భయం అనేది లేకపోతే బహుశ మీరు వివేకాన్ని సాధించగలుగుతారు. అందుకని మీరు యీ భయం అనే అంశాన్ని ఆమూలాగ్రం తరచి చూడండి, భయం నుండి విముక్తులవండి; అప్పుడు మీరు ప్రజ్ఞావంతులు, వివేకవంతులు అవడానికి అవకాశం వున్నది. అంతేకాని, 'నేను వివేకవంతునిగా ఎట్లా అవుతాను' అని అడుగుతే ఒక పద్ధతిని మాత్రమే అలవర్చుకుంటారు, ఆ విధంగా మందమతులుగా, బుద్ధిహీనులగా తయారవుతారు.

**ప్రశ్న: మనమందరం ఏదో ఒకరోజు చనిపోతామని ప్రతివారికీ తెలుసు. అయినా మనకి మృత్యువు అంటే భయం ఎందుకు?**

**కృష్ణమూర్తి:** మీకు చావు అంటే భయం ఎందుకు? జీవించడం ఎట్లాగో బహుశ మీకు తెలియకపోవడం వల్లనా? పరిపూర్ణంగా జీవించడం ఎట్లాగో తెలిశాక మీరు మృత్యువుని గురించి భయపడతారా? ఈ చెట్లు, సూర్యాస్తమయం, పక్షులు, రాలిపడిపోయే ఆకు – వీటిని మీరు ప్రేమించగలుగుతే; స్త్రీ పురుషుల కన్నుల్లోని అశ్రుధారలు, పేదరికం గురించి మీరు ఎరుకగా వుంటే, మీ హృదయంలో నిజమైన ప్రేమ ఉద్భవించి వుంటే – మీరు చావుని తలచుకొని భయపడతారా? భయపడతారా చెప్పండి? నేను అన్నాను కాబట్టి దానికి ఒప్పుకోకండి. మనం అందరం కలసి యీ విషయం ఆలోచిద్దాం. మీరు హాయిగా ఉల్లాసంగా జీవించడం లేదు, మీరు సంతోషంగా లేరు, మీలో అన్నింటికీ ప్రతిస్పందించే సున్నితత్వం అనేది లేదు; అందుకనేనా చనిపోతే ఏం జరుగుతుంది అని మీరు అడుగుతున్నారు? జీవితమంటే మీ అర్థం దుఃఖం అని, అందుకే మీరు మృత్యువు పట్ల ఎక్కువ ఆసక్తి చూపుతున్నారు; చనిపోయిన తర్వాత అయినా సంతోషం వుంటుందేమోనని మీరు భావిస్తున్నారేమో? కాని, అది బ్రహ్మాండమయిన సమస్య. మీరు అదంతా తెలుసుకోవాలనుకుంటారని నేను అనుకోను. అసలు దీనికంతటికీ మూలకారణం

అనేది భయం – చావు అంటే భయం, జీవించడమంటే భయం, బాధలు పడటమంటే భయం. ఈ భయానికి వెనుక కారణమేమిటో మీరు అవగాహన చేసుకొని, భయవిముక్తులవకపోతే మీరు బ్రతికివున్నా, చనిపోయినా ఫరవాలేదు. ఏదయినా ఒకటే.

ప్రశ్న: మేము సంతోషంగా జీవించాలంటే ఏం చేయాలి?

**కృష్ణమూర్తి:** మీరు సంతోషంగా జీవిస్తున్నప్పుడు మీకు ఆ విషయం తెలుస్తుందా? మీరు బాధ పడుతున్నప్పుడు మీకు తెలుస్తుంది; మీకు శరీరబాధ ఏదయినా వుంటే మీకు తెలుస్తుంది. ఎవరయినా మిమ్మల్ని కొట్టినా, ఆగ్రహంతో తిట్టినా మీరు బాధపడతారు, మీకు ఆ విషయం తెలుస్తుంది. అయితే సంతోషంగా వున్నప్పుడు మీకు ఆ విషయం తెలుస్తుందా? మీరు ఆరోగ్యంగా వున్నప్పుడు శరీరం గురించిన చేతనం (స్పృహ) మీకు వుంటుందా? సంతోషం అనే స్థితిలో మీరు వున్నప్పుడు మీలో ఆ చేతన వుండదని గట్టిగా చెప్పవచ్చు. సంతోషంగా వున్నాము అనే సంగతి గురించి మీలో ఎరుక వుండదు. సంతోషంగా వున్నాము అని మీరు అనుకున్న తక్షణమే మీరు సంతోషంగా వుండటం ఆగిపోతుంది. అవునా కాదా? మీలో చాలామంది ఎన్నో బాధలు పడుతూ వుంటారు. బాధ పడుతున్నామని తెలుసుకుని వుంటారు కాబట్టి మీరు ఆ బాధలనుండి, సంతోషం అని మీరు పిలుచుకుంటున్న దానిలోనికి పారిపోవాలని కోరుకుంటున్నారు. చేతనలో తెలిసి సంతోషంగా వుండాలని మీరు అనుకుంటున్నారు; కాని సంతోషంగా చాలా ఉల్లాసంగా వున్నాను. అని మీరు ఎప్పుడయినా చెప్పగలరా? ఆ తరువాత మాత్రమే, ఒక క్షణం తరువాత గానీ, వారం తరువాత గానీ – "నేను అప్పుడు ఎంత సంతోషంగా వున్నాను, ఎంత వుల్లాసంగా గడిపాను" అని మీరు అనుకోగలుగుతారు. సరిగ్గా ఆ యథార్థ క్షణంలో మాత్రం మీకు సంతోషం గురించిన చేతన (స్పృహ) వుండదు; అదే అందులోని సౌందర్యం.

★ ★ ★

# అధ్యాయం 4

క్రమశిక్షణ అనేది చాలా జటిలమైన సమస్య. ఎందుకంటే, ఏదో ఒక విధమైన క్రమశిక్షణ పాటించడం వలన, కొంతకాలానికి విముక్తి లభిస్తుందని మనలో చాలా మందిమి అనుకుంటాం. నిరోధించే శక్తిని అలవర్చుకొనడమే క్రమశిక్షణ, అవునంటారా? మనం తప్పు అని భావించేవాటిని నిరోధించ గలగడం వలన, మన లోపల మనమే ఒక అడ్డుగోడ నిర్మించుకొనడం వలన – మనం యింకా బాగా అవగాహన చేసుకోగలమనీ, సంపూర్ణంగా జీవించే స్వేచ్ఛ సాధించగలమనీ అనుకుంటాం; కాని అది ఎంతమాత్రం యథార్థం కాదు, అవునా? మీరు ఎంత ఎక్కువగా ఒక విషయాన్ని వ్యతిరేకతతో నిరోధిస్తారో లేదా దానితో పోరాడుతారో అంత తక్కువగా దానిని ఆకళింపు చేసుకోగలుగుతారు. స్వేచ్ఛ – ఆలోచించడానికి నిజమైన స్వేచ్ఛ – అన్వేషించి కనుగొనడానికి నిజమైన స్వేచ్ఛ – వున్నప్పుడు మాత్రమే మీరు ఏ విషయం అయినా తెలుసుకొన గలుగుతారు, అని గట్టిగా చెప్పవచ్చు.

స్వేచ్ఛ అనేది ఒక చట్రంలో ఊపిరి పీలుస్తూ వుండలేదనే సంగతి స్పష్టంగా చెప్పవచ్చును. మనలో చాలా మందిమి యిటువంటి చట్రంలోనే, అభిప్రాయాలు అనే గోడలతో మూసుకొనిపోయిన ప్రపంచంలోనే జీవిస్తుంటాం; అవును కదూ? ఉదాహరణకి, మీ తల్లితండ్రులు, మీ టీచర్లు మీకు సరియైనది ఏది, తప్పు ఏది, చెడు ఏది, ప్రయోజనకరమైనది ఏది అనే సంగతులు చెప్తారు. ఇతరులు ఏమంటారో, మతాచార్యులు ఏమంటారో, సంప్రదాయం ఏమంటుందో మీకు తెలుసు; మీరు పాఠశాలలో ఏం నేర్చుకున్నారో అదీ తెలుసు. ఇవన్నీ కలసి చుట్టూరా కట్టిన గోడలతో మూసుకొనిపోయిన ఆవరణలో మీరు నివసిస్తారు. ఇటువంటి మూసుకొని పోయిన ఆవరణలో జీవిస్తూ మీరు స్వేచ్ఛగా వున్నామని చెప్తారు. నిజంగా వున్నారా? కారాగారంలో నివసిస్తున్నంత కాలం మనిషి స్వేచ్ఛగా వుండగలుగుతాడా?

కాబట్టి, సంప్రదాయం అనే కారాగారపు గోడలను మనిషి తనే బద్దలు కొట్టాలి; తనే ఏది వాస్తవమో, ఏది సత్యమో కనుగొనాలి. తనంతట తనే ప్రయోగాలు చేసి అన్వేషించి కనుగొనాలే తప్ప మరొకరిని అనుసరించకూడదు; వారు ఎంత ఉత్తములు అయినా సరే, ఉత్కృష్టత, ఉత్తేజము మూర్తీభవించిన వారయినా సరే, వారి సమక్షంలో గొప్ప ఆనందానుభూతులు కలిగినట్లనిపించినా సరే; అనుసరించడం కూడదు. సంప్రదాయం సృష్టించిన విలువలన్నింటిని; మంచివి, ప్రయోజనకరమైనవి, యోగ్యత కలవి అని లోకం ప్రస్తుతించే విషయాలన్నింటిని యథాతథంగా ఆమోదించకుండా వాటిని పరీక్షించగలిగిన సామర్థ్యం వుండటమే

అన్నింటికంటే అమితమైన ప్రాధాన్యత కలిగిన అంశం. మీరు వాటిని ఆమోదించిన మరుక్షణం నుండి కట్టుబాట్లకు లోనవడము, అనుకరణ చేయడము ఆరంభిస్తారు; ఈ కట్టుబడి వుండటము, అనుకరించడము, అనుసరించడము మీకు ఎన్నటికీ స్వేచ్ఛను, సంతోషాన్ని యివ్వలేవు.

మిమ్మల్ని క్రమశిక్షణలో వుంచాలని మన పెద్దలు అంటారు. ఈ క్రమశిక్షణను మీపైన ఒక వైపునుండి మీరు, మరొక వైపునుండి యితరులు విధిస్తుంటారు. అయితే అసలు ప్రధానమైనది ఏమిటంటే – స్వేచ్ఛగా ఆలోచించడం, స్వేచ్ఛగా తరచి చూడటం; ఆ విధంగా మీ అంతట మీరే స్వయంగా తెలుసుకొనడం ఆరంభించడం. దౌర్భాగ్యం ఏమిటంటే – చాలామంది తమంతట తామే ఆలోచించి తెలుసుకొనడానికి యిష్టపడరు; వారివి మూసుకొనిపోయిన మనసులు. లోతుగా ఆలోచించడం, అన్ని విషయాలను క్షుణ్ణంగా పరిశీలించి తెలుసుకొని, యథార్థాన్ని తనకు తానుగా కనిపెట్టడం చాలా ప్రయాసకరమైనది; దీనికి జాగరూకమైన అంతర్‌గ్రహణసక్తి, ఎడతెగని విచారణశీలత్వం చాలా అవశ్యకరం. అంతటి అభిలాషగాని, సత్తువగాని చాలా మందిలో వుండవు. “నాకంటే బాగా మీకే తెలుసు; మీరే నా గురువులు, నా ఆచార్యులు, మిమ్మల్ని అనుసరిస్తాను” అని వాళ్ళు అంటారు.

కాబట్టి, బాగా పసివయసునుండే మీ అంతట మీరే తెలుసుకొనే స్వేచ్ఛ మీకు వుండటం, “ఇది చేయండి”, “అది చేయకండి” అనే గోడలు కట్టి మిమ్మల్ని ఆ లోపల మూసివేయకుండా వుండటం చాలా ముఖ్యం. ప్రతిక్షణమూ మీతో “ఇది చేయాలి”, “ఇది చేయకూడదు” అని చెప్తుంటే యిక మీ తెలివితేటలు ఏమయిపోతాయి? ఏదో ఒక వృత్తిలో అనాసక్తతతో ప్రవేశించి, మీ తల్లిదండ్రులు ఎవరిని వివాహమాడాలో, ఎవరిని వివాహమాడకూడదో చెప్తే, తల ఆడిస్తూ, ఆలోచనారహితమైన మట్టి బొమ్మలాగా మీరు తయారవుతారు. ప్రజ్ఞ లేదా వివేకం కలవాడెవ్వడూ యిట్లా ప్రవర్తించడని స్పష్టంగా అర్థమవుతూనే వుంది. మీరు పరీక్షల్లో కృతార్థులవచ్చు, బాగా వున్నవారు అవచ్చు, మంచి దుస్తులు, లెక్కలేనన్ని నగలు వుండవచ్చు; పెద్ద మిత్రబృందం, పరువు–ప్రతిష్ఠ వుండవచ్చు; కాని, మీరు సంప్రదాయం చేత బంధితులై వున్నంతవరకు మీలో వివేకం లేనట్లే లెక్క.

ప్రశ్నించడానికి స్వేచ్ఛ వున్నప్పుడే; ఆలోచించి తెలుసుకొనడానికి, అన్వేషించి కనుగొనడానికి స్వేచ్ఛ వున్నప్పుడు మాత్రమే వివేకం ఉదయిస్తుందని నిశ్చయంగా చెప్పవచ్చు. అప్పుడే మీ మనసు అతి చురుకుగా, అతి జాగరూకంగా, అత్యంత నిర్దుష్టంగా తయారవుతుంది. అప్పుడు మీరు సంపూర్ణంగా సమన్వయత్వం చెందిన వ్యక్తిత్వం సాధిస్తారు – లోపల ఒక విధంగా భావిస్తూ, బయట మరో రకమైన కట్టుబాట్లకు లొంగిపోయి, ఏం చేయాలో పాలుపోక, భయంతో వణికిపోతున్న ఒక ప్రాణివలె వుండరు.

సంప్రదాయాలను ఛేదించుకొని స్వంతంగా బ్రతకమని మీలోని వివేకం మిమ్మల్ని గట్టిగా ఆదేశిస్తూ వుంటుంది; కాని మీరేమో, మీరు ఏం చేయాలో, ఏం చేయకూడదో అన్న విషయంలో మీ తల్లిదండ్రుల అభిప్రాయాలు, సమాజపు సంప్రదాయాలు అనేవి మీ చుట్టూ మూసుకొనిపోగా బందీలై వుంటారు. కాబట్టి

మీ లోపల్లోపల సంఘర్షణ జరుగుతూ వుంటుంది. జరుగుతూ వుండదూ? మీరంతా చిన్నపిల్లలు నిజమే, కాని యివన్నీ ఎరుగలేనంత చిన్నవారేమీ కారు. మీరు కొన్ని పనులు చేయాలనుకుంటారు, మీ తల్లిదండ్రులు, మీ టీచర్లు "వద్దు" అంటారు. అంతర్గతంగా పోరాటం జరుగుతూ వుంటుంది; ఈ పోరాటాన్ని పరిష్కృతం చేయనంతవరకు – మీరు సంఘర్షణ, బాధ, దుఃఖాలలో చిక్కుకొనిపోయి వుంటారు; అంతవరకు మీరు ఏవో చేయాలని కోరుకుంటూ వుండటం, మీరు అవి చేయకుండా నిరోధింపబడటం అనేది అనంతంగా సాగిపోతునే వుంటాయి.

బాగా జాగ్రత్తగా పరిశీలించినట్లయితే క్రమశిక్షణ, స్వేచ్ఛ అనేవి రెండూ పరస్పర విరుద్ధమైన విషయాలని మీరు గమనిస్తారు. నిజమైన స్వేచ్ఛ లేదా విముక్తికోసం అపేక్షించడం అనేదే ఒక పూర్తిగా విభిన్నమైన ప్రక్రియకు ఆరంభం అవుతుంది; ఆ తర్వాత మీకు అంతా తేటతెల్లంగా వుంటుంది, కొన్ని పనులు అసలు మీరు చేయనే చేయరు.

మీరు చిన్నవయసులో వున్నప్పుడే, జీవితంలో మీరు నిజంగా ఏం చేయదల్చుకున్నారో తెలుసుకోవడానికి మీకు స్వేచ్ఛ వుండటం, అట్లా తెలుసుకోవడానికి యితరులు సహాయపడటం అనేవి చాలా ప్రాధాన్యం యివ్వాలసిన విషయాలు. మీ చిన్నతనంలోనే కనుక యివి తెలుసుకొనకపోతే, యిక ఎప్పటికీ తెలుసుకోలేరు; ఇక ఎప్పటికీ స్వేచ్ఛగా, సంతోషంగా వుండే వ్యక్తులు అవబోరు. ఈ బీజం యిప్పుడే నాటాలి; అప్పుడే మీలోని అంతఃస్ఫూర్తిని ఉపయోగించడం ఆరంభిస్తారు. అంతఃస్ఫూర్తితో పనులు చేయడం ఆరంభిస్తారు.

రహదారిలో వెళుతున్నప్పుడు తమకి మించిన బరువులు మోస్తూ నడుస్తున్న గ్రామీణులు మీకు తరచు కనిపిస్తుంటారు, అవునా? వారిని చూసి మీలో ఎటువంటి భావాలు కలుగుతాయి? మాసి చినిగిపోయిన దుస్తులు ధరించి, కడుపునిండా తిండి లేకుండా, చాలీచాలని కూలి పైసలకోసం ఒళ్ళు హూనం చేసుకునే ఆ పేద వనితలని చూసి – వారిని చూసి మీ మనోభావాలు కదలుతాయా? లేదూ మీరు మీ పరీక్షలని గురించి ఎంతగా భయపడుతూ వుంటారంటే, మీ రూపురేఖలు, మీ చీరెలను గురించిన ధ్యాసలోనే ఎంతగా మునిగిపోయి వుంటారంటే, వారిపై మీ దృష్టి మళ్ళనే మళ్ళదా? వాళ్ళకంటె మీరు చాలా గొప్పవారు కాబట్టి, వాళ్ళకంటె వున్నత తరగతికి చెందినవారు కాబట్టి, అటువంటి వారిని గురించి పట్టించుకోనవసరం లేదని మీరు అనుకుంటున్నారా? అటువంటివాళ్లు దారిలో కనబడినప్పుడు మీకేమనిపిస్తుంది? వారికి సహాయం చేయాలని మీకు అనిపించదా? అనిపించనే అనిపించదా? మీ ఆలోచనలు ఎట్లా వున్నాయో యిది తెలుపుతుంది. శతాబ్దాల నుండి వచ్చిన సంప్రదాయాలు, మీ తల్లులు, తండ్రులు చెప్పిన మాటలు మిమ్మల్ని అంత మందకొడిగా తయారుచేశాయా? మీరు ఒక ప్రత్యేక వర్గానికి చెందిన వారమనే స్పృహ ఎంత ఎక్కువగా వున్నదంటే, అది గ్రామీణులవైపు తలతిప్పి కూడా చూడకుండా చేసిందా? మీరు నిజంగా మీ చుట్టూరా ఏం జరుగుతున్నదో చూడలేనంత అంధులై పోయారా?

భయమే – మీ తల్లితండ్రులు ఏమంటారో అనే భయం, టీచర్లు ఏమంటారో అనే

భయం, సంప్రదాయం అంటే భయం, జీవితం అంటే భయం – క్రమక్రమంగా మీలోని సున్నితత్వాన్ని నశింపజేస్తుంది. అవును కదూ? సున్నితత్వము (సంవేదనాశీలత) అంటే ఏమిటో మీకు తెలుసా? సున్నితత్వం అంటే అనుభూతి చెందడం, ఆ ప్రభావానికి స్పందించి మనసులో ముద్రించుకునే గుణం, బాధపడుతున్న వారియెడల సానుభూతిని కలిగి వుండటం, అప్యాయత, అనురాగం కలిగి వుండటం, మీ చుట్టూరా ఏం జరుగుతున్నది అనే ఎరుక కలిగి వుండటం. దేవాలయంలో గంటలు మ్రోగినపుడు మీలో దాని ఎరుక కలుగుతుందా? ఆ ధ్వనిని ఆలకిస్తారా? నీళ్ళపై పడి మెరిసే సూర్యకాంతిని ఎప్పుడయినా చూస్తారా? శతాబ్దాల తరబడి దోపిడీదారులు నిరుపేదలని, గ్రామీణులని తమ అధీనం క్రింద వుంచుకొని అణగద్రొక్కి వేస్తూ వున్నారనే ఎరుక, చైతన్యం మీకు వున్నదా? నౌకరు ఒకడు బరువైన తివాచీని అతికష్టంతో మోస్తుండగా చూసినపుడు, ఒక చేయివేసి సహాయం చేద్దామని మీకనిపిస్తుందా?

ఇప్పుడు చెప్పిన వాటి అన్నింటికీ అర్థం సున్నితత్వం కలిగి వుండటం అన్నమాట. చూడండి, ఒక వ్యక్తిని క్రమశిక్షణకు లోను చేసినా, అతను భయభీతుడై వున్నా, అతను తనని గురించే తను ఎప్పుడూ తాపత్రయపడుతూవున్నా అతనిలోని సున్నితత్వం నశిస్తుంది. ఎప్పుడూ తన రూపురేఖా విలాసాల గురించి, తన చీరల గురించి పట్టించుకుంటూ తనని గురించే తను ఆలోచించుకుంటూ వుంటే – మనలో చాలా మందిమి ఏదో ఒక రూపంలో యీ పనే చేస్తుంటాము – సున్నితత్వాన్ని కోల్పోవడం జరుగుతుంది. ఎందుకంటే – అప్పుడు మనసు, హృదయం రెండూ చుట్టూ కట్టుకున్న గోడల మధ్యన బంధితమై పోయి, సౌందర్యాన్ని ఆస్వాదించే రసజ్ఞతను పోగొట్టుకుంటాయి.

సంపూర్ణంగా విముక్తి పొందడం అంటే గొప్ప సున్నితత్వాన్ని పొందడం అని అర్థం చేసుకోవాలి. స్వప్రయోజన కాంక్ష, క్రమశిక్షణ మొదలయిన రకరకాల గోడలను చుట్టూరా నిర్మించుకొని, అందులో బంధితులై వున్నప్పుడు స్వేచ్ఛ (విముక్తి) అనేది వుండనే వుండదు. మీ జీవితం అంతా అనుకరణ విధానంలోనే సాగిపోతున్నంతకాలం సున్నితత్వము, విముక్తి అనేవి మృగ్యమవుతాయి. మీరు యిక్కడ వున్నప్పుడే వివేకాన్ని మేలుకొల్పే విముక్తి కోసంగాను మీలో బీజాలు నాటడం చాలా ముఖ్యం; ఎందుకంటే – ఆ వివేకంతోనే మీరు జీవితంలో ఎదురయే సమస్యలను పరిష్కరించుకోగలుగుతారు.

**ప్రశ్న: ఒక మనిషి తనను భయం అనే భావం నుండి పూర్తిగా విముక్తం చేసుకున్నాక కూడా యీ సమాజంలోనే నివసిస్తూ వుండటం ఆచరణ శక్యమైనదేనా?**

**కృష్ణమూర్తి:** సమాజం అంటే ఏమిటి? జతచేసి పెట్టుకొన్న కొన్ని విలువలు, గుదిగుచ్చి పెట్టుకున్న కొన్ని నియమాలు, నిబంధనలు, సంప్రదాయాలు – అవును కదూ? బయటి నుండి మీరు నిబంధనలను పరికించినపుడు మీకు అనిపిస్తుంది,

"ఇవన్నీ ఒక పక్కన వుంటూండగా నేను నా జీవితం గడపడం ఆచరణ సాధ్యమేనా?" అని. ఎందుకు కాదూ? ఈ విలువల చట్రంలో మిమ్మల్ని మీరు హాయిగా బిగించుకొని కూర్చుంటే యిక మీకు స్వేచ్ఛ ఎక్కడుంటుంది? ఆచరణ శక్యం అంటే మీ అర్థం ఏమిటి? జీవనోపాధి కోసం డబ్బు సంపాదించడం అని మీ అర్థమా? జీవనోపాధి కోసం డబ్బు సంపాదించడానికి చాలా మార్గాలు వున్నాయి; మీరు స్వేచ్ఛ పొంది వున్నప్పుడు మీకు కావలసినదేదో మీరు ఎన్నుకోలేరూ? అది ఆచరణ శక్యమైనదేగా? లేదూ మీ స్వేచ్ఛ సంగతి, విముక్తి సంగతి మరచిపోయి, చట్రంలో యిమిడిపోయి, ఒక న్యాయవాదిగానో, బ్యాంకరుగానో, వ్యాపారిగానో, వీధులూడ్చేవాడిగానో తయారవడం ఆచరణ శక్యమైనది అని మీరు భావిస్తారా? మీరు విముక్తి పొందినప్పుడు, మీరు వివేకాన్ని పెంపొందించుకుంటున్నప్పుడు, మీరు ఏది చేస్తే అన్నింటిలోకి మేలుగా వుంటుందో మీకే తప్పకుండా తెలుస్తుంది. సంప్రదాయాలన్నింటినీ ప్రక్కకి తోసిపడవేసి మీరు నిజంగా యిష్టపడే వాటినే మీరు చేస్తారు; మీ తల్లిదండ్రులు, సమాజం వాటిని ఆమోదించినా సరే, తిరస్కరించినా సరే మీరు లెక్కచేయరు. విముక్తులవడం వలన మీలో వివేకం వుంటుంది, మీరు పూర్తిగా మీ స్వంత భావాలనే ఆచరణలో పెడతారు, ఒక సంపూర్ణ సమన్వయత్వం చెందిన వ్యక్తిత్వం గల మానవుని వలె మీరు ప్రవర్తిస్తారు.

ప్రశ్న: దైవం అంటే ఏమిటి?

**కృష్ణమూర్తి:** ఇది మీరు ఎట్లా కనుక్కోవాలనుకుంటున్నారు? ఎవరో యితరులు యిచ్చిన సమాచారాన్ని అంగీకరించబోతున్నారా? లేదూ దైవం అంటే ఏమిటి అనేది మీరే అన్వేషించి కనుగొనడానికి ప్రయత్నిస్తారా? ప్రశ్నలు అడగడం చాలా తేలిక. కాని సత్యాన్ని అనుభవం ద్వారా తెలుసుకోవాలంటే అతి విస్తారమైన వివేకం, అతి విస్తారమైన విచారణ శీలత్వం, అతి విస్తారమైన అన్వేషణ అవశ్యకం అవుతాయి.

అసలు మొదటి ప్రశ్న ఏమిటంటే – యితరులు దైవం గురించి చెప్పేవాటిని మీరు అంగీకరిస్తారా? అతను 'ఎవరు' అనేది ముఖ్యం కాదు, కృష్ణుడు, బుద్ధుడు, క్రైస్తు అని చెప్తుంటారు కొందరు; వారందరూ పొరబాటు చేయవచ్చును. అదే విధంగా మీరు ఆశ్రయించిన గురువుగారు కూడా పొరబడవచ్చును. సత్యాన్ని గ్రహించాలంటే లోతుగా తరచి, విచారించి తెలుసుకోవడానికి మీ మనసు స్వేచ్ఛగా వుండాలి; అంటే అర్థం మనసు వూరికే అంగీకరించకూడదు, వూరికే విశ్వసించకూడదు అని. నేను సత్యం ఏమిటో మీకు వర్ణించి చెప్పవచ్చును. కాని మీకు మీరే స్వయంగా సత్యాన్ని అనుభవం ద్వారా తెలుసుకొనడంతో అది సమానం అవదు. పవిత్ర గ్రంథాలు అన్నీ దైవం ఏమిటి అనే విషయాన్ని వర్ణించాయి, కాని ఆ వర్ణనలు దైవం కావు. దైవం అనే మాట దైవం కాదు, అవునా?

సత్యం ఏదో తెలుసుకోవడానికి పుస్తకాలు, టీచర్లు లేదా యితరులు చెప్పిన వాటిని మీరు అంగీకరించనేకూడదు; వాటివలన మీరు ప్రభావితం అవనేకూడదు. వాటివలన ప్రభావితం అయారంటే మీరు ఏం తెలుసుకోవాలని వారు కోరుతారో

అది మాత్రమే మీరు తెలుసుకుంటారు. మీరు యింకొక విషయం గ్రహించాలి. మీ మనస్సు తను ఏది కావాలని కోరుకుంటుందో ఆ ప్రతిరూపాన్నే సృష్టించగలుగుతుంది; మనసు దైవాన్ని గడ్డం వున్నవానిగా వూహించవచ్చు, ఏకాక్షిగా వూహించవచ్చు, అతనిని నీలంగానో, ఊదా రంగులోనో వూహించవచ్చు. కాబట్టి మీ మనసు కోరే కోరికలను కూడా మీరు కనిపెట్టి వుండాలి; లేదా మీ లోపలి ఆశలే, మీ మనో వాంఛలే చిత్ర విచిత్ర రూపాలు ధరించి మిమ్మల్ని మాయ చేస్తాయి. మీరు ఫలానా రూపంలో దైవం వుండాలని ఆశపడతారనుకోండి, మీ మనోఫలకంపై కనబడే ప్రతిరూపం కూడా మీ యిచ్ఛానుసారంగానే వుంటుంది; ఆ ప్రతిరూపం దైవం అవదు, అవుతాడా? మీరు దుఃఖంలో వుండి ఊరట పొందాలని కోరుకుంటున్నారనుకోండి, లేదూ మీ ధార్మిక ఆశయాలలో గాఢమైన ఉద్వేగాలు, కాల్పనిక భావాలు చోటుచేసుకున్నాయనుకోండి, అప్పుడు మీరు కోరుకున్నవన్నీ అమలు చేసే దైవాన్నే చివరకు మీరు సృష్టించుకుంటారు; అయితే అది, ఆ ప్రతిరూపం దైవం కాదు.

కాబట్టి, మీ మనసు సంపూర్ణంగా విముక్తమై (స్వేచ్ఛగా) వుండాలి. అప్పుడే మీరు సత్యం ఏది అనేది కనుగొనగలుగుతారు. ఏ మూఢవిశ్వాసాన్నో తలదాల్చడం వలన కాదు, పవిత్ర గ్రంథాలు అని చెప్పబడుతున్న వాటిని చదవడం వలన కాదు, ఏ గురువుగారినో ఆశ్రయించడం వలన కాదు. ఎప్పుడు మీరు – యితరులకు మీపై వుండే ప్రభావాల నుండే కాకుండా, మీ లోపలనే వున్న కాంక్షలు, మనోవాంఛలనుండి కూడా పూర్తిగా విముక్తి పొందుతారో అప్పుడు మీ మనసు పూర్తిగా తేటగా వుంటుంది. అప్పుడు మాత్రమే దైవం అంటే ఏమిటి అనేది తెలుసుకోవడానికి మీకు సాధ్యం అవుతుంది. కాని మీరు ఒకచోట తీరిగ్గా కూర్చుని, నిరాధారమైన ఊహాగానాలు చేస్తే, మీ అంచనాలూ మీ గురువుగారి ఊహల మాదిరే వుండవచ్చు. అవి ఎంత మిథ్యామయమో యివీ అంతే.

ప్రశ్న: మనలో అచేతనంగా వున్న కోర్కెలు ఏమిటో మనం తెలుసుకోగలమా?

**కృష్ణమూర్తి:** అంతకంటే, ముందుగా, మీలో సచేతనంగా ఏ కోరికలు వున్నాయో మీరు తెలుసుకున్నారా? అసలు కోరిక అంటే ఏమిటో తెలుసునా? సాధారణంగా మీరు విశ్వసించే విషయాలకు విరుద్ధంగా ఎవరయినా మాట్లాడుతున్నప్పుడు మీరు వారి మాటలను వినిపించుకోరనే సంగతి మీకు తెలుసా? మీలో వున్న కోరిక, మీరు వినకుండా నిరోధిస్తుంది. మీరు దైవాన్ని కాంక్షిస్తారు. ఎవరో సూచిస్తారు – మీలోని ఆశాభంగాల ఫలితంగా, భయాల ఫలితంగా రూపు దాల్చినదే మీరు కాంక్షించే ఆ దైవం అని. వారి మాటలు మీరు ఆలకిస్తారా? ఏ మాత్రం వినిపించుకోరు. మీరు కోరేది ఒకటయితే, నిజం దానికి చాలా భిన్నంగా మరొకటై వుంటుంది. మీ కోరికల పరిమితిలో మిమ్మల్ని మీరు యిముడ్చుకుంటారు. మీ చేతన మానసంలోని కోరికలను గురించి మీకు సగం ఎరుక మాత్రమే వుంటుంది, అవునంటారా? ఇక మీలో లోతుగా దాగివున్న కోర్కెలను తెలుసుకోవడం యింకా ఎంతో కష్టసాధ్యమైనది. లోపల గుప్తంగా దాగి వున్నవి కనుగొనడానికి, మనసుకు

వున్న ఉద్దేశ్యాలు ఏమిటో ఆవిష్కరించుకోవడానికి యీ వెతుకుతున్న మనసు సాధ్యమైనంత నిర్మలంగా, స్వేచ్ఛగా వుండాలి. అందువల్ల మొదట సచేతనంగా మీలో వున్న కోర్కెలను తెలుసుకోండి; అప్పుడు, ఉపరితలంపై వున్న వాటిని క్రమక్రమంగా తెలుసుకున్న తరువాత లోలోపలి లోతులను మీరు శోధించవచ్చు.

**ప్రశ్న: కొందరేమో నిరుపేద పరిస్థితుల్లో జన్మిస్తారు, మరికొందరు ఐశ్వర్యంలో పుట్టి బాగా ధనంతో తులతూగుతూ వుంటారు. ఎందుకని?**

**కృష్ణమూర్తి:** మీరు ఏమనుకుంటున్నారు? నన్ను ప్రశ్న అడిగి, సమాధానం కోసం ఎదురు చూస్తూ కూర్చోవడం బదులు యీ విషయంలో మీ భావాలేమిటో తెలుసుకోకూడదూ? చాలా నిగూఢమైనదనీ, దుర్గ్రాహ్యమైనదనీ, 'కర్మ' అనీ మీరు అంటూ వుంటారే అటువంటి ఒక ప్రక్రియ కారణం అని మీరు అనుకుంటున్నారా? మీ పూర్వజన్మలో ఉత్తమోత్తమ గుణాలతో జీవించారు కాబట్టి యిప్పుడు ఐశ్వర్యం, అంతస్థు మిమ్మల్ని వరించాయి! అదేనా కారణం? లేదా పూర్వజన్మలో విపరీతమైన చెడు చేయడం వల్ల యీ జన్మలో దానికి పరిహారం చెల్లిస్తున్నారు!

చూడండి, యిది నిజంగా చాలా క్లిష్టమైన సమస్య. పేదరికం వున్నదంటే దోషం సమాజానిదే – అత్యాశాపరులు, జిత్తులమారి గడుసు మనుష్యులు దోపిడీ చేసి, పైకి ఎగబాకి వచ్చే సమాజం యిది. మనమూ అట్లాగే పైకి రావాలని కోరుకుంటాం, మనమూ నిచ్చెన ఎక్కి పైకి చేరాలనుకుంటాం. అందరం ఎక్కి పైన ఉన్నత పీఠంమీద కూర్చోవాలనుకుంటే ఏమవుతుంది? ఎవరో ఒకరిని కాలికింద త్రొక్కేస్తాం; ఇట్లా కాలితో త్రొక్కి, అణచివేయగా, హతమారిన మనిషి అడుగుతాడు, "నాకెందుకు యింత అన్యాయం జరగాలి? మీకు అన్నీ వున్నాయి. నాకు శక్తిసామర్థ్యాలు లేవు, నాకు ఏమీలేవు" అని. మనం యిట్లా విజయసాధన కోసం నిచ్చెన ఎక్కుతూ పోతున్నంత వరకు పీడితులు, దరిద్రులు వుంటూనే వుంటారు. మనం అవగాహన చేసుకోవలసినది మనిషికి వుండే యీ విజయ కాంక్షను; ధనవంతులు ఎందుకున్నారు అని ప్రశ్నిస్తే సరిపోదు; కొందరిలో ప్రతిభ ఎందుకు వున్నది, కొందరిలో ఎందుకు లేదు అని ప్రశ్నిస్తేనూ సరిపోదు. మార్పు రావలసినది ఎక్కడ అంటే – నిచ్చెన ఎక్కాలని మనలోనూ వున్న కాంక్షలలో; గొప్పవారం అవాలి, విజయం సాధించాలి అనే మన ఆశలలో రావాలి మార్పు. మనం అందరమూ విజయం సాధించాలనే అభిలషిస్తాం, నిజమే కదూ? దోషం అక్కడే వుంది. అంతేకాని 'కర్మ' లోనో మరే యితర వ్యాఖ్యానం లోనో కాదు. అసలు యథార్థం ఏమిటంటే మనమందరం పైపైకి, పీఠం మీదికి చేరాలనుకుంటాం – పోనీ, సరిగ్గా పీఠం మీదికి కాకపోయినా నిచ్చెన మీద మనం ఎక్కగలిగినంత పైమెట్టు వున్నంతవరకు, లోకంలో కీర్తి సంపాదించాలనే కోరిక వున్నంతవరకు ధనికులు, పేదవారు వుంటూనే వుంటారు; దోపిడీ చేసేవారు, దోపిడీ కాబడేవారు వుంటూనే వుంటారు.

ప్రశ్న: దైవం అంటే స్త్రీయా, పురుషుడా? లేదూ మనం ఏమాత్రం అవగాహన చేసుకోలేని నిగూఢమైనదేదోనా?

కృష్ణమూర్తి: ఈ ప్రశ్నకు నేను యిప్పుడే, యింతకుముందే సమాధానం చెప్పాను. మీరు వినిపించుకోలేదని అనుకుంటున్నాను. ఈ దేశంలో పురుషుల అధిపత్యమే సాగుతున్నది. ఒకవేళ దైవం అంటే ఒక స్త్రీ అని నేను అన్నాననుకోండి, అప్పుడు మీరేం చేస్తారు? ఆ అభిప్రాయాన్ని మీరు తిరస్కరిస్తారు. ఎందుకంటే, దైవం ఒక పురుషుడు అనే అభిప్రాయం మీలో పూర్తిగా నిండిపోయింది. అందుకని యీ విషయం మీరే స్వయంగా తెలుసుకోవాలి; అయితే అది తెలుసుకోవాలంటే మీకున్న నిర్హేతుకమైన అభిప్రాయాలన్నింటిని అంటే అపోహలను, దురభిమానాలను అన్నింటిని వదులుకోవాలి.

★ ★ ★

# అధ్యాయం 5

గత మూడు నాలుగు సార్లుగా మనం భయాన్ని గురించి మాట్లాడుకుంటూ వున్నాం; మనం దిగజారిపోవడానికి మూలకారణాలయిన వాటిలో అది ఒకటి కాబట్టి యీ భయాన్ని మరొక విభిన్న కోణం నుండి; మరొక విభిన్న దృక్పథంతో పరిశీలించాలని నాకు అనిపిస్తున్నది.

మీకు తెలుసు, మనం ఏమి ఆలోచించాలో, ఏమి ఆలోచించకూడదో అనే విషయం మనకి యితరులు ఎప్పుడూ చెప్తూనే వుంటారు. పుస్తకాలు, టీచర్లు, తల్లితండ్రులు, మన చుట్టూ వుండే సమాజం అంతా ఏమి ఆలోచించాలో మనకి చెప్తారు తప్ప, ఏ విధంగా ఆలోచించాలో తెలుసుకోవడానికి మాత్రం మనకి సహాయం చేయరు. ఏమి ఆలోచించాలో తెలుసుకోవడం కొంతవరకు తేలిక అనే చెప్పచ్చు, ఎందుకంటే, చిన్ననాటినుండీ కొన్ని మాటలతోను, పదసముదాయాలతోను, బాగా పాతుకొనిపోయిన రీతి రివాజులతోను, నిర్హేతుకమైన అభిప్రాయాలతోను మన మనసులు నిబద్ధితం చేయబడి వుంటాయి కాబట్టి. పెద్దవారిలో చాలామందికి వారి మనసులు మార్పు అనేది లేకుండా స్థిరంగా వుండటం మీరు కూడా గమనించి వున్నారేమో నేను ఎరగను. అవి అచ్చులో పోతపోసిన మట్టి మాదిరిగా వుంటాయి. చుట్టూ వున్న పోతను పగులగొట్టి వాటిని బయటకు లాగడం చాలా కఠినమైన పని. మనసును యీ విధంగా అచ్చులో పోత పోయడమే దానిని నిబద్ధీకరణం చేయడం అంటే.

ఇక్కడ భారతదేశంలో శతాబ్దాల తరబడి వస్తున్న సంప్రదాయం ద్వారా ఒక పద్ధతిలో ఆలోచించడానికి మిమ్మల్ని నిబద్ధితం చేసివేశారు; మీ యీ నిబద్ధీకరణం వెనకాల సామాజిక, ఆర్థిక, మతపరమైన కారణాలు వున్నాయి. యూరపు ఖండంలో మరో విధంగా మనసును నిబద్ధీకరించడం జరిగింది. రష్యాలో విప్లవం జరిగిన నాటినుండీ రాజకీయ నాయకులు మరింకో విధంగా మనసుని నిబద్ధీకరణం చేయడానికి పూనుకున్నారు. కాబట్టి అంతటా, అన్ని ప్రాంతాల్లోనూ మనసుని నిబద్ధీకరణం చేయడం అనేది జరుగుతున్నది. కేవలం పైపై ఉపరితలపు పొరలలో మాత్రమే కాదు, చేతనమైన మనసుని మాత్రమే కాదు, అంతకంటె గాఢంగాను, లోతుగానూ కూడా యిది జరుగుతున్నది. జాతి, శీతోష్ణస్థితి, భాషతో ప్రమేయం లేనివి, మాటలలో చెప్పనివి అయిన అనుకరణలు నిగూఢంగాను, అచేతనంగానూ వుండే మనసుని నిబద్ధితం చేస్తూ వున్నాయి.

సరే, మనసును అచ్చులో పోతపోసినట్లుగా వుంచినంతవరకు, నిబద్ధితం చేసి వుంచినంతవరకు, దానికి స్వేచ్ఛ లేదు. ఒకసారి నిబద్ధితమయిన మనసును యిక

ఎన్నటికీ విముక్తం చేయలేము, యిక ఎల్లకాలం అది నిబద్ధితమయే వుండాలి అని చాలామంది అనుకుంటారు. కొన్ని రకాల ఆలోచనా రీతులు, కొన్ని నిర్హేతుకమైన అభిప్రాయాలు కలిగి వుండటం నుండి తప్పించుకోలేమనీ, మనసుకు వీటినుండి విడుదల లేదు, స్వేచ్ఛ పొందలేదు అని కూడా వాళ్ళు అంటారు. ఇంతేగాక, నాగరకత ఎంత ప్రాచీనమైనది అయితే సంప్రదాయాల భారం, ఆధిపత్యం, క్రమశిక్షణల భారం అంత ఎక్కువగా వుండి మనసును క్రుంగదీస్తాయి. ఇండియాలో మోస్తరుగా ప్రాచీన జాతులకు చెందిన ప్రజలు యితర దేశాల ప్రజలకంటె మరింత ఎక్కువగా నిబద్ధీకరణకు లోనవుతారు. ఉదాహరణకు అమెరికాలో ప్రజలు కొద్దికాలం క్రిందటనే వలస వచ్చి నూతన సమాజాన్ని ఆరంభించినవారు – అక్కడ వారికి సామాజిక, ఆర్థిక స్వేచ్ఛ ఎక్కువగా వుంటుంది.

నిబద్ధితమయిన మనసుకి స్వేచ్ఛ లేదు. ఎందువల్లనంటే, చుట్టూవున్న సరిహద్దులను దాటి ఆవలగా, తన చుట్టూ తానే నిర్మించుకున్న అడ్డుగోడలను దాటి ఆవలగా, అది వెళ్ళలేదు; ఇది మనకు స్పష్టంగానే అర్థమవుతుంది. అటువంటి మనసు నిబద్ధత నుండి తనను తాను విడిపించుకొని ఆవలకు విస్తృతమవడం చాలా కఠినమైన పని; ఎందుకంటే, యీ నిబద్ధీకరణం అన్నది సమాజం చేసేదే కాకుండా, మనసు కూడా తనకు తానే విధించుకున్న నిర్బంధం కాబట్టి. నిబద్ధతను మించి ఆవలగా పోయే సాహసం మీలో లేదు కాబట్టి, మీ నిబద్ధతలో కొనసాగడానికే మీరు యిష్టపడతారు. మీ తల్లితండ్రులు ఏమంటారో అని మీకు భయం; సమాజం, మతగురువులు ఏమంటారో అనీ మీకు భయం; అందుకే మిమ్మల్ని పట్టివుంచే యీ అడ్డుగోడల్ని సృష్టించడానికి మీరే తోడ్పడతారు. ఇదీ మనలో చాలా మందిమి చిక్కుకుని పోయిన కారాగారం; ఈ కారణంగానే మీ తల్లితండ్రులు మీతో ఎప్పుడూ చెప్తుంటారు – మీరూ మీ వంతు వచ్చినప్పుడు మీ పిల్లలకు చెప్తూ వుంటారు – ఇది చేయండి, యిది చేయకండి అని.

సాధారణంగా విద్యాలయాల్లో ఏం జరుగుతూ వుంటుంది, ముఖ్యంగా మీ టీచరు మీకు బాగా నచ్చినప్పుడు? టీచరంటే మీకు యిష్టం ఏర్పడితే, అతనిని మీరు అనుసరించా లనుకుంటారు, అతనినే అనుకరించాలనీ అనుకుంటారు; దీనితో మీ మనసు నిబద్ధితం అవడం క్రమంగా యింకా ఎక్కువయిపోయి, గట్టిపడి, శాశ్వతం అయిపోతుంది. ఒక ఉదాహరణ తీసుకుందాం. మీరు ఒక హాస్టలులో వున్నారు. అక్కడ మిమ్మల్ని కనిపెట్టి చూసుకునేందుకు నియమించిన టీచరు రోజూ ఎంతో శ్రద్ధగా పూజాపురస్కారాలు ఆచరించే అలవాటు వున్నవాడనుకోండి. అదంతా చూడటానికి మీకు చాలా బాగుంటుంది; అందులో ఏదో సౌందర్యం కూడా కనబడుతుంది; అందుకని మీరు కూడా అట్లాగే చేయడం ఆరంభిస్తారు. మరొక విధంగా చెప్పాలంటే మీరు మరింత నిబద్ధితం అవుతున్నారన్నమాట; ఇటువంటి నిబద్ధీకరణం మహా ప్రభావపూరితమైనది; ఎందుకంటే, చిన్న వయసులో వున్నప్పుడు మనిషిలో ఎక్కువ ఉత్సాహం వుంటుంది, మనసులో అన్నీ గాఢంగా ముద్రితమవుతాయి, అనుకరణ సులభంగా పట్టుపడుతుంది. మీలో సృజనాత్మకత వున్నదని నేను అనుకోను – బహుశ వుండి వుండదు. ఎందుకంటే, మీ

తల్లితండ్రులు మిమ్మల్ని గోడదాటి బయటకు వెళ్ళనీయరు గాబట్టి; మీరు నీ నిబద్ధీకృత కారాగారానికి అవలగా దృష్టి సారించడానికి కూడా వారు ఒప్పుకోరు. ఇంతలో మీ వివాహాలు జరిపించి మిమ్మల్ని మూసలో (అచ్చులో) పోత పోసేస్తారు, యిక జీవిత పర్యంతం మీరు అందులో కూరుకునిపోయి వుంటారు.

మీరు చిన్నవయసులో వున్నప్పుడు మిమ్మల్ని నిబద్ధులను చేయడం, ఒక కొత్త ఆకృతిలో రూపు దిద్దడం, ఒత్తిడి చేసి ఒక నమూనాలో పడెయ్యడం – యివన్నీ చాలా తేలికగా సాధించవచ్చు. తెలివీ, చురుకుదనమూ, మంచితనమూ వున్న ఒక బాలిక లేదా బాలుడికి, ఒక్క ఏడేళ్ళపాటు మాత్రం మతాచార్యుడి వద్ద శిక్షణ గరిపితే, వాళ్ళు, ఆ పిల్లలు ఎంత నిబద్ధులయి పోతారంటే, యిక దాదాపుగా అదే మాదిరిగ జీవిత పర్యంతం గడుపుతారు. ఇటువంటి (మన) విద్యాలయంలో కూడా అది జరుగవచ్చు; ఇక్కడి టీచర్లయినా నిబద్ధతనుండి విముక్తి సంపాదించిన వారు కాకపోవచ్చును. వారూ తక్కిన అందరిలాంటివారే. వాళ్ళూ రోజువారి పూజాపురస్కారాలు చేస్తుంటారు, వారికి వుండే భయాలు వారికి వుంటాయి, ఒక గురువుగారి కోసం అభిలాషా వుంటుంది; వారు మీకు చదువు చెప్తున్నారు కాబట్టి, పైగా వారిలో ఎవరో ఒక టీచరంటే మీకు ప్రత్యేకమైన అభిమానం కూడా వుంటుంది కాబట్టి, లేదా వారి పూజాపురస్కారాల్లో ఒకటి మీకు చాలా మనోహరంగా అనిపిస్తుంది కాబట్టి, మీకూ వారిలాగే చేయాలని అనిపిస్తుంది – మీకు తెలియకుండానే, మీరు అనుకరణలో చిక్కుకొనిపోతారు.

పెద్దవారు ఎందుకని పూజలూ, కర్మకాండలు చేస్తూ వుంటారు? ఇంతకు ముందు వారి తండ్రులు ఆ విధంగా చేస్తూ వున్నారు కనుకనా? అంతేకాకుండా, అవి వారిలో కొన్ని మనోభావాలు, అనుభూతులు కలిగిస్తాయి, అంతరంగికంగా ప్రశాంతత లభిస్తుంది అని వారు యివి చేస్తుంటారు. ఏవో కొన్ని ప్రార్థనలు వారు వల్లిస్తూ వుంటారు, అవి వల్లించకపోతే తాము ఏమయిపోతామో అని అనుకుంటారు. వారిని చూసి చిన్నవారు కూడా యిదే మాదిరిగా చేయడం మొదలుపెడతారు, దానితో ఆరంభమవుతుంది యీ అనుకరణ అనేది.

అధ్యాపకుడు, తానే యీ కర్మకాండలు, పూజాపురస్కారాలను ప్రశ్నిస్తే, అతను వీటిని గురించి గట్టిగా ఆలోచిస్తే – చాలా తక్కువమంది యీ విధంగా చేస్తారు – ఏ పక్షపాత దృష్టీ లేకుండా, తన వివేకాన్ని, ప్రజ్ఞని ఉపయోగించి పరీక్షించినట్లవుతే, వీటిలో అర్థమే లేదని అతనికి త్వరలోనే తెలిసివస్తుంది. అయితే యీ విధంగా పరిశోధించి, యిందులోని సత్యాసత్యాల్ని కనుగొనాలంటే అపారమైన స్వేచ్ఛ వుండాలి. మీరు మొదట్లోనే ఒక విషయం, అంటే పక్షపాతంతో అభిమానం పెంచుకొని, యిక అప్పుడు ఆ విషయంలో పరిశోధన చేయడం సాగిస్తే, అది అసలు పరిశోధనే కాదు అనేది స్పష్టమే కదా! మీరు మీ పక్షపాతాన్నో, మీ దురభిప్రాయాన్నో మరింత దృఢపరచుకుంటారు, అంతే.

కాబట్టి, అధ్యాపకులు ముందుగా తమని తాము నిబద్ధత నుండి విడిపించుకోవడం ఆరంభించడం, పిల్లలు కూడా నిబద్ధత నుండి విముక్తి పొందడానికి సహాయం చేయడం

చాలా ముఖ్యమైనవి. నిబద్ధీకరణం చేయడంలో తల్లిదండ్రులకి, సంప్రదాయానికి, సమాజానికి వుండే ప్రభావం గురించి టీచర్లకు బాగా తెలుసు కాబట్టి, పిల్లలు ఆలోచనారహితంగా అంగీకరించకుండా, పరిశోధించాలనీ, ప్రశ్నించాలనీ వారికి చెప్పి ప్రోత్సహించాలి.

పెద్దవారవుతున్నకొద్దీ మీరు పరిశీలించినట్లయితే రకరకాల ప్రభావాలు మిమ్మల్ని ఒక మూసకి తగినట్లుగా రూపు దిద్దుతున్నాయనేది గ్రహించడం ఆరంభిస్తారు; మీరు ఆలోచించడానికి తోడ్పడకుండా, మీరు ఏం ఆలోచించాలో ఆదేశించడం కూడా గమనిస్తారు. ఈ పద్ధతికి వ్యతిరేకంగా మీరు కనుక తిరుగుబాటు చేయకపోతే, ఆఖరున మీరు, సృజనాత్మకత లేని, స్వంతమైన ఆలోచనా తీరులేని, మీటలు నొక్కగానే పనిచేసే ఒక యంత్రంలాగా తయారవుతారు.

ఈ సమాజంలో కనుక మీరు యిమడకపోయినట్లయితే జీవనోపాధికి డబ్బు సంపాదించలేమేమోనని మీరందరూ భయపడుతుంటారు. మీ తండ్రి న్యాయవాది అయితే మీరూ న్యాయవాది అయితీరాలని అనుకుంటారు. ఆడపిల్లలయితే, పెళ్ళి చేస్తామంటే తలకాయలు వంచి వప్పుకుంటారు. కాబట్టి ఏం జరుగుతూ వుంది? పుష్కలమైన జీవచైతన్యం, ఉత్సాహం వున్న యువతీ యువకులుగా మీరు జీవితం ఆరంభిస్తారు. కాని, నిర్హేతుకమైన వారి అభిమాన దురభిమానాలతో, భయాలతోను, మూఢాచారాలతోను నిండివున్న మీ తల్లితండ్రులు, అధ్యాపకులు, తమ ప్రభావం ఉపయోగించి చేసే నిబద్ధీకరణం వలన, యిదంతా అంటే మీలోని జీవచైతన్యం, ఉత్సాహం అంతా క్రమక్రమంగా నశించిపోతుంది. స్కూలు ముగించుకొని, బోలెడు సమాచారం నింపుకొని మీరు ప్రపంచంలో అడుగుపెడతారు; కాని అప్పటికే పరిశోధించి చూసే జీవ చైతన్యాన్ని, సమాజంలో సంప్రదాయాలుగా వస్తున్న మూర్ఖత్వాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు చేసే జీవ చైతన్యాన్ని మీరు పోగొట్టుకొని వుంటారు.

మీరు యిక్కడ కూర్చుని యిదంతా వింటున్నారు – అయితే చివరకు బి.ఏ. పరీక్షల్లో, యం.ఏ. పరీక్షల్లో మీరు పాసయినాక, అప్పుడు ఏమవబోతున్నది? ఏమవబోతున్నదో మీకు బాగా తెలుసు. తిరుగుబాటు చేయకపోతే మాత్రం మీరు అచ్చంగా లోకంలో తక్కిన అందరి లాగానే వుండిపోతారు; ఎందుకంటే, భిన్నంగా ప్రవర్తించే సాహసం మీలో లేకపోయింది కాబట్టి. మీరు ఎంత నిబద్ధితులయి పోతారంటే, ఎంత మూసలో మాదిరిగా తయారవుతారంటే – మీ అంతట మీరు ఒక స్వంతదారిలో పయనించడానికి భయపడతారు. మిమ్మల్ని మీ భర్త తమ అదుపులో వుంచుకుంటాడు లేదా మీ భార్య మిమ్మల్ని అదుపుచేస్తూ వుంటుంది; సమాజం మీరు ఏం చేయాలో చెప్తూ వుంటుంది; ఇట్లా ఒక తరం తరువాత మరొక తరంలో అనుకరణ సాగిపోతూ వుంటుంది. నిజమైన అంతఃస్ఫూర్తి వుండదు; స్వేచ్ఛ వుండదు, సంతోషమనేది వుండదు; మెలమెల్లగా దగ్గరవుతున్న మృత్యువు తప్ప మరేమీ వుండదు. మీరు ఒక యంత్రంలాగా పనిచేసేందుకు తయారవుతున్నప్పుడు యీ విద్యాధ్యయనం, చదవడం, వ్రాయడంలో శిక్షణ –

వీటిలో అర్థమేముంటుంది? కాని, మీ తల్లితండ్రులకి కావలసినది అదే, లోకం కోరేదీ అదే. లోకానికి మీరు ఆలోచించడం పనికిరాదు; తెలుసుకొనే స్వేచ్ఛ మీకు వుండటానికి వీల్లేదంటుంది లోకం. ఎందుకంటే, అప్పుడు మీరొక ప్రమాదకరమైన పౌరునిగా తయారవుతారని; నిర్ణయించబడిన లోకపు నమూనాలో మీరు యిమడరని. విముక్తి పొందిన మానవుడు, తను ఒక దేశానికి, ఒక వర్గానికి, ఒక తాత్త్విక విధానానికి చెందినట్లుగా ఎన్నడూ భావించడు. స్వేచ్ఛ అంటే ప్రతి ఒక్క స్థాయిలో, అన్నింటిలో పూర్తిగా స్వేచ్ఛ వుండటం; ఒక ప్రత్యేకమైన సరళిలో మాత్రమే ఆలోచించడం అనేది స్వేచ్ఛ కాదు.

అందువలన మీరు చిన్నవయసులో వున్నప్పుడు స్వేచ్ఛగా వుండటం – ఒక సచేతనమైన స్థాయిలోనే కాదు, అంతర్గతమైన లోతులలో కూడా స్వేచ్ఛగా వుండటం అనేది చాలా ముఖ్యం. దీని అర్థం ఎల్లవేళల్లో మిమ్మల్ని మీరు కనిపెట్టి వుండటం అని; మిమ్మల్ని అదుపు చేయాలనో, మీపై ఆధిపత్యం చలాయించాలనో అపేక్షించే ప్రభావాల ప్రాబల్యాలను గురించిన ఎరుక కలిగి వుండాలి. అంటే అర్థం మీరు ఎప్పుడూ ఆలోచనా రహితంగా అంగీకారం తెలుపకూడదు అనీ; ఎప్పుడూ ప్రశ్నిస్తూ, పరిశోధిస్తూ, తిరుగుబాటు చేస్తూ వుండాలి అనీ అర్థం.

**ప్రశ్న: సంప్రదాయంతో నిండివున్న సమాజంలో నివసిస్తున్న మనం, మన మనసులను ఎట్లా విముక్తం చేసుకొనగలుగుతాం?**

**కృష్ణమూర్తి:** మొదట మీకు స్వేచ్ఛగా వుండాలి అనే గాఢమైన యిచ్ఛ, గట్టి కోరిక వుండటం ముఖ్యం. ఇది ఎగరాలని పక్షికి, ప్రవహించాలని నదిలోని నీటికి వుండే ఆశయం వంటిది. మీలో స్వేచ్ఛ కోసం గాఢ అపేక్ష వున్నదా? అది కనుక మీలో వుంటే అప్పుడు ఏమవుతుంది? మీ తల్లిదండ్రులు, సమాజం మిమ్మల్ని ఒక మూసలో పోతపోయ్యాలని ఒత్తిడి ఉపయోగిస్తూ వుంటారు. వారిని తట్టుకొని నిలబడగలిగే శక్తి మీకున్నదా? మీరు భయపడుతుంటారు కాబట్టి యిది మీకు కష్టంగా అనిపిస్తుంది. ఉద్యోగం దొరకదేమోనని, సరియైన భర్త లేదూ సరియైన భార్య దొరకరేమోనని మీకు భయం; మీరు పస్తులుండవలసి వస్తుందేమోనని, యితరులు మీ గురించి రకరకాలుగా మాట్లాడుకుంటారేమోనని భయం. విముక్తి పొందాలని మీకు వున్నా, భయపడుతుండటంవలన మీరు ప్రతిరోధించి నిలబడలేరు. లోకం ఏమంటుందో, మీ తల్లిదండ్రులు ఏం చేస్తారో అనే భయాలు మీకు ఆటంకంగా నిలుస్తాయి; అందుకే వారు మిమ్మల్ని మూసలోకి నెట్టివేసి పోత పోసేస్తారు.

సరే, యిట్లా అనగలరా మీరు, "నాకు తెలుసుకోవాలని వుంది; తిండికి కరువై నేను మాడినా ఫరవాలేదు; ఏది ఏమయినా సరే, యీ కుళ్ళిపోయిన సమాజంలోని అడ్డుగోడలను ఛేదించడానికి నేను పోరాడి తీరుతాను; ఎందుకంటే తెలుసుకొనడానికి నాకు స్వేచ్ఛ కావాలి కాబట్టి" అని మీరు అనగలరా? ఒక ప్రక్క భయపడుతూ, యీ ప్రతిబంధకాలన్నింటినీ, యీ అడ్డుగోడలను, యీ నిర్బంధాల్నింటినీ తట్టుకొని మీరు నిలబడగలరా?

కాబట్టి భయం ద్వారా కలిగే దుష్ఫలితాలను గమనించి, వాటి నుండి పిల్లలను విముక్తం చేయడానికి, పసితనం నుండే పిల్లలకు సహాయం చేయాలి. మీరు భయపడిన మరుక్షణం నుండే మీలో స్వేచ్ఛ అంతరించిపోతుంది.

**ప్రశ్న: భయమే మూలాధారంగా వున్న సమాజంలో మేము పుట్టి పెరిగాము కదా, మరి ఆ భయం నుండి విముక్తి పొందడం మాకు ఎట్లా సాధ్యమవుతుంది?**

**కృష్ణమూర్తి:** మీరు భయపడిపోయి వున్నారని మీరు తెలుసుకున్నారా? తెలుసుకుని వుంటే సరే! ఇప్పుడు, ఆ భయాన్నుండి విముక్తి ఎట్లా పొందాలి? మీరు, నేను కలసి కనిపెడదాం, నాతో పాటు కలసి ఆలోచించండి.

మీరు భయపడుతున్నారు అనే స్పృహ మీలో కలిగినపుడు మీరు వాస్తవంగా ఏం చేస్తారు? దానినుండి తప్పించుకోవాలని చూస్తారు. అవును కదూ? అందుకని ఒక పుస్తకం తీసి చదవడం ఆరంభిస్తారు, లేదూ బయట షికారుగా తిరగడానికి వెళతారు. మరచిపోవడానికి ప్రయత్నిస్తారు. మీ తల్లితండ్రులన్నా, సమాజం అన్నా మీరు భయపడతారు. మీలో ఆ భయం వున్నదని మీకు తెలుసు. కాని దానిని ఎట్లా నివారించాలో మీకు తెలియదు. మీరు భయాన్ని సూటిగా, తేరిపార చూడాలంటే కూడా భయపడతారు. అందువల్లనే రకరకాల మార్గాలు వెతుక్కొని దానినుండి పారిపోతుంటారు. ఇక చివరకు ఎదుర్కోవడం, కార్యాచరణ చేయడం అనివార్యం అయే ఆ చివరి క్షణం వరకు మీరు పరీక్షలకి చదవడంలో, అందులో ఉత్తీర్ణులవడంలో మునిగిపోయి వుంటారు. సమస్య నుండి పారిపోవాలని యీ విధంగా మీరు ఎడతెగకుండా ప్రయత్నిస్తూనే వుంటారు, అయితే అది సమస్యను పరిష్కరించడానికి మీకు తోడ్పడదు. మీరు సూటిగా సమస్యను ఎదుర్కొనవలసిందే తప్ప మరొక మార్గం లేదు. సరే, మీ భయాన్ని మీరు తేరిపార చూడగలరా? ఒక పక్షిని పరీక్షించాలనుకుంటే, దాని రెక్కల ఆకారం, దాని కాళ్ళు, దాని ముక్కు పరిశీలించాలంటే, దానికి అతి సమీపంగా వెళ్ళాలి, వెళ్ళి తీరవలసిందే – కదూ? అట్లాగే మీరు భయపడుతూ వున్నప్పుడు ఆ భయాన్ని చాలా సమీపం నుండి పరికించి చూడాలి. దానివద్దనుండి మీరు దూరంగా పారిపోతే మీ భయాన్ని మరింత ఎక్కువ చేసి పెంచుకుంటున్నారన్నమాట.

ఉదాహరణగా ఒకటి తీసుకుందాం. మీ జీవితాన్ని, మీకు అత్యంత ప్రియమైన దానికే పూర్తిగా అంకితం చేయాలని మీరు అనుకుంటారు; ఆ విధంగా మీరు చేయడానికి వీల్లేదని, అట్లా చేస్తే భయంకరమైన ఘోరాలు జరుగుతాయనీ మీ తల్లితండ్రులు మిమ్మల్ని బెదిరిస్తారు. మీకు డబ్బు ఒక్క పైస కూడా యివ్వమని అంటారు. దానితో మీరు భయపడిపోతారు. మీరు ఎంత భయపడిపోతారంటే మీ భయంవైపు తల ఎత్తి చూడటానికి కూడా మీరు సాహసించలేరు. యీ విధంగా మీరు లొంగిపోతారు; భయం కొనసాగుతునే వుంటుంది.

ప్రశ్న: నిజమైన స్వేచ్ఛ అంటే ఏమిటి? దానిని మనం ఎట్లా సంపాదించాలి?

కృష్ణమూర్తి: నిజమైన స్వేచ్ఛ సంపాదించడం ద్వారా కలిగేది కాదు, వివేకం వుండటం ద్వారా కలిగే ఫలితం అది. బయటకు వెళ్ళి, మార్కెటులో స్వేచ్ఛను మీరు కొనుక్కొని రాలేరు. ఒక పుస్తకం చదవడం ద్వారా కాని, ఒక ప్రసంగం వినడంవల్ల కాని కలిగేది కాదు. స్వేచ్ఛ వివేకం ద్వారా వస్తుంది.

అయితే, యీ వివేకం అంటే ఏమిటి? భయం వున్నప్పుడు కాని, మనసు నిబద్ధితం అయివున్నప్పుడు కాని యీ వివేకం వుండగలుగుతుందా? మనసు కారణ రహితంగా దురభిప్రాయాలు పెంచుకొని వున్నప్పుడుకాని, మీరు ఒక అద్భుతమైన మహామనిషి అని మీరు అనుకుంటున్నప్పుడు కాని, మీకు బ్రహ్మాండమైన ఆకాంక్షలు వుండి, ప్రాపంచికమైనదో, ఆధ్యాత్మికమైనదో ఒక విజయపీఠం అధిష్టించాలని మెట్లు ఎక్కుతున్నప్పుడుకాని వివేకం అక్కడ వుండగలుగుతుందా? మీరు ఎంతకీ మీమీదే అమిత శ్రద్ధ కనబరుచుకుంటుంటేనో, ఎవరో ఒకరిని అనుసరించడం, పూజించడం చేస్తున్నప్పుడో వివేకం అక్కడ వుంటుందా? ఇటువంటి బుద్ధిహీనతలను అవగాహన చేసుకొని, వాటినుండి ఛేదించుకొని బయటపడినపుడు వివేకం తప్పకుండా ఉదయిస్తుంది. కాబట్టి మీరు అందుకు పూనుకోవాలి; అన్నింటికంటె ప్రథమంగా మీరు ఎరుక కలిగి వుండవలసిన విషయం ఏమిటంటే – మీ మనసు స్వేచ్ఛగా లేదు అనేది. మీ మనసు వీటన్నింటితో ఎట్లా బంధించబడి వున్నదో మీరు పరిశీలించి చూడాలి, అప్పుడే వివేకం ఆరంభం అవుతుంది, తద్వారా విముక్తి కలుగుతుంది. సమాధానాన్ని మీకు మీరుగా కనుగొనాలి. మీకు స్వేచ్ఛ లేనప్పుడు మరొకరు విముక్తులయి వుండటంవలన, మీకు ఆకలిగా వున్నప్పుడు మరొకరు ఆహారం ఆరగించడం వలన ప్రయోజనమేమిటి?

సృజనాత్మకత – అంటే అర్థం నిజమైన అంతఃస్ఫూర్తి కలిగివుండటం – వుండాలంటే స్వేచ్ఛ వుండాలి; ఈ స్వేచ్ఛ కావాలంటే వివేకం వుండాలి. కాబట్టి వివేకాన్ని నిరోధిస్తున్నది ఏది అనే సంగతి మీరు విచారణ చేసి తెలుసుకోవాలి. మీరు జీవితాన్ని తరచి చూసి తెలుసుకోవాలి, సామాజిక విలువలను, యింకా అన్నింటినీ ప్రశ్నించాలి; భయపడిపోయి వున్నారనే కారణంగా ఏ ఒక్కదానికీ అంగీకారం తెలుపకూడదు.

★ ★ ★

# అధ్యాయం 6

ఈ భయం అనే సమస్యను మరొక దృక్కోణం నుండి కూడా దరిచేరవచ్చేమో చూద్దాం. మనలో చాలామందిలో భయం ఎన్నో విపరీతాలను సృష్టిస్తూ వుంటుంది. రకరకాలైన భ్రాంతులలో పడవేస్తుంది, సమస్యలను తయారు చేస్తుంది. భయాన్ని గురించి బాగా లోతుకు వెళ్ళి చూసి పూర్తిగా అవగాహన చేసుకోనంత వరకు అది మనం చేసే పనులను వక్రంగా మార్చివేస్తుంటుంది. మన ఉద్దేశ్యాలకు పెడర్థాలను కల్పిస్తుంది; మన జీవిత విధానాన్ని వంకరటింకర చేసి వేయగలదు భయం; మనిషికీ మనిషికీ మధ్యన అడ్డుగోడలు లేపుతుంది; అన్నింటికంటే ప్రేమానురాగాలను పాతమారుస్తుంది అన్నది మాత్రం పూర్తిగా నిజం. భయాన్ని గురించి యోచించినకొద్దీ, బాగా ఆకళింపు చేసుకొని, దానినుండి నిజంగా విముక్తి పొందిన కొద్దీ మన చుట్టూరా వున్న వాటితో మనకు పరిచయం ఎక్కువవుతూ వుంటుంది. ప్రస్తుతం జీవితంతో మనకు వున్న అర్థవంతమైన సంబంధాలు చాలా కొద్ది, అవును కదూ? భయం నుండి మనల్ని విముక్తి చేసుకోగలిగితే మన సంబంధాలను విస్తృతపరచుకోవచ్చును, గాఢమైన అవగాహన, నిజమైన సానుభూతి, ప్రేమపూర్వకమైన ఔదార్యం పెంచుకోవచ్చును; మన దృక్మండలాన్ని అపారంగా విస్తృత పరచుకోగలుగుతాం కూడా. కాబట్టి భయాన్ని గురించి మరొక కోణం నుండి కూడా చర్చించగలమేమో చూద్దాం.

ఏదో ఒక రకమైన మానసిక భద్రత మనలో చాలమందిమి కావాలనుకుంటామనే సంగతి మీరు గమనించారేమో నాకు తెలియదు. మనకి రక్షణ కావాలి, ఎవరో ఒకరిపై ఒరిగి ఆనుకొని నిలబడాలనుకుంటాం. ఒక చిన్నపిల్లవాడు తల్లి చేతిని పట్టుకొని నడిచినట్లు, మనకూ పట్టుకొనడానికి ఏదో ఒకటి కావాలి; మనల్ని ప్రేమించేవారు కావాలి. భద్రతా భావం లేకపోతే, ఒక మానసికమైన కవచం లేకపోతే మనం కలవరపడిపోతాం, అవునుకదూ? మరొకరిపై మన భారం ఆనించి నిలబడటం మనకి అలవాటు. మనకి దారి చూపేందుకు, సహాయం చేసేందుకు యితరులు కావాలి, యితరుల మద్దతు లేకుంటే మనం అల్లకల్లోలమయి పోతాం, భయభీతులమవుతాం. ఏమి ఆలోచించాలో, ఎట్లా పనిచేయాలో తోచదు. మన పాటికి మనల్ని వదిలివేసిన మరుక్షణాన ఒంటరితనంతో, భద్రతాలేమితో, అనిశ్చితత్వంతో బాధపడతాం. దీనినుండే భయం జనిస్తుంది. అవును కదూ?

అందుకే, మనలో ఒక నిశ్చింత కలిగించే దాన్ని మనం కోరుకుంటాం, అందుకు రకరకాలయిన రక్షణలను ఏర్పరుచుకుంటాం. మానసిక ద్వారాలు అన్నీ మూసివేసి లోపల కూర్చున్నప్పుడు చాలా భద్రంగా వున్నట్లు భావిస్తాం; సురక్షితంగా వున్నామని, ఎవరూ మనల్ని వేధించలేరు అని అనుకుంటాం. కాని, జీవితమంటే అది కాదు

కదా! మనకి బయటి దృశ్యాలు కనిపించాలి. మనం అన్నింటినీ చూడాలి అని జీవితం ఎడతెరపి లేకుండా మన తలుపులు తడుతూనే వుంటుంది. మన కిటికీలు తెరవాలని ప్రయత్నిస్తూనే వుంటుంది. భయం వలన తలుపులకు తాళాలు వేసుకొని, కిటికీల గడియలు వేసుకొని మనం కూర్చుంటే తలుపులు మరింత గట్టిగా కొట్టడం జరుగుతుంది. ఏదో ఒక రూపంలో ఏర్పరచుకొన్న భద్రతను అంటిపెట్టుకొని మనం కూర్చున్న కొద్దీ జీవితం మనల్ని మరింతగా త్రోసిపడవేద్దామని చూస్తుంది. మనం భయపడి, మన చుట్టూ మనమే గోడలు కట్టి మూసివేసుకొన్నకొద్దీ మనల్ని వదిలిపెట్టదు కాబట్టి, భద్రంగా వుండాలని మనం కోరుకుంటాం. జీవితం వల్లకాదు పొమ్మంటుంది. దానితో పోరాటం మొదలవుతుంది. సమాజంలో, సంప్రదాయంలో, మన తల్లులతో, తండ్రులతో గల సంబంధ బాంధవ్యాలలో భద్రత వున్నట్లు మనం భావిస్తాం. అయితే మనం కట్టుకున్న యీ భద్రత అనే గోడలను ఛేదించుకొని వచ్చి జీవితం మనల్ని తాకుతునే వుంటుంది.

భద్రతకోసం మనం ఊహలను అభిప్రాయాలను కూడా ఆశ్రయిస్తూ వుంటాం. కాదూ? ఈ ఊహలు ఏవిధంగా ఉత్పన్నమవుతాయో, మనసు వాటిని ఎట్లా అంటిపెట్టుకొని వుంటుందో మీరెప్పుడయినా గమనించారా? మీరు షికారుకి వెళ్ళినప్పుడు చూసిన ఒక అందమైన దానిని గురించిన ఊహ ఒకటి మీలో వుంటుంది. మీ మనసు ఆ ఊహ పైకే, ఆ స్మృతి వైపుకే మళ్ళీ మళ్ళీ పయనిస్తుంది. ఒక పుస్తకం చదివాక మీకు కలిగిన ఒక అభిప్రాయాన్ని మీరు పట్టుకొని వదలరు. ఇట్లా ఊహలు ఉత్పన్నమవడం, అవి ఆంతరికమైన ఉపశాంతి, భద్రత యిచ్చే సాధనాలుగ తయారవడం, వాటిని మనసు అంటిపెట్టుకొని వదలలేకపోవడం – యిదంతా మీరు గమనించాలి.

ఈ ఊహలు, అభిప్రాయాలు అనేవి ఏమిటో అని మీరు ఎప్పుడయినా ఆలోచించారా? మీకు ఒక ఊహ కలిగి, నాకు మరో ఊహ కలిగి, యిద్దరమూ ఎదుటివారి ఊహకంటే నా ఊహే గొప్పదని అనుకుంటాం, అట్లా పోరాటం మొదలవుతుంది, పోరాడతాం కదూ? నేను మిమ్మల్ని నా ఊహ గొప్పదని ఒప్పించాలని చూస్తాను, మీరు నన్ను ఒప్పించాలని ప్రయత్నిస్తారు. ఈ లోకం మొత్తం యిటువంటి ఊహలు, అభిప్రాయాలు, వాటి మధ్యన గల ఘర్షణ ఆధారంగా నిర్మితమైంది. కొంచెం లోతుగా ఆలోచించినట్లయితే ఒక అభిప్రాయాన్ని వదలకుండా అంటిపెట్టుకుని వేలాడటంలో అర్థం లేదని మీకు తెలుస్తుంది. కాని మీ అమ్మ, మీ నాన్న, మీ అధ్యాపకులు, మీ అత్తయ్యలూ, మీ మామయ్యలూ, యింకా యితర బంధువులూ – తమ ఆలోచనలను గట్టిగా పట్టుకొని ఎట్లా కూర్చుని వుంటారో మీరు గమనించారా?

సరే, ఒక ఊహ అనేది ఎట్లా జనిస్తుంది? మీలో ఒక ఊహ ఎట్లా కలుగుతుంది? ఉదాహరణకు, షికారుగా బయటకు వెళదామన్న ఊహ మీకు వున్నదనుకోండి, ఆ ఊహ ఎట్లా ఉత్పన్నమయి వుంటుంది? ఇది తెలుసుకోవడం చాలా ఆసక్తికరంగా వుంటుంది. ఇటువంటి ఊహ ఎట్లా ఉత్పన్నమవుతుందో, ఏవిధంగా మీ మనసు ఆ ఊహను వదలకుండా అంటిపెట్టుకొని, యితరమైన

వాటినన్నింటినీ నెట్టిపారవేస్తుందో, మీరు బాగా గమనించి చూస్తే తెలిసిపోతుంది. షికారుగా బయటకు వెళదామన్న ఊహ ఒక అనుభూతికి కలిగిన ప్రతిస్పందన, అవును కదూ? ఇంతకు మునుపు మీరు బయట షికారు చేసి వుంటారు; దానివలన ఒక సుఖానుభూతిని లేక సుఖమైన సంవేదనను పొంది వుంటారు; మళ్ళీ అదే కావాలనుకుంటారు, అందుకని ఆ ఊహకు ఊపిరి పోస్తారు, ఆ పైన దానిని ఆచరణలో పెడతారు. ఒక అందమైన కారుని చూసినప్పుడు మీలో ఒక సంవేదన అంటే యింద్రియాల ద్వారా కలిగిన అనుభూతి కలుగుతుంది, కలుగుతుంది కదూ? కారుని వూరికే చూసినంత మాత్రానే యీ సంవేదన కలుగుతుంది. చూడటం అనేది సంవేదనను సృష్టిస్తుంది. ఆ సంవేదన నుండి, "ఆ కారు నాకు కావాలి, అది నా కారు" అనే యీ ఊహ పుట్టుకు వస్తుంది. ఇక తరువాత ఆ ఊహ చాలా బలీయమైనదవుతుంది.

బాహ్యమైన వస్తుసంపదను, పరస్పర సంబంధాలను, అంతరంగా వుండే ఊహాలనూ, అభిప్రాయాలనూ కూడా మనం భద్రత కోసం ఆశ్రయిస్తాం. నాకు దైవంలోను, పూజాపురస్కారాలలోను విశ్వాసం వుంది; నా వివాహం నేను అనుకున్న పద్ధతిలోనే జరగాలని నేను గట్టిగా నమ్ముతున్నాను; నాకు పునర్జన్మలోను, చనిపోయాక మరో జీవితం వుంటుందనే విషయంలోను విశ్వాసం వుంది, యీ విధంగా యింకా, యింకా ఎన్నో. ఈ విశ్వాసాలు అన్నింటికీ రూపు యిచ్చినది నా కోరికలు, నాలోని నిర్హేతుకమైన అభిప్రాయాలు. ఇటువంటి యీ విశ్వాసాలను నేను వదలకుండా అంటిపెట్టుకొని వ్రేలాడుతూ వుంటాను. నాకు బయట ఎన్నో భద్రతలు వున్నాయి, అంటే నా శరీరానికి అవతలగా; అంతర్గతమైన భద్రతలు కూడా వున్నాయి; వాటిని మీరు తొలగించినా, ప్రశ్నించినా – నేను భయపడిపోతాను; మిమ్మల్ని దూరంగా త్రోసివేస్తాను; మీరు నా భద్రత మీద దండెత్తారంటే మీతో నేను యుద్ధం చేసి తీరుతాను.

అసలు భద్రత అనేది ఒకటి వున్నదా? మీకు అర్థం అవుతున్నది కదూ? భద్రత గురించి మనకు కొన్ని ఊహాలు వున్నాయి. తల్లితండ్రుల వద్దనో లేదా ఒక ఉద్యోగంలోనో మనం సురక్షితంగా వున్నట్లు మనం అనుకోవచ్చు. మన ఆలోచనా సరళి, మన జీవన విధానం, మన దృక్పథం – వీటన్నింటితోను మనం తృప్తిపడి వుండవచ్చు. సురక్షితమైన అభిప్రాయాలు అనే గోడలను మన చుట్టూరా కట్టుకొని మనల్ని అందులో మూసివేసుకోవడం మనలో చాల మందికి ఎంతో సంతృప్తిని యివ్వవచ్చు. అయితే, ఎన్ని రకాలయిన బాహ్యమైన, అంతర్గతమైన సంరక్షణలను ఏర్పరుచుకున్నా మనం నిజంగా భద్రంగా వుండగలుగుతామా, నిజంగా సురక్షితంగా వుండగలుగుతామా? బయట ప్రపంచాన్ని తీసుకుంటే, మీరు డబ్బు దాచుకున్న బ్యాంకు రేపే దివాలా తీయవచ్చు. మీ తల్లికాని తండ్రికాని మరణించవచ్చు. దేశంలో విప్లవం రావచ్చు. పోనీ అభిప్రాయాలలో రక్షణ వున్నదా? మన ఉద్దేశ్యాల కారణంగా, మన విశ్వాసాల కారణంగా, మనం ఏర్పరచుకున్న నిర్హేతుకమైన అభిప్రాయాల కారణంగా మనం సురక్షితంగా వున్నామని అనుకోవడం మనకి బాగుంటుంది. అయితే సురక్షితంగా వున్నామంటారా? అవి నిజమైన గోడలు

కావు; అవి కేవలం మన మనసుల్లో కలిగిన తలపోతలు, సంవేదనలు, అంతే. దైవం అనేవాడు ఒకడు వున్నాడు, అతనే మన బాగోగులు కనిపెట్టి వున్నాడు అనీ, మనం వచ్చే జన్మలో యింతకంటే ఎక్కువ సంపన్నులుగానో, యిప్పటికంటే ఉత్తమ గుణాలతోనో పుట్టబోతున్నాం అనీ నమ్మడం మనకి బాగుంటుంది. అట్లా అవనూవచ్చు, కాకపోవనూ వచ్చు; కాబట్టి బాహ్యమైన భద్రతల వైపు చూసినా, అంతర్గతమైన భద్రతలను గమనించి చూసినా, జీవితంలో రక్షణ అనేది బొత్తిగా లేదని మనమే స్వయంగా గ్రహించవచ్చు.

పాకిస్తాను నుండి గాని, తూర్పు యూరప్ దేశాలనుండి గాని వచ్చే కాందిశీకులను అడుగుతే, అక్కడ బాహ్యంగా వుండవలసిన భద్రత లేదని తప్పకుండా చెప్తారు. అయితే, తమలో అంతర్గతంగా భద్రతా భావం వున్నట్లు వారు భావిస్తూ వుంటారు; ఆ భావాన్నే వదలకుండా అంటిపెట్టుకొని వుంటారు. బాహ్యంగా వుండే భద్రతలను మీరు పోగొట్టుకోవచ్చు, కాని అప్పుడు అంతర్గతంగా భద్రతా భావాన్ని నిర్మించుకోవడానికి మీరు మరింత ఆతృత చూపిస్తారు. ఈ భద్రతా భావాన్ని పోగొట్టుకోడానికి మీరు ఎంత మాత్రం యిష్టపడరు. అంటే, దీని అంతరార్థం భయం మరింత పెరిగిపోయిందని చెప్పవచ్చు.

రేపో మాపో లేదూ మరికొన్ని సంవత్సరాలు గడిచాకో మీ తల్లితండ్రులు ఫలానా వారిని పెళ్ళాడమని మిమ్మల్ని ఆదేశిస్తే మీరు భయపడిపోతారా? ఏమీ భయపడరు. మొదటి నుండీ మిమ్మల్ని చెప్పిన మాట విని, చేయమన్నవి చేసే మాదిరిగానే పెంచారు; ఫలానా మార్గాల్లోనే ఆలోచించాలనీ, ఫలానా మాదిరిగా పని చేయాలనీ, ఫలానా నమ్మకాలు వుండాలని మీ తల్లిదండ్రులు, మీ గురువుగారు, మీ మతాచార్యులు మీకు బోధించారు. ఇప్పుడు మీ నిర్ణయాలు మీరే తీసుకోండి అని మీతో అంటే మీరు అయోమయంలో పడిపోరూ? మీకు నచ్చినవారిని వివాహం చేసుకోమని మీ తల్లితండ్రులు మీతో అంటే మీరు వణికిపోతారు, అవునా? ఇంతకాలం సంప్రదాయం, భయాలు మిమ్మల్ని ఆసాంతంగా నిబద్ధీకరణం చేసిపెట్టేశాక యిప్పుడు అన్ని విషయాల్లో మీ నిర్ణయాలు మీరే తీసుకోవాలని మిమ్మల్ని వదిలేస్తే మీకు యిష్టం వుండదు. మీ పాటికి మిమ్మల్ని వదిలి వేయడంలో మీకు ప్రమాదం తోస్తుంది, మీరు ఒంటరిగా అందర్నీ వదిలి మీ పాటికి మీరు వుండటానికి సుతరామూ యిష్టపడరు. మీకు మీరుగా అన్నీ ఆలోచించి నిర్ణయించుకోవడానికి కూడా మీరు బొత్తిగా యిష్టపడరు. మీరు ఒక్కరూ షికారుగా బయటకు వెళ్ళడానికి ఏ మాత్రం యిష్టపడరు. చీమలు ఎప్పుడూ బారులు కట్టి ఏవో పనులకోసం సాగిపోతున్నట్లు మీరూ ఎప్పుడూ అందరితో కలసి పనులు చేయాలనుకుంటారు. ఏదయినా సమస్యకు పరిష్కారం ఆలోచించాలంటే మీకు భయం; జీవితంలో ఎదురయ్యే సవాళ్ళు మిమ్మల్ని భయపెడతాయి. ఇట్లా భయపడిపోయి వుండటం వలన మీరు అస్తవ్యస్తమైన, అర్థంలేని వెర్రి పనులు చేస్తారు. భిక్షా పాత్ర చేతబట్టిన బిచ్చగాని వలె ఏది సమర్పించినా ఆలోచనా రహితంగా స్వీకరిస్తూ వుంటారు.

ఇదంతా గ్రహించాక ఆలోచనాశీలి అయిన వ్యక్తి ఎవరయినా సరే, బాహ్యమైనవి, అంతర్గతమైనవి అయిన అన్నిరకాల భద్రతల నుండి తన్ను తాను విముక్తం చేసుకోవడం ఆరంభిస్తాడు. ఇది మహా కఠినమైన పని. ఎందుకంటే దీని అర్థం, మీరు ఒంటరివారు అని – ఇక్కడ ఒంటరిగా అంటే అర్థం మరొకరిపై ఆధారపడకుండా అని. ఆధారపడిన మరుక్షణం భయభీతి ఏర్పడుతుంది; భయం వున్నచోట ప్రేమ భావం వుండదు. ప్రేమించినపుడు ఒంటరితనం అనేది వుండదు. ఒంటరిగా వుండాలంటే భయపడిపోతున్నప్పుడు, ఏంచేయాలో తోచకుండా వున్నప్పుడు మాత్రమే ఒంటరితనపు భావన జనిస్తుంది. ఊహలు, అభిప్రాయాలు మిమ్మల్ని అదుపు చేస్తున్నప్పుడు, కొన్ని నమ్మకాలతో మీ చుట్టూ గిరి గీసుకొని కూర్చున్నప్పుడు భయం జనించడం అనివార్యం; భయపడుతున్నప్పుడు మీరు పూర్తిగా అంధులైనట్లే అనుకోవచ్చు.

అందువలన అధ్యాపకులు, తల్లిదండ్రులు కలసి యీ భయం అనే సమస్యను పరిష్కరించుకోవాలి. దురదృష్టం ఏమిటంటే, మీరు వివాహం కనుక చేసుకోకపోతే, మీకు వుద్యోగం కనుక దొరకకపోతే మీరు ఏమయిపోతారోనని మీ తల్లితండ్రులు భయపడుతూ వుంటారు. మీరు ఎక్కడ తప్పు మార్గంలో పడతారోనని, ఎక్కడ మీ గురించి నలుగురూ ఆక్షేపణగా మాట్లాడుకుంటారోనని వారికి భయం; అందుకని మీ చేత కొన్ని పనులు చేయించాలని వారు కోరుకుంటారు. వారి యీ భయానికి ఒక ముసుగు వేసి, దానికి ప్రేమ అని వారే పేరు పెడతారు. మీ బాగోగులు వారు కనిపెట్టి వుండాలనుకుంటారు, అందుకే మిమ్మల్ని అది చేయండి. యిది చేయండి అని అంటూవుంటారు. వారు ఆపేక్ష ప్రేమానురాగాలు అని పిలుస్తున్న యీ ముసుగును తొలగించి చూస్తే వారికి వున్నది మీ క్షేమం గురించి, మీ పరువు మర్యాదల గురించి భయం అని మీరు తెలుసుకుంటారు; ఎంతోకాలంగా యితరుల మీద ఆధారపడివున్నందువల్ల మీరు కూడా అట్లాగే భయపడుతూ వుంటారు.

అందువలన మిమ్మల్ని యితరులనుండి పూర్తిగా దూరం చేసి ఏకాకులను చేసే భయభీతి భావాలను మీరు పసివయసునుండే ప్రశ్నించడం ఆరంభించడం, ఛేదించివేయడం అత్యంత ప్రధానమైన విషయాలని నేను అంటున్నాను. అంతే కాకుండా ఊహాలు, అభిప్రాయాలు, సంప్రదాయాలు, అలవాట్లు అనే గోడలను చుట్టూ నిర్మించుకొని మిమ్మల్ని మూసివేసుకోకుండా, సృజనాత్మకమైన జీవచైతన్యం కలిగివున్న విముక్త మానవునిగా మీరు రూపుచెందడం చాలా ముఖ్యం.

**ప్రశ్న: దైవం మనల్ని రక్షిస్తూ వుంటాడని తెలిసి కూడా మనం ఎందుకు భయపడతాము?**

**కృష్ణమూర్తి:** ఆ విధంగా మీతో చెప్పారు. మీ తల్లి, మీ తండ్రి, మీ అన్నయ్య అందరూ మీతో దైవం మిమ్మల్ని రక్షిస్తాడని చెప్పారు; అది ఒక తలంపు, ఒక ఊహ; దానిని వదలకుండా మీరు పట్టుకొని వుంటారు, అయినా యింకా మీలో భయం వుంటూనే వుంది. దైవం రక్షిస్తాడు అనే యీ తలంపు, యీ ఆలోచనా, యీ భావన మీ లోపల వుంటుంది. అయినా మీరు భయపడుతూనే వున్నారన్న

సంగతి మాత్రం యథార్థం; మీ భయం యథార్థమైనది. మీ తలంపు కాదు – మీ తల్లితండ్రులు, సంప్రదాయం నొక్కి వక్కాణించి దైవం మిమ్మల్ని రక్షిస్తాడు అని చెప్తున్న ఆ తలంపు, ఊహ మాత్రం యథార్థం కాదు.

సరే, యింతకూ అసలు జరుగుతున్నది ఏమిటి? మీకు రక్షణ దొరుకుతున్నదా? ఒకసారి లక్షలాది ఆ ప్రజల వంక చూడండి, ఆకలితో అలమటించి పోతున్నారు, వారిని ఎవరు రక్షిస్తున్నారు? గ్రామీణులవైపు చూడండి, ఆకలితో, మురికిగా, జీర్ణవస్త్రాలు ధరించి, మోయలేనంత బరువులు మోస్తూ దుర్భర జీవితాలు గడుపుతున్నారు. దైవం వాళ్ళని రక్షిస్తున్నాడా? ఇతరులకంటే మీకు ఎక్కువ డబ్బు వున్నది కాబట్టి, మీకు ఒక ప్రత్యేకమైన సాంఘిక హోదా వున్నది కాబట్టి, మీ తండ్రి కలెక్టరో, ఒక పెద్ద అధికారో కాబట్టి లేదూ చాలా చాకచక్యంతో యితరులను మోసం చేసే వ్యాపారి కాబట్టి, ప్రపంచంలో లక్షలాదిమంది తగినంత ఆహారంలేక, సరియైన బట్టలు లేక, ఆశ్రయం లేక అలమటిస్తుంటే మీరు మాత్రం రక్షణ పొందాలా? పేదవారిని, తిండిలేక ఆకలితో బాధపడుతున్నవారిని ప్రభుత్వం, వారిని పనిలో పెట్టుకునే యజమానులు, సమాజం, దైవం రక్షించుకుంటారు లెమ్మని మీరు ఆశిస్తారు; ఎవ్వరూ వారిని రక్షించబోవడం లేదు. దైవం మిమ్మల్ని రక్షిస్తాడు అనే భావాన్ని మీరు ఎంతగా యిష్టపడినా సరే, నిజం చెప్పాలంటే రక్షణ అనేది లేనేలేదు. మీ భయాలకు ఉపశాంతిని కలిగించే ఒక చక్కని ఊహ యిది; అందుకని మీరు ఏ ప్రశ్నలూ వేయకుండా దైవాన్ని పూర్తిగా నమ్ముతారు. ప్రధానమైన సంగతి ఏమిటంటే – దైవం మిమ్మల్ని రక్షిస్తాడు అనే తలంపులో అర్థం లేదు. అయితే, యీ భయం అనే సమస్యను గురించి మీరు నిజంగా విచారించినట్లయితే అప్పుడు దైవం మిమ్మల్ని రక్షిస్తాడా లేదా అనే విషయాన్ని మీరు గ్రహించవచ్చును.

ఆపేక్ష లేదా అనురాగం అనే భావం వున్నప్పుడు భయం వుండదు, ఒకరు మరొకరిని దోపిడి చేయడం అనేది వుండదు, అప్పుడిక ఏ సమస్యా వుండదు.

ప్రశ్న: సమాజం అంటే ఏమిటి?

**కృష్ణమూర్తి:** సమాజం అంటే ఏమిటి? మరి కుటుంబం అంటే ఏమిటి? సమాజం పుట్టుక ఎట్లా జరిగింది? ఏ విధంగా సమాజపు ఉనికి స్థిరపడింది? ఈ విషయాలు ఒకదాని తరువాత ఒకటి చూసి తెలుసుకుందాం.

కుటుంబం అంటే ఏమిటి? "ఇది మా కుటుంబం" అని మీరు అంటే దాని అర్థం ఏమిటి? మీ తల్లి, మీ తండ్రి, అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు, మీ మధ్యనగల సాన్నిహిత్యం, మీరందరూ కలిసి ఒకే యింట్లో నివసిస్తున్నారనే యథార్థం, మీ తల్లితండ్రులు మిమ్మల్ని రక్షిస్తూ వుంటారనే భావన, ఆస్తిపాస్తులు, నగలు, చీరెలు, దుస్తులు – వీటన్నింటి యాజమాన్యం – యివన్నీ కలిపి కుటుంబానికి ఆధారభూతమవుతాయి. మీ వంటి యితర కుటుంబాలు యింకా ఎన్నో వుంటాయి, వారి వారి గృహాల్లో నివసిస్తూ, అచ్చంగా మీరు భావిస్తున్నట్లే, 'నా భార్య', 'నా భర్త', 'నా పిల్లలు', 'నా యిల్లు', 'నా దుస్తులు', 'నా కారు' వంటి భావాలు కలిగి వుంటారు; ఇటువంటి కుటుంబాలు అనేకం ఒక భూభాగంపైన నివసిస్తుంటారు;

మరి ఏ యితర కుటుంబాలూ తమపై ఆక్రమణ చేయకూడదు అనే ఉద్దేశ్యం కూడా వారిలో క్రమంగా చోటు చేసుకుంటుంది. అందుకని వారు న్యాయ శాసనాలు తయారు చేయడం మొదలుపెడతారు. బాగా శక్తి ప్రాబల్యాలు గల కుటుంబాలు ఉన్నతమైన పదవుల్లోకి ఎగబ్రాకుతారు; గొప్ప ఆస్తులు ఆర్జిస్తారు; వారి వద్ద యితరుల వద్ద కంటే ఎక్కువ ధనం వుంటుంది, దుస్తులు కార్లు ఎక్కువగా వుంటాయి; వీరంతా కలసి న్యాయశాసనాలు ఏర్పరుస్తారు, తక్కిన మన అందరం ఏం చేయాలో ఆదేశిస్తారు. చట్టాలు, నిబంధనలు, పోలీసులు, సైన్యం, నావికాదళం – వీటన్నింటితో కూడిన సమాజం క్రమక్రమేణా యీ విధంగా ఏర్పడుతుంది. చివరకు ప్రపంచం మొత్తం రకరకాల జన సంఘాలతో – అంటే సమాజాలతో నిండిపోతుంది. ఆ పైన ప్రజలలో విరోధ భావాలు పుడతాయి; ఉన్నత పదవులలో అధిష్టించి కూర్చుని, అధికారాలన్నీ తమ హస్తగతం చేసుకున్న వారిని పడగొట్టాలని ప్రజలు కోరుకుంటారు. వీరు ఆ సమాజాన్ని కూలద్రోసి మరొక సమాజాన్ని నిర్మించుకుంటారు.

సమాజం అంటే ప్రజల మధ్యన వుండే పరస్పర సంబంధ బాంధవ్యాలే – ఒక వ్యక్తికీ మరొకరికీ, ఒక కుటుంబానికీ మరొక కుటుంబానికీ, ఒక కూటమికీ మరొకదానికీ, ఒక వ్యక్తికీ కూటమికీ మధ్యనగల పరస్పర సంబంధాలే సమాజం అంటే అర్థం. మానవ సంబంధాలే సమాజం, మీకూ నాకూ మధ్యనగల పరస్పర సంబంధం వంటిది. నేను అత్యాశాపరుడిని అయితే, చాలా గడుసువాడిని, జిత్తుల మారిని అయితే, నా చేతిలో గొప్ప అధికారం, పెత్తనమూ వుంటే మిమ్మల్ని త్రోసివేసెయ్యడానికి సిద్ధపడతాను; మీరూ నా విషయంలో అదే చేయాలని చూస్తారు. అందుకని మనం చట్టాలు తయారు చేస్తాం. అయితే, యితరులు వచ్చి యీ చట్టాలను ఉల్లంఘించి, తాము మళ్ళీ కొత్త చట్టనీతిని స్థాపిస్తారు. ఇది ఎప్పటికీ యీ విధంగానే నడుస్తూ వుంటుంది. సమాజంలో, అంటే మానవ సంబంధాలలో నిరంతరమైన సంఘర్షణ వుంటూనే వుంటుంది. ఈ చిన్న సూత్రం మీదే సమాజం నిర్మితమైంది. పోను పోను మానవుల ఊహలు, అవసరాలు, వారి వ్యవస్థలు, వారి పరిశ్రమలు, సంక్లిష్టంగా తయారయిన కొద్దీ సమాజం కూడా మరింత సంక్లిష్టతను పొందుతూ వుంటుంది.

## ప్రశ్న: మీరు యీ సమాజంలోనే నివసిస్తూ స్వేచ్ఛగా వుండగలరా?

**కృష్ణమూర్తి:** నా సంతుష్టికోసం, నా సౌకర్యం కోసం సమాజం మీద నేను ఆధారపడుతుంటే నేనెప్పటికయినా స్వేచ్ఛను (విముక్తి) పొందగలుగుతానా? ఆప్యాయత కోసం, డబ్బుకోసం, పనులు నెరవేర్చడానికి అంతఃస్ఫూర్తి కోసం నా తండ్రి మీద, లేదూ మరేదో ఒక విధంగా ఒక గురువు మీదా నేను ఆధారపడుతుంటే, నేను స్వేచ్ఛగా వున్నట్లు కాదు, వున్నట్లా? కాదు కదూ? మరి యీ విధంగా మానసికంగా మరొకరిపై ఆధారపడివున్నంతవరకు నేను విముక్తుడిని అవడం సాధ్యమా? నాలో ఎప్పుడయితే శక్తి సామర్థ్యాలు, అంతఃస్ఫూర్తి వుండి, స్వతంత్రంగా ఆలోచించ గలిగి, ఎవరో ఏదో అంటారు అని భయపడకుండా వుండి, సత్యం ఏది

అని తెలుసుకోవాలని అభిలషిస్తూ, అత్యాశగా, యీర్ష్యగా, అసూయగా లేకుండా వుంటానో, అప్పుడు స్వేచ్ఛ (విముక్తి) పొందడం నిస్సందేహంగా సాధ్యమవుతుంది. ఈర్ష్యతోను, అత్యాశతోను వున్నంతవరకు నేను మానసికంగా సమాజంపై ఆధారపడి వున్నట్లే. ఈ విధంగా సమాజంపై ఆధారపడి వున్నంతవరకు నేను విముక్తుడిని కాను. అయితే నాలో అత్యాశ పడటం అనేది అంతరించిందంటే నేను విముక్తి చెందుతాను.

**ప్రశ్న: ఒంటరిగా జీవించగలిగి వుండి కూడా ఎందుకు మనుష్యులు సమాజంలో జీవించాలని కోరుకుంటారు?**

**కృష్ణమూర్తి:** మీరు జీవించగలరా ఒంటరిగా?

**ప్రశ్న: మా అమ్మ, నాన్న యీ సమాజంలో జీవిస్తున్నారు కాబట్టి నేనూ సమాజంలో జీవిస్తున్నాను.**

**కృష్ణమూర్తి:** ఒక ఉద్యోగం చేయాలన్నా, జీవనోపాధి సంపాదించాలన్నా మీరు సమాజంలో జీవించవలసి వస్తుందా రాదా? మీరు ఒంటరిగా జీవించగలుగుతారా? మీ ఆహారం, దుస్తులు, ఆశ్రయం (యిల్లు) – వీటికోసం మీరు యితరులపై ఆధారపడతారు. అందరికీ దూరంగా అయి ఏకాంతంగా ఎవరూ జీవించలేరు. ఏ ఒక్క ప్రాణీ కూడా పూర్తిగా ఏకాకి కాదు. ఒక మృత్యువులోనే మీరు ఒంటరిగా వుంటారు. జీవిస్తున్నప్పుడు మరొకరితో తండ్రితో, సోదరుడితో, బిచ్చగాడితో, రోడ్డు బాగుచేసేవాడితో, వర్తకునితో, చెత్త పోగు చేసేవానితో – యిట్లా అందరితో సంబంధం వుండితీరుతుంది. మీరు ఎప్పటికీ మరొకరితో సంబంధం కలిగి వుంటారు. మీకు ఆ సంబంధ బాంధవ్యం అవగాహన కాకపోవడం వలన సంఘర్షణ కలుగుతుంది. మీకు, మరొకరికి మధ్యన వున్న సంబంధ బాంధవ్యాన్ని మీరు గనుక అవగాహన చేసుకున్నట్లయితే సంఘర్షణే వుండదు; అప్పుడిక ఒంటరిగా జీవించడం అన్న ప్రశ్న తలెత్తదు.

**ప్రశ్న: మనకు ఒకరితో ఒకరికి యీ సంబంధ బాంధవ్యాలు వుంటూనే వుంటాయి కనుక, యిక ఎప్పటికీ మనం సంపూర్ణ విముక్తి పొందలేము అన్నది వాస్తవం కాదా?**

**కృష్ణమూర్తి:** పరస్పర సంబంధం – సవ్యమైన పరస్పర సంబంధం అంటే ఏమిటో మనం అవగాహన చేసుకోం. నన్ను తృప్తిపరచుకోవడం కోసం, నా సౌకర్యం కోసం, నా భద్రతాభావం కోసం నేను మీమీద ఆధారపడ్డానని అనుకుందాం. అప్పుడు నేను ఎప్పటికయినా విముక్తం ఎట్లా అవగలుగుతాను? అయితే, ఆ విధంగా నేను ఆధారపడకపోయినా మీతో మరొకలాగా సంబంధ బాంధవ్యం కలిగివుంటాను; వుంటాను కదూ? ఏదో ఒక రకమైన మానసిక, భౌతిక లేదా మేధా సంబంధమైన పూరాట కోసం నేను మీ మీద ఆధారపడి వుంటాను కాబట్టి

నాకు స్వేచ్ఛ లేదు. నాకు ఏదో ఒక రకమైన రక్షణ కావాలి కాబట్టి నేను నా తల్లితండ్రులను వదలకుండా అంటిపెట్టుకొని వుంటాను. అంటే అర్థం వారితో నా సంబంధ బాంధవ్యంలో పరాధీనత్వం వున్నది, భయం అనే పునాది మీద యీ సంబంధం ఏర్పడింది అని. అప్పుడు వారితో నాకు స్వేచ్ఛగల సంబంధాలు ఎట్లా వుంటాయి? భయం లేనప్పుడు పరస్పర సంబంధాలలో స్వేచ్ఛాభావం వుంటుంది. కనుక సవ్యమైన పరస్పర సంబంధాలు కావాలంటే, భయానికి ఆలవాలమైన యీ మానసిక పరాధీనత్వం నుండి నన్ను నేను విముక్తం చేసుకోవాలి.

**ప్రశ్న: తల్లిదండ్రులు వృద్ధాప్యంలో మా మీద ఆధారపడతారు, అటువంటప్పుడు మాకు స్వేచ్ఛ అనేది ఎక్కడుంది?**

**కృష్ణమూర్తి:** వృద్ధులు కాబట్టి ఆలంబన కోసం వాళ్ళు మీ మీద ఆధారపడతారు. దానివలన ఏం జరుగుతుంది? వారి ఆహారం, దుస్తులు మొదలయిన అవసరాలు తీర్చడం కోసంగాను మీరు కొంత జీవనోపాధి సంపాదించాలని వారు ఆశిస్తారు. ఒకవేళ మీకు కనుక ఒక వడ్రంగిగానో, ఒక చిత్రకారుడిగానో – అందులో ఆదాయం ఏమీ లేకపోయినా సరే, – పని చేయాలని వుంటుందనుకోండి, మీరు వాళ్ళని పోషించవలసి వున్నది కాబట్టే, మీరు అట్లా చేయడానికి వాళ్ళు ససేమిరా ఒప్పుకోరు. ఒకసారి ఆలోచించి చూడండి. ఇది మంచి అని కానీ చెడు అని కానీ నేను అనడం లేదు. మంచి అనో చెడు అనో అనేస్తే యిక ఆలోచించకుండా మనం ఆగిపోతాం. తమని పోషించి తీరాలని మీ తల్లితండ్రులు గట్టిగా కోరడం అనేది మీరు యిచ్ఛారీతిగ మీ జీవితం గడపడానికి ఆటంకం అవుతున్నది. మీకు యిష్టమైన విధంగా జీవితం గడపడం స్వార్థపరత్వంగా వారు పరిగణిస్తారు; కాబట్టి మీరు తల్లితండ్రులకు బానిసలుగ మారిపోతారు. ప్రభుత్వమే వృద్ధులకు వృద్ధాప్యపు భరణం రూపంలోను, యింకా యితర మార్గాల్లోను భద్రత కల్పించి వారి ఆలన పాలన చూడాలనీ మీరు అనవచ్చు; అయితే విపరీతంగా పెరిగి పోయిన జనాభా, చాలీచాలని జాతీయ ఆదాయం, ఉత్పత్తుల కొరత, యింకా ఎన్నో యిటువంటివి వున్న దేశంలోని ప్రభుత్వం వృద్ధులను పోషించలేదు. అందువల్ల పెద్దవారయాక తల్లితండ్రులు చిన్నవారిమీద ఆధారపడతారు. ఇక చిన్నవారు ఎప్పటికీ యిట్లాగే సంప్రదాయపు గాడిలో యిరుక్కొని పోయి నశించిపోతారు. అయితే, యిది నేను చర్చించవలసిన సమస్య కాదు. మీరందరూ యీ విషయం గురించి ఆలోచించుకొని పరిష్కరించుకోవాలి.

కొంత సమంజసమయిన అవధుల మేరకు నా తల్లితండ్రుల పోషణ భారాన్ని వహించాలనే నేను సాధారణంగా అనుకుంటాను. అయితే, నేను యిష్టపడి చేయాలనుకుంటున్న పనిలో ఆదాయం చాలా తక్కువగా వుండవచ్చు. ఆధ్యాత్మిక జీవితం అంటే నాకు అభిలాష వుండి, నా జీవితమంతా దైవం అంటే ఎవరు, సత్యమంటే ఏమిటి అనే అన్వేషణకే అర్పించి వేస్తాననుకోండి. ఇటువంటి జీవిత విధానం వల్ల నాకు డబ్బు రూపంలో ఏమీ ఆదాయం రాకపోవచ్చును. ఇదే

జీవితం కొనసాగిస్తే నా కుటుంబాన్ని వదులుకోవలసి రావచ్చు – అంటే అర్థం లోకంలోని యితర లక్షలాది ప్రజలలాగా వాళ్ళు కూడా తిండిలేక మాడిపోవచ్చు. నేనేం చేయాలి? ప్రజలు ఏమంటారో – నేను బాధ్యతగల కొడుకును కాననీ, అప్రయోజకుడయిన కొడుకునని అంటారనీ భయపడుతుంటే నేను సృజనాత్మకత వున్న మనిషిగా ఎన్నటికీ రూపొందలేను. ఆనందంగా, సృజనాత్మకత కలిగిన మనిషిగా వుండాలంటే నాలో అపారమైన ధైర్యం, అంతఃస్ఫూర్తి వుండితీరాలి.

**ప్రశ్న: తల్లిదండ్రులు తిండికి లేకుండా మాడుతూ వుంటే మనం చూస్తూ వూరుకోవడం చేయదగిన పనేనా?**

**కృష్ణమూర్తి:** మీరు యీ అంశాన్ని సవ్యమైన దృష్టితో చూడటం లేదు. నాకు నిజంగా ఒక కళాకారుడినో, చిత్రకారుడినో అవాలని వున్నదనుకోండి, బొమ్మలు గీయడంవలన వచ్చే ఆదాయం చాల తక్కువని నాకు తెలుసు. నేను ఏం చేయాలి? చిత్రలేఖనంలో నాకు వున్న గాఢమైన ఆసక్తిని త్యాగం చేసేసి ఒక గుమస్తాని అవాలా? సాధారణంగా యిదే జరుగుతూ వుంటుంది, అవును కదూ? నేనొక గుమాస్తాని అవుతాను, యిక జీవితాంతం విపరీతమైన సంఘర్షణలో మునిగిపోతాను, దుర్భరమైన వ్యథలో క్రుంగిపోతాను; నేను బాధపడుతున్నాను కాబట్టి, భంగపాటు చెందాను కాబట్టి, నా భార్యాపిల్లల జీవితాలు కూడా వ్యథాభరితం చేస్తాను. ఒక యువ కళాకారుడిగా యిందులోని లోతుపాతులన్నీ నేను గ్రహిస్తే; "నేను చిత్రలేఖనం చేయాలనుకుంటున్నాను; నాకొచ్చే కొద్ది మొత్తంలోనుండి నేను యివ్వగలిగినంత మీకు యిస్తాను; అంతే నేను చేయగలిగింది" అని నా తల్లితండ్రులతో చెప్పేస్తాను.

మీరు కొన్ని ప్రశ్నలు అడిగారు, నేను వాటికి సమాధానాలు చెప్పాను. అయితే, యీ ప్రశ్నలను గురించి మీరు బాగా ఆలోచించకపోతే, మీరు స్వయంగా వీటి అంతర్యంలోకి మరింత లోతుగా పోయి పరిశీలించకపోతే, వివిధ కోణాలనుంచి వాటెని ఎదుర్కొనకపోతే, రకరకాల పద్ధతుల్లో వీక్షించకపోతే, అప్పుడు మీరు కేవలం, "ఇది మంచిది, అది మంచిది కాదు; ఇది మన బాధ్యత, అది మన బాధ్యత కాదు; యిది తప్పు; అది ఒప్పు" అని మాత్రం అనుకొని వూరుకుంటారు – దీనివల్ల మీరు సాధించేదేమీ లేదు. అట్లా కాకుండా మీరు, నేను యీ ప్రశ్నలన్నింటిని గురించి కలిసి ఆలోచించామంటే, మీరు, మీ టీచర్లు, మీ తల్లితండ్రులు కలిసి చర్చించారంటే, క్షుణ్ణంగా పరిశీలించారంటే, అప్పుడు మీలోని వివేకం మేల్కొంటుంది; అప్పుడు మీ దైనందిన జీవితంలో యీ సమస్యలు తలఎత్తినప్పుడు మీరు వాటిని ఎదుర్కొనగలుగుతారు. నేను చెప్పేవి అన్నీ మీరు అంగీకరించి వూరుకుంటే మాత్రం మీరు ఆ సమస్యలని ఎదుర్కోలేరు. మీ ప్రశ్నలకు నా సమాధానాలు కేవలం మీలోని వివేకాన్ని మేలుకొల్పాలని; దాని ఫలితంగా మీరు స్వయంగా యీ సమస్యలని గురించి ఆలోచించి పరిష్కరించుకుంటారు అనీ; ఆ పైన జీవితాన్ని సవ్యంగా ఎదుర్కొనే సమర్థత కలుగుతుందనీ ఉద్దేశించి చెప్పినవి.

★ ★ ★

# అధ్యాయం 7

**ఇప్పటి** వరకు నేను భయాన్ని గురించి మాట్లాడుతూ వున్నాను. ఈ భయాన్ని గురించి మనం సచేతనంగా వుండటం, ఎరుక కలిగి వుండటం అనేది చాలా ముఖ్యం. ఈ భయం అనేది ఎట్లా పుట్టుకొస్తుందో మీకు తెలుసునా? భయం కారణంగా వికృతమనస్కులైనవారు, వారి ఆలోచనలు, మనోభావాలు, వారు చేసే పనులు కుటిలంగా తయారయినవారు ప్రపంచమంతటా మనకు కనబడతారు. కాబట్టి భయాన్ని గురించిన సమస్యను మనం సాధ్యమయినంతవరకు అన్ని కోణాల నుండి పరికించక తప్పదు; సమాజానికి చెందిన నీతి సంబంధమైన, ఆర్థిక సంబంధమైన దృష్టిపథంనుండే కాకుండా మన అంతర్గతమైన, మానసికమైన పోరాటాల దృష్టితో కూడా పరికించాలి.

నేను యింతకు పూర్వమే చెప్పినట్లు, బాహ్యమైన, అంతరికమైన భద్రతకోసం భయపడుతుండటం వల్లనే మనసు వికృతం అయి, ఆలోచనలు వక్రమార్గంలో పయనిస్తాయి. మీరు యీ విషయం గురించి కొద్దిగా నయినా ఆలోచించి వుంటారని ఆశిస్తాను. ఎందుకంటే, మీరు ఎంత స్పష్టంగా యీ విషయం పరిశీలించి, సత్యాన్ని గ్రహిస్తే, అంతగా మీరు పరాధీనత నుండి విముక్తి చెందుతారు. పెద్దలు యీ సమాజాన్ని రమణీయమైనదానిగా ఏమీ తయారుచేసి పెట్టలేదు; తల్లితండ్రులు, మత గురువులు, అధ్యాపకులు, పరిపాలకులు, మతబోధకులు వీరందరూ లోకాన్ని ఒక సుందరమయిన ప్రదేశంగా తయారు చేయలేకపోయారు. అట్లా చేయకపోగా, ప్రతివారూ మరొకరితో కలహిస్తూ, పోరాడుతూ వుండే ఒక భయంకరమైన, క్రూరమయిన లోకాన్ని వాళ్ళు సృష్టించారు. ఇక్కడ ఒక కూటమికీ మరొక కూటమికీ మధ్య వైషమ్యం, ఒక వర్గానికి వ్యతిరేకంగా మరొక వర్గం, ఒక దేశాన్ని వ్యతిరేకిస్తూ మరొకటి, ఒక సిద్ధాంత తత్త్వం లేక కొన్ని విశ్వాసాలకు విరుద్ధంగా మరొకటి వున్నాయి. మీరు పెరిగి పెద్దవాళ్ళవుతున్న యీ ప్రపంచం వికృతమైన ప్రపంచం, దుఃఖభూయిష్టమైన ప్రపంచం; ఇక్కడి పెద్దలు తమ ఆలోచనలు, నమ్మకాలు, తమ వికృతత్వం మీమీద రుద్ది, మీకు వూపిరి ఆడకుండా చేయాలని ప్రయత్నిస్తుంటారు; ఈ పాపిష్టి సమాజాన్ని తయారు చేసిన పెద్దల వికృత విధానాల్నే మళ్ళీ మీరూ అనుసరించాలనుకుంటుంటే యిక యీ చదువు సంధ్యలకు ప్రయోజనం ఏముంది, అసలు యీ జీవితానికి మాత్రం అర్థం ఏమిటి?

మీ చుట్టూరా పరికించి చూసినట్లయితే, ప్రపంచమంతటా అతి భయంకరమైన విధ్వంసం, మానవుల దౌర్భాగ్యస్థితి కనబడతాయి. మీరు చరిత్రలో యుద్ధాలను గురించి చదివివుండవచ్చు; కాని అసలు వాస్తవంలో అవి ఎట్లా వుంటాయో మీరు

ఎరుగరు. నగరాలను నేలమట్టంగా విధ్వంసం చేయడం; హైడ్రోజన్ బాంబును ఒక ద్వీపంమీద వేసినప్పుడు ఆ ద్వీపం మొత్తంగా అదృశ్యమవడం; ఓడల మీద బాంబులు వేసినప్పుడు ఆ ఓడలు గాలిలో కలిసిపోయి మాయమయిపోవడం; యివన్నీ మీరు ఎరుగరు. పురోగతి అని అందరూ పిలుస్తున్న దానివలన భయంకరమైన వినాశం జరుగుతున్నది, యిటువంటి ప్రపంచంలో మీరు పెరిగి పెద్దవాళ్ళవుతున్నారు. మీరు చిన్నవయసులో వున్నప్పుడు హాయిగా, ఆనందంగా కాలం గడిచి పోవచ్చు. కాని మీరు పెద్దవాళ్ళయాక, మీరు కనుక జాగరూకంగా వుండకపోతే, యుద్ధాలతో కూడుకొనివున్న యీ ప్రపంచాన్నే, నిర్దాక్షిణ్యంతో, క్రూరత్వంతో ఆకాంక్షలను అందుకోవాలని ప్రయత్నించే యీ ప్రపంచాన్నే, ప్రతివారూ మరొకరితో పోటీపడుతూ వుండే యీ ప్రపంచాన్నే, దుర్భరవేదనలు, ఆకలి, అధిక జనాభా, రోగాలూ వున్న యీ ప్రపంచాన్నే మీరు శాశ్వతంగా కొనసాగేటట్లు చేస్తారు.

కాబట్టి మీకు చిన్నవయసులో ఒక యోగ్యుడయిన అధ్యాపకుడు అర్థంలేని ఏవో పరీక్షలు పాసవడం కోసం మీకు పాఠాలు బోధించడంకంటే యీ విషయాలన్నింటి గురించి మీరు ఆలోచించడానికి తోడ్పడటం చాలా ముఖ్యం కదూ? జీవితం అంటే దుఃఖం, మృత్యువు, ప్రేమ, ద్వేషం, క్రూరత్వం, వ్యాధులు, ఆకలి – యివన్నీ; యీ విషయాలన్నింటి గురించి మీరు యోచించడం ఆరంభించాలి. అందుకోసమే మీరు, నేను కలిసి యీ సమస్యలన్నీ పరిశీలించడం మంచిదని నాకు అనిపిస్తున్నది. ఈ విధంగా మీలోని వివేకం మేల్కొంటుంది, మీ మనసులో యీ విషయాలన్నింటిని గురించి నిజమైన స్పందన ఆరంభమవుతుంది. అప్పుడు మీరు పెరిగి పెద్దవాళ్ళవగానే కేవలం పెళ్ళి చేసేసుకోవడమో, తలలో ఏ ఆలోచనలు లేని ఒక క్లర్కుగా స్థిరపడటమో, ఒక పిల్లల కోడిలా అవడమో చేయరు; వికృతమైన యీ జీవితపు వ్యూహంలో యిసుకలో పోసిన నీటిలాగా మిమ్మల్ని మీరు పోగొట్టుకోరు.

భయం కలగడానికి గల కారణాల్లో ఒకటి ఆకాంక్షపరత్వం, ఏమంటారు? మీ అందరిలో కూడా ఆకాంక్షాపరత్వం వున్నది కదూ? మీ ఆకాంక్ష యేమిటి? ఫలానా పరీక్ష పాసవడమేనా? గవర్నరు అవడమా? మీరు చాలా చిన్న పిల్లలయితే ఒక యింజను డ్రయివరు అవాలని మీ కోరిక అయివుంటుంది, వంతెన మీదుగా యింజను నడిపించాలని అనుకుంటారు. అసలు మీలో యీ ఆకాంక్షలు ఎందుకున్నాయి? వాటి అర్థం ఏమిటి? మీ రెప్పుడయినా ఆలోచించారా? పెద్దవాళ్ళని గమనించారా, వారిలో ఎంతెంత ఆకాంక్షపరత్వం వుంటుందో చూశారా? మీ కుటుంబంలోనే మీ నాన్నకానీ, మామయ్యకానీ ఎక్కువ కావలసిన జీతాల గురించి, యింకా పెద్ద పదవిలోకి, ఎక్కువ ప్రాముఖ్యంగల పదవిలోకి పోయే అవకాశాల గురించి మాట్లాడుకోవడం మీరు వినలేదూ? మన సమాజంలో – మీకు మన సమాజం ఎటువంటిదో వివరించి చెప్పాను కదా – అందరూ ఆ పనే చేస్తుంటారు, పైకి ఉన్నత పీఠంమీదికి ఎక్కి కూర్చోవాలని ప్రయత్నిస్తుంటారు. వాళ్ళు అందరూ గొప్పవారు అవాలనే కోరుకుంటుంటారు, కోరుకుంటారు కదూ? క్లర్కుకేమో మేనేజరు అవాలని, మేనేజరుకేమో అంతకంటే పెద్ద అధికారి అవాలని –

యిట్లాగే యింకా యింకా – మరొకటి ఏదో అవాలని అంతులేని పోరాటం. నేను అధ్యాపకుడిని గనుక అయితే ప్రధానాధ్యాపకుడిని అవాలని కోరుకుంటాను; నేను ప్రధాన అధ్యాపకుడిని కనుక అయితే మేనేజరుని అవాలని కోరుకుంటాను. మీరు అనాకారులవుతే అందంగా అవాలని కోరుకుంటారు. లేదా అంటే ఎక్కువ డబ్బు కావాలని, బోలెడు చీరలు కావాలని, ఎన్నో దుస్తులు కావాలని, ఫర్నిచరు, యిళ్ళు, ఆస్తులు – మరింత ఎక్కువ, మరింత ఎక్కువ, మరింత ఎక్కువ కావాలని కోరుకుంటారు. ఇట్లా ఒక్క బాహ్య ప్రపంచానికి చెందిన వాటిలోనే కాకుండా అంతర్గతమైన విషయాల్లో కూడా యిదే విధంగా కోరుకుంటారు; ఆధ్యాత్మికత అని మీరు అనే ఆ విషయాల్లో కూడా మీకు గొప్ప పేరున్నవారు కావాలని కోరుకుంటారు, అయితే, యీ ఆకాంక్షను మీరు రకరకాల మాటల ముసుగులో కప్పిపెడతారు. ఇది మీరు గమనించలేదా? ఇందులో ఏమాత్రం దోషం లేదని కూడా మీరు అనుకుంటారు. అవును కదూ? ఏమాత్రం ఆక్షేపించనవసరం లేని చాలా సహజమయిన, సమర్థనీయమైన, సమంజసమైన సంగతి యిది అని మీరు అనుకుంటారు.

సరే, యీ ఆకాంక్షాపరత్వం ప్రపంచంలో ఏం చేసింది? అసలు ఆ విషయాన్ని గురించి చాలా కొద్దిమందిమి ఆలోచించాం. ఒక మనిషి సంపాదించాలని, సాధించాలని, మరొకరిని మించిపోవాలని ప్రయాస పడటం మీరు చూసినపుడు, అతని హృదయం లోపల ఏముండి వుంటుంది అని మీలో మీరు ఎప్పుడయినా ప్రశ్నించుకున్నారా? మీరు ఆకాంక్షపడుతూ వున్నప్పుడు, మీరు గొప్పవారు అవాలని – ఆధ్యాత్మికంగా గాని, సాధారణ లౌకికభావంలో గాని – ప్రయాస పడుతున్నప్పుడు మీరే మీ హృదయంలోకి కనుక తొంగి చూసుకున్నట్లయితే, భయం అనే పురుగు అక్కడ కనబడుతుంది. ఆకాంక్షలు వున్న మనిషి అందరికంటే అత్యంత భయస్తుడు, ఎందుకంటే, అతనికి తను వున్న స్థితిలో వుండటం అంటే తగని భయం. "నేను యిప్పుడు వున్నట్లుగానే వున్నానంటే పేరూ వూరూ లేనివాడిగానే మిగిలిపోతాను. కాబట్టి, నేను గొప్పవాడినవాలి. నేను ఒక మేజస్ట్రేటునో, జడ్జినో, మతాచార్యుడినో అయితీరాలి" అని అతను అంటాడు. ఈ ప్రక్రియనంతా మీరు బాగా వివరంగా పరీక్షించి చూస్తే, మాటలు, ఊహాలు అనే తెరలు తొలగించి, వెనకాల ఏమున్నదో చూస్తే, హోదా, విజయం (గెలుపు) కట్టిన గోడకి అవలగా చూస్తే, అక్కడ మీకు భయం కనబడుతుంది; ఎందుకంటే ఆకాంక్షగల మనిషి తను వున్నస్థితిలో వుండటానికి భయపడతాడు. అతడు తన లోపలవున్న తాను వట్టి అల్పుడు, పేద, వికారి అని భావిస్తాడు. చాలా ఒంటరిగానూ, ఆసాంతం ఖాళీగా వున్నట్లుగానూ భావిస్తాడు. అందుకని, "నేను వెళ్ళి ఏదో ఒకటి సాధించాలి" అని అనుకుంటాడు. ఆ పయిన అతను దైవం అని తను అనుకునే దానికోసం – ఇదీ మరొక రూపంలో వున్న ఆకాంక్షే – వెంపర్లాడతాడు. లేదా ప్రపంచంలో తను ఒక గొప్పవాడు అవాలని ప్రయత్నిస్తాడు. ఈ విధంగా అతను దేన్ని గురించి నిజంగా భయపడుతున్నాడో ఆ ఒంటరితనాన్ని, తనలో అంతర్గతంగా వున్న ఆ శూన్యభావాన్ని కప్పిపెడతాడు. దానినుండి అతను తప్పించుకొని పారిపోతాడు;

అతను తప్పించుకొని పారిపోవడానికి ఆకాంక్షపరత్వం అనేది సాధనం అవుతుంది.

ఇప్పుడు లోకంలో ఏంజరుగుతున్నది? ప్రతివారూ మరొకరితో పోరాడుతున్నారు. మరొకరికంటె తాను తక్కువగా వున్నానని ఒకడు భావిస్తాడు, అందుకని తాను పైకి పోవాలని ప్రయాస పడతాడు. ఇక్కడ ప్రేమభావం లేదు, ఔదార్యం లేదు, ఇక్కడ గాఢమైన ఆలోచన లేదు. ఒక మనిషికి మరో మనిషికి మధ్యనగల నిరంతరమైన సమరం మన సమాజం. గొప్పవారవాలనే ఆకాంక్షలలో నుండి ఉద్భవించినదే యీ సమరం; పైగా పెద్దవారు మిమ్మల్ని ఆకాంక్షించడం పెంచుకోమని ప్రోత్సహిస్తుంటారు. మీరు ఏదో ఒక విధంగా పైకి రావాలని, మీరు ఒక శ్రీమంతుడినో, శ్రీమంతురాలినో పెళ్ళాడాలని, మీరు బాగా పలుకుబడి వున్న స్నేహితులని అలవర్చుకోవాలని వారు కోరుకుంటారు. వారు భయభీతులై వుండి, హృదయంలో వికృతులై వుండి, వారిలాగే మిమ్మల్నీ తయారు చేయాలని ప్రయత్నిస్తారు. మీరు కూడా మళ్ళీ వారిలాగే వుండాలని కోరుకుంటారు. అందులోని ఆకర్షణ మిమ్మల్ని వ్యామోహ పరుస్తుంది. గవర్నరు వచ్చినప్పుడు అందరూ తలను నేలకు ఆనించి, నమస్కారాలు చేసి స్వాగతం పలుకుతారు. పూలమాలలు వేస్తారు. ఉపన్యాసాలు యిస్తారు. అతనికి యిదంతా మహా ప్రీతికరం, మీకూ యిష్టమే. మీకు అతని మేనమామో, పినతండ్రో, అతని గుమాస్తానో పరిచయం అయితే గొప్పగా అందలం ఎక్కినట్లుగా భావిస్తారు; అతని ఆకాంక్షలు, అతను సాధించిన ఘన విజయాలు చూసుకొని మురిసిపోతుంటారు. ఇంకేం, మీరు చాలా సునాయాసంగా పాతతరంవారి వికృతజాలంలో, ఘోరమయిన యీ సమాజపు నమూనాలో చిక్కుకుని పోతారు. మీరు జాగరూకంగా వుంటేనే, నిరంతరంగా కనిపెట్టి వుంటేనే, మీరు ఏ మాత్రం భయపడకుండా వుంటేనే, మీ అంగీకారం చూపడం కాకుండా ప్రతిదానినీ ప్రశ్నిస్తూ వుంటేనే – అప్పుడు మాత్రమే మీరు చిక్కుకొనిపోరు; దీనంతటికీ ఆవలగా పయనించి ఒక నూతన లోకాన్ని సృష్టిస్తారు.

అందువల్లనే మీకు సరిపోయే వ్యావృత్తి ఎన్నుకోవడం అనేది మీకు చాలా ముఖ్యమైన విషయం. వ్యావృత్తి అంటే ఏమిటో మీకు తెలుసునా? మీరు చాలా యిష్టంగా చేసే పని, మీరు చాలా సహజంగా చేయగల పని. అసలు విద్యావిధానం నిర్వహించవలసిన ధర్మం యిదే – మీరు స్వతంత్రులుగా పెరిగి పెద్దవాళ్ళవడానికి తోడ్పడటం; ఆ విధంగా ఆకాంక్షాపర్వతం నుండి విముక్తులయి, మీకు సరిపోయే వ్యావృత్తి అంటే సద్వృత్తిని మీరు సంపాదించుకో గలుగుతారని. ఆకాంక్షాపరత్వం వున్న మనిషి తన సద్వృత్తి యేదో తెలుసుకోలేక పోయాడన్న మాట; ఆ సంగతి అతను కనిపెట్టి వుంటే కనుక అతను ఆకాంక్షాపరుడయి వుండేవాడు కాదు.

కాబట్టి మీరు తెలివితేటలతో, నిర్భీతితో వుండటానికి, ఆ విధంగా మీకు యిష్టమైన సద్వృత్తిని, మీదయిన జీవిత విధానం ఒకదానిని తెలుసుకోవడానికి, మీరు నిజంగా కోరుకుంటున్న రీతిలో జీవించి, మీ జీవనోపాధిని సంపాదించుకోవడానికి తోడ్పడవలసిన బాధ్యత మీ అధ్యాపకుల మీద, ప్రధానాధ్యాపకుడి మీద వున్నది. అంటే, దీని అంతర్భావం ఆలోచనాతీరులోనే ఒక విప్లవాత్మకమయిన మార్పు

రావాలని; ఎందుకంటే ప్రస్తుతం మన సమాజంలో మాట్లాడగలిగిన మనిషిని, వ్రాయగలిగిన మనిషిని, పరిపాలించ గలిగిన మనిషిని, చాలా పెద్ద కారు వున్న మనిషిని, చాలా అద్భుతమైన ఉన్నతి సాధించినవాడని అనుకుంటారు; తోటలో పాదులు త్రవ్వే మనిషిని, వంటలు చేసే మనిషిని, యిళ్ళు కట్టే మనిషిని అంతా అసహ్యించుకుంటారు.

ఒక మేస్త్రీవంకగాని, రోడ్లు బాగుచేసేవాడివైపుగాని, టాక్సీ నడపించే అతనిని కాని, తోపుడుబండిని నెట్టేవాడిని కాని చూసినప్పుడు మీలో ఏయే భావాలు కలుగుతూ వుంటాయో మీరు చూసుకుంటారా? మీరు వారిని పరమ హేయంగా గణిస్తారని గమనించారా? అసలు అతనంటూ ఒకడున్నాడని మీరు పట్టించుకోరు. అతన్ని పూర్తి ఉపేక్షాభావంతో చూస్తారు; కాని ఒక వ్యక్తికి గొప్ప బిరుదో, హోదానో వుంటే, అతను బ్యాంకర్‌గాని, వ్యాపారస్తుడు కాని, గురువుగాని, మతాచార్యుడు గాని అయివుంటే మీరు వెంటనే అతనికి అమితమైన గౌరవం చూపుతారు. మీరు కనుక మీకు నిజంగా సరిపడే సద్వృత్తిని అవలంబించారంటే, కుళ్ళి చెడిపోయిన యీ విధానాన్ని పూర్తిగా నిర్మూలించడానికి తోడ్పడతారు; ఎందుకంటే అప్పుడు మీరు ఒక తోటమాలి అయినా, ఆ పనిని మీరు హృదయ పూర్వకంగా యిష్టపడి చేస్తూ వుంటారు కాబట్టి; అందులో ఆకాంక్షాపరత్వం అనేది వుండదు. ఒక పనిని అది ఏ పనయినా సరే బాగా అద్భుతంగా చేయడం, సంపూర్ణంగాను, చిత్త శుద్ధితోను చేయడం, మీరు గాఢంగా యోచించి స్పందించే తీరులో చేయడం – అది ఆకాంక్షాపరత్వం కాదు; అందులో భయం అనేది వుండదు.

మీకు సరిపడే సద్వృత్తి ఏదో కనుగొనడానికి మీకు తోడ్పడటం చాలా కష్టసాధ్యమయిన పని. అంటే అధ్యాపకుడు ప్రతి విద్యార్థి ఎడల చాలా ప్రత్యేకమయిన శ్రద్ధ కనబరచి, అతని శక్తిసామర్థ్యం ఏమిటో తెలుసుకోవాలి. విద్యార్థి తన భయాన్ని పోగొట్టుకోవడానికి తోడ్పడాలి; ప్రశ్నించడాన్ని, పరిశోధించడాన్ని ప్రోత్సహించాలి. మీలో ఒక రచయిత అవడానికి, ఒక కవి అవడానికి, ఒక చిత్రకారుడు అవడానికి తగినంత ప్రతిభ నిద్రాణంగా దాగి వుండవచ్చును. అది ఏదయినా సరే – మీరు ఆ పని చేయడానికి నిజంగా మీలో యిష్టమూ, ప్రేమా వున్నప్పుడు మీలో ఆకాంక్షాపరత్వం లేనట్లే; ఎందుకంటే ప్రేమభావంలో ఆకాంక్షలు వుండవు.

కాబట్టి మీరు చిన్నవయసులో వున్నప్పుడే మీలోని తెలివితేటలను జాగృతం చేసి, ఆ విధంగా మీ నిజమైన వృత్తి ఏదో మీరు తెలుసుకోవడానికి మీకు తోడ్పడటం అనేది అత్యంత ముఖ్యమైనది కాదూ? అప్పుడు మీరు చేస్తున్న పనిని మీరు జీవితమంతా ప్రేమతో చేస్తుంటారు; అంటే అర్థం ఆకాంక్షాపరత్వం వుండదు, పోటీలు పడటం వుండదు, పదవి కోసం, ప్రతిష్టకోసం మరొకరితో పోరాడటం వుండదు; అప్పుడు బహుశ మీరు ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించగలుగుతారు. ఆ నూతన ప్రపంచంలో పాత తరంవారి వికృతమైన విషయాలు – వారి యుద్ధాలు, వారి అర్థరహితమైన కార్యాలు, విభేదాలు సృష్టించే వారి దేవుళ్ళూ, బొత్తిగా అర్థం పర్థంలేని పూజాపురస్కారాలు, ఆచారాలు, వారి సర్వంసహాధికారి (sovereign)

మీద, అధ్యాపకుల మీద వున్న బాధ్యత మహా విశిష్టమయినది.

**ప్రశ్న: ఒకరికి యింజనీరు అవాలని ఆకాంక్ష వున్నదనుకోండి, అంటే అర్థం అతనికి యింజనీరింగులో చాలా ఆసక్తి వున్నట్లు కాదా?**

**కృష్ణమూర్తి:** ఒక విషయంలో ఆసక్తి వుండటాన్ని ఆకాంక్షపరత్వం అని మీరు అంటారా? ఈ ఆకాంక్ష అనే పదానికి మనం అనేక అర్థాలు చూపవచ్చు. నేను అనేది ఆకాంక్షపరత్వం భయంలో నుండి పుడుతుంది అని, భయానికి అది ఫలితం అని. ఒక చిన్న అబ్బాయిగా నాకు యింజనీరు అవాలని ఆసక్తి కనుక వుంటే – అందమైన భవనాలు, అద్భుతమైన నీటి పారుదల విధానాలు, బ్రహ్మాండమైన రోడ్లు నిర్మించాలని నాకు వున్నది కాబట్టి నాకు యింజనీరుని అవాలని ఆసక్తి వుంటే దాని అర్థం నాకు యింజనీరింగ్ అంటే ప్రేమ అని; అప్పుడు అది ఆకాంక్షాపరత్వం కాదు. ప్రేమ భావంలో భయం వుండదు.

కనుక ఆకాంక్షాపరత్వం, ఆసక్తి రెండూ వేరువేరు విషయాలు, అవును కదూ? నాకు వర్ణ చిత్రాలు వేయడంలో నిజంగానే ఆసక్తి వుంటే, చిత్రాలు గీయడంపై నాకు ప్రేమ వుంటే నేను అందరికంటే శ్రేష్ఠమయిన చిత్రకారుడిని అవాలని కానీ, చిత్రకారుడిగా అందరికంటే గొప్ప కీర్తి సంపాదించాలని కానీ పోటీ పడను. నాకు చిత్రాలు గీయడం అంటే ప్రేమ, అంతే. ఒకవేళ నాకంటే మీరు బాగా చిత్రరచన చేయగలిగినవారై వుండవచ్చు; కాని, నేను మాత్రం నన్ను మీతో పోల్చుకోను. నేను చిత్రాలు గీస్తున్నప్పుడు, ఆ చేస్తున్న పనిని ప్రేమిస్తాను. నావరకు నాకు అదే చాలు, నాకు కావలసినది అంతే.

**ప్రశ్న: దైవాన్ని కనుక్కోవడానికి అతి సులువయిన మార్గం ఏది?**

**కృష్ణమూర్తి:** సులువయిన మార్గం ఏదీ లేదనే నేను అంటున్నాను. ఎందుకంటే, దైవాన్ని కనుగొనడం అత్యంత కఠినమయినది, మహా దుష్కరమయినది కాబట్టి. మనం దైవం అని పిలిచేదానిని సృష్టించింది మనసే కదూ? మనసు ఎటువంటిదో మీకు తెలుసు. మనసు కాలానికి కలిగిన ఫలితం. అంటే కాలం ఆధారంగా ఏర్పడినది అని. అది దేన్నయినా, భ్రాంతిని కూడా సృష్టించగలదు. దానికి ఊహలను సృష్టించే శక్తి వుంది; విచిత్ర కల్పనలలో, ఊహాపోహలలో తననుతాను ప్రదర్శించుకుంటుంది. అది నిరంతరంగా పోగు చేసుకుంటూనే వుంటుంది. విసర్జిస్తూనే వుంటుంది, ఎంపిక చేస్తూనే వుంటుంది. మనసుకి నిర్హేతుకమైన అభిప్రాయాలు వుండటం వలన, సంకుచితమైనది, పరిమితమైనది అవడం వలన దైవాన్ని రూపకల్పన చేయడంలో తనకు వున్న అవధులకు అనుగుణంగా మాత్రమే దైవం గురించి ఊహించగలుగుతుంది. కొందరు గురువులు, మత బోధకులు, జగద్రక్షకులు అని పేరు పెట్టుకున్న వారు దైవం వున్నాడని, దైవాన్ని వర్ణించి చెప్పారు కాబట్టి, మనసు దైవాన్ని ఆ విధంగానే ఊహించగలుగుతుంది; కాని ఆ బొమ్మ, ఆ ప్రతిరూపం దైవం కాదు. దైవం అనేది ఎటువంటిదంటే దానిని మనసు కనుగొనలేదు.

దైవాన్ని అవగాహన చేసుకోవాలంటే ముందుగా మీ మనసును మీరు అవగాహన చేసుకోవాలి – అది మహా కష్టసాధ్యమయినది. మనసు చాలా సంక్లిష్టమయినది, దానిని అవగాహన చేసుకోవడం అంత సులువయిన పనికాదు. తీరిగ్గా ఒకచోట కూర్చొని, ఒక స్వప్నావస్థవంటి దానిలోనికి ప్రవేశించి, రకరకాల అభూతకల్పనలు, మాయలు చూసి యిక ఆపైన దైవానికి చాలా సన్నిహితంగా చేరుకున్నానని తలపోయడం మాత్రం చాలా సులువయిన పని. మనసు బ్రహ్మాండంగా తనని తాను మోసపుచ్చుకోగలదు. కాబట్టి దైవం అని మనం పిలవవచ్చు అనేదానిని నిజంగా అనుభవం ద్వారా పొందాలంటే మీరు పూర్తిగా ప్రశాంతంగా వుండాలి; ఈ పని ఎంత మహా కఠినమయినదో మీకు తెలియనిదా? వయసులో పెద్ద వారయినవారు కూడా ప్రశాంతంగా కూర్చోలేకపోవడం, కుదురు లేకుండా అటూ యిటూ కదులుతూ, కాళ్ళూ చేతులూ విదిలించడం మీరు గమనించకుండా వుండి వుంటారా? శరీరాన్ని కదల్చకుండా నిశ్చలంగా కూర్చోవడం యాతనే, మరి మనసుని నిశ్చలంగా వుంచడం యింకా ఎంత యాతనో చూడండి! ఒక గురువుగారిని ఆశ్రయించి మనసుని ఒత్తిడి చేసి నెమ్మదిగా వుంచవచ్చు; అయినా మీ మనసు నిజంగా ప్రశాంతంగా వుండలేదు. దానిలో ఏదో చంచలత్వం; గదిలో ఒక మూలన నిలబడమని దండించిన పిల్లవాడిలో లాగా. ఏ నిర్బంధమూ లేకుండా సంపూర్ణమైన మౌనం పాటించ గలగడం అనేది మనసుకు వుండే ఒక గొప్ప కళ; అటువంటప్పుడు మాత్రమే దైవం అని పిలువదగిన దానిని అనుభవం ద్వారా తెలుసుకొనడానికి అవకాశం వుంది.

ప్రశ్న: దైవం అంతటా వున్నాడా?

**కృష్ణమూర్తి:** తెలుసుకోవాలనే ఆసక్తి మీకు నిజంగా వున్నదా? మీరు ప్రశ్నలు అడుగుతారు, ఆపైన మెదలకుండా వుండిపోతారు. శ్రద్ధగా వినరు. పెద్దవాళ్ళు మీ మాటలను సాధారణంగా ఎప్పుడూ వినిపించుకోరనేది మీరు గమనించారా? వాళ్ళు మీ మాటలు వినడం చాలా అరుదుగా జరుగుతుంది. ఎందుకంటే, వాళ్ళు వారి ఆలోచనలలో వారి స్వీయ ఉద్వేగాలలో, వారి స్వీయ సంతృప్తులలో, దుఃఖాలలో మునిగిపోయి వుంటారు. ఇదంతా మీరు గమనించి వుంటారని ఆశిస్తాను. మీకు పరిశీలించడం తెలుస్తే, వినడం – నిజంగా శ్రద్ధగా వినడం తెలుస్తే, మీరు ఎన్నో విషయాలు తెలుసుకుంటారు, ఒక్క మనుష్యులను గురించే కాదు, లోకాన్ని గురించి కూడా తెలుసుకుంటారు.

ఈ అబ్బాయి యిప్పుడు దైవం అంతటా వున్నాడా అని అడుగుతున్నాడు. ఇటువంటి ప్రశ్న అడగడానికి అతను మరీ చిన్నవాడు. ఇందులోని అసలైన అర్థమేమిటో అతనికి తెలియదు. అస్పష్టంగా ఏదో రవ్వంత అతనికి తెలుసునేమో – ఒక సౌందర్య భావన – ఆకాశంలో ఎగురుతున్న పక్షులు, ప్రవహించే నీళ్ళు, ఒక చక్కని నవ్వు ముఖం, పిల్లగాలికి నృత్యం చేస్తున్న ఒక ఆకు, బరువు మోస్తున్న ఒక స్త్రీ – వీటి ఎరుక అతనిలో వుంది. ఇవే కాకుండా యింకా ఆగ్రహం, శబ్దాలు, శోకం – యివన్నీ కూడా చుట్టూరా వున్నాయి. కాబట్టి జీవితం అంటే

ఏమిటో అంతా తెలుసుకోవాలనే ఆసక్తి, ఆతృత సహజంగానే అతనికి కలిగాయి. పెద్దవారు దైవం గురించి మాట్లాడుకోవడం విని, అతను సంశయంలో పడ్డాడు. ఈ ప్రశ్న వేయడం అతనికి చాలా ముఖ్యమైనదిగా తోచింది, అవును కదూ? ఈ ప్రశ్నకు సమాధానం అన్వేషించడం అనేది మీ అందరికీ కూడా అంతే ముఖ్యమైనది; ఎందుకంటే, యింతకు మునుపు ఒకరోజు నేను చెప్పినట్లుగా మీరు ఆంతరికంగా, అచేతనంగా, లోపల్లోపల యిందులోని అర్థాన్ని అంతటినీ గ్రహించడం ఆరంభిస్తారు; ఆ తరువాత, మీరు పెద్దవారవుతున్నప్పుడు, పోరాటంతో కూడుకున్న యీ వికృత ప్రపంచమే కాకుండా యింకా యితర విషయాల సూచనలు మీకు తెలుస్తూ వుంటాయి. లోకం సౌందర్యమయం; నేల సమృద్ధభరితం; అయితే వాటిని విధ్వంసం చేస్తున్నది మనమే.

**ప్రశ్న: అసలు జీవితానికి గమ్యం లేక లక్ష్యం ఏదయి వుండాలి?**

కృష్ణమూర్తి: అన్నింటికంటె ముఖ్యంగా మీరు ఏం చేయాలనుకుంటున్నారో అది. జీవితం మీ చేతిలో వుంది, దానిని మీరు ఏం చేయదలుచుకుంటే అదే జీవిత గమ్యం, జీవిత లక్ష్యం.

**ప్రశ్న: వాస్తవంలో అది తప్పకుండా మరొకటయి వుంటుంది. వ్యక్తిగతంగా నాకు ఒక లక్ష్యం వుండాలని నేను ప్రత్యేకించి కోరుకోవడం లేదు. కాని అసలు ప్రతివారికీ వుండే లక్ష్యం ఏమిటో తెలుసుకోవాలనుకుంటున్నాను.**

కృష్ణమూర్తి: ఎట్లా తెలుసుకుంటారు? ఎవరు చూపుతారు? చదవడం ద్వారా తెలుసుకోగలుగుతారా? సరే, చదివి తెలుసుకుందామంటే ఒక రచయిత చూపే పద్ధతి ఒకటయి వుండవచ్చు, మరో రచయిత పూర్తిగా విభిన్నమైన మరొక విధానం చూపవచ్చు. బాధపడుతున్న మనిషి దగ్గరకు వెళ్ళి అడుగుతే సుఖంగా వుండటమే జీవిత లక్ష్యం అని చెప్తాడు. తిండికి లేక ఆకలితో మాడుతున్న వ్యక్తిని, సంవత్సరాల తరబడి తగినంత ఆహారం లేక అవస్థపడుతున్న వ్యక్తిని అడిగితే కడుపు నిండా తినడమే తన లక్ష్యం అని అంటాడు. రాజకీయ నాయకుడిని అడిగితే ప్రపంచాన్ని నడిపించే నిర్దేశకుల్లో ఒకడిని అవాలని, ప్రపంచపు పరిపాలకుల్లో ఒకడిని అవాలని వుందనీ, అదే తన గమ్యం అనీ అంటాడు. ఒక యువతిని ఆ ప్రశ్న అడుగుతే, "ఒక పాపకు తల్లి నవడమే నా లక్ష్యం" అని అంటుంది. ఒక 'సన్యాసి' వద్దకు వెళ్ళి అడుగుతే దైవాన్ని దర్శించడం తన లక్ష్యం అంటాడు. సాధారణంగా యీ లక్ష్యం – మనుష్యుల అంతర్గతమైన కోరిక ఏదో దానిని అంటే వారికి తృప్తి కలిగించే దానిని, వారికి ఊరట కలిగించే దానిని సాధించడం అయుంటుంది; ఏదో ఒక రకమయిన భద్రత, రక్షణ కావాలని వారు కోరుకుంటారు; ఆ విధంగా ఏ సందేహాలు, ఏ ప్రశ్నలు, ఆందోళన, భయమూ లేకుండా చేసుకోవాలనుకుంటారు. మనలో చాలా మందిమి వదలకుండా, అంటిపెట్టుకొని వుండటానికి శాశ్వతమైనది ఒకటి కావాలనుకుంటాము, అనుకుంటాం కదూ?

కాబట్టి, సాధారణంగా మనిషికి వుండే జీవితలక్ష్యం అంటే ఏదో ఒక రకమయిన ఆశ, ఏదో ఒక రకమయిన రక్షణ, ఏదో ఒక రకమయిన శాశ్వతత్వం. "అంతేనా" అని అనకండి. తక్షణమే కనబడే యథార్థం యిదే. దీనిని గురించి ముందు పూర్తిగా తెలుసుకోండి. దీనిని అంతటినీ బాగా ప్రశ్నించండి – అంటే, మిమ్మల్ని మీరే స్వయంగా ప్రశ్నించుకోండి. మనుష్యులందరిలో సామాన్యంగా వుండే లక్ష్యమే మీలోపలా పాతుకొనిపోయి వున్నది, ఎందుకంటే – మీరు మొత్తంలో ఒక భాగం, ఒక శకలం కాబట్టి. మీకూ స్వయంగా రక్షణ, శాశ్వతత్వం, సంతోషం కావాలి; వదలకుండా అంటిపెట్టుకొని వ్రేలాడటానికి మీకూ ఏదయినా కావాలి.

ఇప్పుడు, యిక దీనంతటినీ మించినది, మనసుతో సంబంధంలేని సత్యం ఒకటి, మరేదయినా వున్నదేమో చూడాలంటే, మనసు కల్పించే మాయాజాలాన్నంతటినీ ఛేదించివేయాలి; అంటే అర్థం ఆ మాయలను అవగతం చేసుకొని పక్కకు నెట్టేయాలి. అప్పుడే యథార్థమైన విషయాన్ని, ఒక లక్ష్యం అనేది వున్నదా లేదా అనేదాన్ని కనుగొనవచ్చును. ఒక లక్ష్యం వుండి తీరాలని నిబంధన విధించడం, ఒక లక్ష్యం వుండి వుంటుందని నమ్మడం మళ్ళీ మరొక భ్రాంతిలో పడటమే అవుతుంది. అయితే, మీ సంఘర్షణలను, పోరాటాలను, బాధలను, భేషజాలను, ఆకాంక్షలను, ఆశలను, భయాలను అన్నింటినీ పరిశీలించి చూడగలిగి, వాటిని అధిగమించి వాటికి అతీతంగా పోగలిగితే అప్పుడు మీరు దానిని అంటే లక్ష్యం ఏమిటి అనేదానిని కనిపెట్టగలుగుతారు.

ప్రశ్న: నేను ఉన్నతమైన శక్తులను పెంపొందించుకుంటే, కొంతకాలానికి ఆ అంతిమలక్ష్యాన్ని చూడగలనా?

కృష్ణమూర్తి: ఆ అంతిమలక్ష్యానికి లేదూ జీవితపరమార్థానికీ, మీకూ మధ్యన అడ్డుగోడలు వున్నంతవరకు ఆ అంతిమలక్ష్యాన్ని మీరు ఎట్లా చూడగలుగుతారు? మొదట యీ అడ్డుగోడలన్నీ తొలగించాలి. అన్ని వైపులా మూసివున్న గదిలో కూర్చొని నిర్మలమైన గాలి ఎట్లా వుంటుందో తెలుసుకోలేరు. పరిశుభ్రమైన గాలి కావాలంటే కిటికీలన్నీ తెరవాలి. అదే విధంగా, యీ అడ్డుగోడలన్నింటినీ మీ లోపలే వున్న పరిమితులను, నిబద్ధీకరణాలను – అవి ఏమిటో తెలుసుకోగలగాలి. వాటిని అర్థం చేసుకొని పక్కకు తొలగించాలి. అప్పుడు మీరు తెలుసుకోవచ్చు. కాని యిటువైపున కూర్చొని, మరొకవైపున ఏమున్నదో చూడాలనుకోవడంలో అర్థం లేదు.

★ ★ ★

# అధ్యాయం 8

మనం భయాన్ని గురించే చాలా ఎక్కువగా మాట్లాడుకోవడం మీరు చూస్తున్నారు; అది మన జీవితాల్లోని ఒక మహా శక్తివంతమయిన అంశం కాబట్టి, భయాన్ని గురించి యింతగా చర్చించవలసి వచ్చింది. ఇప్పుడు కొంత ప్రేమభావాన్ని గురించి కూడా మాట్లాడుకుందాం; ఈ మాట వెనుక, యీ మనోభావం వెనుక, మనందరం ఎంతో మహత్వపూర్ణమయినదని భావించే యీ 'ప్రేమ' అనే పదం వెనుక కూడా, పెద్దవాళ్ళు ఒంటరితనం అని పిలిచే ఆ వింతయిన భయాకులత అనేది, ఆందోళన అనేది వున్నదేమో తెలుసుకుందాం.

ప్రేమ అంటే ఏమిటో మీకు తెలుసునా? మీ నాన్నని, మీ అమ్మని, మీ సోదరుడిని, మీ టీచర్ని, మీ స్నేహితుడిని మీరు ప్రేమిస్తున్నారా? ప్రేమించడం అంటే అర్థం ఏమిటో మీకు తెలుసునా? మీ తల్లితండ్రుల్ని మీరు ప్రేమిస్తున్నారన్నప్పుడు దాని అర్థం ఏమిటి? వారితో వుంటే మీకు సురక్షితంగా అనిపిస్తుంది, వారితో వున్నప్పుడు హాయిగా అనిపిస్తుంది. మీ తల్లిదండ్రులు మిమ్మల్ని కాపాడుతూ వున్నారు, వాళ్ళు మీకు డబ్బు, ఆశ్రయం, ఆహారం, దుస్తులు యిస్తున్నారు; వారితో ఒక సన్నిహితమైన అనుబంధం వున్నదని మీకు మనోగతంలో అనిపిస్తూ వుంటుంది, అవును కదూ? వారిని పూర్తిగా మీరు విశ్వసించవచ్చని కూడా మీకు అనిపిస్తుంది – లేదూ అనిపించకనూ పోవచ్చును. మీ స్నేహితులతో మీరు మాట్లాడినంత తేలిగ్గా, ఉల్లాసంగా వారితో మీరు మాట్లాడలేక పోవచ్చునేమో! అయితే, వారిని మీరు గౌరవిస్తారు, వారు మీకు మార్గ నిర్దేశం చేసి నడిపిస్తారు, వారికి మీరు విధేయంగా వుంటారు, వృద్ధులయినప్పుడు వారిని మీరు ఆదుకోవాలనే ఒక బాధ్యతాయుత భావం మీలో వుంటుంది. వారూ మిమ్మల్ని ప్రేమిస్తారు, మిమ్మల్ని కాపాడుకోవాలనుకుంటారు, మీకు మార్గ నిర్దేశం చేసి నడిపించాలనుకుంటారు, సహాయం చేయాలనుకుంటారు. కనీసం అట్లాగని మాటల్లో అంటారు. మీరు నీతివంతమయిన జీవితం అని అనబడే జీవితం గడపాలని, ఏ చిక్కులలో పడకుండా వుండాలని వాళ్ళు అనుకుంటారు. పెళ్ళి అయితే మిమ్మల్ని సంరక్షించుకోవడానికి ఒక భర్త వుంటాడని, లేదూ వంట చేసి పెట్టడానికి, పిల్లలను కనడానికి ఒక భార్య వుంటుందని వాళ్ళు మీకు పెళ్ళి చేసేసెయ్యాలని అనుకుంటారు. దీన్నంతటినీ ప్రేమ అని పిలుస్తారు, అవునా కాదా?

ప్రేమ అంటే ఏమిటో చెప్పమంటే వెంటనే చెప్పలేము; ఎందుకంటే, మాటల్లో సులువుగా వివరించగలిగేది కాదు ప్రేమ. అంత సునాయాసంగా ప్రాప్తించేది కాదు అది. అయినా, ప్రేమ లేకపోతే జీవితం చాలా నిష్ఫలంగా వుంటుంది;

ప్రేమే లేకపోతే ఆ చెట్లు, పక్షులు, స్త్రీ పురుషుల చిరునవ్వులు, నదిని దాటించే వంతెన, పడవ నడిపేవాళ్ళు, జంతువులు – వేటికీ అర్థమే లేదు. ప్రేమలేని జీవితం లోతులేని నీటిమడుగు వంటిది. లోతయిన నది ఎంతో సంపన్నమయినది, అనేక రకాల చేపలు జీవించడానికి అస్కారం వుంది; కాని లోతులేని నీటి మడుగు తీక్షణమైన సూర్యతాపానికి త్వరలోనే ఎండిపోతుంది; అడుగున మిగిలేది వట్టి మన్ను, మురికి. అంతే – వేరే ఏమీ మిగలదు.

మనలో చాలామంది జీవితాలు లోతులేనివి కాబట్టి ప్రేమని అవగాహన చేసుకోవడం మనకి అత్యంత కష్టసాధ్యమయిన సంగతి. మనల్ని యితరులు ప్రేమించాలి, మనమూ యితరులను ప్రేమించాలి అని కోరుకుంటాం; కాని, ఆ మాట వెనుక పొంచివున్న ఏదో భయం వుంటుంది. అపూర్వమయిన యీ 'ప్రేమ' అంటే నిజంగా ఏమిటో తెలుసుకోవడం మనలో ప్రతివారికీ తప్పనిసరి కాదూ? మనం తోటి మనుష్యులను ఏ విధంగా పరిగణిస్తుంటాము, చెట్లని, జంతువులని, ఒక అపరిచితుడిని, ఆకలితో వున్న వ్యక్తిని ఏ దృష్టితో పరికిస్తుంటాము అనేదాని ఎరుక మనలో వుంటే, అప్పుడు మనం యీ విషయం అంటే ప్రేమభావం గురించి తెలుసుకోవచ్చును. మనం మన స్నేహితులను ఏ విధంగా పరిగణిస్తున్నాము, మనకి ఒక గురువు కనుక వుంటే ఆ గురువుని ఏ విధంగా పరిగణిస్తున్నాము, మన తల్లితండ్రులను ఏ విధంగా మన్నిస్తున్నాము అనే వాటిని గురించిన ఎరుక మనలో వుండాలి.

"మా అమ్మనీ, నాన్ననీ నేను ప్రేమిస్తాను, నా గార్డియన్ (సంరక్షకుడు) అన్నా, మా టీచర్ అన్నా నాకు ప్రేమ" అని మీరు అన్నప్పుడు దాని అర్థం ఏమిటి? మీరు ఒకర్ని అపరిమితంగా గౌరవిస్తూ, వారి పెద్దరికాన్ని మన్నించడం, వారికి విధేయత చూపటం మీ కర్తవ్యంగా భావించడం, వారు కూడా మీరు వారికి విధేయత చూపాలనుకోవడం, యిదంతా ప్రేమ అవుతుందా? ప్రేమలో భయాందోళనలు వుంటాయా? ఒకరిని మీరు ఉన్నతులుగా మన్నించినపుడు, మరొకరిని తప్పకుండా నీచంగా కూడా చూస్తారు, చూస్తారు కదూ? అదేనా ప్రేమ అంటే? ప్రేమలో ఒకరిని పెద్దచేయడం, మరొకరిని చిన్నబుచ్చడం అనే భావాలు వుంటాయా? ఒకరికి విధేయంగా వుండాలనే నిర్బంధం వుంటుందా?

ఒకరిని ప్రేమిస్తున్నాను అని మీరు అన్నప్పుడు, మీరు ఆ వ్యక్తిపై అంతర్గతంగా ఆధారపడటం లేదూ? మీరు చిన్న పిల్లలుగా వున్నప్పుడు సహజంగానే మీ నాన్నమీద, అమ్మమీద, మీ టీచరు మీద, మీ సంరక్షణ చేసే వారిమీద ఆధారపడి వుంటారు. మరొకరు మీ పోషణ చేయడం అవసరం; వేళకు ఆహారం యివ్వడం, బట్టలు, ఆశ్రయం యివన్నీ అవసరం. ఒక భద్రతాభావం, మరొకరు మీ అలన– పాలన చూసుకుంటున్నారనే భావం మీకు అవసరం.

కాని, సాధారణంగా ఏం జరుగుతూ వుంటుంది? మనం పెద్దవుతున్నకొద్దీ యీ మరొకరిపై ఆధారపడటం లేక పరాధీనభావం అనేది కొనసాగుతూ వుంటుంది, అవును కదూ? పెద్దవారిలో మీ తల్లితండ్రుల్లో, అధ్యాపకుల్లో యిది మీరు గమనించలేదూ? మానసికంగా వారు తమ భార్యలమీదగాని భర్తలమీదగాని

పిల్లలమీదగాని లేకపోతే తమ తల్లితండ్రులమీదగాని ఆధారపడి వుండటం మీరు గమనించలేదూ? పెరిగి పెద్దవాళ్ళయ్యాక కూడా చాలామంది మరొకరిని వదలకుండా అంటిపెట్టుకొనే వుంటారు; మరొకరిపై యింకా ఆధారపడుతునే వుంటారు. తమకు ఓదార్పు, భద్రతా భావం యివ్వడానికి మరొకరి ఆసరా లేకపోతే వారు ఒంటరిగా వున్నట్లు భావిస్తారు, భావించరూ? అయోమయంలో పడిపోతారు కూడా. ఇట్లా మరొకరిపై ఆధారపడి, పరాధీనంగా వుండటాన్ని ప్రేమ అని వారు అంటారు; అయితే, మీరు సూక్ష్మంగా పరిశీలించినట్లవుతే పరాధీనభావం అంటే భయం అనీ, అది ప్రేమభావం కాదనీ తెలుస్తుంది.

ఒంటరిగా వ్యవహరించాలంటే చాలామంది భయపడతారు; ఏ విషయమయినా వారంతట వారు స్వయంగా ఆలోచించి పరిష్కారం చేసుకోవాలంటే భయపడతారు; గాఢమైన మనోభావాలన్నా భయపడతారు; జీవితానికి వుండే పూర్తి అర్థం ఏమిటో శోధించి, అన్వేషించాలంటే భయపడతారు. అందుకని వాళ్ళు మేము దైవాన్ని ప్రేమిస్తున్నాం అని అంటారు; అని, వాళ్ళు దైవం అని వారు అనుకుంటున్న దానిపై ఆధారపడతారు; అయితే, అది మనకు తెలియని దైవం కాదు, అది మనసు సృష్టించిన దైవం అనే ఒకటి.

ఒక ఆదర్శం విషయంలో, ఒక నమ్మకం విషయంలో కూడా మనం యిట్లాగే చేస్తూ వుంటాం. ఒకదానిలో నాకు నమ్మకం నాకు గొప్ప ఓదార్పును యిస్తుంది. ఆదర్శం తీసేయండి, నమ్మకం తీసేయండి; ఇక అంతే, నేను అయోమయంలో పడిపోతాను. గురువు విషయంలో కూడా యిదే జరుగుతుంది. నేను ఏదో పొందాలని కోరుకుంటాను కాబట్టి ఆధారపడి వుంటాను. దీనిలో భయం అనే బాధ వుంటుంది. మీ తల్లిదండ్రుల మీద, టీచరుమీద ఆధారపడినప్పుడు కూడా మళ్ళీ యిదే జరుగుతూ వుంటుంది. మీరు చిన్నవయసులో వున్నప్పుడు యిట్లా ప్రవర్తించడం అంటే పరాధీనంగా వుండటం సహజంగానూ, యుక్తంగానూ వుంటుంది; కాని, పరిణతి చెందిన వయసుకి వచ్చాక కూడా యిట్లాగే పరాధీనంగా వుండటం వలన, ఆలోచించుకోవడానికి, స్వేచ్ఛగా వుండటానికి మీరు అసమర్థులవుతారు. పరాధీనత వున్నప్పుడు భయం వుంటుంది, భయం వున్నచోట అధికారభావం వుంటుంది; ప్రేమభావం వుండదు. మీ తల్లితండ్రులు కనుక మీరు విధేయంగా వుండాలి, మీరు కొన్ని సంప్రదాయాలు అనుసరించాలి, మీరు ఫలానా ఉద్యోగమే చేయాలి, మీరు ఒక రకమయిన పనినే చేపట్టాలి అని అంటూవుంటే – వీటన్నింటిలో ప్రేమభావం లేనేలేదు. సమాజంమీద మీరు ఆధారపడి పరాధీనభావం పెంచుకొని, ఆ కారణంగా మీరు సమాజపు విధానాన్ని వున్నదున్నట్లుగా ఏ ప్రశ్నలూ వేయకుండా ఆమోదిస్తే, మీ హృదయంలో ప్రేమభావం లేనట్లే అనుకోవాలి.

ఆకాంక్షా పరత్వం వున్న స్త్రీ, పురుషులకు ప్రేమ అంటే ఏమిటో తెలియదు. ఈ ఆకాంక్షా పరత్వం వున్న వ్యక్తులే మనమీద ఆధిపత్యం చలాయిస్తూ వుంటారు. అందుకే యీ లోకంలో ఆనందం అనేది లేదు; అందుకోసమే మీరు పెరిగి పెద్దవారవుతున్నకొద్దీ యివన్నీ చూసి, అవగాహన చేసుకొని, ప్రేమ అంటే ఏమిటో కనుగొనడానికి సాధ్యమవుతుందా అనేది మీరే స్వయంగా తెలుసుకోవడం చాలా

ముఖ్యం. మీకు గొప్ప హోదా వుండవచ్చు, ఒక అందమైన యిల్లు, ఒక రమణీయమైన తోట, దుస్తులు వుండవచ్చు, మీరు ప్రధానమంత్రి అయిపోవచ్చు; అయితే ప్రేమ లేనప్పుడు వీటన్నింటిలో వేటికీ అర్థం లేదు.

కనుక, యిప్పుడే మీరు తెలుసుకోవడం ఆరంభించాలి – పెద్దయేదాకా ఆగడం కాదు – అప్పుడు మీరు అసలే తెలుసుకోలేరు. మీ తల్లితండ్రులతో, మీ టీచర్లతో, మీ గురువులతో మీ సంబంధ బాంధవ్యాల విషయంలో మీ యధార్థమైన భావాలు ఏమిటి అనేది మీరు యిప్పుడే తెలుసుకోవాలి. 'ప్రేమ' అనే మాటను, అసలు ఏ మాటను అయినా సరే, మీరు కేవలం విని, ఆమోదించకూడదు. ఆ మాటల అర్థం వెనకకు వెళ్ళి, అసలు వాస్తవం ఏమిటి అని చూడాలి. వాస్తవం అంటే మీరు యథార్థంగా ఏమి భావిస్తున్నారో అది; అంతేకాని, మీరు ఏ విధంగా భావించాలని అందరూ అంటారో అది కాదు. యథార్థంగా మీలో అసూయ, ఆగ్రహం వున్నప్పుడు, "నాలో అసూయ వుండకూడదు, నేను ఆగ్రహం తెచ్చుకోకూడదు" అని మీరు అనడం కేవలం మీలో వున్న ఒక యిచ్ఛను తెలుపుతుంది తప్ప దానిలో వాస్తవం వుండదు. ప్రధానమైన సంగతి ఏమిటీ అంటే, ఆ క్షణంలో ఏ విధంగా భావిస్తున్నదీ చాలా చిత్తశుద్ధితో, చాలా సుస్పష్టమైన ఖచ్చితత్వంతో చూడటం; మీరు అసలు ఎట్లా భావించవలసిందీ లేదూ ఎప్పుడో భవిష్యత్తులో ఒకరోజున మీరు ఎట్లా భావించబోతున్నారో అనే ఒక ఆదర్శాన్ని జొప్పించకుండా చూడటం; అట్లా చూసినప్పుడే యీ విషయంలో మీరు ఏదయినా చర్య తీసుకోగలుగుతారు. అంతే తప్ప "నేను నా తల్లితండ్రులని ప్రేమించాలి, నేను నా టీచర్లను ప్రేమించాలి" అని వూరికే అనడంలో అర్థంలేదు, అవును కదూ? మీ లోపల వున్న మనోభావాలు దీనికి పూర్తిగా విరుద్ధంగా వుంటాయి కాబట్టి; అందుకే యీ మాటలు, వాటి వెనకాల మీరు దాగి వుండటానికి ఒక తెర వంటివి అవుతాయి.

కనుక, పదాలకు వాడుకలో వున్న అర్థాన్ని అధిగమించి చూడటం తెలివిగల లక్షణం కాదూ? 'కర్తవ్యం', 'బాధ్యత', 'దైవం', 'ప్రేమ' వంటి పదాలు పారంపర్యమైన అలవాటుగ వస్తున్న ఒక అర్థాన్ని సేకరించి పెట్టుకున్నాయి; తెలివిగల వ్యక్తి, నిజమయిన విద్యావంతుడు యీ పదాలకు వున్న సాంప్రదాయిక అర్థాన్ని అధిగమించి చూస్తాడు. ఉదాహరణకి, ఒకరు తనకి దేవునిలో నమ్మకం లేదు అని అన్నారనుకోండి, మీరు అవాక్కయిపోతారు. అవరూ? "అమ్మయ్యో! ఎంత ఘోరం!" అని అంటారు. ఎందుకంటే, మీకు దేవునిలో నమ్మకం వున్నది కాబట్టి – కనీసం వున్నదని మీరు అనుకుంటారు కాబట్టి. అయితే యీ నమ్మకం, అపనమ్మకం అనే వాటికి వున్న అర్థం చాలా స్వల్పం.

అన్నింటికంటే ప్రధానమయిన సంగతి ఏమిటంటే, మీరు 'ప్రేమ' అన్న పదం వెనుకకు వెళ్ళి, యథార్థంగా మీ తల్లిదండ్రులని మీరు ప్రేమిస్తున్నారా, మీ తల్లిదండ్రులు యథార్థంగా మిమ్మల్ని ప్రేమిస్తున్నారా అన్నది గ్రహించడం. మీరు, మీ తల్లిదండ్రులు నిజంగానే ఒకర్నొకరు ప్రేమిస్తున్నట్లయితే యీ లోకం పూర్తిగా భిన్నమయిన మరొక తీరులో వుండి వుండేదని గట్టిగా చెప్పవచ్చు. అప్పుడు

యుద్ధాలు వుండవు, ఆకలి చావులు వుండవు, వర్గభేదాలు వుండవు. ధనికులు వుండరు, పేదవారు వుండరు. చూడండి, ప్రేమభావం అనేది లేకుండా సమాజాన్ని ఆర్థికంగా సంస్కరించాలని ప్రయత్నిస్తాం, అంతా సవ్యపరచాలని చూస్తాం; కాని, మన హృదయాల్లో ప్రేమభావం లేనంతకాలం సంఘర్షణ, దుర్భర వేదనలనుండి విముక్తి పొందిన సమాజ వ్యవస్థని సాధించలేము. అందువల్లనే యీ విషయాలన్నీ చాలా జాగ్రత్తగా యోచించాలి; అప్పుడే బహుశ మనం ప్రేమ అంటే ఏమిటో తెలుసుకోగలుగుతాం.

ప్రశ్న: లోకంలో దుఃఖం, బాధ ఎందుకు వున్నాయి?

కృష్ణమూర్తి: ఆ అబ్బాయికి యీ మాటల అర్థం ఏమిటో తెలుసునా అని అనుకుంటున్నాను. కాళ్ళు విరిగిపోయేటంత పెద్ద బరువులు మోస్తూవున్న గాడిదనీ, ఏడుస్తూ వున్న తనలాంటి ఒక అబ్బాయిని, ఒక తల్లి తన పాపని కొడుతూ వుండటాన్ని అతను బహుశ చూసి వుంటాడు. పెద్దవాళ్ళు ఒకరితో ఒకరు కలహించుకోవడం కూడా అతను చూశాడేమో! మృత్యువు అనేది కూడా వున్నది, శవాన్ని దహనం చేయడానికి తీసుకొని పోవడం చూసివుంటాడు. బిచ్చగాడు వున్నాడు, దారిద్ర్యం, రోగాలు, వృద్ధాప్యం వున్నాయి. దుఃఖం వున్నది, బాహ్యంగానే కాదు, మన లోపల, అంతర్గతంగానూ వున్నది. అందుకని అతను అడుగుతున్నాడు, "దుఃఖం ఎందుకున్నది?" అని. మీకు కూడా తెలుసుకోవాలని లేదూ? మీరు మీ దుఃఖానికి కారణం ఏమిటి అని ఎప్పుడూ ప్రశ్నించుకోలేదా? అసలు దుఃఖం అంటే ఏమిటి, అది ఎందుకు కలుగుతున్నది? నేను ఒకటి కావాలని కోరుకొని, అది పొందలేకపోతే నాకు చాలా బాధ కలుగుతుంది; నాకు చాలా చీరెలు కావాలని, చాలా డబ్బు కావాలని, లేదూ నేను చాలా అందంగా వుండాలనీ కోరుకుని, నేను కోరుకున్నవి పొందలేకపోతే, నాలో వ్యాకులత కలుగుతుంది. నేను ఒక వ్యక్తిని ప్రేమించాలని కోరుకొని, ఆ వ్యక్తి నన్ను ప్రేమించకపోతే నాలో తిరిగి అటువంటిదే బాధ మొదలవుతుంది. మా నాన్న చనిపోతారు, నేను దుఃఖంలో మునిగిపోతాను. ఎందుకు?

మనం కావాలని కోరుకున్నవి పొందలేకపోతే మనకు ఎందుకు వ్యాకులత కలుగుతుంది? మనం కావాలని కోరుకున్నవి మనం తప్పక పొంది తీరాలని ఎందుకు అనుకోవాలి? అది మన జన్మహక్కు అని మనం అనుకుంటాం, అనుకోమూ? లక్షలాది ప్రజలకు వారి కనీస అవసరాలు కూడా తీరకుండా వున్నప్పుడు, మనం కావాలని కోరుకుంటున్నవి మనకు ఎందుకు దొరకాలి అని ఎప్పుడయినా మనలో మనం ప్రశ్నించుకున్నామా? అదీకాక అసలు వీటిని ఎందుకు కోరుకుంటున్నాం? మనకు కావలసినవి ఆహారం, దుస్తులు, యిల్లు (ఆశ్రయం); కాని, వీటితో మనం తృప్తి చెందం. అంతకంటే ఎక్కువగా ఏవో కావాలి. అన్నింటిలో విజయప్రాప్తి కావాలి, అందరూ మనల్ని గౌరవించాలి, ప్రేమించాలి, మన పెద్దరికాన్ని ఆమోదించాలి, మనకి అధికారబలం వుండాలి, మనం కవులుగానో, మహా పురుషులుగానో, గొప్ప

వక్తలుగానో ప్రఖ్యాతి సంపాదించాలి, మనం ప్రధానమంత్రులు, అధ్యక్షులు అవాలి. ఎందుకు? ఈ సంగతి ఎప్పుడయినా ఆలోచించారా? ఎందుకు యివన్నీ కావాలని కోరుకుంటున్నాం?

అట్లాగని మనం యిప్పుడు వున్న స్థితితో మనం సంతృప్తి చెంది వూరుకోవాలని కాదు. నా అర్థం అదికాదు. అది చాలా అసహ్యాకరం, మూర్ఖత్వం. అయితే, మరింత, మరింత, మరింత కావాలనే యీ నిరంతరమైన తనివి తీరని అత్యాశ ఏమిటి? ఈ అత్యాశ మనలో అసంతుష్టి, వెలితి వున్నాయని తెలుపుతుంది. అయితే అవి వేటి కారణంగా? మనం యిప్పుడు వున్న స్థితిగతుల కారణంగానా? నేను యిప్పుడు యిట్లాగ వున్నాను, యిది నాకు యిష్టం లేదు, నేను మరొకలాగా వుండాలి. మరొక కొత్తకోటునో, కొత్త చీరనో ధరిస్తే నేను మరింత అందంగా వుంటానని అనుకుంటున్నాను; కనుక అది నాకు కావాలి. అంటే అర్థం, నేను వున్న స్థితిలో నాకు అసంతృప్తిగా వుంది, మరిన్ని దుస్తులు, మరింత అధికారబలం మొదలయినవి ఆర్జించి పెట్టుకుంటే యీ వెలితి అనిపించే భావం నుండి తప్పించుకోగలనని నేను అనుకుంటున్నాను. అయితే, యీ అసంతృప్తి అనేది యింకా అట్లాగే వుండిపోతుంది; అవును కదూ? దానిని దుస్తులు, అధికారబలం, కార్లు అనే వాటితో కప్పి, ముసుగు వేసి వుంటాను, అంతే.

కనుక, మనం అంటే ఏమిటి అనే విషయం అవగాహన చేసుకోవడం ఎట్లాగ అనేది తెలుసుకోవాలి. సంపాదించిన వస్తు సంచయంతో, అధికార బలంతో, పదవితో మనల్ని మనం కప్పిపుచ్చుకోవడం వట్టి నిరర్థకరమైన సంగతి. ఎందుకంటే, మన బాధ యింకా అట్లాగే వుండిపోతుంది కాబట్టి. ఇది అర్థం చేసుకన్నాక, అసంతుష్టుడయిన వ్యక్తి, దుఃఖభరితుడయిన వ్యక్తి గురువుల వద్దకు పారిపోడు; ఆర్జించిన వస్తుసంచయంలో, అధికారంలో మునిగిపోయి, దాగివుందామనుకోడు; అట్లా చేయకపోగా, తన దుఃఖానికి వెనకాల అసలు ఏమున్నదో తెలుసుకోవాలనుకుంటాడు. మీ దుఃఖం వెనకాల ఏముంది అని మీరే స్వయంగా చూసుకున్నట్లవుతే, మీరు చాలా అల్పులని, మీలో ఖాళీతనం, లోపాలు వున్నాయనీ, ఏదో సాధించడం కోసం, ఏదో అయిపోవడం కోసం మీరు ప్రయాస పడుతున్నారనీ మీకే తెలుస్తుంది. ఇదే, యీ పోరాటమే – సాధించాలనీ, మరొకటి అయిపోవాలని ప్రయాస పడటమే దుఃఖానికి కారణం. యథార్థంగా మీరు అంటే ఏమిటి అన్నది అవగాహన చేసుకోవడం ఆరంభించి, లోతుగా లోలోపలకు వెళ్ళి పరికించారంటే, అప్పుడు జరిగేది చాలా విభిన్నమయినదని మీరు తెలుసుకుంటారు.

**ప్రశ్న: ఒక మనిషి ఆకలితో మాడుతున్నప్పుడు నేను అతనికి సహాయం చేయాలని అనుకుంటాను. ఇది ఆకాంక్ష అవుతుందా, ప్రేమ అంటారా?**

**కృష్ణమూర్తి:** మీరు సహాయం చేయడానికి వెనకాల వున్న ప్రేరక హేతువుమీద అదంతా ఆధారపడి వుంటుంది. నేనున్నది పేదవారికి సహాయం చేయడం కోసమే అని ప్రకటించి రాజకీయ నాయకుడు కొత్త ఢిల్లీ చేరతాడు, పెద్ద

బంగళాలో నివసిస్తాడు, దర్పంగా తిరుగుతాడు. అది ప్రేమభావమేనా? మీకు అర్థమవుతున్నాదా? అది ప్రేమా? చెప్పండి!

**ప్రశ్న: నా ఉపకార గుణంతో అతని ఆకలిబాధని తీర్చివేస్తే అది ప్రేమ కాదా?**

**కృష్ణమూర్తి:** అతను ఆకలితో బాధపడుతున్నాడు, మీరు అతనికి ఆహారం యిచ్చి సహాయం చేస్తారు. అది ప్రేమ అవుతుందా? మీరు అతనికి సహాయం చేయాలని ఎందుకు అనుకుంటారు? అతనికి సహాయం చేయాలనే కోరిక తప్ప మరి యే యితర కారణంగాని, ప్రయోజనంగాని వెనకాల లేవా? దీనివలన మీకు వేరే ఏ లాభమూ చేకూరదా? బాగా ఆలోచించండి, వూరికే 'అవును' అనీ, 'కాదు' అనీ అనకండి. దీనినుండి మీరు ఒక ప్రయోజనం పొందాలని ఆశిస్తున్నట్లయితే, – ఆంతరికమయిన లేదా బాహ్యమైన ప్రయోజనం ఆశిస్తుంటే, మీరు అతనిమీద ప్రేమతో చేసినట్లు కాదు. పదిమందిలో పేరు తెచ్చుకోవాలని కాని, కొత్త ఢిల్లీ చేరుకోవడానికి మీ స్నేహితులు దోహదం చేస్తారనే ఆశతో గానీ, మీరు అతనికి ఆహారం యిచ్చివుంటే అప్పుడూ అది ప్రేమ అనిపించుకోదు, అవునా? అయితే మీరు అతనిని ప్రేమిస్తే, ఏ విధమయిన అంతిమ ప్రయోజనం పొందాలనే ఆలోచన లేకుండా, ప్రతిఫలం ఏమీ కోరకుండా, మీరు అతనికి ఆహారం యిస్తారు. ఆహారం యిచ్చాక అతను మీకు కృతజ్ఞత చూపకపోతే మీరు నొచ్చుకుంటారా? నొచ్చుకుంటే మీకు అతనిపై ప్రేమభావం లేనట్లే. అతను మీతోనూ, ఊరి ప్రజలతోనూ మీరు మహా గొప్ప మనిషి అని చెప్తే, ఆ పొగడ్తకి మీరు చాలా పొంగిపోతే, దానికి అర్థం మీరు మీ గురించే ఆలోచిస్తున్నారు అని; అప్పుడు నిశ్చయంగా యిందులో ప్రేమభావం ఏమీ లేనట్లే. కాబట్టి మన ఉపకార గుణం ద్వారా ఏదో ఒక రకమయిన ప్రయోజన సిద్ధి పొందుతున్నామా, ఆకలిగా వున్నవారికి ఆహారం యివ్వడానికి ఏ హేతువు మనల్ని ప్రేరేపిస్తున్నది, అనే విషయాలు గ్రహించడంలో మనం చాలా జాగరూకంగా వుండాలి.

**ప్రశ్న: నేను యింటికి వెళ్ళాలనుకుంటాను, ప్రిన్సిపల్ (ప్రధానాధ్యాపకుడు) 'వీల్లేదు' అంటారు. ఆయన్ని ధిక్కరిస్తే దాని ఫలితాలు నేను ఎదుర్కోవలసి వస్తుంది. ప్రిన్సిపల్ మాటకు విధేయత చూపుతే, నిరాశతో నా గుండె పగిలిపోతుంది. నేను ఏం చేయాలి?**

**కృష్ణమూర్తి:** అంటే యీ విషయం మీరు ప్రిన్సిపల్‌తో మాట్లాడి, పరిష్కరించుకోలేనిది అంటారా? అతనికి మీ మనసులో వున్నది ఏమిటో చెప్పి, మీ సమస్యని వివరించలేరా? అతను సవ్యమైన ప్రిన్సిపల్ కనుక అయితే, అతనిలో మీరు విశ్వాసం వుంచి, ఆయనతో మీ సమస్యను చర్చించాలి. అప్పటికీ ఆయన మీరు యింటికి పోవడానికి వీల్లేదు అని అంటే, ఆయన మూర్ఖపు పట్టుదల మీద వున్నారనే అనుకోవాలి; అంటే ఆ ప్రిన్సపలులో ఏదో లోపం వున్నట్లే అర్థం; కాని, 'వద్దు' అనడానికి సవ్యమయిన కారణాలు కనుక ఆయనకి వుంటే, అవి మీరు

తెలుసుకోవాలి. కాబట్టి, యిద్దరిలో పరస్పర నమ్మకం వుండాలి. మీకు ప్రిన్సిపల్‌లో నమ్మకం వుండాలి, ప్రిన్సిపల్‌కు మీలో నమ్మకం వుండాలి. జీవితంలోని సంబంధ బాంధవ్యాలు ఏకపక్షంగా మాత్రమే సాగేవి కావు. మీరు ఎట్లా ఒక మనిషో, అట్లాగే ప్రిన్సిపలూ ఒక మనిషే. మనిషి కనుక ఏవయినా పొరబాట్లు చేయవచ్చు. కాబట్టి కలిసి చర్చించుకోవడానికి యిద్దరూ సుముఖులై వుండాలి. మీకు యింటికి వెళ్ళాలని చాలా చాలా అనిపించవచ్చు. కాని, అంతమాత్రంతోనే సరిపోదు; మీ తల్లిదండ్రులు ప్రిన్సిపల్‌కి మిమ్మల్ని యింటికి రానివ్వ వద్దని వ్రాశారేమో! ఇది రెండువైపుల నుండీ విచారణ చేయవలసిన అంశం, అవును కదూ? మీరు నొచ్చుకోకూడదు, మీకు అన్యాయం జరిగిందని అనుకోకూడదు, మిమ్మల్ని నిర్దయతో చూస్తున్నారనుకోకూడదు; ప్రిన్సిపల్ యిన్ని విషయాలు చూసుకోవాలి. మీకు ప్రిన్సిపల్‌లో నమ్మకం వుండి, ప్రిన్సిపల్‌కి మీలో నమ్మకం వున్నప్పుడే యిదంతా జరుగుతుంది. మరో మాటలో చెప్పాలంటే, ప్రేమభావం వుండాలి; విద్యాలయం సమకూర్చవలసినది యిటువంటి వాతావరణమే.

ప్రశ్న: మనం పూజ ఎందుకు చేయకూడదు?

**కృష్ణమూర్తి:** పెద్దవాళ్ళు పూజ ఎందుకు చేస్తారో మీరు కనుక్కున్నారా? వాళ్ళు మరొకరి వరవడిని అనుకరిస్తున్నారు, అంతే కదూ? మనలో అపరిపక్వత ఎంత ఎక్కువగా వుంటే అంత ఎక్కువగా మరొకరి వరవడిని అనుకరించాలని కోరుకుంటాం. ప్రజలు యూనిఫామ్‌లు అంటే ఒకే మాదిరిగా వుండే దుస్తులు చాలా యిష్టపడతారనే విషయం మీరు గమనించారా? కాబట్టి, 'పూజ' ఎందుకు చేయకూడదు అని అడగడానికి ముందుగా, మీరు మీ పెద్దవారిని వారు పూజ ఎందుకు చేస్తున్నారో అడగండి. వాళ్ళు 'పూజ' చేయడానికి మొట్టమొదటి కారణం – అది ఒక సంప్రదాయం కాబట్టి; వారి తాతలు చేస్తుండేవారు. రెండోది, శబ్దాలను పునశ్చరణ చేయడం వలన వారికి ఒక విధమయిన శాంతి లభిస్తుంది. ఇది మీకు అర్థమవుతున్నదా? శబ్దాలు పదే పదే, మళ్ళీ మళ్ళీ ఉచ్చరిస్తూ వుంటే మనసు మందకొడిగా అవుతుంది. అది మీకు ఒక విధమయిన ప్రశాంతంగా వున్న భావాన్ని కలిగిస్తుంది. ముఖ్యంగా సంస్కృత పదాల ఉచ్చారణలో కొన్ని ప్రత్యేకమయిన కంపనలు కలుగుతాయి, అవి మీకు ఒక మహా ప్రశాంత భావాన్ని కలుగచేస్తాయి. ఇతరులందరూ పూజ చేస్తున్నారు అనే కారణం వలన కూడా పెద్దవాళ్ళు పూజ చేస్తూ వుంటారు; మీరు చిన్నవయసులో వున్నారు కాబట్టి వారిని అనుకరించాలని కోరుకుంటారు. ఎవరో ఒకరు పూజ చేయడం చాలా మంచిది అని చెప్పడం వలన మీరు పూజ చేయాలని కోరుకుంటున్నారా? కొన్ని శబ్దాలు పునరుక్తి చేస్తుంటే ఆహ్లాదకరమైన ఒక పారవశ్యపు అనుభూతి కలుగుతుంది కాబట్టి మీరు పూజ చేయాలని కోరుకుంటున్నారా? మీరు ఏ పనయినా చేసే ముందు, ఆ పనిని ఎందుకు చేయాలని కోరుకుంటున్నారో మీరు తెలుసుకోవద్దూ? లక్షలాది మంది ప్రజలకి పూజ చేయడంలో నమ్మకం వుంటే వుండవచ్చుగాక, దాని అసలయిన ప్రాధాన్యం ఏమిటో అన్వేషించడానికి మీ బుద్ధి ఉపయోగించవద్దూ?

చూడండి, కేవలం సంస్కృత శబ్దాలను పునరుక్తి చేయడం, కొన్ని సంజ్ఞలు, సైగలు చేయడం అనేవి దైవం ఎవరు, సత్యం ఏమిటి అన్నవి కనుగొనడానికి మీకు ఏమాత్రం వుపకరించవు. అవి కనుగొనాలంటే మీకు ధ్యానం చేయడం తెలిసి వుండాలి. అయితే, ధ్యానం పూర్తిగా మరొక విషయం – పూజ చేయడం వంటిది కానేకాదు. లక్షలాది మంది ప్రజలు పూజలు చేస్తున్నారు, లోకంలో సుఖసంతోషాలు ఎక్కువయాయా? అటువంటి వారిలో సృజనాత్మకత వున్నదా? సృజనాత్మకత కలిగివుండటం అంటే, అంతఃస్ఫూర్తితో నిండివుండటం, ప్రేమభావం, దయ, సానుభూతి, ఉదారభావం వీటితో నిండుగా వుండటం. మీరు చిన్న వయసులోనే పూజలు ఆరంభించి, పదే పదే పూజలు చేస్తూవుంటే, మీరు యంత్రాలలాగా తయారవుతారు. ప్రశ్నించడం, సందేహించడం, లోతుగా తరచి చూడటం మీరు ఆరంభిస్తే, అప్పుడు బహుశ మీకు ధ్యానం చేయటం ఎట్లా అనేది తెలుస్తుంది. ధ్యానం చేయడం – అది సవ్యంగా చేయడం కనుక మీకు తెలుస్తే, అంతకంటె మహోన్నతమైన సౌభాగ్యం మరొకటి లేదు.

★ ★ ★

# అధ్యాయం 9

సంక్లిష్ట పూరితమయిన ప్రేమ అనే సమస్యను మనం అవగాహన చేసుకోవాలంటే, అంతగానూ సంక్లిష్టమ్మయిన సమస్య, మనం మనసు అని పిలుస్తామే, దానిని అవగాహన చేసుకుంటేనే తప్ప సాధ్యం అవుతుందని నేను అనుకోను. చాలా చిన్నవయసులో వున్నప్పుడు మనలో ఎంత కుతూహలం వుంటుందో మీరు గమనించారా? మనకి అన్నీ తెలుసుకోవాలని వుంటుంది; పెద్దవాళ్ళ కంటే ఎన్నో ఎక్కువ విషయాలను మనం చూడగలుగుతాం. మనం కనుక జాగ్రతంగా వున్నట్లయితే, పెద్దవారు గమనించనైనా గమనించని విషయాలు ఎన్నింటినో మనం పరిశీలిస్తాం. చిన్నవయసులో వున్నప్పుడు మన మనసు మరింత ఎక్కువ జాగరూకంగాను, ఎక్కువ కుతూహలం కలదిగానూ, తెలుసుకోవాలని ఎక్కువ అపేక్షతోనూ వుంటుంది. అందువల్లనే మనం లెక్కలు, భూగోళశాస్త్రం వంటి వాటిని తేలిగ్గా నేర్చుకోగలుగుతాం. పెద్దవాళ్ళం అవుతున్నకొద్దీ మనసు ఎక్కువెక్కువగా కరడుగట్టుకొనిపోతూ వుంటుంది, భారంగానూ, మందకొడిగానూ తయారవుతూ వుంటుంది. చాలామంది పెద్దవారికి అకారణమయిన దురభిప్రాయాలుండటం మీరు గమనించారా? వారి మనసుకు కవాటాలు తెరచి వుండవు; మూసుకొనిపోయి వుంటాయి. ప్రతిదానినీ ఒక స్థిరపడిపోయిన దృక్పథం నుండే పరికిస్తారు; ప్రస్తుతం మీరు చిన్నవయసులో వున్నారు; మీరు కనుక చాలా జాగ్రత్తగా కనిపెట్టి వుండకపోతే మీ మనసు కూడా అట్లాగే తయారవుతుంది.

మరి యిప్పుడు, మనసును అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం కదూ? మీరు క్రమక్రమంగా మందకొడిగా తయారవడానికి బదులు, మెత్తగా, విరుగకుండా వుండే వెదురుబద్ద వంటి వంగే గుణం కలిగి, త్వరత్వగా సర్దుకుపోయే సామర్ధ్యం, అసాధారణమైన అంతఃస్ఫూర్తి, జీవితపు ప్రతి ఒక్క శాఖలోను గాఢమయిన పరిశోధన, అవగాహన కలిగివుండగలరేమో తెలుసుకోవడం కూడా ముఖ్యం కదూ? ప్రేమభావపు తీరు అవగాహన చేసుకోవడం కోసం మనసు తీరుతెన్నులు మీరు తప్పక తెలుసుకోవద్దూ? ఎందుకంటే, ప్రేమను ధ్వంసం చేసేది మనసే. కేవలం చాతుర్యం, గడుసుదనం వున్న మనుష్యులకు ప్రేమ అంటే ఏమిటో తెలియదు; వాళ్ళ మనసులు చురుకుగా వుండవచ్చు, కాని అదంతా పైపైన మాత్రమే; వారు ఎప్పుడూ పైపై ఉపరితలంలోనే జీవిస్తుంటారు, అయితే, ప్రేమ ఉపరితలంమీద ఉనికి ఏర్పరచుకుని వుండేది కాదు.

మనసు అంటే ఏమిటి? అంటే నా అర్థం, నరాలకు సంబంధించిన రకరకాల ప్రతిస్పందనల ద్వారా ప్రతిచర్య చూపే భౌతిక జీవాంగం అయిన మెదడు అని

మాత్రం కాదు; దీనిని గురించి ఏ జీవతత్త్వ శాస్త్రవేత్త అయినా చెప్పగలడు. అదికాదు. మనం యిప్పుడు తెలుసుకోబోయేది మనసు అంటే ఏమిటి అనేది. 'నేను ఆలోచిస్తాను', 'ఇది నాది', 'నాకు నొప్పి తగిలింది', 'నాకు అసూయ', 'నేను ప్రేమిస్తున్నాను', 'నేను ద్వేషిస్తున్నాను', 'నేను భారతీయుడిని', 'నేను ముస్లిముని', 'నేను యిది నమ్ముతున్నాను', 'నాకు అందులో నమ్మకం లేదు', 'నాకు తెలుసు', 'మీకు తెలియదు', 'నేను గౌరవిస్తాను', 'నేను అసహ్యించుకుంటాను', 'నాకు కావాలి' అని అంటూవుండే మనసు – ఇది అసలు ఏమిటి? మీరు ఇప్పుడే కనుక మనసు అని మనం పిలిచే యీ ఆలోచనా ప్రక్రియను అంతా అవగాహన చేసుకొని, దానిని క్షుణ్ణంగా సన్నిహితంగా తెలుసుకొనడం ఆరంభించకపోతే, దానిని గురించి మీ లోపల మీరు పూర్తిగా ఎరుకతో వుండకపోతే, మీరు పెద్దవారవుతున్నకొద్దీ క్రమక్రమంగా కఠినమయిపోయి, కరడుగట్టుకొనిపోయి, మందకొడిగా తయారై, ఒక మాదిరి అయిన ఆలోచనా విధానంలో స్థిరపడిపోతారు.

మనసు అని మనం పిలిచే యీ పదార్థం ఏమిటి? అది మన ఆలోచనల తీరు, అవును కదూ? నేను మాట్లాడుతున్నది మీ అందరి మనసు గురించి, మరెవరి మనసు గురించో కాదు – మీరు ఎట్లా ఆలోచిస్తారు, ఎట్లా భావిస్తారు, మీరు చెట్లవైపు, చేపలు పట్టే వారివైపు ఏ విధమైన దృష్టితో చూస్తారు, ఒక పల్లెమనిషిని ఏ విధంగా పరిగణిస్తారు అన్నవి. మీరు పెరిగి పెద్దవారవుతున్నకొద్దీ మీ మనసు క్రమక్రమంగా వంకరటింకరగా అవడమో, ఒక మాదిరి అయిన విధానంలో స్థిరపడి పోవడమో చేస్తుంది. మీరు ఒకటి కావాలని కోరుకుంటారు, దానికోసం ఆరాటపడతారు; మీరు మీరుగా కాకుండా మరొకలాగా వుండాలని, మరొకటి అవాలని కోరుకుంటారు; ఈ కోరిక ఒక నమూనాను తయారు చేస్తుంది. అంటే, మీ మనసు ఒక నమూనాను తయారుచేసి, అందులో తను చిక్కుకుంటుంది. మీ కోరిక మీ మనసును ఘనీభవింపజేస్తుంది, కరడుగట్టిస్తుంది.

ఉదాహరణకి, మీరు బాగా డబ్బున్న శ్రీమంతులు అవాలని కోరుకుంటారనుకుందాం. శ్రీమంతులు అవాలనే కోరిక ఒక నమూనాను సృష్టిస్తుంది, మీ ఆలోచనలు దానిలో చిక్కుకొనిపోతాయి. మీరు ఆ నమూనా ప్రకారంగానే ఆలోచించగలుగుతారు. అంతే తప్ప దానిని అధిగమించి మీరు పోలేరు. కాబట్టి మీ మనసు మెలమెల్లగా కరడుగట్టుకొని పోతుంది. బాగా కఠినమవుతుంది, మందకొడిగా తయారవుతుంది. లేదూ మీకు ఏదయినా ఒక విషయంలో నమ్మకం వుంటే – దైవంలోనో, కమ్యూనిజంలోనో, ఒక ప్రత్యేకమైన రాజకీయ వ్యవస్థలోనో నమ్మకం వుంటే – ఆ నమ్మకమే ఒక నమూనాను తయారుచేస్తుంది. ఎందుకంటే అది, ఆ నమ్మకం మీ కోరిక యొక్క ఫలితమే; మీ కోరిక ఆ నమూనా గోడలను మరింత దృఢపరుస్తుంది. క్రమక్రమంగా మీ మనసుకు త్వరగా సర్దుకొని పోవడము, లోతుగా పరిశీలించడం, చక్కగా స్పష్టంగా చూడగలగడం చేతకావు. ఎందుకంటే, మీలోపలి మీ స్వీయ ఆలోచనల కీకారణ్యంలో మీరు చిక్కుకొని పోయివుంటారు.

కనుక, మనసు అని మనం పిలిచే యీ ప్రక్రియను పరిశోధించడం

ఆరంభించేవరకు, మన లోపలి ఆలోచనల తీరులకు మనం సన్నిహితంగా వెళ్ళి అవగాహన చేసుకోనంతవరకు, ప్రేమ గురించి తెలుసుకోవడం మనకి సాధ్యం కాదు. మన మనసులు కొన్ని కోరికలను ప్రేమ ద్వారా తీర్చుకోవాలని కోరుకుంటున్నంత వరకు, ప్రేమ ఒక నిర్దిష్టమైన పద్ధతిలోనే నడవాలని ఆంక్షలు పెట్టుకున్నంతవరకు, ప్రేమ అనేదే వుండదు. ప్రేమ ఎట్లా వుండాలి అనే విషయం మనం కల్పన చేసుకుంటున్నప్పుడు, దానికి కొన్ని ఉద్దేశ్యాలు అంటగట్టున్నప్పుడు, ప్రేమకు సంబంధించిన ఆచరణలో ఒక నమూనాను క్రమక్రమంగా తయారు చేస్తాం; అయితే అది ప్రేమ కాదు; ప్రేమ అంటే యిట్లా వుండాలి అని మనం ఏర్పరుచుకున్న ఒక అభిప్రాయం మాత్రమే.

ఉదాహరణగా యిది చూద్దాం. నాకు నా స్వంతమైన ఒక భార్య లేదా ఒక భర్త వున్నారు – మీకు మీది అని చెప్పుకునే చీరగాని కోటుగాని వున్నట్లు. ఇతరులు ఎవరయినా మీ కోటును అపహరిస్తే మీకు ఆందోళనగా, చికాకుగా, కోపంగా వుంటుంది ఎందుకు? ఎందుకంటే, ఆ కోటుని మీ స్వంత ఆస్తిగా మీరు భావిస్తున్నారు కనుక; అది మీది; దానిని కలిగివుండటం వల్ల మీరు గొప్ప సంపద వున్నట్లు భావిస్తుంటారు, అవును కదూ? ఎక్కువ దుస్తులు వుండటం వలన బాగా సంపద కలిగిన, వున్నవారుగా మీరు భావించుకుంటారు – భౌతికంగానే కాదు, అంతర్గతంగా కూడా; మరొకరు మీ కోటును అపహరించడం వల్ల మీరు చిరాకు పడతారు, ఎందుకంటే, మీ అంతర్గతంలో వున్న సంపన్నతా భావం, మీ స్వంతం అనే భావం మీకు లేకుండా చేసినందుకు.

ఈ స్వంతానికి కలిగివుండటం అనే భావం ప్రేమ విషయంలో ఒక అవరోధాన్ని లేక అడ్డుగోడను సృష్టిస్తుంది, అవునా కాదా? నేను మిమ్మల్ని స్వంతం చేసుకుంటే, నాదిగా చేసుకుంటే, అది ప్రేమ అవుతుందా? ఒక కారుని, ఒక కోటుని, ఒక చీరను స్వంతం చేసుకున్నట్లు మిమ్మల్ని స్వంతం చేసుకోవడంలో నాకు చాలా తృప్తిగా వుంటుంది; నేను ఆ భావం మీద ఆధారపడతాను; అంతర్గతంగా యిది నాకు చాలా ముఖ్యం. ఈ స్వంతం చేసుకున్న భావం, మరొకరిని తమ స్వంతానికి కలిగివుండే భావం, మరొకరిపై మానసికంగా ఆధారపడివుండటం – దీనినే మనం 'ప్రేమ' అని అంటున్నాం. దీనిని పరీక్షించినట్లయితే, మనసు యీ 'ప్రేమ' అనే పదం వెనుక స్వంతం చేసుకోవడం అనే దానిలో ఒక సంతృప్తిని పొందుతున్నది అని మనం గ్రహించవచ్చు. మీకు చాలా అందమైన చీరలు వున్నప్పుడు కాని, చక్కని కారు కాని, విశాలమయిన యిల్లుకాని వున్నప్పుడు, అది మీదే, మీ స్వంతమే అనే భావన మీకు అంతర్గతంగా గొప్ప సంతృప్తిని ఎట్లా యిస్తుందో యిదీ అటువంటిదే.

కనుక, కోరికలు కోరడం ద్వారా, కావాలనుకోవడం ద్వారా మనసు ఒక నమూనాను తయారు చేసుకుంటుంది, ఆ నమూనాలోనే చిక్కుకొని పోతుంది; ఆ పైన అది, అంటే మనసు అలసటగా, మందకొడిగా, బుద్ధిహీనంగా, ఆలోచనా రహితంగా తయారవుతుంది. ఈ స్వంతానికి కలిగి వుండటం అనే భావానికి 'నేను' 'నాది' అనే భావాలకు కేంద్రం మనసు; 'ఫలానాది నాది', 'నేను చాలా గొప్పవాడిని', 'నేను అల్పుడిని', 'నాకు అవమానం జరిగింది', 'నన్ను ప్రశంసించారు',

'నేను తెలివైన వాడిని', 'నేను చాలా అందగాడిని', 'నేను గొప్పవాడిని అవాలి', 'నేను ఫలానా గొప్పవారి కొడుకుని లేదా కూతురిని' – ఈ 'నేను' 'నాది' అనే భావమే మనసు లోపలి ప్రధాన అంతర్భాగం, అసలు మనసు అదే. నేను చాలా గొప్పవాడిని, చాలా తెలివి గలవాడని, చాలా బుద్ధిహీనుడిని – యింకా యిటువంటి యీ భావాలు మనసుకు, వుండటం ఎక్కువైన కొద్దీ, తన చుట్టూ తాను ఆ విధంగా అడ్డుగోడలు కట్టుకోవడం కూడా ఎక్కువవుతూ వుంటుంది; అట్లా చుట్టూరా మూసుకొని పోయి, మనసు మందకొడిగా తయారవుతుంది. అప్పుడు అది బాధపడుతుంది, మూసుకొని పోయిన చోట బాధ అనివార్యం కాబట్టి. బాధపడుతున్నది కాబట్టి, 'నేను ఏం చేయాలి' అని మనసు అంటుంది. అయితే, వీటి ఎరుక కలిగి వుండటం ద్వారా, జాగ్రత్తగా యోచించడం ద్వారా, యీ చుట్టుగోడలు ఏ విధంగా తయారయాయో ఆ సమగ్ర ప్రక్రియ అంతా అవగాహన చేసుకోవడం ద్వారా యీ చుట్టుగోడలను తొలగించడానికి బదులు మనసు, తిరిగి తనని బంధించి వేసుకొనడానికి బాహ్యమైన మరొకదానిని అంటే మరొక అడ్డుగోడను కట్టుకొనడానికి ప్రయాస పడుతుంది. కనుక, మనసు క్రమక్రమంగా ప్రేమకు అవరోధంగా తయారవుతుంది; మనసు అంటే ఏమిటో అంటే – కార్యాచరణ అంతా ఉద్భవించే లోపలి మూలస్థానం అయిన మన లోపలి ఆలోచనల తీరు అంటే ఏమిటో అవగాహన చేసుకోకుండా ప్రేమ అంటే ఏమిటో మనం కనుగొనడం ఏ మాత్రం సాధ్యం కాదు.

మనసు పోలికలు లేదా సామ్యాసామ్యాలు చూపే ఒక సాధనం కూడా కదూ? పోల్చి చూడటం అంటే ఏమిటో మీకు తెలుసు. "ఇది దానికంటె బాగున్నది" అని అంటారు మీరు; మీకంటే ఎక్కువ అందంగా వున్న మరొకరితోకాని, మీ కంటే తక్కువ తెలివి వున్న వారితో కాని మిమ్మల్ని పోల్చిచూసుకుంటారు. "ఒక సంవత్సరం క్రిందట చూసిన ఒక నది నాకింకా జ్ఞాపకం వున్నది, దీనికంటే అది యింకా చాలా అందంగా వుంటుంది." అని మీరు అన్నప్పుడు పోల్చిచూడటం వుంటుంది. ఆదర్శానికి పరమావధి అని మీరు అనుకుంటున్న ఒక మహాత్ముడితో కాని, ఒక వీరుడితోకాని మిమ్మల్ని మీరు పోల్చిచూసుకుంటారు. ఈ పోల్చి తీర్పులు చేయడం అనేది మనసును మందకొడిగా తయారు చేస్తుంది. ఇది మనసుకు చురుకుదనాన్ని కలిగించదు; విశాలత్వాన్ని, అన్నింటిని గురించి గ్రహించుకునే శక్తిని యివ్వదు.

మీరు ఎప్పుడూ అదే పనిగా పోల్చిచూడటం చేస్తూ వుంటే ఏమవుతుంది? ఒక సూర్యాస్తమయం చూడగానే, వెంటనే వెనుకటి ఒక సూర్యాస్తమయంతో పోల్చినప్పుడు, "ఆ పర్వతం అందంగానే వుంది, అయితే యింతకంటె అందమయిన పర్వతాన్ని రెండేళ్ళ క్రిందట నేను చూశాను" అని మీరు అన్నప్పుడు మీ కళ్ళముందు వున్న సౌందర్యాన్ని మీరు నిజంగా చూడటం లేదన్న మాట! కాబట్టి పోల్చిచూడటం అనేది మీరు సంపూర్ణంగా సందర్శించడాన్ని నిరోధిస్తుంది. మిమ్మల్ని చూసి నేను, "ఇంతకంటే మంచి వ్యక్తిని నేనెరుగుదును" అని అన్నప్పుడు, నేను నిజంగా మీ వైపు పరికించి చూడనట్లే లెక్క, అవునుకదూ? నా మనసు మరోదాని వ్యాపకంతో నిండివుంది. సూర్యాస్తమయాన్ని నిజంగా చూడటం అంటే, అక్కడ

పోల్చిచూడటం అనేది వుండకూడదు; మిమ్మల్ని నిజంగా చూడటం అంటే నేను మిమ్మల్ని మరొకరితో పోల్చిచూడకూడదు. మిమ్మల్ని సంపూర్ణమైన దృష్టితో చూసినప్పుడే, సామ్యాసామ్యాలు చూపి ఏ తీర్పులూ చేయకుండా చూసినప్పుడే, నేను మిమ్మల్ని అవగాహన చేసుకోగలను. మిమ్మల్ని మరొకరితో పోల్చి చూసినప్పుడు నేను మిమ్మల్ని అవగాహన చేసుకోవడం లేదు. మీ గురించి కేవలం ఒక నిర్ణయం చేసి తీర్పు యిస్తున్నాను, మీరు యిటువంటి వారు, అటువంటి వారు అని అంటున్నాను. కాబట్టి పోల్చిచూడటం బుద్ధిహీనమైన పని; ఎందుకంటే, మిమ్మల్ని మరొకరితో పోల్చిచూడటంలో వ్యక్తి గౌరవాన్ని కించపరచడం వుంది. పోల్చిచూడటం అనేది లేకుండా మిమ్మల్ని నేను చూసినప్పుడు నా ధ్యాస, అపేక్ష అంతా పూర్తిగా మిమ్మల్ని అవగాహన చేసుకోవడం మీదే వుంటుంది; పోల్చిచూపడం లేని యీ అపేక్షలోనే నిజమైన తెలివి వున్నది, వ్యక్తిని గౌరవించడం వున్నది.

మనసు పోల్చిచూస్తున్నంత వరకు ప్రేమభావం అనేది వుండదు; అయితే మనసు ఎప్పుడూ పోల్చిచూస్తూనే వుంటుంది, ఎక్కువ తక్కువలు లెక్క వేస్తూ వుంటుంది. మంచీ చెడు నిర్ణయించి తీర్పులు చేస్తూ వుంటుంది; అవును కదూ? అది ఎప్పుడూ బలహీనత ఎక్కడ వున్నదా అని వెతుకుతూనే వుంటుంది; కాబట్టే ప్రేమ భావం లోపిస్తుంది. తల్లిదండ్రులు తమ పిల్లలను ప్రేమిస్తున్నప్పుడు, ఆ పిల్లలను ఒకరితో మరొకరిని పోల్చిచూడరు. మీరు మాత్రం మీకంటె మంచివారితో, మహనీయులతో, ధనవంతులతో మిమ్మల్ని పోల్చిచూసుకుంటారు; మీ ధ్యాస అంతా ఎప్పుడూ మిమ్మల్ని మీరే మరొకరి ప్రక్కన నిలబెట్టి పోల్చి చూసుకోవడం గురించే వుంటుంది; అందులోనే ప్రతిక్షణం మునిగి తేలుతూ వుంటారు. కనుక మీరు మీలో ప్రేమరాహిత్యాన్ని సృష్టించుకుంటారు; దీనివల్ల మనసు మరింతగా పోల్చిచూడటంలో పడిపోతుంది; మరింతగా నాది, నా స్వంతం అనే భావంలో మునిగిపోతుంది. మరింతగా పరాధీనమవుతూ వుంటుంది; ఈ విధంగా ఒక నమూనాను స్థాపించుకొని, అందులో చిక్కుకొని పోతుంది. ఏ విషయాన్ని కూడా నవ్యమైన, సరిక్రొత్త దృక్పథంతో చూడలేదు కాబట్టి మనసు జీవిత సౌగంధాన్నే హరించివేసేస్తుంది; ఈ జీవిత సౌగంధమే ప్రేమ అనేది.

ప్రశ్న: దేవుడిని మనకి ఏమి యివ్వమని అడగాలి?

**కృష్ణమూర్తి:** దైవం గురించి మీకు చాలా ఆసక్తి వున్నట్లున్నది, వున్నది కదూ? ఎందుకు? ఎందుకంటె మీ మనసు దేనికొరకో అడుగుతున్నది, ఏదో కావాలని కోరుతున్నది. అందుకని అది అవిరామంగా కలవరపడి పోతున్నది. నేను మిమ్మల్ని ఏదయినా అడిగినా, మీ వద్దనుండి ఏదయినా పొందాలని ఆశిస్తున్నా నా మనసు కలవరపడుతూ వుంటుంది, వుంటుంది కదూ?

దైవాన్ని ఏమి యివ్వమని అడగాలి అనే సంగతి తెలుసుకోవాలని యీ అబ్బాయి కోరుతున్నాడు. దేవుడంటే ఏమిటో అతనికి తెలియదు. అయితే మొత్తంమీద అతనిలో ఒక భయాకులత చోటు చేసుకొని వుంది. 'నేను అడగాలి, నేను

ప్రార్థించాలి, నన్ను రక్షించమని కోరాలి' అనే భావం అతనిలో వుంది. మనసు ఎప్పుడూ ఏదో ఒక దానికోసం మూలమూలలూ వెతుకుతూ వుంటుంది. అది ఎప్పుడూ కోరుతూ వుంటుంది. చేజిక్కించుకోవాలని చూస్తుంది. కనిపెట్టి చూస్తూ వుంటుంది, త్రోసుకు పోదామని చూస్తుంది. పోల్చి చూస్తుంది. నిర్ణయాలు చేసి తీర్పు యిస్తుంది. కాబట్టి అది ఎప్పుడూ నిలకడగా వుండలేదు. మీ మనసును మీరే పరిశీలించండి. అప్పుడు మీకే అది ఏం చేస్తున్నదో తెలుస్తుంది; తన్ను తాను అదుపులో పెట్టుకోవాలని ప్రయత్నించడం, ఆధిపత్యం వహించాలనీ, అణచివేయాలనీ, ఏదో ఒక రూపంలో సంతృప్తిని పొందాలనీ చూస్తూ వుండటం మీరే గమనిస్తారు. ప్రతి క్షణం అర్థిస్తూ, ప్రాధేయపడుతూ, పోరాడుతూ, పోల్చి చూసుకుంటూ వుండటం కూడా గమనిస్తారు. అటువంటి మనసును చాలా అప్రమత్తమైన, జాగరూకమైన మనసు అని మనం అంటూ వుంటాం. అయితే అది జాగరూకతయేనా? నిజంగా చూస్తే జాగరూకమయిన మనసు అంటే నిశ్చలమయిన మనసు; సీతాకోకచిలుక వలె ఎప్పుడూ దేనికొరకో వెతుకుతూ అంతటా ఎగురుతూ వుండేది కాదు. నిశ్చలంగా నిలకడగా వుండే మనసే దైవం అంటే ఏమిటో అవగాహన చేసుకోగలుగుతుంది. నిశ్చలంగా వుండే మనసు దైవాన్ని ఏమీ కోరదు. నిస్సారం చెందిన పేద మనసే ప్రాధేయపడుతుంది, అర్థిస్తుంది. తాను అర్థించినది అది ఎన్నటికీ పొందలేదు; ఎందుకంటే అది అసలు కావాలని కోరుకునేవి భద్రత, పూరట, నిశ్చితత్వం అంటే సందిగ్ధత లేకపోవడం. దైవాన్ని దేని కొరకైనా మీరు అర్థించేటట్లయితే మీరు ఎన్నటికీ దైవాన్ని కనుగొనలేరు.

ప్రశ్న: నిజమయిన గొప్పతనం అంటే ఏమిటి, నేను గొప్పవాడినవాలంటే ఏంచేయాలి?

**కృష్ణమూర్తి:** చూడండి, మన దౌర్భాగ్యం ఏమిటంటే, మనం గొప్పవాళ్ళం కావాలని కోరుకుంటూ వుంటాం. మనమంతా ప్రతి ఒక్కరం గొప్పవాళ్ళం కావాలని కోరుకుంటాం, మనమూ ఒక గాంధీ అవాలనో, ప్రధానమంత్రి అవాలనో కోరుకుంటాం; గొప్ప నూతన పరిశోధనలు కనిపెట్టాలనీ, మహారచయితలం అవాలనీ కోరుకుంటాం. ఎందుకు? విద్య, మతము వంటి జీవితానికి సంబంధించిన అన్ని శాఖల్లో మనకి ఆదర్శమూర్తులు వున్నారు. మహాకవి, మహావక్త, గొప్పరాజనీతిజ్ఞుడు, మహాభక్తుడు, వీరాధివీరుడు – ఇటువంటివారిని దృష్టాంతాలుగా నిలుపుతారు, మనమేమో వారిలాగా వుండాలని కోరుకుంటాం.

సరే, మరొకరిలాగా వుండాలని కోరుకున్నప్పుడు, మీరు ఒక ఆచరణ పథకాన్ని తయారు చేసుకుంటారు, చేసుకుంటారా, లేదా? మీ ఆలోచనలకు ఒక పరిమితిని పెట్టుకుంటారు, కొన్ని పరిధుల్లో వాటిని బంధించివేస్తారు. కాబట్టి మీ ఆలోచనా ప్రక్రియ ఘనీభవించి, కుంచించుకొనిపోయి, పరిధులకు లోబడి, బయటకు రాలేక లోలోపలే అణగారిపోతుంది. గొప్పవాళ్ళు అవాలని మీరు ఎందుకు కోరుకుంటున్నారు? మీరు ఏమిటి అనేది మీ వైపు మీరు పరికించి చూసుకొని,

అవగాహన ఎందుకు చేసుకోరు? చూడండి, మీరు మరొకరిలాగా వుండాలని అనుకున్న మరుక్షణమే దుర్భర వ్యథ, సంఘర్షణ వచ్చి చేరుతాయి; ఈర్ష్య, దుఃఖము బయలుదేరుతాయి. మీరు బుద్ధునిలాగా వుండాలని కోరుకుంటే ఏమవుతుంది? ఆ ఆదర్శాన్ని అందుకోవడం కోసం అనంతంగా మీరు ప్రయాస పడుతూనే వుంటారు. మీరు అవివేకులయి వుండి, చాతుర్యం సంపాదించాలని ప్రాకులాడితే, యిక ఎప్పటికీ, మీరు ఏమిటో అది వదిలేసి, మరి దేనికొరకో ప్రయత్నించడమే అవుతుంది. మీరు అనాకారులై వుండి, అందంగా అవాలని కోరుకుంటే, జీవితాంతం అందంగా వుండాలని కాంక్షిస్తూనే వుండిపోతారు. లేదా మీరు అందంగా వున్నారని అనుకుంటూ మిమ్మల్ని మీరే మోసం చేసుకుంటూ వుంటారు. కాబట్టి మీరు యథార్థంగా ఏమిటో అది కాకుండా మరోలాగా వుండాలని ప్రయత్నించినంత కాలం మనసు వూరికే వేసారి, వ్యర్థమై పోతుంది. "నేను యిట్లా వున్నాను, అది ఒక వాస్తవం, దీనిని నేను పరిశోధించి చూస్తాను, అవగాహన చేసుకుంటాను." అని మీరు అనుకుంటే, అప్పుడు మీరు అధిగమించి పోగలరు. ఎందుకంటే, మీరు ఏమిటి అనేది అవగాహన చేసుకోవడం వలన అశేషమయిన శాంతి, పరితృప్తి, గొప్ప అంతర్దృష్టి, గొప్ప ప్రేమభావం కలుగుతాయని మీరు తెలుసుకుంటారు.

**ప్రశ్న: ప్రేమ కలగడానికి ఆకర్షణ ఆధారం కాదా?**

**కృష్ణమూర్తి:** మిమ్మల్ని ఒక అందమైన స్త్రీకాని, స్ఫురద్రూపి అయిన పురుషుడు కాని ఆకర్షించారు అనుకోండి. అందులో తప్పేమిటి? తెలుసుకోవాలని మనం ప్రయత్నం చేస్తున్నాం. చూడండి, ఒక స్త్రీగాని, ఒక పురుషుడు గాని, ఒక చిన్నపాప గాని మిమ్మల్ని ఆకర్షిస్తే సాధారణంగా ఏం జరుగుతుంది? మీరు ఆ వ్యక్తితో పాటే ఎప్పుడూ వుండాలని కోరుకోవడమే కాకుండా, ఆ వ్యక్తి మీ స్వంతం అవాలని కూడా కోరుకుంటారు; ఆ వ్యక్తి మీకు చెందినవారుగా చెప్పుకోవాలనుకుంటారు. మీ శరీరం ఆ వ్యక్తి శరీరానికి సమీపంలో వుండి తీరాలనుకుంటారు. కనుక మీరు చివరికి ఏం చేసేశారు? యథార్థం ఏమిటంటే, మీరు ఆకర్షణకు లోనయినప్పుడు, ఆకర్షించినవారిని మీ స్వంతం చేసుకోవాలని కోరుకుంటారు, ఆ వ్యక్తి మరొకరివంక కన్నెత్తి చూడరాదని కోరుకుంటారు. మీరు మరొక మనిషిని మీకు చెందినవారుగా, మీ స్వంతం అని అనుకున్నప్పుడు ప్రేమభావం వుంటుందా? ఏమాత్రం వుండదు. మీ మనసు 'నాది' అనే కంచెను ఆ వ్యక్తి చుట్టూ వేసిన మరుక్షణమే ప్రేమభావం వుండదు.

యథార్థం ఏమిటంటే – మన మనసులు అన్నివేళలా యీ పనినే చేస్తూ వుంటాయి. అందుకే మనం యీ విషయాలను చర్చిస్తున్నాం – మనసు ఎట్లా పని చేస్తుందో తెలుసుకోవడానికి, బహుశ తన చేష్టలను గురించిన ఎరుక కలిగినపుడు మనసు తనంతట తనే స్థిమితపడుతుందేమో!

ప్రశ్న: ప్రార్థన అంటే ఏమిటి? దైనందిన జీవితంలో దాని ప్రాధాన్యత ఏమయినా వున్నదా?

కృష్ణమూర్తి: మీరెందుకు ప్రార్థన చేస్తారు? అసలు ప్రార్థన అంటే యేమిటి? ప్రార్థన అంటే చాలా వరకు విన్నవించుకోవడం, అర్థించడం. బాధపడినప్పుడు మీరు యిటువంటి ప్రార్థనకు పూనుకుంటారు. చాలా ఒంటరిగా తోచినపుడు, కృంగిపోయి వ్యాకులంగా వున్నప్పుడు, దుఃఖంలో వున్నప్పుడు మీరు దేవుని సహాయం కోసం అర్థిస్తారు; కనుక మీరు ప్రార్థన అని అనేది నిజానికి ఒక వినతి పత్రం. ప్రార్థన భిన్నమైన రూపాల్లో వుండవచ్చునేమోకాని, వాటి అన్నింటి వెనకాల వున్న తాత్పర్యం మొత్తం మీద ఒక్కటే. చాలా మందికి ప్రార్థన అంటే ఒక విన్నపం చేసుకోవడం, ఒక యాచన, ఒక అర్థింపు; మీరు చేసేది అదేనా? మీరు ఎందుకు ప్రార్థన చేస్తారు? మీరు ప్రార్థన చేయాలని కాని, చేయకూడదని కాని నేను అనడం లేదు. మీరు అసలు ఎందుకు ప్రార్థిస్తున్నారు? ఇంకా ఎక్కువ జ్ఞానం కోసమా, మరింత శాంతి కోసమా? లోకంలో దుఃఖం అనేది పూర్తిగా లేకుండా పోవాలని మీరు ప్రార్థిస్తున్నారా? మరొక విధమయిన ప్రార్థన ఏదయినా వున్నదా? ఉన్నది, యిది నిజంగా ప్రార్థన అని చెప్పలేము; ఇది సుహృద్భావాన్ని పదుగురికీ పంచడం; ప్రేమభావాన్ని పంచిపెట్టడం, సద్భావనలను అందరికీ ప్రసారం చేయడం. మీరు చేస్తున్నది ఏమిటి?

ప్రార్థిస్తున్నప్పుడు మీరు దైవాన్ని కాని, మరో మహాత్ముడిని కాని, మీ ఖాళీపాత్రను నింపమని సాధారణంగా అడుగుతూ వుంటారు, అవును కదూ? జరిగే దానితో, మీరు పొందిన దానితో మీకు సంతృప్తి వుండదు. అందుకని మీ పాత్రను మీ యిచ్ఛానుసారం నింపాలని మీరు కోరుకుంటూ వుంటారు. కనుక మీ ప్రార్థన కేవలం ఒక వినతి పత్రమే; మిమ్మల్ని సంతృప్తిపరచమని గట్టిగా అడుగుతూ చేసే అర్థింపు. అందువలన అది ప్రార్థన కానేకాదు. "నేను బాధపడుతున్నాను, నాకు తృప్తి కలిగించు, దయచేసి నా తమ్ముడిని, నా పుత్రుడిని నాకు తిరిగి యిచ్చివేయి. దయచేసి నన్ను ఐశ్వర్యవంతుడిని చేయి" అని మీరు దేవునితో అంటారు. మీరు మళ్ళీ మళ్ళీ మీ అర్థింపులను గట్టిగా కోరడం ఎప్పటికీ కొనసాగిస్తూనే వుంటారు; కాబట్టి అది ప్రార్థన కాదని తెలుస్తూనే వున్నది.

అసలు చేయవలసినది మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడం; మీరు నిరంతరంగా ఏదో కావాలని ఎందుకు అడుగుతున్నారు, మీలో ఎందుకు యీ తీవ్రకాంక్ష, అర్థించాలనే యీ బలమైన కోరిక వున్నాయి అనేవి నిజంగా తెలుసుకోవలసినవి. మీరు ఏమి ఆలోచిస్తున్నారు, మీ మనోభావాలు ఏమిటి అనే ఎరుక ద్వారా మిమ్మల్ని మీరు మరింత బాగా తెలుసుకున్నకొద్దీ మీ 'వున్నస్థితి' అనే సత్యాన్ని అంత బాగా మీరు ఆవిష్కరించుకోగలుగుతారు; యీ సత్యమే మీరు విముక్తులవడానికి తోడ్పడుతుంది.

★ ★ ★

# అధ్యాయం 10

ఏ విధంగా వినాలి అనే సంగతి తెలుసుకోవడం చాలా ముఖ్యమని నేననుకుంటాను. ఎట్లా వినాలో తెలుస్తే చెప్తున్న విషయంలోని అసలు మూలాంశమేమిటో వెంటనే తెలుస్తుంది. అచ్చమైన వట్టి ధ్వనిని వింటూ వుంటే అందులోని సౌందర్యం మిమ్మల్ని వెంటనే తాకుతుంది. అదే విధంగా చెప్తున్న దానిని ఏ విధంగా వినాలో తెలుస్తే వెంటనే అవగాహన అవుతుంది. వినడం అంటే ధ్యాస లేదా సావధానతను అంతటినీ ఒకదానిమీద ప్రసరించడం. వినడం అలసట అయిన పని అనీ, ఏకాగ్రతను నేర్చుకోవడం దీర్ఘకాలంపాటు కొనసాగించవలసిన ప్రక్రియ అనీ మీరు అనుకోవచ్చు. కాని చక్కగా వినడం అనేది మీరు తెలుసుకుంటే, సావధానతగా వుండటం అంత కష్టమయినది ఏమీకాదు. అప్పుడు అసాధారణమయిన మెలకువతో మీరు వింటున్న విషయంలోని ప్రధాన అంతర్భాగాన్ని తక్షణమే తెలుసుకోవడం మీరే గమనిస్తారు.

మనలో చాలమందిమి సవ్యంగా వినము. బయటనుండి వచ్చే యితర శబ్దాలు మన ధ్యాసను మళ్ళిస్తాయి; మనకి ముందుగానే ఒక నిర్హేతుకమైన అభిప్రాయం ఏర్పడి వుంటే, యీ పక్షపాతం వలన మనసు పక్కదారి పడుతుంది; చెప్తున్న దానిని సరిగా వినకుండా యిది మనల్ని నిరోధిస్తుంది. పెద్దవారిలో యిది మరీ బాగా కనిపిస్తుంది; వారి వెనుక జీవితంలో వారు సాధించిన మహత్కార్యాల, వైఫల్యాల సుదీర్ఘ జాబితాలు దీనికి కారణం; లోకంలో వారు కొంత కీర్తి, అపకీర్తి కూడా సంపాదించి వుంటారు. వారు ఏర్పరుచుకున్న అభిప్రాయాల పొరలనూ స్థిరపరుచుకున్న ఉద్దేశ్యాల పొరలను చీల్చడం చాలా దుస్సాధ్యమయిన పని. వారిలో వుండే కల్పనాశక్తి, వారి నిబద్ధీకరణం, తాము ఏదో సాధించామనే ఘనత యివన్నీ కలసి చెప్పబడుతున్న దానిని వినిపించుకోనీయవు. చెప్తున్నదానిని మనం ఎట్లా వినాలో కనుక తెలుసుకుంటే, అడ్డుగోడ ఏదీ లేకుండా, ఏ వ్యాఖ్యానమూ లేకుండా మనం వినగలుగుతే; ఉషోదయంలో పక్షి పాడే పాటను ఎట్లా వింటామో అట్లా వింటే – అప్పుడు వినడం అనేది అపూర్వంగా వుంటుంది; ముఖ్యంగా యథార్థం అయిన విషయాలు చెప్తున్నప్పుడు. అవి మనకి యిష్టం అవచ్చు, కాకపోవచ్చు, అప్రయత్నంగానే మనం వాటిని ప్రతిరోధించవచ్చు; కాని, మనం వాటిని సవ్యంగా విన్నట్లయితే అందులో వున్న సత్యం బోధపడుతుంది. కాబట్టి సవ్యంగా వినడంవలన మనసు భారం తీసివేసినట్లవుతుంది; సంవత్సరాల తరబడి పేరుకొనిపోయిన వైఫల్యాల, ఓటములు గెలుపుల, ఆరాటాల కల్మషం కడిగి వేసినట్లవుతుంది.

సిద్ధాంతాల ప్రచారం అంటే ఏమిటో మీకు తెలిసే వుంటుంది, తెలుసుకదూ?

అంటే ఒక సిద్ధాంతానికి బహుళ వ్యాప్తి కలిగించడం, ఒక సిద్ధాంతపు బీజం నాటడం, ఎడతెగకుండా ఒక అభిప్రాయాన్ని పునరుక్తి చేస్తూ వుండటం. సిద్ధాంతప్రచారకుడు, రాజకీయవేత్త, మతాధికారి తాము కోరుకున్నవి మీచేత విశ్వసింపచేయడానికి యీ విధంగానే మీ మనసుమీద గట్టిగా ముద్రిస్తూ వుంటారు. ఈ ప్రక్రియలో కూడా వినడం అనేది కూడుకొని వున్నది. మీరు ఏం చేయవలసిందీ, ఏ పుస్తకాలు చదవాలిసిందీ, ఎవరిని అనుసరించాలిసిందీ, ఏ భావాలు సరియైనవో, ఏవి తప్పో అనేవి వీరందరూ అదే పనిగా మీకు మళ్ళీ మళ్ళీ బోధిస్తూ వుంటారు; ఆపకుండా చేసే యీ పునరుక్తి మీ మనసుపైన ఒక జాడను అంటే ముద్రను వదులుతుంది. మీరు అంత ప్రయత్నపూర్వకంగా వినకపోయినా అది ఒక ముద్రను మీ మనసుపై అచ్చు వేస్తుంది, అదే సిద్ధాంత ప్రచారం సాధించదలుచుకున్న ప్రయోజనం. అయితే, ఒకటి – సిద్ధాంత ప్రచారం అన్నది స్వార్థ ప్రయోజనార్థం జరుగుతుంది; మీరు శ్రద్ధగా వింటున్నప్పుడు, ఏ ప్రయత్నమూ లేకుండానే సావధానత కలిగి వున్నప్పుడు, మీరు తక్షణమే అవగాహన చేసుకొనే ఆ సత్యాన్ని మాత్రం యీ సిద్ధాంత ప్రచారం మీకు అందివ్వదు.

ఇప్పుడు మీరు నేను చెప్పేది వింటున్నారు; మీరు సావధానంగా వుండాలని పెద్దగా ప్రయత్నం చేయడం లేదు, మామూలుగా వింటున్నారు; మీరు వింటున్న దానిలో సత్యం వున్నట్లయితే మీలో ఒక ఆశ్చర్యకరమైన మార్పు జరుగుతూ వుండటం మీరు గ్రహిస్తారు; ముందుగానే యోచనచేసి పెట్టుకోవడం వల్ల, ఆశ పడటంవల్ల వచ్చిన మార్పు కాదు యిది; ఒక సంపూర్ణమైన మార్పు; మీ మనసు సృష్టించిన ఊహాలకు కాకుండా యథార్థానికి మాత్రమే ఆధిక్యత వున్న ఒక సంపూర్ణ విప్లవం. నేను ఒక సలహా యివ్వవచ్చునా? నేను చెప్పే విషయాలనే కాకుండా, యితరులు చెప్పేవాటిని, పక్షుల పాటలను, రైలు యింజను కూతను, నడుస్తున్న బస్సు చేసే శబ్దాన్ని ప్రతిదానినీ మీరు యీ విధంగానే వినాలి. మీరు అన్నింటినీ బాగా వింటున్నకొద్దీ నిశ్శబ్దం ఎక్కువ అవడమూ, ఆ పైన ఆ నిశ్శబ్దాన్ని ఏ శబ్దమూ భంగపరచకపోవడమూ మీరు గ్రహిస్తారు. మీరు దేనినయినా ప్రతిరోధిస్తున్నప్పుడు మాత్రమే, అంటే మీకూ, మీరు వినదలుచుకోని విషయానికీ నడుమన అడ్డుగోడ లేవనెత్తినప్పుడే – అప్పుడు మాత్రమే సంఘర్షణ అనేది వుంటుంది.

సరే; బాహ్యంగానూ, అంతరంగంలోనూ ఉభయత్రా సంస్కారం కలిగి వుండటం చాలా ముఖ్యం కదూ? సంస్కారం అంటే ఏమిటో మీకు తెలుసునా? మీ చుట్టూ వున్న వాటన్నింటి యెడల సున్నితత్వం కలిగి వుండటం; మీ మనసులోని ఆలోచనలు, నమ్మకాలు, మనో భావాలు, వీటియెడల కూడా సున్నితత్వం కలిగివుండటం. సంస్కారం అనేది మీరు ధరించిన దుస్తులలో, మీరు చూపే మంచీ మర్యాదలో, మీ హావభావాల్లో, మీ నడక తీరులో, మీ సంభాషణా తీరులో, మీరు మనుష్యులను పరికించే రీతిలో ప్రతిబింబిస్తూ వుంటుంది. సంస్కారం అత్యంత ఆవశ్యకమయినది, అవును కదూ? సంస్కారం కనుక లేకపోతే క్రమంగా క్షీణత్వం అంటే హీనత్వంలోకి దిగజారిపోవడం అనేది సంభవిస్తుంది.

దిగజారిపోవడం అంటే అర్థం మీకు తెలుసునా? అది సృజనాత్మకతకు, నిర్మాణానికి వ్యతిరేకం; అభ్యుదయానికి, అభివృద్ధికి కావలసిన అంతఃస్ఫూర్తి వుండటానికి సరిగ్గా వ్యతిరేకమైనది. క్షీణించడం అంటే మెలమెల్లగా శిథిలమవడం, శుష్కించి వడిలిపోవడం అని కూడా చెప్పుకోవచ్చు. ఇప్పుడు లోకంలో జరుగుతున్నది అదే. కాలేజిలలో, విశ్వవిద్యాలయాలలో, దేశదేశాలలో, ప్రజలలో, వ్యక్తి లోపల మెలమెల్లగా శైథిల్యం చోటుచేసుకుంటూ వున్నది; ఈ క్షీణించిపోయే ప్రక్రియ అన్ని వేళలా జరిగిపోతూనే వున్నది; దానికి కారణం అంతర్గతమైన సంస్కారం లేకపోవడమే. బాహ్యగతమయిన సంస్కారం కొంతవరకు మీకు వుండి వుండవచ్చు; మీరు చక్కని దుస్తులు ధరించవచ్చు, అందమైన యింట్లో నివసించవచ్చు, మంచి భోజనం ఆరగిస్తుండవచ్చు, అపరిమితమయిన పరిశుభ్రత పాటిస్తుండవచ్చు; అయితే అంతర్గతమైన సంస్కారం లేనప్పుడు బయటకు కనబడే పద్ధతుల్లో శ్రేష్ఠత వున్నా దానికి అర్థమే లేదు. ఇది కేవలం మరో రూపంలో వున్న క్షీణత. సుందరమయిన వస్తువులను స్వంతానికి కలిగివుండి, అంతరంగాల్లో మాత్రం మోటుగా వుండటం అంటే తన స్వాభిమానంలో, తన భేషజాలలో, తన ఆకాంక్షలలో, తన ఘనతలలో మునిగి తేలుతూ వుండటం – ఇదీ క్షీణతకి గల మరో లక్షణమే అని చెప్పవచ్చు.

కవిత్వంలో, ఒక వ్యక్తిలో, ఒక చక్కని వృక్షంలో సౌందర్యరూపం వున్నది, అయితే అది ప్రేమ వలన కలిగే అంతర్గత సంస్కారం ద్వారా మాత్రమే అర్థవంతమవుతుంది. ప్రేమ కనుక వుంటే బాహ్యగతమయిన సంస్కారం, అంతర్గతమయిన సంస్కారం రెండూ వుంటాయి. ఇతరుల యెడల ఔదార్యంతో వుండటంలోను, మీ తల్లితండ్రులయెడల, మీ యిరుగు పొరుగు, మీ నవుకరు, మీ తోటమాలి, వీరి యెడల మీ ప్రవర్తన తీరులోను మీ సంస్కారం బయటకు అభివ్యక్తమవుతుంది తోటమాలి మీ తోటను సుందరనందనంగా తీర్చిదిద్ది వుండవచ్చు, కాని ప్రేమ వలన కలిగే సంస్కారం కనుక లేకపోతే ఆ తోట మీలో వున్న అహంకారాన్ని ప్రదర్శించే అభివ్యక్తి మాత్రమే అవుతుంది.

కనుక, బాహ్యగతంగా, అంతర్గతంగా రెండింటా సంస్కారం వుండటం అత్యంత ఆవశ్యకం. మీరు భోజనంచేసే తీరు చాలా ముఖ్యమయినది; భోజనం చేస్తున్నప్పుడు మీరు శబ్దం చేస్తూ తింటారా అన్నది కూడా చాలా ముఖ్యమైన సంగతి. మీ ప్రవర్తన విధానం, స్నేహితులతో వున్నప్పుడు మీరు మంచీ మర్యాదా చూపే తీరు, యితరుల ప్రసక్తి వచ్చినప్పుడు మీరు మాట్లాడే పద్ధతి – యివన్నీ చాలా ప్రధానమయినవి, ఎందుకంటే – అంతర్గతంగా మీరు ఎటువంటి వారో అవి సూచిస్తాయి; మీలో అంతర్గతమయిన సంస్కారం వున్నదా లేదా అనేది తెలియడానికి అవి చిహ్నాలు. అంతర్గతమయిన సంస్కార విహీనత బాహ్యమైన క్షీణత రూపంలో ఏదో విధంగా వ్యక్తమవుతుంది; కాబట్టి లోపల ప్రేమభావం కనుక లేకపోతే బాహ్యమయిన సంస్కారానికి అర్థం లేదు. ప్రేమభావం అనేది స్వంతం చేసుకొనే విషయం కాదని కూడా మనం తెలుసుకున్నాం. మనసు తనంతట తానే సృష్టించుకున్న సంక్లిష్ట సమస్యలను అవగాహన చేసుకున్నప్పుడే అది, అంటే ప్రేమభావం వుదయిస్తుంది.

ప్రశ్న: మనం గెలిచినపుడు, విజయం సాధించినప్పుడు, గర్వం వంటి ఒక భావం కలుగుతుంది, ఎందువలన?

కృష్ణమూర్తి: గెలుపులో గర్వంవంటి భావం వున్నదా? అసలు గెలుపు అంటే ఏమిటి? ఒక రచయితగా, కవిగా, చిత్రకారుడిగా, ఒక వ్యాపారవేత్తగా, రాజకీయవేత్తగా విజయం సాధించడం అంటే ఏమిటో మీరెప్పుడయినా ఆలోచించారా? ఇతరులు సాధించలేని ఒక స్వయంనిగ్రహాన్ని మీరు అంతర్గతంగా సాధించామనే భావం, యితరులు విఫలమయిన దానిలో మీరు జయప్రదం కావడం, మరొకరికంటే మీరు ఘనులు అనుకోవడం, మీరు బాగా పైకి వచ్చిన వ్యక్తి, యితరులు గౌరవించే వ్యక్తి, మిమ్మల్ని యితరులు ఒక దృష్టాంతంగా తీసుకొని మన్నించే వ్యక్తి అని అనుకోవడం – యిదంతా దేనిని సూచిస్తుంది? మీలో యిటువంటి భావం కలిగినపుడు సహజంగానే గర్వం వుంటుంది – నేనేదో సాధించాను, నేను చాలా ముఖ్యుడిని అని. 'నేను' అనే భావంలోనే సహజ లక్షణంగా గర్వభావం వుంటుంది. కాబట్టి గర్వం గెలుపుతోపాటు పెరుగుతుంది; తక్కిన మనుష్యులతో పోల్చి చూసినపుడు తను చాలా ముఖ్యుడిననే భావం వ్యక్తిలో గర్వాన్ని కలిగిస్తుంది. ఒక దృష్టాంతాన్ని, ఒక ఆదర్శాన్ని అనుసరించడంలో కూడా యితరులతో మిమ్మల్ని పోల్చి చూసుకోవడం వుంటుంది; అది మీలో ఒక ఆశను కలిగిస్తుంది; మీకు బలాన్ని, ఒక ఆశయాన్ని యిచ్చి, ప్రేరణగా కూడా పనిచేస్తుంది. ఇది 'నేను'ను, యితరులందరికంటే తాను ఎంతో ముఖ్యుడు అనే సుఖమయిన భావాన్ని మరింత దృఢపరుస్తుంది; ఆ భావమే; ఆ సౌఖ్య భావమే గర్వానికి ఆరంభం అవుతుంది.

గర్వం అపరిమితమయిన అహంకారానికి, స్వాతిశయానికి ఆస్కారం అవుతుంది. దీనిని మీరు పెద్దవారిలోను, మీలోను కూడా గమనించవచ్చు. మీరు ఒక పరీక్షలో ఉత్తీర్ణులయినప్పుడు, మరొకరికంటే కాస్త ఎక్కువ తెలివిగలవారమని అనిపించి, ఒక సౌఖ్యమయిన భావం కలుగుతుంది. మరొకరిని వాదంలో చిత్తుచేయడం కూడా యిట్లాంటిదే; భౌతికంగా మీరు మరొకరికంటె మరింత బలంగానో, మరింత అందంగానో వున్నారని భావించినపుడు కూడా వెంటనే మీలో మీ స్వీయ ప్రాముఖ్యం గురించి ఒక భావం ఉత్పన్నమవుతుంది. 'నా' అనే యీ స్వీయ ప్రాముఖ్యతా భావం సంఘర్షణను, పోరాటాన్ని, బాధను కలిగించడం అనివార్యం. ఎందుకంటే, మీరు ఎల్లవేళలా మీ ప్రాముఖ్యతను కాపాడుకుంటూ వుండాలి కాబట్టి.

ప్రశ్న: గర్వం నుండి మనం ఎట్లా విముక్తి పొందుతాం?

కృష్ణమూర్తి: క్రిందటి ప్రశ్నకు యిచ్చిన సమాధానాన్ని మీరు నిజంగా విని వున్నట్లయితే గర్వం నుండి ఎట్లా విముక్తి చెందాలో మీకు బాగా అర్థమయివుండేది. మీరు గర్వం నుండి విముక్తి సంపాదించేవారు; కాని మీరు తరువాత ప్రశ్న ఎట్లా అడగాలా అనే ధ్యాసలో మునిగిపోయారు, అవును కదూ? కనుక మీరు వినడం లేదు. చెప్తున్నది ఏమిటో మీరు నిజంగా వినివున్నట్లయితే సత్యాన్ని మీరే కనుగొని వుండేవారు.

నేను ఏదో కొంత సాధించాను కాబట్టి నాకు గర్వం అని అనుకుందాం. నేను ప్రధానాధ్యాపకుడిని అయ్యాను; నేను యింగ్లాండో, అమెరికానో వెళ్ళివచ్చాను; నేను ఘనకార్యాలు చేశాను; వార్తాపత్రికల్లో నా చిత్రపటం పడింది, యింకా యిటువంటివి ఎన్నెన్నో. చాలా గర్వంగా భావిస్తూ, నాలో నేను "నేను గర్వం నుండి ఎట్లా విముక్తి పొందుతాను?" అని అనుకుంటాను.

సరే, నేను అసలు గర్వం నుండి విముక్తి ఎందుకు కోరుతాను? అదీ అసలు ముఖ్యమయిన ప్రశ్న, ఎట్లా విముక్తి పొందడం అన్నది కాదు. దీనికి వెనకాల ప్రేరణ ఏమిటి, కారణం ఏమిటి, దీనివలన లాభం ఏమిటి? అది నాకు హాని కలుగజేస్తుంది కాబట్టి; 'బాధ కలిగిస్తుంది, మానసికంగా మంచిది కాదు కాబట్టి గర్వంనుండి నేను విముక్తి కోరుతున్నానా? అదే కనుక హేతువు అయితే గర్వం నుండి నన్ను విముక్తి చేసుకోవడానికి ప్రయత్నించడం కూడా మరో రూపంలో వున్న గర్వమే, అవును కదూ? నేను యింకా ఏదో సాధించాలనే తపనలోనే వున్నాను. గర్వం చాలా బాధాకరమైనది, మానసికంగా అసహ్యకరమయినది అని తెలుసుకొని, దానినుండి విముక్తి పొందితీరాలని నేను అంటూ వుంటాను. 'నేను విముక్తి పొందాలి' అన్న దానిలో కూడా 'నేను' అనేదానికే యిక్కడా ప్రాముఖ్యం, విముక్తి పొందడానికి జరిగే పోరాటానికి అదే కేంద్రం.

కాబట్టి గర్వం నుండి విముక్తి పొందడం కాదు ముఖ్యమయినది, 'నేను' ను అవగాహన చేసుకోవడం ప్రధానం; ఈ 'నేను' అనేది మహా కపటి; అది యీ యేడు ఒకటి కావాలని కోరుతుంది. మరు సంవత్సరం మరొకటి కోరుతుంది; ఆ మరొకటి కనుక బాధాకరంగా పరిణమించినట్లయితే, మరింకేదో కావాలని కోరుతుంది. కాబట్టి యీ నేను అనే కేంద్రానికి అస్తిత్వం వున్నంతవరకు, వ్యక్తి గర్వంగా వున్నాడా లేదూ వినయవిధేయతలతో – అంటారే అట్లా వున్నాడా అనేది చాలా అల్పమయిన విషయం. అవి మనిషి ధరించే రకరకాల కోట్లు మాత్రమే. నాకు ఏ కోటు నచ్చితే అదే వేసుకుంటాను; ఆ తరువాత సంవత్సరం నా సరదాలకు, నా అభీష్టాలకు అనుగుణంగా మరో రకమయిన కోటును ధరిస్తాను.

మీరు అర్థం చేసుకోవలసినది ఏమిటంటే – యీ 'నేను' అనేది ఏ విధంగా ఉనికిని ఏర్పరుచుకుంటున్నది అనే సంగతి. అనేక రూపాలతో వుండే ఏదో సాధించామనే భావం ద్వారానే 'నేను'కు ఉనికి ఏర్పడుతున్నది. అంటే దీని అర్థం మీరు ఏ కార్యమూ చేపట్టకూడదని కాదు; అయితే మీరు అవగాహన చేసుకోవలసినది ఏమిటంటే – 'మీరు' కార్యాచరణ చేస్తున్నారు, 'మీరు' సాధిస్తున్నారు, 'మీరు' గర్వరహితంగా వుండాలి అనే భావాన్ని. 'నేను' యొక్క స్వరూప స్వభావాలని మీరు అర్థం చేసుకోవాలి. మీ స్వీయ ఆలోచనలను గురించి మీరు ఎరుకగా వుండాలి; మీరు మీ పనివారితో, మీ అమ్మతో, మీ నాన్నతో, మీ టీచరుతో, మీ నవుకరుతో, ఏవిధంగా వ్యవహరిస్తున్నారో పరిశీలించుకోవాలి. మీకంటే పైవారిని, మీ కంటె తక్కువగా వున్న వారిని, మీరు గౌరవించేవారిని, మీరు తృణీకారంగా చూసేవారిని మీరు పరిగణించే తీరు ఏమిటి అనే చైతన్యం మీలో వుండాలి. ఇదంతా 'నేను'కు వున్న స్వభావనైజాన్ని బహిరంగపరుస్తుంది. 'నేను' స్వభావనైజాన్ని అవగాహన

చేసుకోవడం ద్వారానే 'నేను' నుండి విముక్తి లభిస్తుంది. అసలయిన ప్రాధాన్యం యివ్వవలసినది దీనికి, అంతేతప్ప గర్వంనుండి విముక్తి పొందడానికి కాదు.

**ప్రశ్న: సౌందర్యపూరితమయినది ఒకటి కలకాలం ఉల్లాసాన్ని ఎట్లా కలిగిస్తుంది?**

**కృష్ణమూర్తి:** ఇది మీకు స్వంతంగా వచ్చిన ఆలోచనేనా, ఎవరో చెప్పింది ఉదహరిస్తున్నారా? సౌందర్యానికి నశింపు వున్నదా అనీ, కలకాలం నిలిచిపోయే ఉల్లాసం అనేది వున్నదా అనీ మీరు తెలుసుకోవాలనుకుంటున్నారు కదూ?

**ప్రశ్న: సౌందర్యం అనేది కొన్ని రూపాలలో కనిపిస్తుంది.**

**కృష్ణమూర్తి:** ఆ వృక్షం, ఆకు, నది, ఒక స్త్రీ, పురుషుడు, తలలపై బరువులు మోస్తూ పొందికగా నడచివెళ్తున్న పాటకజనం. సౌందర్యానికి నశింపు వున్నదా?

**ప్రశ్న: పల్లెజనం నడిచి వెళ్ళిపోతారు, అయితే వాళ్ళు సౌందర్యాన్ని ఒక జాడగా మిగిల్చి వెళతారు.**

**కృష్ణమూర్తి:** వాళ్ళు నడిచి వెళ్ళిపోతారు, ఆ జ్ఞాపకం మాత్రం మిగిలిపోతుంది. మీరు ఒక వృక్షాన్ని, ఒక ఆకుని చూస్తారు; ఆ సౌందర్యపు స్మృతి మాత్రం వుండిపోతుంది.

సరే, సౌందర్యపు స్మృతి ఒక సజీవమయిన విషయమా? అందమయిన దానిని చూసినపుడు తక్షణమే ఉల్లాసం కలుగుతుంది; సూర్యాస్తమయం చూస్తారు, వెంటనే మీరు ఉల్లాసంతో స్పందిస్తారు. ఆ ఉల్లాసం కొన్ని క్షణాలు పోయాక ఒక స్మృతిగా మారుతుంది. ఆ ఉల్లాసపు స్మృతి సజీవమయినదేనా? సూర్యాస్తమయం యొక్క స్మృతి సజీవమయినదా? అది ఒక జీవరహితమయిన ముద్ర (మనసులో) కదూ? ఆ సూర్యాస్తమయపు జీవరహితమయిన ముద్ర ద్వారా మీరు ఆ ఉల్లాసాన్ని తిరిగి మననం చేసుకోవాలని కోరుకుంటారు. అయితే స్మృతిలో ఉల్లాసం వుండదు; అది కేవలం జరిగిపోయినదానికి, ఒకప్పుడు ఉల్లాసాన్ని సృష్టించిన దానికి ఒక ప్రతిరూపం. సౌందర్యానికి తక్షణమే స్పందిస్తూ ఉల్లాసం జనిస్తుంది; అయితే ఆ పైన స్మృతి ప్రవేశిస్తుంది, దానిని నిర్మూలిస్తుంది. స్మృతులను పేర్చిపెట్టుకోవడం అనేది లేకుండా నిరంతరాయంగా సౌందర్యాన్ని అనుగ్రాహ్యం చేస్తూవుంటే – అప్పుడు ఉల్లాసం కలకాలం కొనసాగడం అనేది సాధ్యమవుతుంది.

స్మృతులను సంచయపరచుకోవడం నుండి విముక్తం చెందడం అంత సునాయాసమయినదేమి కాదు; ఎందుకంటే – సంతోషకరమయినదేదయినా చూసిన మరుక్షణమే, మీరు దానిని ఒక స్మృతిగా చేసుకొని, అది గట్టిగా పట్టుకొని కూర్చుంటారు. ఒక చక్కని వస్తువునుగాని, అందాల పాపాయినిగాని, అందమయిన వృక్షాన్ని గాని చూసినప్పుడు మీలో తక్షణమే ఉల్లాసం కలుగుతుంది; అది యింకా ఎక్కువగా కావాలని మీరు కోరుకుంటారు. అయితే అది యింకా ఎక్కువగా కావాలని

కోరుకోవడమే స్మృతిని పేర్చిపెట్టుకోవడం అవుతుంది. ఎక్కువగా కావాలని మీరు కోరుకోవడంతోనే విచ్ఛిన్నతకు దారితీసే ఒక ప్రక్రియను మీరు ఆరంభించారన్నమాట! దీనిలో ఉల్లాసం వుండదు. స్మృతి ఎన్నటికీ కలకాలం నిలిచిపోయే ఉల్లాసాన్ని ఉత్పన్నం చేయలేదు. స్మృతి అనే ఉత్తేజపరచే ప్రేరణ లేకుండా, సౌందర్యం చూసినా, కురూపం చూసినా, ఏది చూసినా నిరంతరాయంగా, స్వచ్ఛందంగా ప్రతిస్పందన వుంటూ వున్నప్పుడు మాత్రమే కలకాలం నిలిచిపోయే ఉల్లాసం కలుగుతుంది. దీని అంతర్భావం ఏమిటంటే అంతరికంగాను, బాహ్యంగాను యథార్థమయిన ప్రేమభావంతో కూడిన గొప్ప సున్నితత్త్వం కలిగివుండటం అని.

**ప్రశ్న: పేదవారు సంతోషంగాను, ధనికులు విచారంగాను ఎందుకుంటారు?**

**కృష్ణమూర్తి:** పేదవారు అంత సంతోషంగా వున్నారంటారా? వాళ్ళు పాటలు పాడుతుండవచ్చు, నృత్యాలు చేస్తుండవచ్చు; అంత మాత్రాన వారు సంతోషంగా వున్నారా? వాళ్ళకి చాలినంత ఆహారం లేదు, బట్టలు చాల కొద్దిగా వుంటాయి, లేదా అసలే వుండవు, వాళ్ళు పరిశుభ్రంగా వుండలేరు; ఒక యేటి తరువాత మరొక యేడు, యేడాది పొడుగునా, పొద్దున లేస్తే రాత్రివరకు నడుం వంచి కష్టపడుతునే వుండాలి. మధ్య మధ్యలో సంతోషకరమయిన క్షణాలు వారికి తటస్థపడవచ్చు; అంతమాత్రాన వాళ్ళు నిజంగా సంతోషంగా వున్నట్లు కాదు, ఏమంటారు?

ఇక ధనికులు, వీరు విచారంగా వున్నారా? వాళ్ళకి పుష్కలంగా వున్నాయి, గొప్ప హోదాలు వున్నాయి, విలాస యాత్రలు చేస్తుంటారు. ఏదో ఒక విధమయిన ఆశాభంగపు మనోవేదన వలన వారు బాధపడుతూ వుండవచ్చు. వాళ్ళకి ఏమయినా ఆటంకాలు ఎదురయి, వాళ్ళు కావాలనుకున్నవి పొందలేకపోయినప్పుడు వాళ్ళు విచారిస్తుండవచ్చు.

అసలు సంతోషం అంటే మీ అర్థం ఏమిటి? మనం కోరుకున్నది దొరకడంలోనే సంతోషం వున్నదని కొందరు అంటారు. మీరు కారు కావాలనుకుంటే, అది లభించినపుడు మీరు సంతోషపడతారు, కనీసం ఆ కాసేపు. మీరు ఒక చీర కావాలనుకున్నా, యూరపు ప్రయాణం కోరుకున్నా, ఏదయినా సరే; మీరు కావాలనుకున్నది లభ్యమవుతే మీరు సంతోష పడతారు. మీరు ఒక విశిష్టమయిన ప్రొఫెసర్‌గా పేరు గణించాలనుకున్నా, మహోన్నత రాజకీయవేత్తగా ప్రఖ్యాతి కోరుకున్నా, అది అందుకోగలిగినపుడు మీకు సంతోషంగా వుంటుంది; అందుకోలేకపోతే దుఃఖం కలుగుతుంది.

కాబట్టి, మీరు సంతోషం అంటున్నది, మీరు కోరుకున్నది పొందడం, అంటే విజయం సాధించడం లేదా మహా ఉత్తములుగా అయిపోవడం – వాటి యొక్క ఫలితం అన్నమాట. మీరు ఒకటి కావాలనుకుంటారు, అది మీరు పొందగలిగితే మీరు మహా సంతోషంగా వుంటారు, మీరు చీకాకు, చింత పడరు; మీరు కావాలనుకున్నది మీకు లభ్యమవకపోతే మాత్రం, అప్పుడు విచారం ఆరంభమవుతుంది.

ధనికులు, పేదవారు మాత్రమే కాదు, మనకందరికీ యీ సమస్యతో సంబంధం

వుంది. ధనికులు, పేదవారు యిద్దరూ తమకు స్వంతానికి ఏవో కావాలని కోరుకుంటారు. వారికి ఆటంకం కలిగినప్పుడు విచారపడతారు; ఈ విషయంలో వారు వీరు అంతా సమానమే. అయితే, పేదలు వారు కావాలని కోరుకున్నవి, వారికి అవసరమయినవి పొందకూడదని నేను అనడం లేదు. మనం ప్రస్తుతం విచారణ చేస్తున్న అంశం అది కాదు. సంతోషం అంటే ఏమిటో, సంతోషంగా వున్నప్పుడు మీరు సంతోషంగా వున్నారు అనే చైతన్యం మీలో వుంటుందా అనేవి తెలుసుకోవాలని మనం ప్రయత్నిస్తున్నాం.

మీరు సంతోషంగా వున్నప్పుడు, సంతోషంగా వున్నాము అనే సంగతి మీరు సచేతనంగా తెలుసుకొని వుంటే అది సంతోషమేనా? అది సంతోషం కాదు, కాదు కదూ? ఇది కూడా నమ్రతాభావం లాంటిదే; మీరు నమ్రతగా వున్నారు అనే స్పృహ మీలో కలిగిన మరుక్షణం మీలో నమ్రత వుండదు. కాబట్టి మీరు సంతోషాన్ని వెంటాడలేరు; అది వెంటాడి దొరకపుచ్చుకునే సంగతి కాదు. అది కలుగుతుంది; మీరు దానికొరకు వెతుకుతే, మిమ్మల్ని తప్పించుకొని పారిపోతుంది.

**ప్రశ్న: వివిధ రంగాలలో పురోగతి సాధించాక కూడా సహోదరభావం మాత్రం లేదు, ఎందువల్ల?**

**కృష్ణమూర్తి:** 'పురోగతి' అంటే ఏమిటని మీ అర్థం?

**ప్రశ్న: వైజ్ఞానిక పురోగతి.**

**కృష్ణమూర్తి:** ఎద్దులబండి నుండి జెట్ విమానం వరకు – అదే పురోగతి అంటే, అవును కదూ? శతాబ్దాల క్రిందట ఎద్దులబండి మాత్రమే వుండేది; క్రమక్రమంగా కాలం గడిచిన కొద్దీ, జెట్ విమానాన్ని తయారు చేసుకున్నాం. ప్రాచీనకాలంలో ప్రయాణ సాధనాలు చాలా మెల్లగా నడిచేవి, యిప్పుడు అతివేగంగా నడుస్తున్నాయి; కొన్ని గంటలలోనే మీరు యిక్కడనుండి లండన్ చేరుకోగలరు. పారిశుద్ధ్యం గురించిన కొత్త పద్ధతుల ద్వారా, సవ్యమూ, పుష్టికరమూ అయిన ఆహారం వైద్య సంరక్షణ ద్వారా శరీర ఆరోగ్యానికి సంబంధించిన విషయాలలో కూడా గొప్ప అభివృద్ధి జరిగింది. ఇదంతా శాస్త్ర విజ్ఞానపు పురోగతి; అయినా కూడా సౌభ్రాతృత్వం విషయంలో యిదేవిధంగా అభివృద్ధినీ, పురోగతినీ సాధించలేకపోయాం.

అయితే సౌభ్రాతృత్వం అనేది పురోగతికి సంబంధించిన విషయమా? 'పురోగతి' అంటే అర్థం ఏమిటో మనకు తెలుసు. అది ఒక పరిణామ క్రమం, కాలగమనంతో పాటుగా సాధించేది. మనం కోతినుండి పరిణామం చెందామని శాస్త్రజ్ఞులు అంటారు; కొన్ని లక్షల సంవత్సరాల కాలంలో అల్పాతి అల్పమయిన జీవరాశులనుండి అత్యున్నత జీవి అయిన మనిషిగా మనం వృద్ధి చెందామని వాళ్లు అంటారు. సహోదరత్వం అనేది యిటువంటి అభివృద్ధికి చెందిన విషయమా? కాలగమనంలో పరిణామం చెంది ఏర్పడేదా? కుటుంబంలో ఐక్యత అనేది వుంటుంది; ఒక్కొక్క సమాజంలో, ఒక్కొక్క జాతిలో ఐక్యత అనేది వుంటుంది; జాతి తరువాత

అంతర్జాతీయత ఆ పై సోపానం; ఆ తరువాత కలిగేది అంతా ఒకే ప్రపంచం అనే భావన. ఈ అంతా ఒకే ప్రపంచం అనే ప్రతిపాదననే మనం సహోదరత్వం అంటున్నాం. అయితే యీ సహోదరభావం అనేది పరిణామక్రమానికి చెందిన విషయమా? సహోదరత్వం అనేది కుటుంబం, సమాజం, జాతీయత, అంతర్జాతీయత, ప్రపంచ సమైక్యత అనే దశల వారీగా మెల్లమెల్లగా పోషించవలసినదా? సహోదరత్వం అంటే ప్రేమభావం, అవును కదూ? ప్రేమభావం కాలగమనంతో ముడిపడినదా? నేను చెప్తున్నది మీకు అర్థం అవుతున్నదా?

ఒక పది లేక ముప్తయి, లేక వంద సంవత్సరాల్లో సహోదరత్వం వస్తుంది అని నేను అంటే అది దేనిని సూచిస్తుంది? నాకు ప్రేమ లేదు, నాలో సహోదర భావం లేదు అని నిర్ధారణగా చూచిస్తుంది. "నేను సోదరభావంతో యికముందు మెలుగుతాను. నేను యికముందు ప్రేమిస్తాను" అని నేను అన్నప్పుడు, అసలు యథార్థం ఏమిటంటే - నేను ప్రేమించడం లేదు అని, నేను సోదరభావంతో మెలగడంలేదు అని. "ఇకముందు నేను వుండబోతాను" అని నేను మాట్లాడినంతకాలం నేను ప్రస్తుతం అది కానట్లే కదా! భవిష్యత్తులో సోదరభావంతో వుండబోతాను అనే ప్రతిపాదనను నా మనసులో నుండి నేను తొలగిస్తే, అప్పుడు యథార్థంగా నేను ఏమిటి అనేది నేను గ్రహించగలను; నాలో సోదరభావం లేదని నేను గ్రహించి, యిట్లాగ ఎందుకున్నాను అనేది తెలుసుకోవడం ఆరంభిస్తాను.

ఏది ముఖ్యం - నేను వున్నస్థితిని గ్రహించడమా లేదూ నేను ఏమి అవబోతానో దాన్ని గురించి ఆచరణ శూన్యమైన ఊహాగానాలు పెంచుకోవడమా? నేను వున్న స్థితిని గ్రహించడమే ప్రధానమయినది అని గట్టిగా చెప్పవచ్చును, ఎందుకంటే, అప్పుడు ఆ పరిస్థితితో నేను వ్యవహరించవచ్చును. నేను ఏదో అవబోవడం అనేది భవిష్యత్తుకి సంబంధించినది; భవిష్యత్తులో జరుగబోయే దానిని గురించి జోశ్యం చెప్పలేము. యథార్థమైన వాస్తవం ఏమిటంటే - నాలో సహోదరభావం లేదు, నేను నిజంగా ప్రేమించడం లేదు; ఈ వాస్తవం ఆధారంతో నేను ఆరంభించవచ్చు, నేను వెంటనే యీ విషయంలో ఏదయినా చేయవచ్చు. అంతేకాని, భవిష్యత్తులో ఒకరు ఏదో అవభోతారు అని అనడం వట్టి ఆదర్శవాదం; ఆదర్శవాది అనేవాడు ప్రస్తుతం వున్న స్థితి నుండి తప్పించుకొని పారిపోయే వ్యక్తి; అతడు వాస్తవం నుండి, వర్తమానంలో మాత్రమే సరిదిద్దగలిగిన వాస్తవం నుండి పారిపోతూ వుండే వ్యక్తి.

★ ★ ★

# అధ్యాయం 11

భయాన్ని గురించి మనం మాట్లాడుతున్నట్లు మీకు గుర్తుండే వుంటుంది. సరే, జ్ఞాన సంచయానికి అంటే జ్ఞానం పోగుచేసి పెట్టుకొనడానికి భయమే కారణం కాదూ? ఇది క్లిష్టమయిన విషయం, దీనిని గురించి పూర్తిగా తెలుసుకోగలమేమో చూద్దాం, జాగ్రత్తగా విచారించుకుంటూ పోదాం.

మానవులు జ్ఞానాన్ని కూడబెట్టుకుంటారు, జ్ఞానాన్ని పూజిస్తారు; ఒక్క శాస్త్రజ్ఞానాన్నే కాదు, ఆధ్యాత్మిక జ్ఞానం అని అంటారే, దానిని కూడా. గతంలో జరిగిపోయిన వాటిని గురించిన జ్ఞానం, జరగబోయే దానిని గురించిన జ్ఞానం, రెండూ జీవితంలో చాలా ముఖ్యమయినవని వాళ్ళు అనుకుంటారు. ఇట్లా సమాచారాన్ని కూడబెట్టుకోవడం, జ్ఞానాన్ని పూజించడం అనే యీ ప్రక్రియ అంతా భయపు నేపథ్యంలో జనించడం లేదూ? జ్ఞానం దారి చూపకపోతే మనం అయోమయంలో పడిపోతాం, మనం ఏవిధంగా ప్రవర్తించాలో మనకే తెలియదు అని మన భయం. అందుకని ఋషులు ఏం చెప్పారో అని చదవడం ద్వారా, యితరుల నమ్మకాలు, అనుభవాల ద్వారా; మన స్వంత అనుభవాల ద్వారా క్రమక్రమంగా జ్ఞానం అనే ఒక నేపథ్య వాతావరణాన్ని నిర్మించుకుంటాం; యిదే సంప్రదాయంగా మారుతుంది; మనం యీ సంప్రదాయం వెనకాల రక్షణ కోసం ఆశ్రయం వెదుక్కుంటాం. ఈ జ్ఞానం లేదా సంప్రదాయం అనేది మనకు అత్యంత ఆవశ్యకమని, అది లేకపోతే మనకి దిక్కుతోచకుండా పోతుందనీ, ఏం చేయాలో తోచని స్థితిలో పడిపోతామనీ మనం అనుకుంటాం.

సరే, జ్ఞానాన్ని గురించి మనం మాట్లాడుతున్నప్పుడు, అసలు ఆ మాటకి అర్థం ఏమిటి అని మీ అభిప్రాయం? జ్ఞానం అంటే తెలుసుకున్నది; మనం తెలుసుకున్నది ఏమిటి? మీరు కూడబెట్టుకున్న జ్ఞానం గురించి యోచించండి; అసలు మీరు తెలుసుకున్నది ఏమిటి? ఒక స్థాయిలో జ్ఞానం – వైజ్ఞానిక శాస్త్రం, యింజనీరింగు మొదలైన వాటిలో జ్ఞానం చాలా ముఖ్యమయినది; అయితే వీటికి పైగా, అతీతంగా ఆలోచిస్తే మనం తెలుసుకున్నదేమిటి?

ఈ జ్ఞానాన్ని పోగుచేసుకోవడం (జ్ఞానసంచయం) అనే ప్రక్రియ గురించి మీ రెప్పుడయినా యోచించి చూశారా? మీరెందుకు చదువుకుంటున్నారు? మీరు ఎందుకు పరీక్షలు పాసవుతున్నారు? ఒక స్థాయిలో జ్ఞానం చాలా అవసరం, అవును కదూ? గణితంలో, యింకా యితర విషయాల్లో జ్ఞానం లేకుండా ఎవరూ యింజనీరుగాని, శాస్త్రవేత్తగాని అవలేరు. సామాజిక సంబంధాలు యిటువంటి జ్ఞానం పైనే ఆధారపడి నిర్మించారు; మనం మన జీవనోపాధిని కూడా జ్ఞానం

లేకుండా సంపాదించుకోలేము. అయితే, యిటువంటి రకం జ్ఞానాన్ని మించిన దానిని గురించి మనకేం తెలుసు? దీనిని మించిన అతీతమైన జ్ఞానపు స్వభావ గుణం ఎటువంటిది?

దైవాన్ని కనుగొనడానికి జ్ఞానం అవసరం, మనల్ని మనం అవగాహన చేసుకోవాలంటే జ్ఞానం అవసరం, జీవితంలో ఎదురయే ఒడిదుడుకులను తట్టుకొని నిలబడాలంటే జ్ఞానం అవసరం – అని మనం అంటూ వుంటాం, దానికి అర్థమేమిటి? ఇక్కడ జ్ఞానం అంటే అనుభవము అన్నమాట; ఈ అనుభవం అంటే ఏమిటి? అనుభవం ద్వారా మనం తెలుసుకున్నది ఏమిటి? ఈ జ్ఞానాన్ని ఉపయోగించుకోవడం వల్లనే 'అహం', యీ జ్ఞానాన్ని ఉపయోగించుకొనే 'నేను' బలం పుంజుకోవడం లేదూ?

ఉదాహరణకి, నేను సమాజంలో ఒక అంతస్థును చేరుకున్నాను అనుకుందాం. ఈ అనుభవం, అంటే విజయం సాధించడం ద్వారా, ప్రతిష్ఠ, అధికారం ద్వారా నాలో కలిగిన కొన్ని భావాలతో కూడిన యీ అనుభవం – నాకు ఒక నిశ్చింత అయిన, సౌఖ్యవంతమైన మానసిక స్థితిని యిస్తుంది. కాబట్టి నా విజయసాధన గురించిన జ్ఞానం, నేను పేరుగలవాడిని, నాకు హోదా, అధికారం వున్నాయనే జ్ఞానం 'నేను'ను, అహాన్ని మరింత బలిష్ఠంగా తయారు చేస్తాయి; చేస్తాయి కదూ?

'పండితులు' ఎంతగా జ్ఞానంతో ఉబ్బిపోయి వుంటారో మీరు గమనించలేదూ? మీ నాన్నలో, మీ అమ్మలో, మీ టీచరులో కూడా, "నేను నీకంటే అనుభవం సంపాదించాను; నాకు తెలుసు, నీకు తెలియదు" అనే వైఖరిని జ్ఞానం కలిగించడం మీరు గమనించేవుంటారు. కనుక, వట్టి సమాచారం మాత్రమే అయిన జ్ఞానం క్రమక్రమంగా దురహంకారాన్ని పెంచి పోషించేదిగాను, 'అహా'నికి 'నా'కు మరికాస్త పుష్టిని చేకూర్చేదిగాను తయారవుతుంది. ఇదికాని, యిటువంటిదే మరొక ఆధారంకాని లేకుండా పరాశ్రయజీవి అయిన 'అహం' తన ఉనికిని నిలుపుకోలేదు.

పండితుని వలెనే శాస్త్రజ్ఞుడు కూడా స్వాహంకారాన్ని పోషించుకోవడానికి, తన గొప్పతనం తలచుకొని ఆనందించడానికి జ్ఞానాన్ని ఉపయోగించుకుంటాడు. అధ్యాపకులు, తల్లితండ్రులు, గురూజీలు – వీరందరూ ప్రపంచంలో తామూ గొప్పవాళ్ళు అవాలని అభిలషించే వాళ్ళే; అందుకని వీరు ఆ లక్ష్యం అందుకునే సాధనంగా, ఆ కోరికను తీర్చే సాధనంగా జ్ఞానాన్ని ఉపయోగించుకుంటారు; అసలు వారు మాట్లాడే మాటల వెనుకకు వెళ్ళి చూస్తే, వారికి నిజంగా తెలిసినది ఏముంటుంది? పుస్తకాల్లో వున్నదే, లేదూ వారి అనుభవంలోకి వచ్చినవే వారికి తెలిసినవి; వారి అనుభవాలు కూడా వారు నిబద్ధితులయివున్న నేపథ్య వాతావరణంలో కలిగినవే, ఆ వాతావరణం మీద ఆధారపడినవే అయివుంటాయి. వారిలాగానే మనలో చాలా మందిమి మాటలతో నిండిపోయి వుంటాం, జ్ఞానం అని పిలుస్తామే – ఆ సమాచారంతో నిండిపోయి వుంటాం; ఈ జ్ఞానం లేకపోతే మనం దారీ, తెన్నూ తెలియని అయోమయంలో పడిపోతాం; కనుక యీ మాటల తెరల వెనుక, యీ సమాచారపు తెరల వెనుక భయం ఎప్పుడూ తారట్లాడుతూనే వుంటుంది.

భయం ఎక్కడ వుంటుందో అక్కడ ప్రేమ వుండదు; ప్రేమభావం లేని జ్ఞానం మన వినాశనానికి కారణమవుతుంది. ప్రస్తుతం ప్రపంచంలో జరుగుతున్నది యిదే.

ఉదాహరణకి యిది తీసుకుందాం: ప్రపంచంలో వున్న మనుష్యులందరికీ ఆహారం యిచ్చేందుకు తగిన విజ్ఞానం ప్రస్తుతం మనవద్ద వున్నది; మానవ కోటి అంతటికీ ఆహారం యిచ్చి, దుస్తులు యిచ్చి, ఆశ్రయం కల్పించడం ఎట్లాగో మనకు తెలుసు; అయితే మనం ఆ పని చేయడంలేదు, ఎందుకంటే రకరకాల జాతీయకూటముల క్రింద మనల్ని విభజించుకొని వున్నాం. ఒక్కొక్క కూటమి తమ తమ స్వార్థ ప్రయోజన పూరిత కార్యకలాపాలలో మునిగిపోయి వుంటుంది; మనం నిజంగా యుద్ధం ఆపాలని కనుక కాంక్షిస్తూ వుంటే ఆపివేయగలం; కాని మనలో ఆ కాంక్ష లేదు, దానికీ పైన చెప్పినదే కారణం. కనుక ప్రేమభావం లేని జ్ఞానం వినాశనానికి సాధనం అవుతుంది. మనం యిది అవగాహన చేసుకునేటంతవరకు, వూరికే పరీక్షలు పాసవడం, ప్రతిష్ఠ, అధికారం వున్న పదవులు సాధించడం క్షీణతకు, కాలుష్యానికీ, మానవ గౌరవం మెలమెల్లగా మాడి మసియై పోవడానికి దారితీయడం అనేది అనివార్యం.

కొంత కొంత స్థాయిలో జ్ఞానం కలిగి వుండటం అత్యంత ప్రధానమైన విషయం. అయితే, మనిషి తన అహంకారం పెంచుకోవడానికి, స్వార్థ ప్రయోజనాల కోసం జ్ఞానాన్ని ఎట్లా ఉపయోగిస్తాడో తెలుసుకొనడం కూడా చాలా ముఖ్యం. మిమ్మల్ని మీరే పరిశీలించుకోండి. మనసు తన స్వీయ విస్తృతికోసం, అధికారం, పలుకుబడి సాధించడం కోసం అనుభవాల్ని ఎట్లా సాధనాలుగా నియోగిస్తుందో మీరు గ్రహిస్తారు. పెద్దవారిని తిలకించండి. వాళ్ళు పదవికోసం ఎట్లా ప్రాకులాడుతారో, తాము సాధించిన విజయాన్ని ఎట్లా పట్టుకొని వ్రేలాడుతారో గ్రహిస్తారు. వాళ్ళు తమకోసం ఒక సుర్యక్షితమయిన గూడు నిర్మించుకోవాలనుకుంటారు; అధికారం, పలుకుబడి, ఆధిపత్యం కావాలని కోరుకుంటారు; మనలో చాలమందిమి కూడా రకరకాల మార్గాల్లో యివే సాధించాలనుకుంటాం. మనం ఎటువంటి వారమయినా సరే, మనలాగే మనం వుండటానికి యిష్టపడం; మనం గొప్పవారుగా అయిపోవాలని కోరుకుంటాం. ఉన్న స్థితిలో వుండటానికి, మరేదో అయిపోవాలని కోరుకోవడానికి మధ్యన నిజంగానే చాలా అంతరం వున్నది. అగుట కోసం కోరిక లేక మరొకటి అయిపోవాలని కోరుకోవడం జ్ఞానం ద్వారా కొనసాగుతుంది, బలం పుంజుకుంటుంది. స్వీయఘనతను పెంచుకొనడానికీ మనిషి జ్ఞానాన్నే ఉపయోగించుకుంటాడు.

మనం పెరిగి పరిణతి చెందుతున్న కొద్దీ, యీ సమస్యలన్నింటినీ లోతుగా పరికించి అవగాహన చేసుకోవడం మనందరికీ చాలా అవసరమైనది; అప్పుడే ఒక వ్యక్తికి కేవలం గొప్ప బిరుదు వున్నదనో, ఉన్నతమైన హోదా వున్నదనో, అపరిమితమైన జ్ఞానసంపద వున్నదనే పేరు కలదనో అతనిని గౌరవించడం చేయం. యథార్థంగా మనకు తెలిసినది చాలా తక్కువ. మనం ఎన్నో పుస్తకాలు చదివి వుండవచ్చు. కాని చాలా కొద్దిమంది మాత్రమే ప్రత్యక్ష అనుభవాల ద్వారా అంటే నేరుగా తెలుసుకొని వుంటారు. స్వయంగా, ప్రత్యక్షంగా, నేరుగా సత్యమైన దానిని, దైవం అనే దానిని అనుభవంలోకి తెచ్చుకోవడమే అత్యంత ప్రధానమైన విషయం; ఇది పొందాలంటే ప్రేమభావం వుండితీరాలి.

# అధ్యాయం 12

**మనం** చిన్న వయసులో వున్నప్పుడే, మనల్ని యితరులు ప్రేమించడం, అసలు ప్రేమించడం 'అంటే ఏమిటి అనేది తెలుసుకోవడం, చాలా ముఖ్యమైనది కదూ? అయితే మనలో చాలామంది విషయంలో జరిగేది ఏమిటంటే, వారు ప్రేమించరు, వారిని యితరులు ప్రేమించరు అని నాకు అనిపిస్తున్నది. మనం చిన్న వయసులో వున్నప్పుడే యీ సమస్యని బాగా లోతుగా పరిశీలించి అవగాహన చేసుకోవడం చాలా అవశ్యకరమయిన విషయం అని నేను అనుకుంటున్నాను; అప్పుడే బహుశ మనలో ప్రేమభావాన్ని జనింపచేసే సున్నితత్వం కలుగుతుందేమో; దాని గుణగణాలు తెలుసుకొని, ఆ ప్రేమభావం పరిమళాలు ఆస్వాదించగలమేమో; ఆ విధంగా, వయసులో ఎదుగుతున్న కొద్దీ మనలో అది పూర్తిగా నశించిపోకుండా వుండిపోగలుగుతుంది. కనుక మనం యీ విషయాన్ని గురించి ఆలోచించి చూద్దాం.

ప్రేమ అంటే ఏమిటి? అది ఆదర్శమా, ఎన్నటికీ సుదూరంలో వుండిపోయేదా? అందుకోలేనిదా? లేదూ ప్రేమ అనే మనోభావాన్ని మనలో ప్రతి ఒక్కరం రోజులో ఏదో ఒక అనుకోని సమయంలో పొందగలుగుతామా? సానుభూతి చూపే, అవగాహన చేసుకునే గుణం కలిగి వుండటం, లోపల ఏ ఉద్దేశమూ లేకుండా మరొకరికి సహాయం చేసే సహజస్వభావంతో వుండటం, అప్రయత్నంగా యితరుల యెడల దయతో వుండటం, ఒక మొక్కకో, కుక్కకో సంరక్షణ చేయడం, ఒక పల్లెమనిషిని చూసి పరితాప పడటం, మీ స్నేహితుడి విషయంలో, యిరుగు పొరుగు విషయంలో ధారాళమైన ఔదార్యాన్ని చూపడం – మనం ప్రేమ అనుకునేది యిదే కదూ? ఎప్పుడూ, ఎల్లప్పుడూ వుంటూ వుండే క్షమాగుణమే తప్ప ఏ విధమయిన తిరస్కార భావం, ఆగ్రహం లేని ఒక స్థితినే ప్రేమ అనవచ్చును కదూ? మనం చిన్న వయసులో వున్నప్పుడే యీ మనోభావం ఎటువంటిదో తెలుసుకోవడం సాధ్యం కాదా?

చిన్న వయసులో వున్నప్పుడు మనలో చాలామంది యిటువంటి మనో భావాలను అనుభవంలో చవి చూసి వుంటారు – ఒక పల్లెమనిషి పైనో, ఒక కుక్కపిల్ల మీదనో, చాలా చిన్నవారి మీదనో, నిస్సహాయంగా వున్న వారి మీదనో అకస్మాత్తుగా కలిగే స్నేహపూరితమయిన సహానుభూతి వంటివి. ఈ భావాన్ని నిరంతరంగా సంరక్షించుకుంటూ వుండాలి కదూ? మరొకరికి ఉపకారం చేయడానికి, ఒక చెట్టుకో, తోటకో సంరక్షణ చేయడానికి, యింట్లోగాని, హాస్టలులోగాని పనులలో సహాయపడటానికి, మీరు రోజూ ఏదో కొంత సమయాన్ని కేటాయించవద్దూ? దీనివలన, మీరు ఎదిగి, పరిణతి చెందినపుడు, సహజంగానే అంటే, మరొకరు

ఒత్తిడి వుపయోగించడం వలన కాకుండా, వెనకాల ఏదో ఉద్దేశం వుండటం వలన కాకుండా, సహజంగానే దయాదాక్షిణ్యాలు కలిగివుండటం అంటే ఏమిటో మీకు తెలుస్తుంది. ఇటువంటి నిజమయిన ఆప్యాయత అనే గుణం మీరు కలిగి వుండవద్దూ?

కృత్రిమమైన పద్ధతుల్లో అలవర్చుకునేది కాదు నిజమయిన ఆప్యాయత అంటే; మనోగతంలో అది కలుగుతుంది, అంతే; అట్లాగే మీ సంరక్షకుని (గార్డియన్), మీ తల్లితండ్రుల, మీ టీచర్ల మనసుల్లో ఆ భావం కలగాలి. చాలామందిలో నిజమయిన ఆప్యాయత వుండదు; వారికి వారు సాధించిన వాటిని గురించి, వారి మనోవాంఛల గురించి వారి జ్ఞానం, వారి విజయాలు – వీటిని గురించిన ఆరాటంతోనే సరిపోతుంది. వారు తాము యింతకు మునుపు చేసిన పనులకు, యికముందు చేయబోతున్న వాటికి బ్రహ్మాండమయిన ప్రాముఖ్యత యిస్తారు; చిట్టచివరకు అదే వారిని సర్వనాశనం చేస్తుంది.

అందుకోసమే, మీరు చిన్న వయసులో వున్నప్పుడే, హాస్టలులోనూ, యింట్లోనూ మీరు వుండే గదులకు సంబంధించిన పనులు చూసుకోవడంలోనూ సహాయం చేయడం, మీరే పాతిన చెట్లలో కొన్నింటికి పోషణ భారం వహించడం, జబ్బులో వున్న స్నేహితుని సహాయార్థం వెళ్ళడం అనే వాటికి చాలా ప్రాముఖ్యం యివ్వాలి. దీని ద్వారా ఒక సుకుమారమయిన సానుభూతి భావం, అక్కర, ధారాళ స్వభావంతో వుండటం అనేవి కలుగుతాయి. నిజమైన ధారాళ స్వభావం అంటే కేవలం మనసుకు సంబంధించినదే కాదు; దీనివలన మీకు ఎంత వుంటే అంతని, చాలా తక్కువగా వున్నా సరే, మరొకరితో పంచుకోవాలని కోరుకుంటారు. మీ చిన్న వయసులోనే యిటువంటి ప్రేమభావం, ధారాళబుద్ధి, దాక్షిణ్యభావం, సౌమ్యత మీలో లేనట్లయితే, పెద్దవారయాక అవి మీలో కలగడం చాలా కష్టం; అయితే మీలో యిప్పుడే కనుక యివి ఆరంభమయామంటే, బహుశ యితరులలో కూడా మీరు వాటిని మేలు కొలుపగలుగుతారు.

సానుభూతి, ఆప్యాయత కలిగి వుండటం అంటే దాని అంతరార్థం భయాన్నుండి విముక్తి అని, అవును కదూ? అయితే చూడండి, భయం అనేది లేకుండా, చేసే పనులకు వెనకాల స్వార్థ ప్రయోజనం లేకుండా యీ ప్రపంచంలో పెరిగి పెద్దవాళ్ళవడం చాలా కష్టం; పెద్దవారు ఎప్పుడూ యీ భయాన్ని గురించిన సమస్యను పట్టించుకోలేదు; ఒకవేళ పట్టించుకున్నా అదేదో వాస్తవ ప్రపంచానికి సంబంధించినది కాదు అన్నట్లుగా భావించారు; రోజువారీ జీవిత విధానంలో దానిని గురించి ఏ చర్యా తీసుకోలేదు. మీరు యింకా వయసులో చిన్నవారు, అన్నీ జాగ్రత్తగా గమనిస్తున్నారు, తరచి చూస్తున్నారు, నేర్చుకుంటున్నారు; అయితే భయానికి కారణమయిన దేమిటో తెలుసుకొని, అవగాహన చేసుకొనకపోతే మీరు కూడా మీ పెద్దవారిలాగే తయారవుతారు. భూమిలోపల దాగివున్న కలుపు మొక్కలలాగా భయం కూడా పెరిగి అంతటా వ్యాపించి మీ మనసులను వక్రంగా తయారుచేస్తుంది. కనుక, మీరు మీ చుట్టూరా జరుగుతున్నవాటిని గురించీ, మీ లోలోపల జరుగుతున్నదాన్ని గురించీ ఎరుకగా వుండాలి – మీ టీచర్లు ఎట్లా

మాట్లాడుతున్నారు, మీ తల్లితండ్రులు ఎట్లా ప్రవర్తిస్తున్నారు, మీరు ఏ విధంగా ప్రతిస్పందిస్తున్నారు – యివన్నీ, అప్పుడే యీ భయం అనే సమస్యను గురించి మీరు గ్రహించి అవగాహన చేసుకోగలుగుతారు.

ఏదో ఒక రకమయిన క్రమశిక్షణ అవసరమని చాలామంది పెద్దవారు అనుకుంటారు. క్రమశిక్షణ అంటే ఏమిటో మీకు తెలుసునా? మీకు చేయడానికి యిష్టంలేని పనులను మీ చేత చేయించడానికి అవలంబించే ఒక పద్ధతి. క్రమశిక్షణ వున్నచోటనే భయం వుంటుంది; కాబట్టే క్రమశిక్షణ అనేది ప్రేమభావానికి దారితీసే పద్ధతి కానేకాదు. అందుకనే ఏదో ఒక విధంగా యీ క్రమశిక్షణ అనే పద్ధతిని విసర్జించి వేయాలి –– నిర్బంధించడము, నిరోధించడము, బలవంతం చేయడం, ప్రతిఫలం యిస్తామని ప్రలోభపెట్టి మీ చేత చేయించడము – యివన్నీ క్రమశిక్షణలోనే రకాలు. మీకు ఏదయినా అవగాహన కానప్పుడు మీరు దానిని చేయకండి, మరొకరి నిర్బంధంవల్ల కూడా చేయకండి. వివరణ కోసం అడగండి; మొండితనంగా వుండకండి; అయితే ఆ విషయంలోని అసలు సత్యమేదో గ్రహించడానికి ప్రయత్నించండి; అప్పుడే అందులో భయపు ప్రసక్తి లేకుండా వుంటుంది; మీ మనసు మృదువుగా మారి, పెళుసుదనం లేకుండా సునాయాసంగా వంగే వెదురుబద్ద వంటి గుణాన్ని సంతరించుకుంటుంది.

మీకు అర్థం కాని వాటిని, పెద్దవారు తమ అధికార బలంతో నిర్బంధం చేసి మీచేత చేయిస్తూవుంటే, మీ మనసును మీరే అణగద్రొక్కుతూ వుంటారు; అప్పుడు భయానికి ఉనికి ఏర్పడుతుంది; ఈ భయమే మిమ్మల్ని జీవితాంతం నీడలా వెన్నాడుతుంది. అందువల్లనే, ఒక ప్రత్యేకమయిన ఆలోచనా ధోరణిని, కార్యాచరణ విధానాన్ని అనుసరించే క్రమశిక్షణకి మీరు లోనుకాకుండా వుండటం అనేది చాలా ముఖ్యం. కాని చాలా మంది పెద్దవారు యీ విధంగా తప్ప ఆలోచించలేరు. మీకు 'మంచిది' అని వారు అనుకునేది మీచేత చేయించాలని కోరుకుంటారు. మీ మంచి కోసమని మీ చేత యీ విధంగా చేయించడమనే పద్ధతి మీ సున్నితత్వాన్ని, అవగాహన చేసుకోవడంలో మీ శక్తి సామర్థ్యాలను, తద్వారా మీలోని ప్రేమభావాన్ని నశింపజేస్తుంది. నిర్బంధాన్ని, బలాత్కారాన్ని ఎదిరించడం చాలా కఠినమయిన పని; ఎందుకంటే మన చుట్టూ వున్న ప్రపంచం చాలా శక్తివంతమైనది; అయితే మనం అన్నింటికీ తలవంచి వప్పేసుకొని, అవగాహన చేసుకోకుండానే అచరిస్తూ వుంటే, మనలో ఆలోచనా రాహిత్యం కూడా ఒక అలవాటు కింద తయారవుతుంది; ఆ తరువాత దీనినుండి తప్పించుకోవడం మరింత కఠినతరమవుతుంది.

ఇప్పుడు చెప్పండి. మీ స్కూల్లో అధికారపు పెత్తనం, క్రమశిక్షణ వుండాలంటారా? లేదూ మీ టీచర్లు యీ సమస్యలను గురించి చర్చించి, లోతుగా పరిశీలించి, అవగాహన చేసుకోవడానికి మిమ్మల్ని ప్రోత్సహించాలనుకుంటారా? అట్లా ప్రోత్సహిస్తే, మీరు పెరిగి పెద్దవారయాక, బయట ప్రపంచంలోకి అడుగు పెట్టినప్పుడు లోకంలోని సమస్యలను ప్రజ్ఞావంతంగా ఎదుర్కొనే శక్తిసామర్థ్యాలు కల పరిణతి చెందిన మనిషిగా మీరు అయేందుకు వీలవుతుంది. మీలో ఏరకమయిన భయంగాని వుంటే, యిటువంటి గాఢమైన వివేకం మీలో కలగడం అనేది సాధ్యమవదు. భయం మిమ్మల్ని మందకొడిగా తయారుచేస్తుంది. మీ అంతఃస్ఫూర్తిని ఆటంక పరుస్తుంది;

మనం సానుభూతి, ధారాళ స్వభావం, ఆప్యాయత, ప్రేమభావం అని పిలుచుకునే ఆ జ్వాలను హరింపజేస్తుంది. కనుక, ఒక నిర్ణీతమయిన కార్యాచరణ విధానంలో మిమ్మల్ని యిమిడ్చే క్రమశిక్షణను మీరు అనుమతించకుండా, దానిని గురించి అంతా తెలుసుకోండి; అంటే అర్థం మీకు ప్రశ్నించడానికి, తరచి చూడటానికి తగినంత సమయం వుండితీరాలి; టీచర్లకి కూడా తగినంత వ్యవధి వుండాలి; సమయం లేదు అనుకుంటే కొంత సమయాన్ని దీనికోసం ప్రత్యేకం కేటాయించాలి. భయం కాలుష్యాన్ని సృష్టించే ఒక మూల కేంద్రం; క్షీణతకు అది ఆరంభస్థానం; అన్ని పరీక్షలకంటె, పాండిత్యాన్ని ప్రదర్శించే డిగ్రీలకంటె భయం నుండి విముక్తి చెందడమే ముఖ్యమయినది.

ప్రశ్న: అసలు ప్రేమ అంటే తనకు తానుగా ఏమిటి?

కృష్ణమూర్తి: ప్రేమకుగల స్వతఃశీలత ఏమిటి? అదేనా మీరు అడగదలుచుకున్నదీ? ఏ హేతువూ, ఏ ప్రేరేపకమూ లేకుండా ప్రేమ వుంటుందా? ఏ ప్రయోజనమూ, ఆశా లేకుండానే ప్రేమ కలుగుతుందా? జాగ్రత్తగా వినండి, అప్పుడే మీరు తెలుసుకోగలుగుతారు. మనం యీ ప్రశ్నను పరీక్షిస్తున్నాం. సమాధానం కోసం వెతకడం లేదు. గణితశాస్త్రం అధ్యయనం చేస్తున్నప్పుడు, ఏదయినా సందేహం వెలిబుచ్చుతున్నప్పుడు, మీలో చాలామంది తమ దృష్టిని ఆ సమస్యని అవగాహన చేసుకోవడం మీద కాకుండా, సమాధానం మీదే ప్రసరింపజేస్తూ వుంటారు. మీరు సమస్యని అధ్యయనం చేసినట్లయితే, లోతుగా పరికించినట్లయితే, పరీక్షించినట్లయితే, అవగాహన చేసుకున్నట్లయితే ఆ సమస్యలోనే మీకు సమాధానం దొరుకుతుంది. కాబట్టి, మనం యిప్పుడు అసలు సమస్య ఏమిటో అవగాహన చేసుకుందాం; సమాధానం కోసం భగవద్గీతనో, ఖురానునో, బైబిలునో వెదకవద్దు; ఏ ప్రొఫెసరునో, లెక్చరరునో అడగనూ వద్దు. మనం కనుక సమస్యను నిజంగా అవగాహన చేసుకోగలుగుతే సమాధానం అందులోనుండే వస్తుంది; సమాధానం ఎప్పుడూ సమస్యలోనే యిమిడి వుంటుంది కాబట్టి, అది సమస్య నుండి విడిగా వుండదు కనుక.

ఇప్పుడు, సమస్య ఏమిటంటే; ఉద్దేశ్య రహితమయిన ప్రేమ ఏమిటి? ఏ ప్రేరేపకమూ వెనకాల లేకుండా ప్రేమ వుంటుందా? ప్రేమనుండి తమకోసం ఏమీ కోరుకోకుండా వుండటం అనేది వుంటుందా? అవతల వారు కూడా స్పందించి ప్రేమించనప్పుడు గాయపడటం అనే భావం లేని ప్రేమ వుంటుందా? నేను నా స్నేహహస్తం మీ వైపు జాపినప్పుడు మీరు తిరస్కరిస్తే నేను నొచ్చుకోనూ? ఈ నొచ్చుకోవడం అనేది నిజంగా స్నేహభావం వుండటం వల్లనే కలుగుతున్నదా, నిజంగానే ఔదార్యానికి, ధారాళ స్వభావానికి లేదూ సానుభూతికి ఫలితంగానే కలుగుతున్నదా? నేను యీ విధంగా నొచ్చుకుంటున్నంతవరకు, నాలో భయం వున్నంత వరకు, మీరు తిరిగి నాకు సహాయం చేస్తారేమో అనే ఆశతో నేను మీకు సహాయం చేస్తున్నంతవరకు – పైగా దీనినే 'సేవ' అని కూడా అంటుంటారు – ప్రేమ అనేది వుండదని ఖండితంగా చెప్పవచ్చు.

ఇది మీకు అవగాహన అయిందంటే, మీకు సమాధానం లభించినట్లే.

ప్రశ్న: మతం అంటే ఏమిటి?

**కృష్ణమూర్తి:** మీకు సమాధానం నానుండి కావాలా? మీ అంతట మీరే అన్వేషించి తెలుసుకోవాలనుకుంటున్నారా? ఎవరో ఒకరు, ఒక గొప్పవాడో, మూర్ఖుడో మీకు సమాధానం యిస్తే సరిపోతుందా? సరిపోతుందనుకుంటున్నారా? లేదూ నిజంగానే మతం అంటే ఏమిటి అనే సత్యాన్ని తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నారా?

యథార్థమయిన మతం అంటే ఏమిటో తెలుసుకోవాలంటే, దారిలో అడ్డంగా వున్న వాటిని అన్నింటినీ పక్కకు నెట్టివేయవలసిందే. కిటికీలకు వున్న గాజు తలుపులు రంగువయి వున్నప్పుడు, మురికిగా వున్నప్పుడు మీరు బయటి సూర్యకాంతిని స్పష్టంగా చూడాలనుకుంటే, ఆ కిటికీలను శుభ్రపరచాలి. లేదా పూర్తిగా తెరవాలి. లేదూ అంటే ఆరుబయటకు వెళ్ళాలి. అదే విధంగా యథార్థమయిన మతం అంటే ఏమిటి అని తెలుసుకోవాలంటే మొట్టమొదట అది ఏది కాదో అది తెలుసుకొని దానిని పక్కకు నెట్టేయాలి. అప్పుడిక మీరు మతం అంటే ఏమిటో తెలుసుకోవచ్చు. ఎందుకంటే అప్పుడు సూటిగా గ్రాహ్యం చేసుకోవడానికి వీలవుతుంది కాబట్టి; ముందుగా మతం అంటే ఏమి కాదో తెలుసుకుందాం.

పూజ చేయడం, ఒక కర్మకాండను ఆచరించడం – అదేనా మతం అంటే? ఏదో ఒక ఆచారవిధినో, ఒక మంత్రాన్నో పూజాగృహపు వేదిక ముందో, దేవుని విగ్రహం ముందో పదేపదే పునశ్చరణ చేస్తారు. అందులో మీకు ఏదో సంతోషం, ఒక సంతృప్తికరమయిన భావం కలగవచ్చు. కాని, అదేనా మతం అంటే? యజ్ఞోపవీతం వేసుకోవడం, మీరు ఒక హిందువుననో, బౌద్ధుడిననో, క్రిస్టియనుని అనో చెప్పుకోవడం, కొన్ని సంప్రదాయాలను, అంధ విశ్వాసాలను, నమ్మకాలను ఆమోదించి, అనుసరించడం – వీటన్నింటికీ మతంతో ఏమయినా సంబంధం వుందా అసలు? ఏ మాత్రం లేదు. కాబట్టి, మనసు యివన్నీ అవగాహన చేసుకొని, వాటిని త్రోసిరాజన్నాక కానీ, మతం అనే దానిని తెలుసుకోవడం సాధ్యంకాదు.

మతం అన్నదాని నిజమయిన అర్థం తీసుకున్నామంటే, దానివలన విభజన జరగదు కదూ? కాని, మీరు ముస్లిము, నేను క్రిస్టియను అయినప్పుడు, నాకు ఒకదానిలో నమ్మకం వుండి, అందులో మీకు నమ్మకం లేనప్పుడు ఏమవుతుంది? మన నమ్మకాలు మనల్ని విభజిస్తాయి; కాబట్టి మన నమ్మకాలకు, మతానికి సంబంధం లేదన్నమాట. మనకి దేవునిలో నమ్మకం వున్నదా లేదా అన్నదానికి యిక్కడ ఏ ప్రాధాన్యమూ లేదు. ఎందుకంటే మనం ఏమి నమ్ముతాము, ఏమి నమ్మము అనే దానిని మనం పొందిన నిబద్ధీకరణం నిర్ణయిస్తుంది, అవును కదూ? మన చుట్టూ వున్న సమాజం, మనం పుట్టి పెరిగిన సంస్కృతీ వాతావరణం మన మనసులమీద కొన్ని నమ్మకాల, భయాల, అంధ విశ్వాసాల ముద్రలను అచ్చు వేస్తుంది. వీటినే మనం మతం అనుకుంటాం; కాని వీటికి మతంతో ఏ సంబంధమూ లేదు. నేను ఒక మార్గాన్ని నమ్మడం, మీరు మరో దానిని నమ్మడం అనే దానిమీద ఆధారపడి వుంటాయి. ఇంగ్లండులో, రష్యాలో, ఇండియాలో, అమెరికాలో యిట్లాగ. కాబట్టి

నమ్మకం మతం అవదు, అది అంటే నమ్మకం మన నిబద్ధీకరణం ద్వారా కలిగిన ఫలితం.

ఇక మనిషి తన స్వీయ ముక్తికోసం పడే ఆరాటం ఒకటుంది. నేను సురక్షితంగా వుండాలి; నేను 'నిర్వాణం' అందుకోవాలి, లేక స్వర్గం చేరుకోవాలి; జీసస్ పక్కనో, బుద్ధుని పక్కనో, మరో దేవుని కుడిచేతివైపునో నేను ఒక స్థానాన్ని అందుకోవాలి. మీకు వుండే నమ్మకం నాకు పరిపూర్ణమయిన సంతృప్తిని, సౌఖ్యాన్ని యివ్వదు కాబట్టి, వాటిని నాకు యిచ్చే నా స్వంత నమ్మకం నాకు మరొకటి వుంటుంది. అయితే యిదేనా మతం అంటే? నిజమయిన మతం అంటే ఏమిటో తెలుసుకోవాలంటే మన మనసులను వీటన్నింటి నుండి విముక్తం చేసుకోక తప్పదు.

మతం అంటే కేవలం ఉపకారం చేయడం, సేవ చేయడం, సహాయం అందివ్వడం అనే వాటికి చెందినదేనా? ఇంతకంటే యింకా ఎక్కువ ఏమయినా వున్నదా? అట్లాగని మనం ధారాళమైన ఔదార్యంతోను, దయాగుణంతోను వుండగూడదని అర్థంకాదు. ఇంతమాత్రమేనా అని. మతం అంటే మనసు ఊహల్లో కల్పన చేసిన దానికంటే మరింత మహత్త్వపూర్ణ మయినది, యింకా స్వచ్ఛమైనది, యింకా అధికంగా విశాలమయినది కాదూ?

కనుక, నిజమయిన మతం అంటే ఏమిటో కనిపెట్టాలంటే వీటన్నింటి గురించి లోతుగా తరచి చూసి, భయభీతి నుండి విముక్తులయి వుండాలి. ఇది అంధకారంలో వున్న యింటిలో నుండి సూర్యకాంతి లోనికి రావడం వంటిది. అప్పుడు మీరు మతం అంటే ఏమిటి అని అడగరు; మీకే తెలిసిపోతుంది. సత్యమయిన దానిని ప్రత్యక్షంగా అంటే నేరుగా అనుభవించడం అనేది జరుగుతుంది.

**ప్రశ్న: విచారంలో మునిగి వున్నవారు ఒకరు సంతోషంగా వుండాలని కోరుకుంటారనుకోండి, అది ఆకాంక్ష పడటం అవుతుందా?**

**కృష్ణమూర్తి:** మీరు బాధపడుతున్నప్పుడు ఆ బాధనుండి విముక్తి పొందాలను కుంటారు; అది ఆకాంక్షించడం అవుతుందా? అవదు. ప్రతి వారిలోనూ వుండే సహజేచ్ఛ అది. మనందరిలోనూ స్వభావసిద్ధంగానే భయం లేకుండా వుండాలని, శారీరకమయిన, మానసికమయిన బాధలు లేకుండా వుండాలని సహజేచ్ఛలు వుంటాయి. అయితే జీవితం ఎటువంటిది అంటే – మనం నిరంతరంగా ఏదో ఒక బాధని అనుభవిస్తూనే వుంటాం. నాకు సరిపడనిది ఏదో నేను తింటాను, నాకు కడుపునొప్పి వస్తుంది. నన్ను ఎవరో ఏదో అంటారు, నేను నొచ్చుకుంటాను. నేను ఒక పనిని చేయాలని ఎంతగానో వాంఛిస్తాను, కాని ఏదో నన్ను నిరోధిస్తుంది. దాంతో నేను భంగపాటు చెంది విసుగూ, వ్యాకులత పొందుతాను. నా తండ్రి లేదా నా పుత్రుడు మరణించాడని విచారపడుతూ వుంటాను, యిట్లాగే యింకా ఎన్నో. నాకు యిష్టం వున్నా లేకపోయినా జీవితం తన ప్రభావం నా మీద చూపుతునే వుంటుంది; ప్రతిసారీ నేను గాయపడతాను, ప్రతిసారీ భంగపడి వేదన చెందుతాను, ప్రతిసారీ బాధతో ప్రతిస్పందిస్తూనే వుంటాను. కాబట్టి, నేను

చేయవలసింది ఏమిటంటే – యీ ప్రక్రియని అంతా అవగాహన చేసుకోవడం. కాని మీరు చూశారో లేదో, మనలో చాలా మందిమి దీనినుండి తప్పించుకొని పారిపోవాలని చూస్తాం.

మీరు లోలోపల, మానసికంగా బాధపడుతున్నప్పుడు ఏం చేస్తారు? ఓదార్పు కోసం ఎవరినయినా ఆశ్రయిస్తారు; ఒక పుస్తకం చదువుతారు; రేడియో పెడతారు; లేదా వెళ్ళి పూజ చేద్దామని కూర్చుంటారు. ఇవన్నీ మీరు బాధనుండి పారిపోతున్నారనడానికి సూచనలు. దేనినుండి అయినా మీరు పారిపోవాలని చూస్తున్నారంటే దానిని మీరు అవగాహన చేసుకోలేదని అర్థం. మీరు మీ బాధని పరికించి చూసినట్లయితే, క్షణక్షణమూ దానిని పరిశీలిస్తున్నట్లయితే, అందులో చిక్కుపడి వున్న సమస్య ఏమిటో మీకు అవగతమవుతుంది; యిది ఆకాంక్ష పడటం కాదు. మీ బాధనుండి మీరు తప్పించుకొని పారిపోయినప్పుడు లేదా దానిని పట్టుకొని వ్రేలాడినప్పుడు లేదా దానితో పోరాటం సాగించినప్పుడు, లేదా దాని చుట్టూరా క్రమక్రమంగా సిద్ధాంతాలూ, ఆశలూ నిర్మించినప్పుడు, అప్పుడు ఆకాంక్షపడటం అన్నది ఆరంభమవుతుంది. బాధనుండి తప్పించుకొని మరోదాని వద్దకు పారిపోగానే, ఆ మరొక దానికి చాలా ప్రాధాన్యం వస్తుంది; ఎందుకంటే – మీరు ఆ మరొకదానితో తాదాత్మ్యం చెందుతారు. మీ దేశంతోనో, మీ హోదాతోనో, మీ దైవంతోనో మీరు పూర్తిగా తాదాత్మ్యం చెందుతూ వుంటారు; ఇది ఆకాంక్ష పడటానికి మరో రూపం, అంతే.

★ ★ ★

# అధ్యాయం 13

ఈ ప్రసంగాలలో నేను చెప్పేది అంతా, వూరికే విని జ్ఞాపకం పెట్టుకోవడానికి కాదు. మీరు విన్నదంతా మీ మనసులో నిలవచేసుకునే ప్రయత్నం చేసి, ఆ తరువాత ఎప్పుడో జ్ఞాపకం చేసుకొని, దానిని గురించి యోచించడం కోసమో, ఆచరణలో పెట్టడం కోసమో ఉద్దేశించబడినది కాదు – యిదంతా. నేను మీకు చెప్తున్నదంతా మీ మనసులో వూరికే నిలవచేసివుంచుతే, అది వట్టి స్మృతి అవుతుంది; ఒక సజీవమైన విషయం అవదు; మీరు నిజంగా అవగాహన చేసుకున్న విషయం అవదు. ప్రధానమైన సంగతి ఏమిటంటే అవగాహన చేసుకోవడం; జ్ఞాపకం పెట్టుకోవడంకాదు. ఈ రెండింటికి నడుమగల వ్యత్యాసాన్ని మీరు చూడగలుగుతున్నారని ఆశిస్తాను. అవగాహన తక్షణమే జరుగుతుంది; ప్రత్యక్షంగాను, మీరు తీవ్రంగా అనుభవించేదిగాను వుంటుంది. అయితే మీరు విన్నదానిని వూరికే జ్ఞాపకం పెట్టుకున్నట్లవుతే, అది ఒక నమూనాగా మాత్రమే మిగిలిపోతుంది; మార్గ నిర్దేశం చేసేదానిలాగా, మళ్ళీ మళ్ళీ పునరావృతం చేసే నినాదంలాగా, అనుకరించడానికి ఒక అభిప్రాయంలాగా, మీ జీవితాన్ని మలచుకోవడానికి ఒక ఆదర్శంలాగా మాత్రమే మిగిలిపోతుంది. అవగాహన అంటే స్మృతికీ, స్మరణకీ సంబంధించిన విషయం కాదు – అది ఒక నిరంతరమయిన సునిశితత్వం, అనంతమయిన అన్వేషణ.

కనుక, నేను మాట్లాడుతున్నది మీరు కేవలం జ్ఞాపకం పెట్టుకొని వూరుకున్నారంటే, మీకు గుర్తువున్న విషయాలతో మీ ఆచరణను పోల్చిచూసుకోవడం, ఆ ప్రకారంగా మార్చుకోవాలని ప్రయత్నించడం, సరిదిద్దుకోవాలని ప్రయత్నించడం చేస్తారు. కాని మీరు నిజంగా నేను చెప్పినది అవగాహన చేసుకున్నట్లయితే, ఆ అవగాహనలో నుండి మీ ఆచరణ జనిస్తుంది; అప్పుడు మీరు జ్ఞాపకం వున్నవాటిని ఆధారంగా చేసుకొని ఆచరణ చేయనవసరం వుండదు. అందువల్ల జ్ఞాపకం పెట్టుకోవడం ప్రధానం కాదు; వినడం, వెంటనే అవగాహన చేసుకోవడం ప్రధానమయినవి.

మీరు కొన్ని మాటలు, కొన్ని పదప్రయోగాలు గుర్తు పెట్టుకొని, లేదా యిప్పుడు యిక్కడ జాగృతం చేసిన మనోభావాలను మననం చేసుకొని, మీ ఆచరణను మీరు జ్ఞాపకం వుంచుకున్నవాటితో పోల్చి చూసుకున్నప్పుడు వాటి నడుమన అంటే మీరు గుర్తు వుంచుకున్న విషయాలకూ, ఆచరణకూ మధ్యన తప్పకుండా కొంత అంతరం వుండి తీరుతుంది. అయితే, మీరు నిజంగా అవగాహన చేసుకున్నప్పుడు మరొకరు చెప్పినట్లుగా తయారవడం అనేది వుండదు. ఏ మాత్రం శక్తి సామర్థ్యాలు కలిగివున్న వారయినా మాటలను గుర్తు పెట్టుకొని పరీక్షల్లో ఉత్తీర్ణులవవచ్చు; కాని,

మీరు చూస్తున్న దానిని, వింటున్న దానిని, మీ మనోభావాలను వాటిలోని లోతుపాతులతో సహా అవగాహన చేసుకోవడం ఆరంభించారంటే ఆ అవగాహనలో నుండే మీ ఆచరణ జనిస్తుంది; యీ ఆచరణకు మీరు మార్గ నిర్దేశం చేయ నవసరంలేదు. దాని రూపు సరిదిద్ద నక్కరలేదు. దానిని అదుపులో పెట్టనవసరమూ లేదు.

మీరు కేవలం జ్ఞాపకం పెట్టుకోవడం కనుక చేస్తే, ఎప్పుడూ పోల్చి చూస్తూ వుంటారు; ఈ సామ్యాసామ్యాలు చూడటం ఈర్ష్యను పెంచి పోషిస్తుంది; దీనిని ఆధారం చేసుకునే యీ వస్తు సంచయం చేసే మన సమాజం మొత్తం తయారయివున్నది; పోల్చి చూడటం అనేది ఎన్నటికీ అవగాహనను కలిగించలేదు. అవగాహనలో ప్రేమభావం వున్నది. అదే సామ్యాసామ్య పరిశీలనలో అయితే మేధాశక్తిని ప్రయోగించడం వుంటుంది; అనుకరణ, అనుసరణ అనే మానసిక ప్రక్రియ వుంటుంది; దీనివలన అధినేత, అతని వెంట నడిచే అనుయాయులు ఏర్పడటం అనే ప్రమాదం తప్పకుండా కలుగుతుంది. దీనిని మీరు గ్రహించారా?

అధినేత, అనుయాయులు, దృష్టాంతము, ఆ దృష్టాంతాన్ని అనుసరించేవాడు, ఒక నాయకుడు, ఆ నాయకుడిని వీరపూజ చేసేవాడు అనే వాటి ఆధారంగా యీ లోకంలో సామాజిక స్వరూపం ఏర్పడి వుంది. నేతృత్వం, అనుయాయత్వం అనే యీ విధానాన్ని లోతుగా పరికించి చూసినట్లయితే, ఒకరు మరొకరిని అనుసరించినప్పుడు అంతఃస్ఫూర్తి అనేది వుండదని మీరు గ్రహిస్తారు. మీకుగాని, నేతృత్వం వహించినవారికిగాని స్వేచ్ఛ వుండదు, ఎందుకంటే, అధినేతను మీరు సృష్టిస్తారు, అపయిన అధినేత మిమ్మల్ని అదుపు చేస్తాడు. స్వార్థ త్యాగము, మహోన్నతి, వివేకము, ప్రేమభావము – యిట్లా మీరు ఒక దృష్టాంతాన్ని అనుసరిస్తున్నంతవరకు, మీరు జ్ఞాపకం పెట్టుకొని, అచ్చం అదే మాదిరిగా వుండాలనుకొనే ఒక ఆదర్శం మీకు వున్నంత వరకు, ఆదర్శానికీ, మీ ఆచరణకు నడుమన కొంత అంతరం, విభజన తప్పకుండా వుంటూనే వుంటాయి. ఇందులోని సత్యాన్ని నిజంగా గ్రహించగలిగిన వాడికి ఆదర్శం వుండదు, దృష్టాంతం వుండదు; అతను ఎవరినీ అనుసరించడు. అతనికి గురువు వుండడు, మహాత్ముడు వుండడు, నేతృత్వం వహించే నాయకుడు వుండడు. అతను నిరంతరం తన లోలోపల వున్నదానిని అవగాహన చేసుకుంటూ వుంటాడు; యితరులు చెప్పేదానిని – అది తన తండ్రి కావచ్చు, తల్లి కావచ్చును, టీచరు లేదా ఎప్పుడో ఒకసారి అతని జీవితంలో తటస్థపడే నావంటివాడు కావచ్చును – వారు చెప్పేది అతను నిరంతరంగా అవగాహన చేసుకుంటూ వుంటాడు.

ఇప్పుడు మీరు కనుక వింటూ, అవగాహన చేసుకుంటూ వుంటే మీరు అనుసరణగాని, అనుకరణకాని చేయడంలేదు అన్నమాట; కాబట్టి మీలో భయం వుండదు, అందుకని ప్రేమభావం వుంటుంది.

ఇదంతా మీరే స్వయంగా, స్పష్టంగా చూసి తెలుసుకోవడం చాలా ముఖ్యం. అప్పుడే మీరు నాయకమ్మన్యుల చేత సమ్మోహితులవడం, దృష్టాంతాలను, ఆదర్శాలను చూసి వివశులయి లొంగిపోవడం జరగదు. దృష్టాంతాలను, ఆదర్శాలను, నాయకులను గుర్తుపెట్టుకోవాలంటే కొంత ప్రయత్నం కావాలి; అవి చాలా

సులభంగా మరపున పడతాయి. అందుకని, అనుక్షణం మీకు గుర్తుకు రావడంకోసం, చిత్రపటమో, విగ్రహమో, నినాదమో - ఏదో ఒక రూపంలో అవి మీ వద్ద వుండి తీరాలి. ఒక ఆదర్శాన్ని లేక ఒక దృష్టాంతాన్ని మీరు అనుసరిస్తున్నారంటే దానిని మీరు మాటిమాటికీ జ్ఞాపకం చేసుకుంటున్నారన్నమాట; యిటువంటి స్మరణలో అవగాహన అనేది వుండదు. మీరు వున్న స్థితిని, మీరు అవాలని కోరుకుంటున్న స్థితితో పోల్చి చూస్తుంటారు; యీ సామ్యాసామ్యాలు చూడటమే అధికార భావానికి తావు యిస్తుంది; యీర్ష్యనూ, భయభీతినీ పెంచి పోషిస్తుంది; యిందులో ప్రేమభావం వుండదు.

దయచేసి యిదంతా చాలా జాగ్రత్తగా విని, అవగాహన చేసుకోండి, అప్పుడే మీరు అధినేతలను అనుసరించరు; దృష్టాంతాలను, ఆదర్శాలను అనుకరించడం, అచ్చం అదే మాదిరిగా తయారవడం చేయరు; అప్పుడే మీరు స్వీయ గౌరవం కలిగిన వ్యక్తిగా, స్వేచ్ఛగల మనిషిగా విలసిల్లుతారు. మిమ్మల్ని మీరు ఆదర్శంతో, 'నేను యిట్లా వుండాలి' అనే దానితో నిరంతరంగా పోల్చి చూసుకుంటూ వున్నారంటే మీకు స్వేచ్ఛ అనేది వుండదు. వాస్తవంగా మీరు ఏమిటి అనేది - మీరు అనాకారులు అవచ్చు, అందంగా వుండవచ్చు, మీరు విపరీతమయిన భయస్థులయి వుండవచ్చు, ఏదయినా అవచ్చు - అది అవగాహన చేసుకోవడం అంటే అది స్మరణకు సంబంధించినది మాత్రం కాదు. మీరు బాగా కనిపెట్టి వుండాలి, మీ దైనందిన సంబంధ బాంధవ్యాలలో క్షణక్షణమూ మిమ్మల్ని మీరే ఎరుకతో చూసుకోవాలి. వాస్తవంగా 'మీరు ఏమిటి' అనే చైతన్యం కలిగివుండటమే అవగాహన చేసుకోవడం అనే ప్రక్రియ.

నేను మాట్లాడుతున్నది మీకు నిజంగా అవగాహన అవుతుంటే దానిని సంపూర్ణంగా వినండి; అప్పుడు, వెనకటి తరాలవారు సృష్టించిన బూటకపు కట్టుకథలన్నింటి నుండి మీరు విముక్తి చెందుతారు. అప్పుడు మీ మనసునూ, హృదయాన్నీ వికలపరచి, భయాన్నీ, యీర్ష్యను పెంచి పోషించే అనుకరణ, ఆదర్శాలను స్మరణ చేసుకోవడం అనే భారాలతో మీరు క్రుంగిపోకుండా వుంటారు. మీకు తెలియకుండానే మీరు యిదంతా చాలా గాంభీర్యంతో వింటూ వుండవచ్చు. అట్లా వింటున్నారనే నేను ఆశిస్తున్నాను; అప్పుడే, గాఢంగా వినడంవలన, అనుకరణ నుండి విముక్తి చెందడం వలన, ఎంతటి సంపూర్ణమయిన మార్పు జరుగుతుందో మీకు తెలుస్తుంది.

ప్రశ్న: సౌందర్యం వస్తుగతమయినదా, మనోగతమయినదా?

**కృష్ణమూర్తి:** అందంగా వున్నదేదో మీరు చూస్తారు; వరండాలో నుండి కనబడే నదిని చూస్తారు. లేదూ ఒక చిన్నపాప చినిగిపోయిన దుస్తుల్లో ఏడుస్తూ కనబడుతుంది. మీలో సున్నితత్వం లేకపోతే, మీ చుట్టూవున్న వాటన్నింటి గురించి మీకు ధ్యాస లేకపోతే, మీరు వూరికే చూసి వూరుకుంటారు; అంతే తప్ప ఆ సంఘటనకి మీ దృష్టిలో ఏ విలువా వుండదు. తలమీద మోయలేనంత పెద్ద బరువు మోసుకుంటూ ఒక స్త్రీ వస్తుంది. ఆమె కట్టుకున్న దుస్తులు మురికి

ఓడుతూ వుంటాయి; ఆకలిగానూ, అలసటగానూ వుంటుంది. ఆమె నడకలో సౌందర్యం మీరు గుర్తిస్తారా, ఆమె శారీరక స్థితిని గురించి బాధపడతారా? ఆమె చీర – అది ఎంత మాసివున్నా సరే, దాని రంగు ఏమిటో గుర్తిస్తారా? ఇటువంటి వస్తుగతమయిన ప్రభావాలు మీ చుట్టూ వున్నాయి; మీలో సున్నితత్వం కనుక లేనట్లయితే వీటిని మీరు ఆస్వాదించలేరు, అవును కదూ?

సున్నితత్వం కలిగివుండటమంటే సుందరంగా వున్నాయని అనుకునే వాటిని గురించే కాకుండా వికారంగా వున్నాయని అనుకునే వాటిని గురించి కూడా ఎరుకగా వుండటం, నదీ ప్రవాహం, ఆకు పచ్చని పొలాలు, దూరాన వున్న వృక్ష సముదాయం, సాయంత్రపు ఆకాశంలో మబ్బులు – యివన్నీ అందంగా వుంటాయని మనం అంటూవుంటాం. మురికిగా, సగం డొక్కమాడివుండే పల్లె ప్రజలు; రొచ్చు, రొంపిలో నివసిస్తూ, ఆలోచనా శక్తికాని, స్పందన శీలత్వంగాని ఏమాత్రంలేని దరిద్రులు – యిదంతా సౌందర్యం కాదు, వికారం అని మనం అంటాం. మీరు జాగ్రత్తగా కనుక పరిశీలిస్తే, మనలో చాలామంది సౌందర్యాన్ని పట్టుకొని వ్రేలాడటం, వికారాన్ని పూర్తిగా తోసి పారెయ్యడం గమనిస్తారు. అయితే సౌందర్యంతో పాటుగా వికారమైన దానియెడల కూడా సున్నితత్వంతో వుండటం ముఖ్యం కాదూ? ఇటువంటి సంవేదనాశీలత్వం అంటే సున్నితత్వం లేకపోవడమే మనం జీవితాన్ని సౌందర్యం, వికారం అనే ఖండాలుగా విభజించడానికి కారణం అవుతున్నది. అయితే, మనం వికారం యెడల, సౌందర్యం యెడల కూడా వివృతంగానూ, సమాదరణీయంగానూ, సున్నితత్వంతోనూ వుంటే, అప్పుడు రెండూ చాలా అర్థపూరితమయినవని గ్రహించగలుగుతాము. ఈ విధమైన పరిగ్రాహ్యశీలత జీవితాన్ని సౌభాగ్యవంతం చేస్తుంది.

అయితే యిప్పుడు సౌందర్యం అనేది వస్తుగతమయినట్లా, మనోగతమయినట్లా? ఒకవేళ మీరు అంధులు కనుక అయితే, లేదా చెవిటి వారయి సంగీతమే వినలేక పోయినట్లయితే, మీకు సౌందర్యం అనేది తెలియకుండానే వుండిపోతుందా? సౌందర్యం అంటే అంతర్గతమయినదా? మీ కనులతో మీరు చూడలేకపోవచ్చును, చెవులతో వినలేకపోవచ్చును; కాని నిజంగా వివృతంగా వుండటం అంటే మూసుకొని పోకుండా వుండటం అనే స్థితిని కనుక మీరు అనుభవిస్తూ వుంటే, ప్రతిదాని యెడల సున్నితత్వం కలిగివుంటే, మీలోపల, అంతరంగంలో జరుగుతున్నదంతా, ప్రతి ఆలోచన, ప్రతి మనోభావము మీరు సునిశితంగా ఎరిగి వుంటూవుంటే – యిందులో మాత్రం సౌందర్యం లేకుండా వున్నదా? చూడండి, మనం ఎప్పుడూ సౌందర్యం అనేది మనకు వెలుపలనే వున్నదని అనుకుంటూ వుంటాం. అందుకనే చిత్రపటాలు కొనుక్కొని వచ్చి గోడలకు వేలాడదీస్తాం. అందమయిన చీరలను, సూట్లను – తలపాగాలను స్వంతం చేసుకోవాలనుకుంటాం; మన చుట్టూ సుందరమయిన వస్తువులను పేర్చుకోవాలనుకుంటాం; ఎందుకంటే – సౌందర్యాన్ని వస్తు రూపంలో గుర్తు చేసుకుంటూ వుండకపోతే, అంతరంగంలో కూడా పోగొట్టుకుంటామని మనం భయపడుతూ వుంటాం కాబట్టి. అయితే జీవితాన్ని, సమస్తమైన అస్తిత్వ ప్రక్రియను వస్తుగతం, మనోగతం అని విభజించగలమా? అది, ఆ

అస్తిత్వ ప్రక్రియ అంతా ఏకాత్మంగా జరిగే ఒకే ప్రక్రియ కాదూ? బాహ్యమయినది లేకుండా అంతర్గతమయినది లేదు, అంతర్గతమయినది లేకుండా బాహ్యమయినది వుండదు.

**ప్రశ్న: బలహీనులను బలవంతులు ఎందుకు అణగద్రొక్కుతూ వుంటారు?**

**కృష్ణమూర్తి:** మీరు బలహీనులను అణగ ద్రొక్కుతారా? ఈ సంగతి మనం తెలుసుకుందాం. వాద వివాదంలో కాని, శారీరకమయిన బలాబలాలకు సంబంధించిన విషయాల్లో కానీ మీకంటె చిన్నవాడయిన మీ తమ్ముడిని మీరు త్రోసి పారేస్తారు కదూ? ఎందుకు? మీ ఆధిక్యం నిరూపించుకోవాలనుకుంటారు కాబట్టి. మీ బలం ప్రదర్శించాలనుకుంటారు, అతని కంటే మీరు అధికులు అనీ, మరింత శక్తిమంతులు అనీ చూపాలనుకుంటారు. అందుకని పెత్తనం చలాయిస్తారు. ఆ చిన్న పిల్లవాడిని త్రోసిపారేస్తారు; అందరిమీదా అజమాయిషీ చేయాలనుకుంటారు. పెద్దవారూ అంతే. వాళ్ళు మీకంటే యింకా పెద్దవారు కాబట్టి, పుస్తకాలు చదివి యింకా ఎక్కువ తెలుసుకొని వుంటారు కాబట్టి, వారికి హోదా, డబ్బు, అధికారం వున్నాయి కాబట్టి, అణగద్రొక్కాలని చూస్తారు, మిమ్మల్ని త్రోసిపారేస్తారు. మిమ్మల్ని త్రోసి పడెయ్యడాన్ని మీరూ సహిస్తారు. ఆ తరువాత మీరూ మీకంటే క్రిందివారిని అణగద్రొక్కుతారు. ప్రతివారూ తమ ఆధిక్యం నిరూపించుకోవాలనుకుంటూ వుంటారు, పెత్తనం చలాయించాలనుకుంటారు. ఇతరులపై తమకు వున్న అధికారం ప్రదర్శించాలనుకుంటారు. మనలో చాలామందికి, 'మనం ఏమీకాదు' అనే సంగతి యిష్టం వుండదు. మనం గొప్పవాళ్ళుగా వుండాలి అనుకుంటాం. ఇతరులమీద మన ప్రాబల్యం చూపించడంలో మనమూ గొప్పవాళ్లమే అనే భావం కలుగుతుంది; దానివలన ఒక సంతృప్తి మనలో కలుగుతుంది.

**ప్రశ్న: అందుకేనా - పెద్ద చేప చిన్న చేపను మింగుతుంది అని అంటారే - అది జరుగుతూ వుంటుంది?**

**కృష్ణమూర్తి:** జంతు ప్రపంచంలో పెద్ద చేపలు చిన్న చేపలను తిని బ్రతకడం అనేది బహుశ ప్రకృతి సహజమయిన కార్యం. ఇది మనం మార్చలేనిది, దీని విషయంలో మనం ఏమీ చేయలేము. అయితే ఒక పెద్ద మనిషి మరో చిన్న మనిషిమీద పడి బ్రతకవలసిన అవసరం లేదు. మన తెలివిని ఎట్లా ఉపయోగించుకోవాలో మనకు తెలిసినట్లయితే శారీరకమయినదే కాదు, మానసికమయిన అర్థంలో కూడా మనం ఒకరిమీద పడి బ్రతకనవసరం లేదు. ఈ సమస్యను పరికించిచూసి, అవగాహన చేసుకుంటే, అంటే తెలివిని లేదా వివేకాన్ని కలిగివుంటే, ఒకరిమీద పడి బ్రతకడం అనేది ఆగిపోతుంది. అయితే, మనలో చాలామందిమి మరొకరి మీద పడి బ్రతకాలనుకుంటాం; అందుకని మనకంటే బలహీనంగా వున్న వారిని మన స్వప్రయోజన సిద్ధికి ఉపయోగించుకుంటాం. స్వేచ్ఛకి అర్థం మనకి ఏది యిష్టమయితే అది చేసేయడం అని కాదు. నిజమయిన స్వేచ్ఛ తెలివిని, వివేకాన్ని కలిగి వున్నప్పుడు మాత్రమే వుంటుంది; పరస్పర సంబంధాలను అవగాహన

చేసుకోవడం వలన వివేకం ఉదయిస్తుంది; పరస్పర సంబంధాలు అంటే – మీకూ నాకూ మధ్యనగల సంబంధం, మనలో ఒక్కొక్కరికీ మరొకరికీ నడుమనగల సంబంధ బాంధవ్యం అనమాట.

**ప్రశ్న: వైజ్ఞానిక శాస్త్రంలో జరిగే పరిశోధనలు మన జీవితాలను యింతకంటే సులువుగా సుఖంగా చేస్తాయనడం నిజమేనా?**

**కృష్ణమూర్తి:** మీ జీవితాన్ని అవి సులువుగా, సుఖమయంగా చేయలేదూ? విద్యుచ్ఛక్తి వున్నది మీకు యిప్పుడు, వున్నదా లేదా? మీట నొక్కగానే దీపం వెలుగుతుంది. ఆ గదిలో ఒక టెలిఫోను వున్నది, మీరు కావాలనుకుంటే, బొంబాయిలోనో, న్యూయార్కులోనో వున్న మీ స్నేహితునితో మాట్లాడవచ్చు. అది సులువుగా వుండటం కాదూ? ఒక విమానం ఎక్కి అతి శీఘ్రంగా ఢిల్లీగాని, లండన్‌గాని చేరవచ్చు. ఇవన్నీ వైజ్ఞానిక శాస్త్ర పరిశోధనల ద్వారా కలిగిన ఫలితాలే; వీటివలన జీవితం సులువుగా, సుఖమయంగా అయిపోయింది. వ్యాధులు నయం చేయడానికి వైజ్ఞానిక శాస్త్రం సహాయపడింది; అయితే వేలకొద్దీ మనుష్యులను ఒక్కసారే సంహరించివేసే హైడ్రోజన్ బాంబుని కూడా అది ప్రసాదించింది. కాబట్టి వైజ్ఞానిక శాస్త్రం పరిశోధనలు చేసి నిరంతరంగా కొత్త, కొత్త విషయాలు కనిపెట్టినకొద్దీ, మనం యీ శాస్త్రవిజ్ఞానాన్ని వివేకంతో, ప్రేమ భావంతో ఉపయోగించుకోవడం ఆరంభించకపోతే, మనల్ని మనమే సర్వనాశనం చేసుకోబోతున్నాం.

**ప్రశ్న: మృత్యువు అంటే ఏమిటి?**

**కృష్ణమూర్తి:** మృత్యువు అంటే ఏమిటి? ఒక చిన్న అమ్మాయి నుండి యిటువంటి ప్రశ్న!

మృతదేహాలను నది వద్దకు మోసుకొని వెళ్ళడం మీరు చూసి వుంటారు; జీవరహితమయిన ఆకులను, చెట్లను మీరు చూసి వుంటారు. పళ్ళు వడిలిపోయి, కుళ్ళిపోతాయని మీకు తెలుసు. ఉదయంపూట ఉత్సాహంతో తొణికిసలాడుతూ కిచకిచమని శబ్దాలు చేస్తూ, ఒక దాన్నొకటి పిలుచుకుంటూ వుండే పిట్టలు సాయంత్రం అయేవరకు చనిపోవచ్చు. ఇవాళ బ్రతికివున్న వ్యక్తి ఒకరిని రేపు ఒక దుర్ఘటన బలి తీసుకోవచ్చు. ఇటువంటివి జరగడం మనం చూస్తూ వుంటాం. మృత్యువుని మనం అందరమూ చవి చూడవలసిందే. మనం అందరమూ ఆ విధంగానే సమాప్తం అవుతాము. మీరు ఒక ముప్ఫయ్యేళ్ళో, యాభయ్యో లేదూ ఎనభయ్యేళ్ళ కాలమో జీవించవచ్చు – ఖులాసాగా, బాధలు పడుతూ, భయపడుతూ – అవన్నీ ఆఖరయిపోయాక యిక మీరు వుండరు.

జీవించడం అని మనం అనుకునేది ఏమిటి? మృత్యువు అని మనం అనుకునేది ఏమిటి? ఇది చాలా సంక్లిష్టమైన విషయం, మీరు యిదంతా తెలుసుకోవాలనుకుంటున్నారని నేను అనుకోను. జీవించడం అంటే ఏమిటో

తెలుసుకుంటే, అంటే ఏమిటో అవగాహన చేసుకుంటే అప్పుడు బహుశ మృత్యువు అంటే ఏమిటో కూడా మనకు అవగాహన అవుతుందేమో! మనం ప్రేమించే ఒకరిని మనం పోగొట్టుకున్నప్పుడు కోల్పోయిన భావం, ఒంటరితనం కలుగుతాయి; అందుకని మృత్యువుకు, జీవించి వుండటానికి సంబంధమే లేదని మనం అంటాం. జీవితం నుండి మనం మృత్యువును విడదీసి చూస్తాం. కాని, నిజంగా మృత్యువు జీవితం నుండి విడిపడి వుంటుందా? జీవించడం అంటే మరణించడం కోసం జరుగుతున్న ఒక ప్రక్రియ కాదూ?

మనలో చాలామందికి, జీవించడం అంటే అర్థం ఏమిటి? ఆర్జన చేసి సంచయపరచుకోవడం, ఎంపిక చేసుకోవడం, బాధపడుతుండటం, నవ్వుతూ గడపడం – అని అర్థం. నేపథ్యంలో, యీ సుఖదుఃఖాల వెనుక భయం వుంటుంది – అంతమయిపోతామనే భయం, రేపు ఏమవుతుందోననే భయం, పేరూ వూరూ లేకుండా అయిపోతామేమో, ఆస్తీ, అంతస్థూ లేకుండా అయిపోతామేమో అనే భయం. ఇవన్నీ అంతం కాకుండా ఎల్లకాలం కొనసాగాలని మనం కోరుకుంటాం. అయితే మృత్యువు మాత్రం అనివార్యం; అందుకని "మృత్యువు తరువాత ఏం జరుగుతుంది?" అని మనం అడుగుతాం.

సరే, మృత్యువు వలన అంతమయిపోయేదేమిటి? ప్రాణమా? జీవితమా? ప్రాణం అంటే కేవలం గాలి లోపలకు ఉచ్ఛ్వాసించడం, నిశ్వాసం చేయడం అనే ప్రక్రియ మాత్రమేనా? తినడం, ద్వేషించడం, ప్రేమించడం, సంపాదించడం, స్వంతం చేసుకోవడం, పోల్చి చూడటం, యీర్ష్య పడటం – మనలో చాలామందికి జీవితం అంటే తెలిసింది యిదే. మనలో చాలామందికి జీవితం అంటే – బాధపడటం; కష్ట సుఖాలతో కూడిన, ఆశ నిరాశలతో కూడిన నిరంతర పోరాటం – అని. అది సమాప్తమయిపోగూడదా? మనం చనిపోకుండా వుండాలా? హేమంత ఋతువులో చలికాలం ఆరంభం కాగానే చెట్ల నుండి ఆకులు రాలిపడిపోతాయి, వసంతకాలంలో మళ్ళీ చిగురుటాకులు ప్రత్యక్షమవుతాయి. అదే విధంగా నిన్నతో త్రెంచుకొని, మన సముపార్జనల నుండి, ఆశలనుండి, పోగుచేసుకొని వుంచిన విజయాలనుండి త్రెంచుకొని, మనం చనిపోవద్దూ? వీటన్నింటి నుండి చనిపోయి రేపు మళ్ళీ జీవించవద్దూ? మళ్ళీ జీవించి, ఒక క్రొత్త ఆకువలే మనం తాజాగా, మృదువుగా, సున్నితంగా వుండవద్దూ? నిరంతరం చనిపోతూ వుండే వ్యక్తికి మృత్యువే లేదు. కాని, 'నేను గొప్పవాడిని, నేను యిదే విధంగా కొనసాగాలి' అనే మనిషిని – ఆ మనిషిని మాత్రం మృత్యువు, శ్మశానం ఎప్పటికీ వెన్నంటే వుంటాయి; ఆ మనిషికి ప్రేమభావం అనేది తెలియదు.

★ ★ ★

# అధ్యాయం 14

మానవ విచ్ఛిత్తికి అనేక కారణాలు వున్నాయి, మనుష్యులు విచ్ఛిన్నమయి పోవడం అనేక విధాలుగా జరుగుతుంది. సమన్వయత్వం చెందడం అంటే కూడగట్టుకోవడం, అంటే సంపూర్ణంగా చేయడం. మీరు సమన్వయత్వం చెంది వుంటే మీ ఆలోచనలు, మనోభావాలు, కార్యాచరణ అన్నీ కలిసిపోయి ఒక్కటిగా వుంటాయి, ఒకే దిశలో పయనిస్తాయి; ఒకదానితో మరొకదానికి వైరుధ్యం వుండదు. మీరు సంఘర్షణ అనేది లేని సంపూర్ణమైన మనిషి అవుతారు. అదీ సమన్వయత్వంలో వున్న అంతరార్థం. దీనికి సరిగ్గా వ్యతిరేకమయినది విచ్ఛిన్నత చెందడం; అంటే చిన్న చిన్న ముక్కలుగా చెదిరిపోవడం, ఛిన్నాభిన్నమయి పోవడం, కలిసి వుంచిన దానిని చిందరవందర చేయడం. మనుష్యులు విచ్ఛిన్నమయిపోవడం, చెదరి ముక్కలయిపోవడం, తమని తామే వినాశనం చేసుకోవడం అనేక విధాలుగా జరుగుతూ వుంటుంది. ఈర్ష్యాభావం కలగడం ఒక బలమయిన కారణం అని నేను అనుకుంటున్నాను. ఇది, యీ యీర్ష్యా భావం ఎంత ప్రచ్ఛన్నంగా వుంటుందంటే, దీనికి రకరకాల పేర్లు తగిలించి, మానవుడికి వుండవలసిన శక్తియుక్తులలో యిది సార్థకమైనదనీ, ప్రయోజనకరమైనదనీ, యోగ్యత కలిగిన ఒక సుగుణం అనీ భావించడం జరుగుతున్నది.

ఈర్ష్య అంటే ఏమిటో మీకు తెలుసునా? మీరు చాలా చిన్నవయసులో వున్నప్పుడే యిది ఆరంభమవుతుంది – మీకంటే చక్కగా వుండే మీ స్నేహితుడిపైన మీకు యీర్ష్య కలుగుతుంది. మీకంటే ఎక్కువ వస్తువులు వున్నా, మీకంటే మంచి స్థితిలో వున్నా అతనిపై మీలో యీర్ష్యాభావం కలుగుతుంది. ఒక అమ్మాయికాని అబ్బాయి కాని చదువులో మిమ్మల్ని మించిపోతేనో, మీకంటే ఐశ్వర్యవంతులయిన తల్లితండ్రులను కలిగివుంటేనో, గొప్ప పేరు ప్రఖ్యాతులున్న కుటుంబానికి చెందివుంటేనో మీకు వారంటే అసూయ కలుగుతుంది. కాబట్టి యీర్ష్య లేక అసూయ పసితనంనుండే ఆరంభమవుతుంది; క్రమక్రమంగా అది పోటీ రూపాన్ని తాలుస్తుంది. మీరు చాలా విశిష్టమయిన పేరు ప్రఖ్యాతులు సాధించడానికని ఏదో ఒకటి చేయాలనుకుంటారు; యితరులకంటే ఎక్కువ మార్కులు పొందాలనుకుంటారు, మరొకరి కంటె గొప్ప క్రీడాకారులు అవాలనుకుంటారు; యితరులను మించి పోవాలనీ, యితరులకంటే బాగా ప్రకాశించాలనీ అనుకుంటారు.

మీరు పెద్దవారవుతున్నకొద్దీ యీ యీర్ష్య మీలో మరీ మరీ బలవత్తరమవుతూ వుంటుంది. పేదవారు ధనికులని చూసి యీర్ష్య పడుతుంటారు, ధనికులు తమకంటె ధనికులని చూసి యీర్ష్య చెందుతుంటారు. కొంత అనుభవం సంపాదించినవారిలో మరింత అనుభవం కోరుకుంటూ ఒక రకం యీర్ష్య; యింతకంటె యింకా బాగా

రాయాలని రచయితలో వుండే యీర్ష్య మరో రకం. ఇంతకంటె బాగా వుండాలనే ఆ కోరిక, గొప్ప యోగ్యత సాధించాలనుకోవడం, యిది ఎక్కువ కావాలని, అది మరింత కావాలని కోరుకోవడం – యివన్నీ ఆర్జన పరత్వం – అంటే సేకరించడం, అధీనంలో వుంచుకోవడం అనే గుణాన్ని సూచిస్తాయి. మీరు పరిశీలించినట్లయితే మనలో చాలామందికి వుండే సహజేచ్ఛ అతిగా ఆర్జించాలని, మరిన్ని ఎక్కువ చీరలు, దుస్తులు, యిళ్ళు, ఆస్తులు ఆర్జించాలని అనే కోరిక అని గమనిస్తారు. ఇవి కాకపోతే మరింత అనుభవం కోసమో, మరింత విజ్ఞానం కోసమో ఆశపడతారు. అందరికంటే మనకే ఎక్కువ తెలుసుననీ, మరొకరి కంటే మనం ఎక్కువ పుస్తకాలు చదివామనీ భావించడం మనకు యిష్టం. ప్రభుత్వంలో ఉన్నత స్థానంలో వున్న ఫలానా ఉద్యోగికి యితరులకంటే మనమే చాలా సన్నిహితంగా వుండాలని కోరుకుంటాం; లేదూ మరొకరికంటే మనం ఆధ్యాత్మికంగా, అంతర్గతంగా ఎక్కువ పరిణతి చెందామని అందరూ భావించాలని అనుకుంటాం. మనం చాలా వినయం గలవారమనీ, సుగుణశీలురమనీ, మనకే వివరణాత్మకంగా మాట్లాడటం వచ్చు, యితరులకు రాదనీ మనల్ని గురించి మనమే భావిస్తూ వుంటాం.

కాబట్టి, ఎంత ఎక్కు వెక్కువగా ఆర్జించి, అధీనంలో వుంచుకుంటే అంత ఎక్కువగా మన విచ్ఛిత్తి జరుగుతూ వుంటుంది. ఎక్కువ ఆస్తి పాస్తులు, ఎక్కువ కీర్తి ప్రతిష్ఠలు, ఎక్కువ అనుభవ సంపద, అమిత జ్ఞానం సేకరించినకొద్దీ మరింత త్వరగా మనం దిగజారిపోతూ వుంటాం. మరేదో అవాలని, ఎంతో ఆర్జించాలని వుండే కోరికనుండే యీర్ష్య, అసూయ అనే సర్వసామాన్యమైన వ్యాధి అంకురిస్తుంది. మీలోను, మీ చుట్టూవున్న పెద్దవారిలోనూ యిది మీరు గమనించలేదూ? ఒక టీచరు ప్రొఫెసరు అవాలని కోరుకోవడమూ, ప్రొఫెసరేమో ప్రిన్సిపలు అవాలని కోరుకోవడమూ మీరు గమనించలేదూ? మీ నాన్నగారు కాని, అమ్మగారు కాని మరింత ఆస్తిపాస్తులు, గొప్ప పేరు కావాలని అనుకోవడం చూసి వుంటారు కదూ?

ఈ ఆర్జనకై జరిగే పోరాటంలో మనం క్రూరంగా తయారవుతాం. ఆర్జన పరత్వంలో ప్రేమభావం వుండదు. ఆర్జన కోసమే బ్రతికే జీవితం అంటే పొరుగువారితో, సమాజంతో మనం చేసే ఒక అంతులేని సమరం; యిందులో నిరంతరమయిన భయం వుంటుంది; అయితే యిదంతా మనం సమర్థించాలని చూస్తాం; యీర్ష్యని ఒక అనివార్యమైన గుణంగా ఆమోదించేస్తాం. ఆర్జన పరత్వం మనందరికీ వుండి తీరాలని అనుకుంటాం – అయితే దానికి సుగుణంగా తోపింపజేసే మరో పేరు పెడతాం. పరిణామం, పెరుగుదల, అభివృద్ధి, అభ్యుదయం అని రకరకాల పేర్లు పెట్టి, యిది అత్యంత అవశ్యకమయినది అని అంటాం.

చూడండి, మనలో చాలామందికి వీటిని గురించి సచేతనమైన స్పృహ వుండదు; మనలో యింత అత్యాశ వున్నదనీ, ఆర్జనమీద కాంక్ష అనీ, మన హృదయాలు యీర్ష్యాగ్నితో భగ్గుమంటున్నాయనీ, మన మనసులు దిగజారిపోతున్నాయనీ ఒక ఎరుక లేదా స్పృహ మనలో వుండదు. ఎప్పుడయినా ఒక్క క్షణం యీ విషయం మనకు తట్టినా ఏదో విధంగా దానిని సమర్థించుకుంటాం; లేదా 'తప్పే' అని

వూరికే అని వూరుకుంటాం; లేదా అనేక రకాలయిన మార్గాలలో తప్పించుకొని పారిపోవాలని చూస్తాం.

మన లోపల దాగివున్న యీర్ష్యని బహిష్కృతం చేయడంకాని, దాని ముసుగు తొలగించి కనిపెట్టడంకాని చాలా కఠినమయిన పని. ఎందుకంటే, యీ యీర్ష్యకు కేంద్రస్థానం మనసే. అసలు మనసే యీర్ష్యా పూరితమయినది. అర్జన పరత్వం, యీర్ష్య అనేవాటిని ఆధారంగా చేసుకునే మనసు తన స్వరూప నిర్మాణం చేసుకుంటుంది. మీ లోపలి ఆలోచనలను పరికించినట్లయితే, మీ ఆలోచనా ధోరణిని పరిశీలించినట్లయితే, మనం ఆలోచన అని అనేది నిజంగా సామ్యాసామ్యాలు చూసే ఒక ప్రక్రియ అని తెలుసుకుంటారు; "నేను యితరులకంటే బాగా వివరించగలను, నాకు ఎక్కువ విజ్ఞానం వున్నది, ఎక్కువ వివేకం వున్నది." 'మరింత ఎక్కువ' అనే ధోరణిలో ఆలోచించడం అర్జన పరత్వం అనే కోరిక వున్న మనసు చేసే పని; దాని అస్తిత్వాన్ని కొనసాగించే మార్గమే అది. 'మరింత ఎక్కువ' అనే ధోరణిలో ఆలోచించ వద్దనుకుంటే మీకు అసలు ఆలోచించడమే మహా కష్టసాధ్యమయిపోతుంది. 'మరింత ఎక్కువ' కోసం ఆరాటపడటమే ఆలోచన యొక్క తులనాత్మక గతిశీలత్వం; అంటే మరింత ఎక్కువ కావాలని ప్రయాసపడటమే గమనాన్ని తెలుపుతుంది, యిదే కాలాన్ని (వ్యవధిని) సృష్టిస్తుంది – మరొకటి అవబోయే వ్యవధిని, గొప్పవారు అవబోయే వ్యవధిని; ఇదే యీర్ష్య, అర్జన పరత్వం పనిచేసే పద్ధతి. మరొకరితో పోల్చి చూసుకుంటూ మనసు, "ఇప్పుడు 'యిట్లాగ' వున్నాను, ఏదో ఒక రోజున 'అట్లాగ' అవుతాను," "నేను కురూపిని, అయితే భవిష్యత్తులో అందంగా అవబోతున్నాను" అని అనుకుంటుంది. ఇట్లా అర్జనపరత్వం, యీర్ష్య, యితరులతో పోల్చి చూసుకోవడం అసంతుష్టిని, అశాంతిని కలుగజేస్తాయి; దీనికి మన ప్రతిచర్య ఏమిటంటే, మనం వున్న స్థితికి తృప్తిచెందాలి, మనకు వున్న దానితోనే సంతుష్టిపడి వూరుకోవాలి అని అనుకోవడం. నిచ్చెన పైమెట్టుమీద వున్నవారు యీ మాట చెబుతూ వుంటారు. సాధారణంగా మతాలు అన్నీ వున్నదానితో సంతుష్టి చెందాలని బోధిస్తూ వుంటాయి.

యథార్థమయిన సంతుష్టి మరొకదానికి ప్రతిస్పందనగా జనించినదయి వుండదు, అది అర్జనపరత్వానికి వ్యతిరేకమయినదీ కాదు; అది అంతకంటే ఎంతో విశాలమయినది, మరెంతో విశిష్టమయినది. అర్జన పరత్వానికి, యీర్ష్యకు సరిగ్గా వ్యతిరేకంగా వుండే సంతుష్టిని కలిగివున్న వ్యక్తి చైతన్యం లేని జీవచ్ఛవం వంటివాడు; అంతర్గతంగా ఏమీలేని వట్టి ప్రాణంవున్న బొమ్మ; చాలామంది మనుష్యులు యిట్లాగే వుంటారు. చాలామంది మనుష్యులు నిశ్చలంగా వున్నట్లే కనబడతారు. ఎందుకంటే, అంతర్గతంలో వారు మృతజీవులు కాబట్టి; అంతర్గతంలో వారు ఎందుకు మృతజీవులు అంటే వారు యథార్థంగా ఏమిటో వాటన్నింటికీ పూర్తిగా వ్యతిరేకంగా తాము వుండటం అలవర్చుకున్నారు కాబట్టి. ఈర్ష్య కలిగి వుండి కూడా, "నేను యీర్ష్య పడకూడదు" అని వారు అంటారు. ఈర్ష్య అనే అంతులేకుండా కొనసాగే పోరాటాన్ని తిరస్కరిస్తూ మీరు ఒక గోచీగుడ్డను మాత్రం ధరించవచ్చుగాక, మీరు ఏదీ అర్జన చేయబోవడం లేదని అనవచ్చుగాక; కాని యీ మంచిగా

వుండాలనే కోరిక, అర్జనపై కాంక్ష లేకపోవడం అనేవి విరుద్ధమయిన వాటికోసం అభిలషించడం కదా. కాబట్టి అవి కూడా కాలం అనే పరిధికి, లేక వ్యవధి అనే పరిధికి కట్టుబడినవే; ఇది కూడా యీర్ష్యా భావంలో ఒక భాగమే, ఎందుకంటే, మీరు మరేదో కావాలని యింకా కోరుకుంటున్నారు కాబట్టి. యథార్థమయిన సంతుష్టి యిటువంటిది కానేకాదు; అది యింకా ఎంతో సృజనాత్మకమయినది, మహా గంభీరమయినది. మీరు సంతుష్టిగా వుండాలని ఎన్నుకున్నంత మాత్రాన అందులో సంతుష్టి వుండదు; సంతుష్టి అనేది ఆ విధంగా రాదు. మీరు యథార్థంగా ఏమిటి అనేది అవగాహన చేసుకొని, మీరు మరొకలాగా వుండాలి అనే దానిని అందుకోవాలని యత్నిస్తూ వుండనప్పుడే నిజమైన సంతుష్టి కలుగుతుంది.

మీరు కావాలనుకున్నవన్నీ సాధించాక సంతుష్టిగా వుండవచ్చని మీరు అనుకుంటారు. ఒక గవర్నరు అవాలనో, గొప్ప సాధుపుంగవునిగా మారాలనో మీరు కోరుకుంటారు; ఆ గమ్యం చేరుకున్నాక, మీలో సంతుష్టి కలుగుతుందని కూడా మీరు అనుకుంటారు. మరొక విధంగా చెప్పాలంటే యీర్ష్యపడటం అనే ప్రక్రియ ద్వారా సంతుష్టి సాధించవచ్చని మీరు ఆశిస్తారు. తప్పు మార్గం అవలంబించి మంచి ఫలితం సాధించవచ్చని మీరు ఆశపడతారు. సంతుష్టి అంటే తనివి తీర్చుకున్న సంతృప్తి భావం కాదు. సంతుష్టి భావం అనేది అంతకంటే మహత్వపూర్ణమయినది; యథార్థమయిన 'వున్నస్థితి'ని పూర్తిగా అవగాహన చేసుకున్న, సృజనాత్మకత కలిగిన ఒక స్థితి అది. క్షణక్షణమూ, ప్రతిరోజూ మీరు యథార్థంగా ఏమిటి అనేది అవగాహన చేసుకోవడం ఆరంభిస్తే, యీ అవగాహనలో నుండి బ్రహ్మాండమయిన విశాల భావము, అపరిమితమైన పరిగ్రాహ్యశక్తి జనించడం మీరు గ్రహిస్తారు. అంటే అర్థం ఏమిటంటే, మీరు అత్యాశాపరులవుతే, మీ అత్యాశను అవగాహన చేసుకోవడం ప్రధానం కాని, అత్యాశాపరత్వం లేకుండా అవడానికి ప్రయత్నించడం కాదు; ఎందుకంటే అత్యాశాపరత్వం లేనివారుగా అయిపోవాలనే కోరికే మరొక విధమయిన అత్యాశాపరత్వం.

మన మత స్వరూపం, మన ఆలోచనా ధోరణులు, మన సామాజిక జీవితం, మనం చేసే పనులు అన్నీ అర్జన పరత్వంమీద, యీర్ష్యాపూరితమయిన వైఖరిమీద ఆధారపడి వున్నాయి. శతాబ్దాలుగా మనం యిటువంటి విధానంలోనే పెరిగి పెద్దవాళ్ళం అవుతున్నాం. ఈ విషయంలో ఎంత నిబద్ధితులమయినామంటే 'మరింత ఎక్కువ', 'మరింత మేలైన' లను గురించే తప్ప మరొకలాగా ఆలోచించలేము; అందువల్ల యీర్ష్యను మనం అలవరచుకోదగిన మంచి లక్షణంగా చేసివేశాం. అయితే దానిని యీర్ష్య అనే పేరుతో పిలవం, మరొక నాజూకు మాటను వాడుతాం; కాని, ఆ మాట వెనుకకు వెళ్ళి చూస్తే, 'మరింత ఎక్కువ' కోసం వుండే యీ విపరీతమయిన కోరిక అహంభావజనితమయినది, స్వార్థపూరిత మయినది అని మీరు గ్రహిస్తారు. దీనివలన ఆలోచనలకు పరిమితులను గీయడం అవుతుంది.

ఈర్ష్యవలన హద్దులు ఏర్పరచబడిన మనసు, 'నా' కారణంగా వస్తు సంచయం కోసమో, సద్గుణాల సంచయం కోసమో అర్జనకాంక్షవలన హద్దులు ఏర్పరచుకున్న మనసు, ఏనాటికీ నిజమైన ఆధ్యాత్మికత కలిగిన మనసు అంటే సత్యాన్వేషణ

చేసే మనసు కాదు. ఆధ్యాత్మికత కలిగిన మనసు పోల్చిచూసే మనసు కాదు. 'ఉన్న స్థితి' యొక్క పూర్తి ప్రాధాన్యతను ఆధ్యాత్మికత కలిగిన మనసు గ్రహిస్తుంది, అవగాహన చేసుకుంటుంది. అందువల్లనే మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోవడం, అంటే మీ మనసు చేసే చర్యలన్నీ మీరే పరికించి గ్రహించడం చాలా ముఖ్యం: అంటే మీలోని ప్రేరణలు, ఉద్దేశాలు, వాంఛలు, కోరికలు ఏదో అందుకోవాలనే ఆరాటం వలన కలిగే నిరంతరమైన ఒత్తిడి, అది సృష్టించే ఈర్ష్య, ఆర్జనపరత్వం, పోల్చి చూసే తత్వం – యివన్నీ, 'ఉన్నస్థితి'ని అవగాహన చేసుకోవడం ద్వారా యివన్నీ సమాప్తమయినప్పుడు, నిజమైన ఆధ్యాత్మికత అంటే సత్యాన్వేషణ చేసే తత్వం అంటే ఏమిటో అప్పుడు మాత్రమే మీకు తెలుస్తుంది.

## ప్రశ్న: సత్యం సాపేక్షికమా? తిరుగులేనిదీ, నిరపేక్షికమైనదీనా?

**కృష్ణమూర్తి:** ముందుగా యీ ప్రశ్న ప్రాధాన్యాన్ని యీ మాటల ద్వారానే పరికించి చూద్దాం. మనకు నిరపేక్షికమయినది కావాలి, అంటే ఏ ఆధారం అవసరం లేని సంపూర్ణ సత్యం. మానవుడిలో శాశ్వతము, స్థిరము, అచలము, ఆద్యంతరహితము, క్షీణక్షయములు లేనిది, మరణము లేనిది అయినదాని కోసం, అటువంటి ఒక ఊహ, ఒక మనోభావం కోసం తీరని ఆరాటం వుంటుంది. అది ఒక నిత్యంగా నిలిచిపోయే స్థితి, ఒక అనంత స్థితి అయివుండాలని, అప్పుడు మనసు దానిని వదలకుండా పట్టుకొని వ్రేలాడవచ్చని కూడా మానవుడు కోరుకుంటాడు. ఈ ప్రశ్నను అర్థం చేసుకొని దానికి సరియైన సమాధానం యివ్వడానికంటే ముందుగా యీ తీరని ఆరాటాన్ని అవగాహన చేసుకోవాలి.

మనిషి మనసు ప్రతిదానిలోను పరస్పర సంబంధాలలో, ఆస్తిపాస్తులలో, సద్గుణాలలో శాశ్వతత్వాన్ని కోరుకుంటుంది. అనశ్వరమయినది, నశింపు లేనిది కావాలి మనసుకు, అందువల్లనే మనం దైవం శాశ్వతం అనీ సత్యం నిరపేక్షికం అనీ అంటూ వుంటాం.

అసలు సత్యం అంటే ఏమిటి? సత్యం అంటే ఒక అపూర్వమయిన నిగూఢ మర్మమా, ఎవరికీ అందనంత దూరంలో వుండేదా, అనూహ్యమైనదీ, రూపరహితమయినదీనా? లేదూ సత్యం అంటే ప్రతిక్షణమూ, ప్రతిరోజూ మీరు అన్వేషించి కనుగొనేదా? అనుభవాల ద్వారా సంచయం చేసుకొనేదీ, సేకరించేదీ కనుక అయితే అది సత్యం కాదు; ఎందుకంటే యీ సేకరణ వెనుక వుండేది ఆర్జన పరత్వం అనే అభిలాషే కాబట్టి. అది చాలా సుదూరంగా వుండి, ధ్యానమార్గాల ద్వారా మాత్రమే గ్రహించగలిగినదీ, వైరాగ్యం, పరిత్యాగం ఆచరించడం ద్వారా మాత్రమే గ్రహించగలిగినది అయితే, అది కూడా సత్యం కానేకాదు. ఎందుకంటే యిది కూడా ఆర్జనపరత్వంలో ఒక రకానికి చెందినదే కాబట్టి.

ప్రతి పనిలోను, ప్రతి ఆలోచనలోను, ప్రతి మనోభావంలోను – అవి ఎంత అల్పమయినవి, ఎంత క్షణికమయినవి అయినా సరే – వాటిలోని సత్యాన్ని కనుగొని అవగాహన చేసుకోవాలి; ప్రతి ఒక్క రోజులో, ప్రతి ఒక్క క్షణంలో దానిని పరిశీలిస్తూ వుండాలి; భార్యాభర్తలు చెప్పుకునే మాటలలో, తోటమాలి మాటలలో,

మీ స్నేహితులు చెప్పే దానిలోను, మీలోని ఆలోచనా ప్రక్రియలోను కూడా సత్యాన్ని వినాలి. మీ ఆలోచన కపటమైనది అవచ్చు, పరిమితులకు లోబడినది కావచ్చు, నిబద్ధితమయినది అవచ్చు; మీ ఆలోచనలు నిబద్ధితమయినవి, పరిమితులకు లోబడినవి అనే ఆ సంగతిని కనుగొనడమే సత్యం. ఈ సత్యావిష్కరణమే మీ మనసును పరిమితులకు లోబడి వుండటం నుండి విముక్తం చేస్తుంది. మీలో అత్యాశాపరత్వం వున్నదని మీరు కనుగొంటే, – మరొకరు మీకు అది చెప్పడం కాదు – మీరే స్వయంగా కనుగొంటే, – ఆ కనుగొనడమే సత్యం అన్నమాట; యీ సత్యమే మీలోని అత్యాశాపరత్వం మీద తన ప్రభావం చూపుతుంది.

సేకరించి, సంచయం చేసుకొని, నిలవ వుంచుకొని, ఆ తరువాత మార్గనిర్దేశం చేయడానికి దానిపై ఆధారపడేటటువంటిది కాదు సత్యం అంటే. ఇది కూడా మరొక రకంగా వస్తువులను స్వంతం చేసుకొని అధీనంలో వుంచుకోవడం వంటిదే. ఏదీ స్వంతానికి సంపాదించుకోకుండా, నిలవ చేసుకోకుండా వుండటం అనేది మనసుకు చాలా కఠినమయిన పని. దీని ప్రాధాన్యం మీరు గ్రహించి, అర్థం చేసుకున్నప్పుడు, సత్యం ఎంత అద్భుతమయినదో మీకు తెలుస్తుంది. సత్యం కాలరహితమయినది, మీరు దానిని చేజిక్కించుకున్న క్షణంలోనే – "నేను సత్యాన్ని కనుగొన్నాను, యిక అది నాదే" అని మీరు అన్నప్పుడే – యిక ఆ క్షణం నుండే అది సత్యం కాదు.

కాబట్టి, సత్యం 'నిరపేక్షికమా,' తిరుగులేనిదా అంటే ఆధారం అవసరంలేని సంపూర్ణ సత్యమా, లేదూ కాలానికి అతీతమా అన్న సంగతి మనసుమీద ఆధారపడివున్నది. "నాకు నిరపేక్షికమయినది కావాలి, క్షీణక్షయాలు లేనిది, మరణం లేనిది కావాలి" అని మనసు అడిగినప్పుడు, నిజంగా దానికి వదలకుండా పట్టుకొని వ్రేలాడటానికి ఒక శాశ్వతమయినది కావాలని అర్థం; అందుకని, ఒక స్థిరంగా, శాశ్వతంగా వుండే దానిని అది సృష్టిస్తుంది. అయితే బాహ్య ప్రపంచంలోనూ, తన అంతర్గతంలోనూ జరుగుతున్న వాటిని గురించి ఎరుకవున్న మనసు, వాటిలోని సత్యాన్ని చూసిన మనసు – అటువంటి మనసు కాలరహితమయినది, కాలానికి అతీతమయినది. అటువంటి మనసు మాత్రమే పేర్లకు అతీతమయిన, శాశ్వతత్వానికి, అశాశ్వతత్వానికీ అతీతంగా వున్నదానిని తెలుసుకోగలుగుతుంది.

## ప్రశ్న: బాహ్యమైన ఎరుక కలిగివుండటం అంటే ఏమిటి?

**కృష్ణమూర్తి:** ఈ హాలులో మీరు కూర్చొని వుండటం గురించి మీరు ఎరిగి వున్నారా లేదా? ఆ చెట్లు, సూర్యకాంతిని గురించిన ఎరుక మీకు లేదూ? ఆ కాకి అరవడం, కుక్క మొరగడం వీటి ఉనికి మీకు తెలుస్తునే వున్నది కదూ? పూవుల రంగులు, ఆకుల కదలికలు, నడుస్తూ పోతున్న మనుష్యులు – యివన్నీ మీరు చూడటం లేదూ? బాహిరమయినవాటి ఎరుక అంటే యిదే. సూర్యాస్తమయం, రాత్రి పూట ఆకాశంలోని నక్షత్రాలు, నీటిమీద పడి మెరుస్తున్న వెన్నెల మీరు చూసినప్పుడు, అదంతా బాహిరమయినవాటి ఎరుక అంటాం, అవునా కాదా? బాహిరమయిన వాటి ఎరుక కలిగివున్నట్లుగానే, అదే విధంగా మీ ఆలోచనలు,

మనోభావాలు, మీలోని ఉద్దేశాలు, ప్రేరణలు, నిర్హేతుకమయిన అభిప్రాయాలు, యీర్ష్యాసూయలు, అత్యాశ, దురభిమానం – వీటిని గురించిన అంతర్ముఖమయిన ఎరుక కూడా మీరు కలిగివుండవచ్చును.

మీరు నిజంగా బాహిరమయిన ఎరుకను కలిగివుంటే, అంతర్ముఖమయిన ఎరుక కూడా జాగృతమవడం ఆరంభమవుతుంది; ఆపైన యితరుల మాటలకు, మీరు చదివేవాటికి, యింకా యిటువంటి వాటికన్నింటికి మీలో కలిగే ప్రతిచర్యలను గురించి మరింతగా మీరు సచైతన్యంతో వుంటారు. మీలో ఏదో వెలితిగా వుండటం, ఆశపడటం, ఆదుర్దా పడటం, భయపడటం వంటి స్థితిగతుల మూలంగా కలిగిన ఫలితమే యితరులతో మీ సంబంధాలలో మీ బాహిరమయిన ప్రతిచర్యగా లేదా ప్రతిస్పందనగా వెలువడుతుంది. ఈ బాహిరమయిన, అంతర్ముఖమయిన ఎరుక అంతా ఒక ఏకాత్మకమయిన ప్రక్రియ; దీనివలన మానవుని అవగాహనలో ఒక సంపూర్ణమయిన సమన్వయత్వం కలుగుతుంది.

### ప్రశ్న: నిజమైన, శాశ్వతమైన సంతోషం అంటే ఏది?

**కృష్ణమూర్తి:** పరిపూర్ణమయిన ఆరోగ్యంతో వున్నప్పుడు మీకు మీ శరీరం గురించిన స్పృహ వుండదు కదూ? వ్యాధి, అస్వస్థత, నొప్పి వంటివి వున్నప్పుడే శరీరం గురించిన స్పృహ కలుగుతుంది. ఏ ప్రతిరోధమూ లేకుండా సంపూర్ణంగా ఆలోచించుకోవడానికి మీకు స్వేచ్ఛ వున్నప్పుడు, ఆలోచిస్తున్నాము అనే సచేతనత్వం మీలో వుండదు. ఒక ఘర్షణగాని, ఒక ఆటంకంగాని, ఒక సరిహద్దుగాని వున్నప్పుడే మీలోపల వున్న ఆలోచించేవాడిని గురించిన స్పృహ మీలో కలగడం ఆరంభిస్తుంది. అదే విధంగా, సంతోషంగా వున్నప్పుడు మీకు దానిని గురించిన ఎరుక వుంటుందా? ఉల్లాసంగా వున్న క్షణంలో మీరు ఉల్లాసంగా వున్నారనే ఎరుక మీలో వుంటుందా? మీరు విచారంగా, దుఃఖంగా వున్నప్పుడే మీకూ సంతోషం కావాలి అని అనిపిస్తుంది; అప్పుడే, "నిజమైన, శాశ్వతమైన సంతోషం ఏది?" అనే యీ ప్రశ్న ఉదయిస్తుంది.

మనసు మాయలుజేసి ఎట్లా తనని తానే మరిపించుకుంటుందో చూడండి. మీరు విచారంలో, దురవస్థలో, నిరుపేద పరిస్థితుల్లో యింకా యింకా యిటువంటి బాధల్లో వున్నారు కాబట్టి, మీకు ఒక అనంతంగా వుండే, శాశ్వతమయిన సంతోషం కావాలనిపిస్తుంది. అటువంటి దొకటి నిజంగా వున్నాదా? శాశ్వతమయిన సంతోషాన్ని గురించి అడగడానికి బదులు, మిమ్మల్ని శారీరకంగా, మానసికంగా పీడిస్తూ, బాధని కలిగిస్తూవున్న వ్యాధులనుండి విముక్తి పొందడం ఎట్లాగో తెలుసుకోండి. ఆ స్వేచ్ఛను మీరు పొందినప్పుడు యిక సమస్యే లేదు; అప్పుడు అనంతంగా వుండే సంతోషం అనేది వున్నదా, వుంటే అది ఏమిటి అని మీరు ప్రశ్నించరు. సోమరిపోతు, మూర్ఖుడు అయిన వ్యక్తి మాత్రమే తాను కారాగారంలో వుండి, స్వేచ్ఛ అంటే ఏమిటో తెలుసుకోవాలనుకుంటాడు; అంతకంటే సోమరులు, మూర్ఖులు అయినవారు అతనికి సమాధానం చెప్తూ వుంటారు. కారాగారంలోవున్న మనిషికి స్వేచ్ఛను గురించి తెలిసింది వట్టి ఊహాగానమే. కాని అతను కారాగారంనుండి బయటపడ్డాక యిక

స్వేచ్ఛను గురించి ఊహాపోహాలు పెంచుకోడు; అప్పుడు స్వేచ్ఛ అనేది అతను వున్న స్థితి కాబట్టి. అందుకని, సంతోషం అంటే ఏమిటి అని అడగడానికి బదులుగా, మనం ఎందుకు విచారంగా వున్నాం అని తెలుసుకోవడం ఎక్కువ ముఖ్యం కదూ? మనసు ఎందుకు వికలత చెందింది? మన ఆలోచనలు ఎందువలన పరిమితుల్లోకి కుంచించుకొని పోయి, అల్పంగాను, నీచంగాను వుంటాయి? మన ఆలోచనలకు ఏర్పడిన అవధులను మనం కనుక అవగాహన చేసుకోగలుగుతే, దానియందున్న సత్యం గ్రహించగలుగుతే, ఆ సత్యావిష్కరణలోనే విమోచనం వున్నది.

**ప్రశ్న: మనుష్యులు ఎందుకని వస్తువులు కావాలని కోరుకుంటారు?**

**కృష్ణమూర్తి:** మీకు ఆకలిగా వున్నప్పుడు ఆహారం కావాలని కోరుకోరూ? మీకు దుస్తులు కావాలనీ, ఆశ్రయం యివ్వడానికి యిల్లు కావాలనీ కోరుకోరూ? ఇవన్నీ సర్వసాధారణమయిన అవసరాలు, అవును కదూ? ఆరోగ్యంగా వున్న మనుష్యులు తమకు కొన్ని వస్తువుల అవసరం వున్నదనీ, సహజమనీ గుర్తిస్తారు. వ్యాధిగ్రస్తుడయిన మనిషి, లేదా మానసికంగా నిలకడలేని మనిషి మాత్రమే, "నాకు ఆహారం అవసరం లేదు" అని అంటాడు. తనకి చాలా యిళ్ళు కావాలనిగాని, అసలు యిల్లే అవసరం లేదనిగాని అనేది వక్రం చెందిన మనసు.

మీరు మీలోపలి శక్తిని వుపయోగిస్తున్నారు కాబట్టి మీ శరీరానికి ఆకలి వేస్తుంది, అందుకని మరికొంత ఆహారం కోరుకుంటుంది; అది సహజం. కాని, "నాకు చాలా రుచికరమయిన ఆహారం కావాలి, నా జిహ్వకి ఆనందం కలిగించే ఆహారం మాత్రమే కావాలి" అని మీరు అంటే వక్రత్వం ఆరంభమవుతుంది. మనందరికీ, ఒక్క భాగ్యవంతులకు మాత్రమే కాదు, లోకంలో నివసిస్తున్న అందరికీ – ఆహారం, దుస్తులు, నివాస స్థలం కావాలి; అయితే యీ భౌతికావసరాలు సరిపోయినన్ని లేక, తగుమాత్రంగానే వున్నప్పుడు, కట్టుబాట్లు అమలుపరచి, కొద్దిమందికి మాత్రమే లభ్యం చేసినట్లయితే, పెడదారులు పట్టడం అనేది ఆరంభమవుతుంది; ఒక అసహజమయిన ప్రక్రియ ఆరంభం అవుతుంది. "నేను వస్తువులు పోగుచేసుకుంటాను, అన్నీ నాకే కావాలి" అని మీరంటే, యితరుల రోజువారీ అవసరాలకు ఆవశ్యకమయిన దానిని మీరు వారికి దక్కకుండా చేస్తున్నారన్నమాట.

చూడండి, యీ సమస్య అంత సులువయినది కాదు, మన నిత్యావసరాలకు ఆవశ్యకమయినవే కాకుండా, యితర వస్తువులు కూడా మనం కావాలని కోరుకుంటాం. కొద్దిగా ఆహారం, కాసిని దుస్తులు, వుండటానికి ఒక చిన్న గది – వీటితో నేను తృప్తిపడి వూరుకోవచ్చు; అయితే నాకు కావలసినది మరొకటి. నేను పదిమందిలో పేరున్న వ్యక్తిని అవాలి, నాకు హోదా కావాలి, అధికారం, ప్రతిష్ఠ కావాలి, నేను దైవానికి చాలా సన్నిహితంగా చేరాలి, నా స్నేహితులు నా గురించి మంచిగా చెప్పుకోవాలి – యిట్లా యింకా కొన్ని. ఈ అంతర్గతమయిన వాంఛలు మానవుని బాహ్యమయిన అభిలాషలను పెడదారుల్లో పెడతాయి. ఈ సమస్య చాలా జటిలంగా వుంటుంది; ఎందుకంటే, అందరికంటే భాగ్యవంతుడిని అవాలి, అందరికంటె ఎక్కువ అధికారం సంపాదించాలి, గొప్పవాడిని అవాలి అనే

ఆశయాలు, యింకా యిటువంటి అంతర్గతమైన కాంక్షలు తమ సాఫల్యంకోసం వస్తువుల సంచయత్వం మీద ఆధారపడతాయి; ఈ వస్తు సంచయత్వంలోనే ఎక్కువ ఆహారం, దుస్తులు, నివాసగృహాలు స్వంతంగా తమకే కలిగివుండటం కూడ చేరివుంటాయి. అంతర్గతంగా సంపన్నత చెందడం కొరకు నేనూ యీ వస్తువుల మీద ఆధారపడతాను; అయితే నేను యీ విధమైన పరాధీనతలో వున్నంత కాలం అంతర్గతమయిన సంపన్నత సాధించడం నాకు అసాధ్యం; అంతర్గతమైన సంపన్నత అంటే అంతర్గతంగా పూర్తిగా సరళంగా వుండటం అని అర్థం.

★ ★ ★

# అధ్యాయం 15

ఈర్ష్యను గురించి నేను చెప్పిన దానిపై మీలో కొందరికి ఆసక్తి కలిగివుండవచ్చు. నేను 'జ్ఞాపకం' అనే మాట ఉపయోగించడం లేదు. ఎందుకంటే, నేను ముందుగానే వివరించినట్లు మాటలనుగాని, పదప్రయోగాలను గాని జ్ఞాపకం పెట్టుకోవడం మాత్రమే చేస్తే మనసు మందకొడిగా, సోమరిగా, భారంగా, సృజనాత్మకత లేనిదిగా తయారవుతుంది. ఊరికే జ్ఞాపకం పెట్టుకోవడం అనేది చాలా హానికరమయినది. జ్ఞాపకశక్తిని వృద్ధి చేసుకోవటం కంటే, అర్థం చేసుకోవడం, అందులోనూ మీరు చిన్నవయసులో వున్నప్పుడు ముఖ్యంగా పాటించవలసిన సంగతి; ఎందుకంటే, అవగాహన మనసును విముక్తం చేస్తుంది; విశ్లేషణ చేసే విమర్శనాత్మక లక్షణాన్ని అది జాగృతం చేస్తుంది. ఒక అంశం, అది ఎంత సహేతుకమయినదో చూపడం కాకుండా, దాని ప్రాధాన్యత ఏమిటి అనేది గుర్తించడానికి మీకు తోడ్పడుతుంది. ఉదాహరణకి యీర్ష్యను గురించిన కొన్ని మాటలు, వాక్యాలు, అభిప్రాయాలు మాత్రమే మీరు జ్ఞాపకం పెట్టుకుంటే, యీర్ష్య అనే యథార్థం వంక సూటిగా చూడటానికి మీకు ఆ జ్ఞాపకం అడ్డు తగులుతుంది. సత్కార్యాలు, దానధర్మాలు, మతం, గొప్పవారు అవాలనే, సత్పురుషులుగా ప్రకాశించాలనే మీ కాంక్ష – యీ ముసుగు వెనకాల నక్కివున్న యీర్ష్యను మీరు పరికించి, అర్థం చేసుకున్నట్లయితే – దీనిని నిజంగానే మీరు స్వయంగా చూసి, అవగాహన చేసుకున్నట్లయితే, అప్పుడు యీర్ష్య, అసూయల నుండి విముక్తి పొందడం ఎంత అద్భుతంగా వుంటుందో అనే సంగతి మీరు కనిపెట్టగలుగుతారు.

కనుక, అవగాహన చేసుకోవడం అనేది చాలా ముఖ్యం. ఎందుకంటే, జ్ఞాపకం అనేది నిర్జీవమయినది కాబట్టి; బహుశ మానవుని క్షీణతకు గల కారణాలలో యిది ఒక ప్రధానపాత్ర వహిస్తున్నదేమో! ఇతరులను అనుకరించడానికి, పూర్తిగా మరొకరికి నకలుగా తయారవడానికి, ఆదర్శాలను, వీర పురుషులను అనుసరించడానికి మనం ఎక్కువగా మొగ్గుచూపుతూ వుంటాం; అప్పుడు ఏమవుతుంది? సృజనాత్మకత అనే జ్వాల క్రమక్రమంగా ఆరిపోతుంది. ఆపైన వట్టి చిత్రపటం, వట్టి బొమ్మ, వట్టి మాట మాత్రం మిగిలిపోతుంది; దాని వెనకాల ఏమీ వుండదు. కంఠస్థం చేయడం మంచిదని మనకు నేర్పిస్తారు, యిది ఏ మాత్రం సృజనాత్మకమయినది కాదు. పుస్తకాల్లో మీరు చదివిన అంశాలను, మీకు నేర్పించిన విషయాలను వూరికే జ్ఞాపకం పెట్టుకోవడంలో అవగాహన అనేది వుండదు; జీవితకాలమంతా యీ విధంగా జ్ఞాపకశక్తిని పెంచి పోషించడం వలన, నిజమయిన అవగాహన అనేది క్రమంగా హరించుకొనిపోతుంది.

దయచేసి జాగ్రత్తగా వినండి, దీనిని అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం. అవగాహన చేసుకోవడం – సృజనాత్మకమయినది; జ్ఞాపకం పెట్టుకోవడం కాదు, స్మరణ చేసుకోవడం కాదు. అవగాహన చేసుకోవడమే విమోచనకు సాధనం. మీ మనసులో పేర్చి వుంచుకున్న విషయాలు కావు. అవగాహన అనేది భవిష్యత్తుకి సంబంధించినది కాదు. వట్టి జ్ఞాపకశక్తిని అలవరచుకోవడం వల్లనే భవిష్యత్తుని గురించిన యోచన మొదలవుతుంది; అయితే మీరు సూటిగా అవగాహన చేసుకుంటే, అంటే ఒక అంశాన్ని మీరే స్వయంగా, స్పష్టంగా చూడగలుగుతే అప్పుడు యిక ఏ సమస్యా వుండదు. మనం స్పష్టంగా చూడలేకపోయినప్పుడే సమస్యకు ఉనికి ఏర్పడుతుంది.

ఇటువంటప్పుడు ముఖ్యమయినది ఏమిటి అంటే – మీరు తెలుసుకున్నది కాదు, మీరు సేకరించిన జ్ఞానం, అనుభవం కాదు. విషయాలను వున్నవి వున్నట్లుగా, యథాతథంగా చూడటం, తక్షణమే అవగాహన చేసుకోవడం; ఆకళింపు లేదా అవగాహన అనేది తక్షణమే జరిగేది కాబట్టే అది భవిష్యత్తులోనిది కాదు. జ్ఞానం, అనుభవం అవగాహన స్థానాన్ని ఆక్రమించుకున్నప్పుడు అవి జీవితాన్ని దిగజారదీసే కారణాలు అవుతాయి. మనలో చాలామందికి జ్ఞానం, అనుభవం చాలా ప్రాముఖ్యత గలవి; అయితే ఆ మాటల వెనక్కి వెళ్ళి చూసినట్లయితే జ్ఞానానికి, అనుభవానికి గల అసలయిన విలువ ఏమిటో చూసినట్లయితే, మానవజాతి క్షీణతకు, దిగజారిపోవడానికి అవి ప్రధానమయిన కారణాలు అవుతున్నాయని మీరు కనిపెడతారు. అట్లాగని మన జీవితాలలో కొంత కొంత స్థాయిలో జ్ఞానం వుండటం ఉపయుక్తం కాదు అని అర్థం చేసుకోకూడదు. ఒక చెట్టును పెంచాలంటే మొక్కను ఎట్లా నాటాలి, ఏ విధమయిన పోషణ దానికి చేయాలి, కోడిపిల్లలకు ఎట్లా ఆహారం యివ్వాలి, ఒక కుటుంబాన్ని ఏవిధంగా పైకి తీసుకొని రావాలి, ఒక వంతెనను ఎట్లా నిర్మించాలి, యింకా యిటువంటి వాటిని తెలుసుకోవడం ఉపయుక్తమయినదీ, అవసరమయినదీ కూడా. బ్రహ్మాండమయిన శాస్త్రీయ విజ్ఞానం లభ్యమవుతూవున్నది, దీనిని సక్రమంగా ఉపయోగించుకోవచ్చును. ఉదాహరణకి ఒక డైనమోను కాని, ఒక మోటరునుకాని ఎట్లా నిర్మించాలో మనం తెలుసుకొని వుండటం మంచిది, సక్రమమయినది. అయితే అవగాహన లేనప్పుడు, వట్టి జ్ఞాపకం మాత్రమే అయిన జ్ఞానం అత్యంతమైన వినాశనకారి అవుతుంది; అనుభవం కూడా వినాశహేతువు అవడం మీరు తెలుకుంటారు. ఎందుకంటే, జ్ఞాపకాల నేపథ్యాన్ని అనుభవం మరింత గట్టిపరుస్తుంది.

చాలామంది పెద్దవాళ్ళు తాము పక్కా ఉద్యోగుల్లాగా, అధికార స్వభావంతో ప్రవర్తించడం మీరు ఎంతవరకు గమనించి వుంటారు అని యోచిస్తున్నాను. వాళ్ళు కనుక అధ్యాపకులవుతే వారి ఆలోచనలు ఆ రంగానికే పరిమితమయి వుంటాయి; సజీవత్వంతో తొణికిసలాడే మనుష్యులలాగా వుండనే వుండరు. వ్యాకరణ సూత్రాలు, గణితం కాస్తంత చరిత్ర వారికి తెలిసివుంటాయి; ఆ జ్ఞాపకాలు, ఆ అనుభవంతో వారి ఆలోచనా విధానానికి చుట్టూ గిరి గీసేసుకొని వుండటం వలన వారి జ్ఞానం వారి వినాశనానికి దారి తీస్తుంది. జీవితం అంటే ఏమిటో మరొకరి నుండి

నేర్చుకునే విషయం కాదు. జీవితం అంటే అనుభవాలను పోగుచేసి పెట్టుకోకుండా మీరు వింటూ వుండవలసినది, క్షణక్షణమూ మీరు అవగాహన చేసుకోవలసినది. మీరు అనుభవాలను పోగుచేసి పెట్టుకున్న తరువాత మీకు ఒరిగేది మాత్రం ఏముంది? "నాకు బ్రహ్మాండమయిన అనుభవం వున్నది" అనికాని, "నాకు ఆ మాటల అర్థం తెలుసు" అనికాని మీరు అంటే అవి జ్ఞాపకాలు, అంతేకదూ? మీకు ఏవో కొన్ని అనుభవాలు జరిగి వుండవచ్చును, ఒక ఆఫీసును ఎట్లా నడిపించాలో మీరు నేర్చుకొని వుండవచ్చును, ఒక భవనాన్నో, వంతెననో ఎట్లా నిర్మించాలో మీరు నేర్చుకొని వుండవచ్చును; యీ నేపథ్యం ఆధారంగా మీరు మరికొంత అనుభవం పొందుతారు. అనుభవాన్ని మీరు పెంచి పోషిస్తారు, అదే స్మృతి అవుతుంది, ఆ స్మృతులతో, ఆ జ్ఞాపకాలతో మీరు జీవితాన్ని ఎదుర్కొంటారు.

ఒక నదిలాగా జీవితం వురవడితో, చంచలంగా, స్థిరత్వం అనేది లేకుండా ప్రవహిస్తూనే వుంటుంది; స్మృతి అనే మోయలేని భారంతో మీరు జీవితాన్ని ఎదుర్కొంటే, అప్పుడు సహజంగానే అసలు జీవితాన్ని మీరు స్పృశించనయినా స్పృశించలేరు. మీరు సంపాదించిన జ్ఞానంతో, అనుభవంతో మీరు జీవితాన్ని ఎదుర్కొంటున్నారు, దీనివల్ల స్మృతుల బరువుభారం మరింత ఎక్కువవుతూ వుంటుంది; కాబట్టి జ్ఞానం, అనుభవం క్రమక్రమంగా జీవిత వినాశనానికి దారితీసే కారణాలుగా తయారవుతాయి.

ఇదంతా మీరు చాలా గాఢంగా అర్థం చేసుకుంటున్నారని ఆశిస్తాను, ఎందుకంటే, నేను చెప్తున్నది చాలా యథార్థమయిన విషయం; దీనిని మీరు అవగాహన చేసుకున్నట్లయితే, జ్ఞానాన్ని దానికి తగిన స్థాయిలో ఉపయోగించుకుంటారు. మీరు కనుక అవగాహన చేసుకోకుండా, జ్ఞానాన్ని, అనుభవాన్ని పోగుచేసుకొని, జీవితంలో నెగ్గుకొని రావడానికి ఒక సాధనంగా, లోకంలో మీ స్థానాన్ని బలపరచుకోవడానికి ఒక సాధనంగా ఉపయోగిస్తే, అప్పుడు జ్ఞానం, అనుభవం అత్యంత వినాశకరమైనవిగా పరిణమిస్తాయి; అవి మీ అంతఃస్ఫూర్తిని, మీ సృజనాత్మకతను హరించివేస్తాయి. మనలో చాలామందిమి ఆధిపత్యపు భారం, యితరుల ఉపదేశాల భారం, భగవద్గీతల, యింకా ఎన్నో అభిప్రాయాల భారాలు మోసి, క్రుంగిపోయి, చివరకు మన జీవితాలను మహామందకొడిగా తయారుచేసుకున్నాం. ఇవి అన్నీ జ్ఞాపకాలు, స్మృతులు; ఇవి మనం అవగాహన చేసుకున్న విషయాలు కావు, అవి సజీవమయినవి కావు. మనం యీ జ్ఞాపకాల భారం మోస్తున్నంతవరకు క్రొత్తవైనవేవీ జరగవు; అయితే జీవితం నిరంతరంగా నవ్యనూతనంగా వుంటుంది; కనుక మనం దానిని, జీవితాన్ని అవగాహన చేసుకోలేము. అందువలన మన బ్రతుకు విసుగ్గా అయిపోతుంది; మనం బద్ధకంగా తయారవుతాం; మానసికంగా, భౌతికంగా మనం లావుగా, వికారంగా పెరిగిపోతాం. ఇదంతా అవగాహన చేసుకోవడం చాలా ముఖ్యం.

సరళత్వం లేదా సంకీర్ణంగా లేకపోవడం అంటే అనుభవాల, జ్ఞాపకాల బరువు భారాలనుండి మనసుకు విముక్తి కలగడం. సరళత్వం అంటే చాలా కొద్ది దుస్తులే వుండటం, ఒక భిక్షా పాత్ర వుండటం అని మనం అనుకుంటాం; సరళత్వం గల

జీవితం అంటే బాహ్యంగా చాలాకొద్ది వస్తువులను కలిగివుండటం అని మనం అనుకుంటాం. అది కొంతవరకు నిజమే అవచ్చు. అయితే, యథార్థమయిన సరళత్వం అంటే జ్ఞానంనుండి విముక్తి; జ్ఞాపకం పెట్టుకోవడం నుండీ, అనుభవాలు పోగుచేసుకోవడం నుండి విముక్తి. చాలా కొద్దిగా కలిగివుండటాన్ని ఒక ప్రత్యేక లక్షణంగా అలవర్చుకొని, తాము చాలా సరళత్వం వున్న వారిమని తలచేవారిని మీరు గమనించలేదూ? వారు చెప్పేవి మీరు వినలేదూ? వారివద్ద ఒక్క గోచిపాత, ఒక్క చేతికర్ర మాత్రమే వున్నా వారివద్ద ఆదర్శాలు మాత్రం బోలెడు వుంటాయి. అంతర్గతంగా వారు చాలా సంక్లిష్టంగా వుంటారు; తమతో తామే సమరం చేస్తూ, తాము చేసుకున్న ఊహాకల్పనలను, తమ విశ్వాసాలను తామే అనుసరించడానికై ప్రయాసపడుతూ వుంటారు. అంతర్గతంగా వారిలో సరళత్వం వుండదు; పుస్తకాలనుండి వారు సేకరించిన వాటితో నిండిపోయి వుంటారు; ఎన్నో ఆదర్శాలు, కొన్ని సిద్ధాంతాలలో నమ్మకం, భయాలు – వీటితో నిండిపోయి వుంటారు. బయటకు మాత్రం వారికి ఒక్క చేతికర్ర, చాలా కొద్ది దుస్తులు వుండవచ్చును. అయితే, నిజమైన సరళత్వం అంటే అంతర్గతంగా శూన్యతతో వుండటం, సహజ స్వభావంతో వుండటం, నమ్మకాలు, సిద్ధాంతాలు లేకుండా వుండటం, ఆధిపత్యం చేసే అధికారం అంటే భయం లేకుండా వుండటం; అటువంటి అంతర్గతమయిన సరళత్వం, మీరు ప్రతి అనుభవాన్ని క్షణక్షణమూ నిజంగా అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే సిద్ధిస్తుంది. ఒక అనుభవాన్ని మీరు అవగాహన చేసుకున్నట్లయితే, ఆ అనుభవం అప్పటితో పూర్తి అయిపోయినట్లే; ఏ అవశేషమూ మిగిలి వుండదు. అనుభవాన్ని మనం అవగాహన చేసుకోకపోవడం వలన, దానిలో వున్న సుఖాన్ని, బాధని గుర్తుపెట్టుకోవడం వలన, మనం అంతర్గతంగా సరళంగా వుండటం అసాధ్యం అవుతున్నది. ఆధ్యాత్మిక వైఖరిని అలవరచుకున్నవారు బాహ్యమయిన సరళత్వాన్ని సాధించే వాటి కోసం ఆరాటపడతారు; అయితే అంతర్గతంగా వారు ఆందోళనతోను, అల్లకల్లోలంగాను వుంటారు; అసంఖ్యాకమయిన వాంఛలు, కోరికలు, జ్ఞానం అనే భారాలు మోయలేక వారు క్రుంగిపోయి వుంటారు; బ్రతుకు అన్నా, అనుభవాలు పొందాలన్నా వారు భయభ్రాంతులయి వుంటారు.

ఊర్ధ్వవంక మీరు బాగా పరికించి చూసినట్లయితే, లోతుగా వ్రేళ్ళూనుకొనిపోయిన జ్ఞాపకం యొక్క మరో రూపమే అది అనీ, అది అతి వినాశకరమయినది అనీ తెలుసుకుంటారు; మన జీవితాలను దిగజార్చడానికి కారణమయినది అని కూడా గ్రహిస్తారు. అనుభవం చేసేది కూడా యిదే. అట్లాగని రోజువారీ అంశాలన్నీ మీరు మరచిపోవాలనీ, అనుభవాన్ని దాటవేయాలనీ అర్థం కాదు. మీరు అట్లా చేయలేరు. అయితే, ఎక్కువ అనుభవం గడించిన మనిషి చాలా వివేకవంతుడు అని చెప్పడానికి వీల్లేదు. ఒక అనుభవం పొందిన మనిషి, ఆ అనుభవాన్నే వదలకుండా పట్టుకొని వ్రేలాడుతుంటే, అతను గొప్ప వివేకి ఏమీ కాదు; పుస్తకాలు చదివి సమాచారాన్ని పోగుచేసుకొనే మామూలు పాఠశాల విద్యార్థిలాంటి వాడే అతడు కూడా. వివేకవంతుడయిన వాడు సహజస్వభావంతోను, అనుభవం నుండి విముక్తి చెందీ వుంటాడు; అంతర్గతంగా అతను సరళత్వంతో వుంటాడు; బాహ్యంగా యీ

భూమిమీది వస్తువులన్నింటినీ అయినా కలిగివుండచ్చు, లేదూ అతనికి వున్నది బహుకొద్దీ అవచ్చు.

ప్రశ్న: తెలివీ, వివేకం సౌశీల్యాన్ని కలిగిస్తాయా?

కృష్ణమూర్తి: 'సౌశీల్యం' అంటే అర్థం ఏమిటి? 'తెలివి', 'వివేకం' అంటే అర్థం ఏమిటి? ప్రతి రాజకీయ నాయకుడు – అతను ఢిల్లీ రకమయినా సరే, మీ వూళ్ళో రచ్చబండమీద కూర్చొని ఉపన్యాసాలు దంచే రకమయినా సరే – 'శీలం', 'ఆదర్శం', 'తెలివి', 'మతం', 'దైవం' వంటి మాటలను అదే పనిగా వాడుతూ వుంటాడు. అవి చాలా గొప్ప సంగతులని అనుకుంటూ మనమూ చాలా శ్రద్ధతో చెవులు దోరగిల బెట్టుకొని వింటూ వుంటాం. మనలో చాలామందిమి యీ మాటలతోనే కడుపులు నింపుకుంటూ వుంటాం. అవి ఎంత ఆడంబరంగా వుంటే, ఎంత వన్నె చిన్నెలతో అలంకారయుతంగా వుంటే అంతగా మనం సంతృప్తి చెందుతాం. కనుక, అసలు 'తెలివి' అంటే ఏమిటో, 'సౌశీల్యం' అంటే అర్థం ఏమిటో తెలుసుకుందాం. మీ ప్రశ్నకు ఒక నిర్ధారణ అయిన సమాధానం యివ్వడం లేదని అనకండి. నిర్వచనాల కోసం, తీర్మానాల కోసం వెతకడం అంతా మనసుచేసే యింద్రజాలమే. నిర్వచనాల కోసం వెతకడం అంటే మీకు అన్వేషించి తెలుసుకోవాలని లేదని, అవగాహన చేసుకోవాలని లేదని, మీకు వట్టి మాటలను మాత్రమే అనుసరించాలని వున్నదనీ అర్థం.

తెలివి అంటే ఏమిటి? ఒక మనిషి భయభీతుడయి, ఆందోళనతో, యీర్ష్యతో, అత్యాశతో వుంటే, అతని మనసు మరొకరికి నకలుగా తయారవుతూ, అనుకరిస్తూ, యితరుల అనుభవాలతో, జ్ఞానంతో తన్నుతాను నింపుకుంటూ వుంటే – అతని ఆలోచనా తీరును సమాజం, పరిసరాలు కొన్ని పరిమితుల్లో వుంచి, దానిని ఒక ఆకృతిలో దిద్దుతూ వుంటే – అటువంటి మనిషి ప్రజ్ఞావంతుడా, తెలివికలవాడా, వివేకవంతుడా? అతను తెలివి కలవాడు కాడు, అవునా? భయభీతుడై, ప్రజ్ఞాహీనుడయిన వాడికి సౌశీల్యం వుంటుందా? సౌశీల్యం అటే స్వతహాగా స్వశీలం కలిగివుండటం; ఆచారంగా వస్తూవున్న మంచీ, చెడు సూత్రాలను వూరికే పునశ్చరణ చేయడం కాదు; కాదు కదూ? సౌశీల్యం కలిగినవాడు అంటే మర్యాదస్థుడనా? పరువు మర్యాదలు కలవాడనా?

"పరువు మర్యాదలు" అనే మాటకి అర్థం ఏమిటో మీకు అవగాహన అయిందా? మిమ్మల్ని అందరూ పెద్దమనిషిగా లెక్కచేస్తే మీ చుట్టూవున్న చాలామంది మిమ్మల్ని గౌరవిస్తే మీరు మర్యాదస్తులయినట్లు. ఈ చాలామంది – అంటే కుటుంబంలోని మనుష్యులు, జనబాహుళ్యానికి చెందిన మనుష్యులు గౌరవించేది ఏమిటి? వారు స్వయంగా అవాలి అని అనుకున్నవాటిని, ఒక ధ్యేయంగా, ఒక ఆదర్శంగా వారు ఊహించి కల్పన చేసుకున్న వాటిని వారు గౌరవిస్తారు; చాలా అల్పమయిన తమ స్వస్థితికి పూర్తిగా విరుద్ధంగా వారికి కనబడుతున్న వాటికి వారు మర్యాద చూపుతారు. మీరు ఐశ్వర్యవంతులయి, అధికారబలం కలిగివుంటేనో, రాజకీయ రంగంలో గొప్ప కీర్తి వుంటేనో, బహుళ జనాదరణ పొందిన పుస్తకాలు

మీరు రచిస్తేనో, మిమ్మల్ని ఎక్కువమంది ప్రజలు గౌరవమర్యాదలతో చూస్తారు. మీరు మాట్లాడేది శుద్ధ వూకదంపుడు కావచ్చు; మిమ్మల్ని ప్రజలు గొప్పవారుగా ఎంచుతుండటం వలన, మీరు మాట్లాడుతుంటే వారు వింటారు. ఈ విధంగా మీరు చాలామంది గౌరవాన్ని పొందడం, జనబాహుళ్యపు అభిమానాన్ని సంపాదించడం మీలో పరువు మర్యాదలు కలవాడిని అనే ఒక భావాన్ని కలుగజేస్తాయి. ఏదో సాధించాను అన్న భావాన్ని కలుగజేస్తాయి. అయితే అందరూ పాపాత్ముడు అని అనే వ్యక్తి యీ మర్యాదస్తుడి కంటే దైవానికి మరింత సన్నిహితంగా చేరుకోగలడు, ఎందుకంటే మర్యాదస్తుడు కపటవేషం అనే ముసుగు కప్పుకొని వుంటాడు కాబట్టి.

సౌశీల్యం అనేది అనుకరణకు ఫలితమా, యితరులు ఏమంటారో లేదూ ఏమి అనరో అనే భయంవలన పెట్టుకున్న అదుపు ఆజ్ఞల ఫలితంగా వస్తుందా? శీలం అంటే ఒక వ్యక్తి తన స్వభావ వైఖరులను, తన నిర్హేతుకమైన అభిప్రాయాలను మరింత దృఢపరచుకోవడం మాత్రమేనా? తమ సంప్రదాయాన్ని, అది ఇండియాది అవచ్చు, యూరపుది అవచ్చు, అమెరికాది అవచ్చు – ఆ సంప్రదాయాన్ని నిలబెట్టుకోవడమా? సాధారణంగా దీనినే శీలం కలిగివుండటం అంటూ వుంటాం; ప్రాంతీయ సంప్రదాయాన్ని పాటించే గట్టిమనిషి అని అందరూ మర్యాద చేస్తూవుండటాన్ని. అయితే మీలో నిర్హేతుకమైన అభిప్రాయాలు వుండి, అనుకరణ చేస్తూ, సంప్రదాయాలచేత బంధింపబడి మీరు వున్నప్పుడు, లేదూ భయభ్రాంతులయి వున్నప్పుడు, మీలో తెలివి, వివేకం వున్నాయని అనగలమా? అనుకరించడం, అనుసరించడం, పూజ చేయడం, ఆదర్శాలు వుండటం – యీ మార్గం పరువు మర్యాదలకు దారితీస్తుంది, కాని అవగాహనకు కాదు. ఆదర్శాలుగల మనిషికి అందరూ మర్యాద యివ్వవచ్చు; కాని అతను దైవాన్ని ఏనాటికీ సమీపించలేడు. ప్రేమించడం అంటే ఏమిటో అతడు ఏనాటికీ తెలుసుకోలేడు, ఎందుకంటే – అతని ఆదర్శాలు అతనిలోని భయాన్నీ, అతని అనుకరణనీ, అతని ఒంటరితనాన్ని కప్పివుంచే ఒక మార్గం.

కనుక, మిమ్మల్ని మీరు అవగాహన చేసుకోకుండా, మీ లోపల మనసులో ఏయే కార్యకలాపాలు జరుగుతున్నాయో – ఏ విధంగా ఆలోచిస్తున్నారు, మరొకరికి నకలుగా అవుతున్నారా, అనుకరిస్తున్నారా, భయభ్రాంతులయి వున్నారా, అధికారబలం కోసం ఆరాటపడుతున్నారా – వీటన్నింటిని గురించిన ఎరుక లేకుండా తెలివి వుండటం అనేది జరగదు. ఇటువంటి తెలివి మాత్రమే శీలాన్ని తయారుచేస్తుంది. వీరపూజ చేయడం కాదు, ఆదర్శాన్ని అందుకోవడం కోసం పెట్టే పరుగులు కాదు, శీలాన్ని తయారుచేసేవి. తనని తాను, లోపల విపరీతమయిన సంక్లిష్టతలతో కూడిన తనను తాను స్వయంగా అవగాహన చేసుకోవడంలోనే వివేకానికి, తెలివికి ఆరంభం వున్నది. అదే సౌశీల్యాన్ని వ్యక్తం చేస్తుంది.

ప్రశ్న: మరొక వ్యక్తి తనవైపు అదేపనిగా పరికించి చూస్తున్నప్పుడు మనిషి ఎందుకు కలవరం చెందుతాడు?

కృష్ణమూర్తి: ఎవరయినా మిమ్మల్ని పరికించి చూస్తున్నప్పుడు మీరు తత్తరపాటు

చెందుతారా? ఒక నవుకరుగాని, పల్లెమనిషిగాని – చాలా అల్పుడు అని మీరు అనుకునే మనిషి ఒకరు – మిమ్మల్ని పరికించి చూస్తుంటే, అతను అక్కడ వున్నాడని కూడా మీకు తెలియదు, అతన్ని దాటుకుంటూ మీదారిన మీరు వెళ్ళిపోతారు; అతనిని మీరు పెద్దగా లెక్కచేయరు. అయితే మీ నాన్నగారు, అమ్మ లేదా మీ టీచరు మిమ్మల్ని పరకాయించి చూస్తుంటే, మీలో ఒకరకమైన ఆదుర్దా బయలుదేరుతుంది. ఎందుకంటే, వారికి మీకంటె ఎక్కువ తెలుసును కాబట్టి; మీ గురించిన సంగతులు ఏమయినా కనిపెడతారేమోనని ఆదుర్దా పడతారు. ఇది దాటి యింకాస్త పైకి వెళ్ళామంటే, ఒక ప్రభుత్వాధికారిగానీ, మరో గొప్ప పేరున్న పెద్దమనిషికానీ మిమ్మల్ని గమనిస్తే మీకు సంతోషమే. అతని ద్వారా మీరు ఏదయినా ప్రయోజనం పొందవచ్చనీ, ఒక ఉద్యోగమో, మరేదయినా ప్రతిఫలమో సంపాదించవచ్చని ఆశిస్తారు. ఒక వ్యక్తి, అతని నుండి మీరు ఏదీ ఆశించని వ్యక్తి మిమ్మల్ని పరికించి చూస్తుంటే, మీరు నిర్లక్ష్యంగా ఊరుకుంటారు, అవును కదూ? కాబట్టి యితరులు మిమ్మల్ని పరకాయించి చూస్తున్నప్పుడు మీ మనసు లోపల ఏమేమి జరుగుతున్నాయన్నది చాలా ముఖ్యమైన విషయం. ఒక చూపుకు గాని, ఒక చిరునవ్వుకు గాని మీరు అంతర్గతంగా ఏ విధంగా ప్రతిస్పందిస్తారు అనే విషయంలో ఎన్నో లోతయిన అర్థాలు వున్నాయి.

మనలో చాలామంది యీ విషయాలన్నింటి గురించి ఏమాత్రం పట్టించుకోక పోవడం చాలా విచారకరం. ఒక బిచ్చగాడివైపు, మోయలేనంత పెద్ద బరువులు మోసుకొనిపోతున్న ఒక గ్రామీణుడివైపు, ఎగురుతున్న రామచిలుక వైపు మనం ఎప్పుడూ దృష్టి సారించి చూడనే చూడం. మన స్వంత ఆవేదనలు, మన ఆరాటాలు, భయాలు, మన సౌఖ్యాలు, పూజాపురస్కారాలు – మన ధ్యాస అంతా పూర్తిగా వీటిపైనే తప్ప, జీవితంలో ప్రధానమయిన ఎన్నో విషయాలను గురించి మనం పట్టించుకోము, వాటి ఎరుక మనకు వుండదు.

**ప్రశ్న: అవగాహనను మనం అలవరుచుకోలేమా? అవగాహన చేసుకోవడానికి మనం ఎప్పుడూ ప్రయత్నిస్తూ వుంటే, అది అవగాహనను సాధన చేస్తున్నట్లు కాదా?**

**కృష్ణమూర్తి:** అవగాహన అలవరచుకొనేదా? టెన్నిస్, పియానో, పాటలు పాడటం, నృత్యం చేయడం రోజూ మీరు సాధన చేసినట్లుగా సాధన చేసే విషయమా అవగాహన? ఒక పుస్తకాన్ని మళ్ళీ మళ్ళీ చదివి, అందులోని విషయమంతా క్షుణ్ణంగా తెలుసుకోవచ్చు. అవగాహన కూడా అటువంటిదేనా, మళ్ళీ మళ్ళీ పునశ్చరణ చేసి నేర్చుకొనే విషయమా? ఇట్లా చేయడం జ్ఞాపకశక్తిని వృద్ధిచేసుకోవడం అవుతుంది. అవగాహన అంటే క్షణక్షణమూ జరిగేది కాదూ? కాబట్టి సాధన చేసి నేర్చుకునే విషయం కానే కాదు, కదూ?

మీరు ఎప్పుడు అవగాహన చేసుకుంటారు? అవగాహన వున్నప్పుడు మీ మనసు, హృదయం ఎటువంటి స్థితిలో వుంటాయి? ఈర్ష్యను గురించిన అసలైన నిజాలు – యీర్ష్య వినాశనకారి అనీ, అసూయ మానవ సంబంధాలు క్షీణించిపోవడానికి ప్రధాన

కారణం అనీ నేను చెప్తుంటే మీరు విన్నప్పుడు, మీరు ఏవిధంగా ప్రతిస్పందిస్తారు? అందులో వున్న సత్యాన్ని మీరు తక్షణమే గుర్తిస్తున్నారా? లేదా మీరు యీర్ష్యని గురించి ఆలోచించడం మొదలుపెట్టి, దానిని గురించి మాట్లాడి, హేతుబద్ధంగా చేసి, విశ్లేషించి చూడటం మొదలుపెడతారా? అవగాహన అంటే హేతువులు వెతికే లేదా నెమ్మదిగా విశ్లేషణ చేసే ఒక ప్రక్రియా విధానమా? మీ తోటను పెంచి, పోషించి పళ్ళూ, పూవులూ కాయించినట్లు అవగాహనను పెంచి పోషించగలమా? ఖచ్చితంగా చెప్పాలంటే – మాటలు, అపోహలు, ఉద్దేశాలు అనే అడ్డుగోడలు లేకుండా, ఒక విషయంలోని సత్యాన్ని సూటిగా, ప్రత్యక్షంగా చూడటమే అవగాహన అంటే.

**ప్రశ్న: అవగాహన చేసుకొనే శక్తి అందరిలోను సమానంగా వుంటుందా?**

**కృష్ణమూర్తి:** ఒక యథార్థాన్ని మీ ముందు వుంచారనుకుందాం; దానిలోని నిజాన్ని మీరు అతి త్వరగా గ్రహించారనుకోండి; మీలో ఏ అడ్డుగోడలు లేకపోవడం వలన మీరు తక్షణమే అర్థం చేసుకున్నారు. మీ స్వీయ ఘనతని గురించి మీరు పట్టించుకొని కూర్చోకుండా, తెలుసుకోవాలనే ఉత్సాహం మీలో వుండటంవలన, తక్షణమే మీరు గ్రహించగలిగారు. కాని, నాలో ఎన్నో అడ్డుగోడలు వున్నాయి, మరెన్నో నిర్హేతుకమైన అభిప్రాయాలు వున్నాయి. నాలో అసూయ, యీర్ష్యల వలన కలిగిన ఘర్షణలతో నేను ఛిన్నాభిన్నం అయిపోతున్నాను. నేనేదో గొప్పవాడిని అనే భావంతో నిండిపోయివున్నాను. జీవితంలో ఎన్నో సంపాదించి, సంచయంచేసి పెట్టుకున్నాను, నాకు ఏదీ తెలుసుకోవాలని నిజంగా లేదు, అందుకని నేను ఏదీ చూడను, నేను ఏదీ అవగాహన చేసుకోను.

**ప్రశ్న: ఎప్పుడూ అవగాహన చేసుకోవడానికి ప్రయత్నిస్తూ వుండటం ద్వారా యీ అడ్డుగోడలను మెలమెల్లగా తొలగించుకోలేమా?**

**కృష్ణమూర్తి:** తొలగించలేము. అడ్డుగోడలను నేను తొలగించుకోగలను; అయితే అది అవగాహన చేసుకోవడం ద్వారా కాదు; అడ్డుగోడలు లేకపోవడంలోని ప్రాధాన్యతను నేను నిజంగా గ్రహించినప్పుడు మాత్రమే – అంటే అర్థం, నేను ఆ అడ్డుగోడల్ని చూడటానికి సిద్ధపడాలి. ఈర్ష్య చాలా వినాశకారి అని ఎవరో అంటుంటే మీరు, నేను విన్నామని అనుకోండి. మీరు వింటారు, దాని ప్రాధాన్యాన్ని, అందులోని నిజాన్ని మీరు అవగాహన చేసుకుంటారు; ఈర్ష్య, అసూయ అనే మనోభావాలనుండి మీరు విముక్తి పొందుతారు. కాని, నేను అందులోని నిజాన్ని చూడటానికి యిష్టపడను; ఎందుకంటే – నేను ఆ సత్యాన్ని గ్రహించానంటే, అది నా జీవిత స్వరూపాన్ని అంతా పూర్తిగా నిర్మూలించివేస్తుంది.

**ప్రశ్న: ఈ అడ్డుగోడలను తొలగించడం చాలా అవసరమని నాకు అనిపిస్తున్నది.**

**కృష్ణమూర్తి:** అట్లా ఎందుకు మీకు అనిపిస్తున్నది? పరిస్థితుల వలన మీరు

ఆ అడ్డుగోడలను తొలగించాలని కోరుతున్నారా? అట్లా చేయాలని మీకు ఎవరో చెప్పారు కాబట్టి మీరు వాటిని తొలగించాలని అనుకుంటున్నారా? ఏ విధమయిన అడ్డుగోడలు వున్నా సరే, అవి మెలమెల్లగా శిథిలం అవుతుండే స్థితిలో వున్న మనసును తయారుచేస్తాయని మీ అంతట మీరే స్వయంగా తెలుసుకున్నప్పుడు, ఆ అడ్డుగోడలు తప్పకుండా తొలగిపోతాయి. అయితే, యిది మీరు ఎప్పుడు తెలుసుకుంటారు? బాగా బాధపడినప్పుడా? అయితే, బాధపడటం అనేది అడ్డుగోడలన్నీ తొలగించడంలోని ప్రాధాన్యాన్ని తప్పనిసరిగా మీలో జాగృతం చేస్తుందా? అట్లా కాకపోగా, మీరు మరికొన్ని అడ్డుగోడలను నిర్మించడానికి అది దారి తీస్తుందా?

మీరు స్వయంగా వినడం ఆరంభించినపుడు, పరిశీలించడం ఆరంభించినపుడు, తెలుసుకొనడం ఆరంభించినపుడు యీ అడ్డుగోడలన్నీ కూలిపోవడం మీరే గ్రహిస్తారు; అడ్డుగోడలను తొలగించడానికి కారణం లేదు; మీరు కారణాన్ని తీసుకువచ్చారంటే, అడ్డుగోడలను మీరు తొలగించడం లేదు అన్నమాట. మహా అద్భుతమైనది, గొప్ప వరమూ ఏమిటంటే – మీ స్వంత, అంతర్గతమైన గ్రాహ్యశక్తికి అడ్డుగోడలను తొలగించే ఒక అవకాశం యివ్వడం. కానీ, అడ్డుగోడలను తొలగించి తీరాలి అని మీరు అన్నప్పుడు, అది అంతా మనసు చేస్తున్న పని; మనసు యీ అడ్డుగోడలను తొలగించనే లేదు. మీరు చేసే ఏ ప్రయత్నమూ వాటిని తొలగించలేవని మీరు తెలుసుకోవాలి. అప్పుడు మనసు చాలా నిమ్మళిస్తుంది, చాలా నిశ్చలంగా వుంటుంది; యీ నిశ్చలత్వంలో మీరు సత్యమయినదానిని ఆవిష్కరించుకుంటారు, కనిపెడతారు.

★ ★ ★

# అధ్యాయం 16

మానవ జీవితంలో క్షీణతకు దారితీయిస్తున్న కారణాలను గురించి మనం మాట్లాడుకుంటూ వున్నాం; యీ క్షీణతకు ప్రధాన కారణాల్లో ఒకటి భయం అని కూడా అనుకున్నాం. ఇంకొక విషయం కూడా మనం చెప్పుకున్నాం. ఆధిపత్యాన్ని, అది ఏ రూపంలో వున్న సరే – స్వయంగా విధించుకున్నదయినా, బయటనుండి ప్రయోగింపబడినదయినా సరే, దానిని అనుసరించడమూ, అంతేకాకుండా ఏ రకమయినదయినా సరే, అనుకరణమూ, నకలుగా తయారవడమూ అనేవి సహజ అభినివేశాన్ని, సృజనాత్మకతను నశింపజేస్తాయి; సత్యం ఏమిటి అనేది కనుగొనడానికి యిది అవరోధం అవుతుంది.

సత్యం అంటే అనుసరించవలసిన ఒక విషయం కాదు; అది కనుగొనవలసిన విషయం. ఏదయినా పుస్తకం ద్వారా కాని, పోగుచేసుకున్న అనుభవాల ద్వారా గాని సత్యాన్ని మీరు తెలుసుకోలేరు. ఆ రోజు మనం చర్చించుకున్నట్లుగా, అనుభవం ఒక స్మృతిగా మారినప్పుడు, ఆ స్మృతి సృజనాత్మకమయిన అవగాహనను నశింపజేస్తుంది. ఎంత స్వల్పంగానయినా సరే – కార్పణ్యభావం, యీర్ష్యాభావం వుంటే అవి కూడా యీ సృజనాత్మకమైన అవగాహనను హరించి వేస్తాయి. ఈ సృజనాత్మకమైన అవగాహన లేకుండా సంతోషమే లేదు. సంతోషాన్ని కొనితెచ్చుకోలేము; అది కావాలని దాని వెనుక పరుగులు పెడితే దొరికేది కాదు; సంఘర్షణ లేనప్పుడు అది ప్రత్యక్షంగా వుంటుంది.

సరే, మాటల, పదాల విశిష్టత ఏమిటి అనే విషయం మెలమెల్లగా అవగాహన చేసుకోవడం – అందులోనూ మనం యింకా స్కూల్లో చదువుతున్నప్పుడే ఆరంభం చేయడం – చాలా ముఖ్యం కదూ? మనలో చాలామందికి మాటలు, సంకేతాలు లేదా చిహ్నాలు అతి భయంకరమైన వినాశనకారులుగ తయారయినాయి; అయితే ఆ విషయం మనం గ్రహించలేదు. సంకేతం అని నేను ఎందుకు అంటున్నానో మీకు తెలుసునా? సంకేతం సత్యానికి ఛాయ వంటిది. ఉదాహరణకి గ్రామఫోను రికార్డు వాస్తవమయిన కంఠం కాదు; కంఠస్వరాన్ని రికార్డు మీద ముద్రించారు, దానిని మనం వింటుంటాం. మాట, సంకేతం, ప్రతిరూపం, ఊహ యివి యేవీ నిజం కాదు; కాని మనం ప్రతిరూపాన్ని, ప్రతిమను పూజిస్తాం, సంకేతాన్ని గౌరవిస్తాం, మాటకు గొప్ప ప్రాధాన్యాన్ని ఆపాదిస్తాం; యివన్నీ చాలా విధ్వంసపూరితమయినవి; ఎందుకంటే అప్పుడు మాటకు, సంకేతానికి, ప్రతిమకు సత్యానికంటే అశేషమైన ప్రాముఖ్యం కలుగుతుంది కాబట్టి. ఆ విధంగానే దేవాలయాలు, చర్చీలు, యింకా వ్యవస్థీకృతమయిన అనేక మతాలు వారి వారి సంకేతాలతో, నమ్మకాలతో, మూర్ఖ

విశ్వాసాలతో ఆవలగా ఏముందో అధిగమించి చూడకుండా సత్యాన్ని కనుగొనకుండా మనసును నిరోధించే పాత్రను పోషిస్తున్నాయి. కాబట్టి మాటలలో సంకేతాలలో చిక్కుకొని పోకండి; అవి అనుకోకుండానే ఒక అలవాటును తయారుచేస్తాయి. అలవాటు అన్నింటికంటే వినాశకరమైనది; ఎందుకంటే – మీరు సృజనాత్మకంగా ఆలోచించాలని కోరుకున్నప్పుడు, అలవాటు అందుకు అడ్డుతగులుతుంది.

నేను చెప్తున్న దానిలోని ప్రాధాన్యం అంతా మీకు బహుశ అవగాహన కాకపోవచ్చును; మీరు ఆలోచించినట్లయితే మీకు అర్థం అవుతుంది. అప్పుడప్పుడు మీరు ఒక్కరే దూరంగా నడుస్తూ వెళ్ళి యీ విషయాలన్నీ ఆలోచించుకొని చూడండి. 'జీవితం', 'దైవం', 'కర్తవ్యం', 'సహకారం' అనే మాటలకు – మనం తరచు యథేచ్ఛగా వాడే ఆ అద్భుతమయిన పదాలకు – అసలయిన అర్థం ఏమిటో తెలుసుకోండి.

'కర్తవ్యం' అంటే ఏమిటి అని మీలో మీరే ఎప్పుడయినా ప్రశ్నించుకున్నారా? ఏ విషయంలో కర్తవ్యం? వృద్ధులైనవారి విషయంలో సంప్రదాయం ఏమంటున్నది? తల్లిదండ్రుల కోసం, మీ దేశం కోసం, మీ దేవతల కోసం మీ స్వార్థాన్ని మీరు త్యాగం చేసితీరాలి అని అంటున్నది. 'కర్తవ్యం' అనే ఆ పదం చాలా అసాధారణమయిన ప్రాముఖ్యాన్ని పొందింది మీ దృష్టిలో, అవును కదూ? అది బోలెడు అర్థాన్ని నింపుకొని చాలా భావగర్భితంగా తయారయింది; ఆ అర్థాన్ని అంతా మీమీద బలవంతంగా రుద్దుతున్నారు. మీ దేశం ఎడల, మీ దేవతల ఎడల, మీ యిరుగుపొరుగు ఎడల మీరు కర్తవ్య నిర్వహణ చేయాలని మీకు నేర్పిస్తారు; అయితే, యీ కర్తవ్యం అనే మాటకంటె మరింత ముఖ్యమయిన విషయం ఏదంటే – సత్యం ఏది అనేది మీరే స్వయంగా తెలుసుకోవడం. మీ తల్లితండ్రులు, సమాజం యీ 'కర్తవ్యం' అనే మాటని మిమ్మల్ని ఒక మూసలో పోసి తీర్చిదిద్దడానికి సాధనంగా ఉపయోగిస్తారు; వారి ప్రత్యేకమయిన వింత వింత అభిరుచులకు, వారికి అలవాటయిన ఆలోచనలకు, వారి యిష్టాయిష్టాలకు సరిపోయేటట్లుగా మిమ్మల్ని తీర్చిదిద్దుకుంటారు. ఈ విధంగా తమ భద్రత విషయంలో హామీ లభిస్తుందని వారు ఆశిస్తారు. అందుకని, కొంత సమయం వెచ్చించి, సహనంతో వుండి, విశ్లేషించండి; యివన్నీ బాగా పరిశీలించాక మీరే స్వయంగా సత్యం ఏమిటి అనేది కనుక్కోండి. 'కర్తవ్యం' అనే మాటను వూరికే ఆమోదించకండి. ఎందుకంటే, ఎక్కడయితే 'కర్తవ్యం' వుంటుందో అక్కడ ప్రేమభావం వుండదు.

అదే విధంగా, 'సహకారం' అనే మాట తీసుకోండి. ప్రభుత్వం మిమ్మల్ని తనతో సహకరించమని కోరుతుంది. ఒక విషయాన్ని అవగాహన చేసుకోకుండా దానికి సహకారం యిస్తే మీరు కేవలం అనుకరించినట్లే, నకలుగా తయారవుతున్నట్లే అవుతుంది. మీరు అవగాహన కనుక చేసుకుంటే, అప్పుడు సహకరించడం అంటే మీరు దానితోపాటు కలిసి జీవిస్తున్నట్లు, దానితోపాటు కలిసి పయనిస్తున్నట్లు అవుతుంది. అది మీలో కలిసిపోతుంది.

కాబట్టి, మీ ఆలోచనా తీరుని వక్రం చేసే పదాలను గురించి, సంకేతాలు, ప్రతిరూపాలను గురించి తెలుసుకొని వుండటం చాలా అవసరం. మీరు సృజనాత్మకత కలిగి జీవించాలన్నా, విచ్ఛిత్తి చెందకుండా వుండాలన్నా వీటిని గురించి ఎరుకతో

వుండటం, వీటిని అధిగమించి ఆవలగా పోగలరా అనే విషయం తెలుసుకోవడం చాలా అవశ్యకం.

మీకు తెలుసా, 'కర్తవ్యం' అనే మాట మనల్ని హతమారుస్తూ వుంటే మనం చూస్తూ వూరుకుంటాం. మీ తల్లితండ్రుల ఎడల, బంధువుల ఎడల, దేశం ఎడల మీకు 'కర్తవ్యం' వున్నదనే అభిప్రాయం మిమ్మల్ని బలిపశువుని చేస్తున్నది. ఆ కర్తవ్యమే మిమ్మల్ని యుద్ధంలోకి తరిమి, మీచేత మరొకరిని చంపించడం చేస్తుంది; మిమ్మల్ని చంపడమో, అవిటివారిని చేయడమో చేస్తుంది. ఒక సమాజాన్ని, ఒక దేశాన్ని, ఒక సిద్ధాంతాన్ని, లేదా ఒక జీవిత విధానాన్ని రక్షించడం కోసం యితరులని హతమార్చడం అవసరం అని రాజకీయవేత్త అయిన నాయకుడు ఉద్బోధిస్తాడు; అందువల్ల చంపడం మీ కర్తవ్యంలో ఒక భాగం అవుతుంది; మీరు చాలా సులువుగా సైనికుడి వీరావేశంలో మునిగిపోతారు. సైన్యంలో చేరగానే ఆ ఆవేశం వల్లనే మీలో విధేయత వచ్చేస్తుంది; భౌతికంగా మీరు విపరీతమయిన క్రమశిక్షణకి లోనవుతారు; అయితే మీరు అనుకరిస్తున్నారు, అనుసరిస్తున్నారు, నకలుగా తయారవుతున్నారు కాబట్టి అంతర్గతంగా మీ మనసు ధ్వంసమయిపోతుంది. పెద్దల చేతిలో, రాజకీయవేత్తల చేతిలో ఒక ఆయుధంగా మీరు తయారవుతారు; సిద్ధాంత ప్రచారానికి ఒక సాధనంగా మీరు అయిపోతారు. మీ దేశాన్ని రక్షించుకోవాలంటే చంపడం చాలా అవసరం అని ఎవరో అన్నారు కాబట్టి, చంపడం అనివార్యం అనుకొని మీరు దానికి సమ్మతిస్తున్నారు. అవసరం అని ఎంతటివారు చెప్పినా సరే, ఆ విషయాన్ని మీరు స్వయంగా, నిర్దుష్టంగా ఆలోచించి తెలుసుకోవద్దూ?

చంపడం అనేది – ముఖ్యంగా మరొక మనిషిని చంపడం అత్యంత విధ్వసకపూరితమయినదని, అది ఒక అవినీతి చర్య అని తెలుస్తునే వున్నది; మీరు చంపినప్పుడు, ఎంతగా మీరు దానిని తర్కంతో సమర్థించుకోవాలని చూసినా మీలో ద్వేషం నిండివుంటుంది; పైగా మీరు ఎదుటివారిలో ప్రతిస్పర్థను రగుల్కొల్పుతారు. ఒక మాటతోనైనా మీరు చంపవచ్చు, లేదూ ఒక క్రియతోనయినా మీరు చంపవచ్చు; మనుష్యులను చంపడం ద్వారా మన ఏ ఒక్క సమస్యగాని పరిష్కారం అయినట్లు యింతవరకు కనబడటంలేదు. మన ఆర్థిక, సామాజిక రుగ్మతలు యుద్ధంవలన చికిత్స జరిగి బాగుపడటం ఏనాడూ జరగలేదు. మానవ సంబంధాలలో పరస్పర అవగాహనమూ యుద్ధం తీసుకొనిరాలేదు. అయినా సరే, ప్రపంచమంతా ఎల్లకాలం అంతులేని సమర సన్నాహాల్లో మునిగి తేలుతూ వుంటుంది. మనుష్యుల్ని చంపడం ఎందుకు అవసరమో అని చూపడానికి ఎన్నో కారణాలను ఉటంకిస్తూ వుంటారు; మనుష్యుల్ని చంపకుండా వుండటానికి కూడా మరెన్నో కారణాలు వున్నాయి. అయితే మీరు మాత్రం యిటువంటి తర్కాలకు లొంగిపోకండి; ఎందుకంటే యీ రోజు చంపకుండా వుండటం అనేది చాలా తర్కబద్ధంగా అనిపించవచ్చు, కాని రేపు చంపడానికి యింతకంటె బలవత్తరమయిన కారణాలు కనబడవచ్చు.

ముందుగా అందులోని సత్యాన్ని తెలుసుకోండి; చంపకుండా వుండటం ఎంత అవశ్యకమో మీ మనసులో బాగా భావించి తెలుసుకోండి. ఇతరులు, అత్యున్నతమైన

పదవిలో వున్న అధికారినుండి, అతి అల్ప ఉద్యోగి వరకు ఎవరయినా సరే, వారు ఏమంటున్నారో లెఖ్ఖ చేయకుండా, యీ విషయంలోని సత్యాన్ని మీరు స్వయంగా తెలుసుకోండి; మీ అంతర్గతంలో మీరు స్పష్టపరచుకున్నాక, ఆ పైన వివరాలను తార్కికంగా తెలుసుకోండి. అంతేతప్ప తర్కంతోనే ఆరంభించకండి; ఎందుకంటే ప్రతి తర్కానికి విరుద్ధంగా ప్రతితర్కం కూడా వుంటుంది; మీరు యీ తర్క-వితర్కాల జాలంలో చిక్కుకొనిపోతారు. ముఖ్యమయిన విషయం ఏమిటంటే – మీ అంతట మీరే స్వయంగా సత్యాన్ని సూటిగా చూడాలి; ఆ తరువాత మీరు తర్కం ఉపయోగించడం ఆరంభించవచ్చు, సత్యం ఏమిటి అనేది మీకు గ్రాహ్యం అయినప్పుడు; మరొకరిని చంపడం ప్రేమ కాదు అని మీరు తెలుసుకున్నప్పుడు; మరొకరితో సంబంధ బాంధవ్యాలలో శత్రుత్వం వుండకూడదు అని అంతర్గతంగా మీరు భావించినప్పుడు, అప్పుడిక ఎంతటి తర్కమూ ఆ సత్యాన్ని హతమార్చలేదు. అప్పుడు ఏ రాజకీయవేత్త కానీ, ఏ మతాచార్యుడు కానీ, ఏ తల్లి, తండ్రి కానీ ఒక సిద్ధాంతం కోసమో, తమ స్వరక్షణ కోసమో మిమ్మల్ని బలిపశువుగా చేయలేరు.

పెద్దవారు ఎప్పుడూ చిన్నవారిని బలిదానం యిస్తూనే వుంటారు; మీ వంతు వచ్చినప్పుడు, మీరూ వయసులో పెద్దవారయాక యిట్లాగే చిన్నవారిని బలిపశువులని చేస్తారా? ఈ బలిదానాలని అంతం చేసెయ్యాలని మీరు కోరుకోరా? ఎందుకంటే – అది అత్యంత వినాశనకరమయిన జీవితవిధానం; మానవ క్షీణక్షయాలకు దారి తీసే ముఖ్యాతి ముఖ్యమయిన కారణాల్లో యిది ఒకటి. దీనిని అంతం చేసెయ్యాలంటే, ఒక వ్యక్తిగా మీరు, మీలో ప్రతి ఒక్కరూ వ్యక్తిగతంగా సత్యాన్ని స్వయంగా తెలుసుకోవాలి. ఏ కూటమిలో కాని, ఏ సంస్థలో కాని చేరకుండానే, చంపకుండా వుండటంలోని, ప్రేమభావంలోని, శత్రుత్వం లేకుండా వుండటంలోని సత్యాన్ని మీరు కనుగొనాలి. అప్పుడు ఎన్ని వేల, లక్షల పదాలు ఉపయోగించినా, కపట తంత్రాల తర్కాలు చూపినా, మరొకరిని చంపడానికి లేదా మరొకరిని బలిదానం యివ్వడానికి మిమ్మల్ని ఏనాటికీ ఒప్పించలేరు.

అందువలన, మీరు చిన్నవయసులో వున్నప్పుడే యీ విషయాలను గురించి స్వయంగా ఆలోచించి చూసుకొనడం, మనోగతాన తెలుసుకొనడం చాలా ముఖ్యం. ఆ విధంగా సత్యాన్ని కనుగొనడానికి మీరు పునాది వేయగలుగుతారు.

ప్రశ్న: ఈ సృష్టికి వెనుక వున్న ఉద్దేశం ఏమిటి?

కృష్ణమూర్తి: మీరు నిజంగా తెలుసుకోవాలని ఆసక్తి పడుతున్నారా? 'సృష్టి' అంటే మీరు అనుకుంటున్నది ఏమిటి? జీవించడంలోని ఉద్దేశం ఏమిటి? మీరు ఎందుకు బ్రతుకుతున్నారు, చదువుతున్నారు, విద్యాధ్యయనం చేస్తున్నారు, పరీక్షలు పాసు అవుతున్నారు? సంబంధబాంధవ్యాలలో ప్రయోజనం ఏమిటి, – తల్లితండ్రులకు, పిల్లలకు నడుమన, భార్యాభర్తల నడుమన గల పరస్పర సంబంధాలకు అర్థం ఏమిటి? అసలు జీవితం అంటే ఏమిటి? 'సృష్టి యొక్క ఉద్దేశ్యం ఏమిటి' అనే ప్రశ్న మీరు అడిగినప్పుడు – యిదేగా మీరు అడగదలుచుకున్నది? మీరు అంతర్గతంగా స్పష్టంగా

చూడలేకపోయినప్పుడు, మీకు అంతా గందరగోళంగా, దుర్భరంగా, అంధకారంగా వుండి, సత్యమైనది ఏమిటి అనే సంగతి పరిగ్రహించలేకుండా వున్నప్పుడు – అప్పుడే జీవితం యొక్క ఉద్దేశం ఏమిటి అని మీరు తెలుసుకోవాలనుకుంటారు.

సరే, జీవిత పరమార్థం ఏమిటి అనేది మీకు చెప్పడానికి చాలా మంది వున్నారు; పవిత్ర గ్రంథాలు ఏమంటున్నాయనేది వారు మీకు చెప్తారు. చతురులు అయినవారు రకరకాల జీవితోద్దేశాలను – నవ్యనూతనమయిన వాటిని సృష్టిస్తూనే వుంటారు. రాజకీయ కూటమి వారు ఒక ఉద్దేశాన్ని ప్రకటిస్తే, మతసంబంధమయినవారు మరొకటి అంటారు; యింకా యితరులు మరెన్నో! మీరు యీ గందరగోళంలో పడిపోతే జీవితానికిగల ఉద్దేశం ఫలానా అని మీ అంతట మీరు ఎట్లా తెలుసుకుంటారు? మీరు యిట్లా గందరగోళంలో వున్నంతకాలం, గందరగోళంగా వుండే సమాధానం మాత్రమే మీకు అందుతూ వుంటుంది. మీ మనసు చెదరిపోయి వున్నప్పుడు, అది ఏ మాత్రం నెమ్మదిగా లేనప్పుడు, మీరు ఎటువంటి సమాధానం అందుకున్నా, అది యీ గందరగోళం, ఆదుర్దా, భయభీతి అనే తెరలగుండానే మీకు అందుతుంది; కాబట్టి ఆ సమాధానం వక్రీకృతం అయ్యే వుంటుంది. అందువల్ల జీవితం యొక్క ఉద్దేశం ఏమిటి అని అడగడం ప్రధానమైన అంశం కాదు; మీలోపల వున్న గందరగోళాన్ని తేటపరచుకోవడం ముఖ్యం. ఇది ఒక గుడ్డివాడు, 'వెలుగు అంటే ఏమిటి?' అని అడగడం వంటిది. వెలుగు అంటే ఏమిటో నేను అతనికి చెప్పడానికి ప్రయత్నిస్తే, అతను తన గుడ్డితనానికి అనుగుణంగా, తన అంధకారానికి అనుగుణంగా అర్థం చేసుకుంటాడు; అయితే అతను చూడగలగడం మొదలుపెట్టిన మరుక్షణం నుండే వెలుగు అంటే ఏమిటి అనే ప్రశ్న అతను ఎంతమాత్రం అడగడు. వెలుగు వుంటుంది, అంతే!

అదే విధంగా, మీ లోలోపల వున్న గందరగోళాన్ని తేటపరచుకొనగలిగినప్పుడు, జీవితం యొక్క ఉద్దేశం ఏమిటి అనేది మీకే తెలుస్తుంది; మీరు అడగనవసరంలేదు, మీరు వెదకనవసరం లేదు. గందరగోళం నుండి విముక్తి చెందాలంటే గందరగోళానికి కారకమయినవి ఏమిటో తెలుసుకొని వాటిని అవగాహన చేసుకోవాలి; గందరగోళానికి కారకమయినవి స్పష్టంగా కనిపిస్తునే వుంటాయి. వాటి మూలం 'నా'లో వున్నది. యీ 'నా' నిరంతరం స్వంతంచేసుకోవడం ద్వారా, మరొకటి అవబోవడం ద్వారా, విజయసాధన ద్వారా, అనుకరణ ద్వారా తనని తాను విస్తృతం చేసుకోవాలనుకుంటూ వుంటుంది; దీని లక్షణాలు అసూయ, యీర్ష్య, అత్యాశ, భయం. అంతర్గతమైన గందరగోళం వున్నంతకాలం, బయటనుండి సమాధానాలు కావాలని మీరు వెతుకులాడుతునే వుంటారు; అంతర్గతమయిన గందరగోళం తేటపడిపోగానే, అప్పుడిక మీకు జీవితపు విశిష్టత ఏమిటో తెలుస్తుంది.

ప్రశ్న: 'కర్మ' అంటే ఏమిటి?

**కృష్ణమూర్తి:** మనం ఉపయోగించే విచిత్రమయిన మాటలలో కర్మ ఒకటి; మన ఆలోచనలు చిక్కుబడిపోయిన కొన్ని పదాలలో యిది ఒకటి. పేదవాడు తన

జీవితాన్ని ఆమోదించాలంటే ఏదో ఒక సిద్ధాంతం పేరు చెప్పుకొని బ్రతకాలి. దురవస్థలు, ఆకలి బాధ, మురికి – యివన్నీ అతను భరించాలి, ఎందుకంటే, సగం డొక్క మాడివున్న యితనికి ఎదిరించడానికి, తిరుగుబాటు చేయడానికి సత్తువ వుండదు. జీవితం ఏది ప్రసాదిస్తే అది అతడు భరించవలసిందే. అందుకని, అతడు "ఇట్లా వుండటం నా కర్మ" అని అంటాడు; ఇక రాజకీయవేత్తలు, బడానాయకులు అతన్ని యీ దౌర్భాగ్యాన్నంతటినీ భరించమని ప్రోత్సహిస్తారు.

దీన్నంతటినీ వ్యతిరేకిస్తూ అతను తిరుగుబాటు చేయడం మీరు కోరరు, అవును కదూ? మీవద్ద అంత ఎక్కువ వుంచుకొని, పేదవాడికి చాలా తక్కువ జీతం యిచ్చినప్పుడు, అట్లా అవడానికి, అంటే తిరుగుబాటు రావడానికి అవకాశం వున్నది; అందుకని మీరు 'కర్మ' అనే మాట ఉపయోగించి, అతను నోరుమూసుకొని తన జీవితంలోని దుఃస్థితిని భరించడాన్ని ప్రోత్సహిస్తారు.

విద్యాధికుడయిన వ్యక్తి, జీవితంలో కొంత సాధించిన వ్యక్తి, వారసత్వపు ఆస్తిని పొందిన వ్యక్తి, ఉన్నత స్థాయిని చేరుకున్న వ్యక్తి, అధికారం, హోదా, తద్వారా అవినీతి మార్గాల్లో పోవడానికి అవకాశమూ వున్న వ్యక్తి – అతను కూడా, "ఇది నా కర్మ, మునుపటి జన్మలో మంచిపనులు చేశాను – యిప్పుడు పూర్వపు పుణ్యాలకు ప్రతిఫలాన్ని ఆస్వాదిస్తున్నాను" అనే అంటాడు.

అయితే, యిదేనా 'కర్మ' అంటే అర్థం – వున్నవి వున్నట్లుగా స్వీకరించడమా? మీకు అవగాహన అవుతున్నదా? కర్మ అంటే అర్థం పరిస్థితులను, వున్నవి వున్నట్లుగా, ప్రశ్నించకుండా, ఒక్క తిరుగుబాటు నిప్పురవ్వ కూడా లేకుండా స్వీకరించడమేనా? – మనలో చాలామంది వైఖరి యిదే, కాదూ? చూడండి, కొన్ని మాటలు ఎంత సునాయాసంగా ఒక వలలాగా అల్లుకొనిపోతాయో; మనం అందులో ఎట్లా చిక్కుకొనిపోతామో. ఇది ఎందువల్లనంటే, మనం నిజంగా సజీవంగా లేము కాబట్టి. ఈ 'కర్మ' అనే మాట యొక్క నిజమయిన ప్రాధాన్యతను అది ఒక సిద్ధాంతం అనే దృష్టితో చూసి ఎప్పటికీ అవగాహన చేసుకోలేరు. "భగవద్గీత చెప్తున్నది యిదే" అని మీరు అనడం వలన దానిని అవగాహన చేసుకోలేరు.

మీకు తెలుసా, పోల్చిచూసే మనసు మహా బుద్ధిహీనమైన మనసు అని? అది ఆలోచించలేదు కాబట్టి బుద్ధిహీనమైన మనసు; "నేను ఫలానా పుస్తకం చదివాను, మీరు చెప్పేది ఆ పుస్తకంలో చెప్పిన మాదిరిగానే వుంది" అని మాత్రం అంటుంది. ఇట్లా మీరు అంటున్నారంటే మీరు ఆలోచించడం మానివేశారన్నమాట; మీరు సామ్యాసామ్యాలు చూసినప్పుడు సత్యం ఏది అని తెలుసుకోవడానికి అన్వేషణ చేయడం మానివేశారన్నమాట; ఫలానా పుస్తకంలో ఏమున్నది, గురువుగారు ఏమన్నారు అన్న సంగతులే మీరు చెప్తూ వుంటారు, అంతే. కాబట్టి, ఆధిపత్యంలో మాట్లాడే వారి మాటలన్నింటిని త్రోసిరాజనేసి అన్వేషించడం, తెలుసుకొనడం ప్రధానం కాని, పోల్చి చూడటం కాదు. పోల్చిచూడటం అంటే ఆధిపత్యాన్ని శిరసావహించడం; అది అనుకరణ, అది ఆలోచనా రాహిత్యం. సత్యం ఏమిటి అనేది కనిపెట్టడం కోసం జాగరూకంగా లేని మనసుకు వుండే అతి సహజమైన స్వభావమే పోల్చి చూడటం.

"అవును అంతే, అది బుద్ధుడు చెప్పిన దానిలాగే వుంది" అని మీరు అంటారు; ఆ విధంగా మీ సమస్యలను పరిష్కరించుకున్నామని మీరు తలుస్తారు. ఒక విషయంలోని సత్యాన్ని నిజంగా కనుగొనాలంటే, మీరు అశేషమైన చురుకుదనం, సత్తువ కలిగివుండి, స్వీయశక్తిపై ఆధారపడి వుండాలి; పోల్చిచూసి మీరు ఆలోచిస్తున్నంతవరకు మీలో స్వీయసామర్థ్యంపై ఆధారపడటం అనేది కలుగదు. దయచేసి యిది వినండి. మీకు కనుక స్వావలంబనశీలత అంటే స్వీయసామర్థ్యంపై ఆధారపడే గుణం కనుక లేకపోతే సత్యం ఏది అని అన్వేషించడానికి, తెలుసుకోవడానికి కావలసిన అధికారం మీరు పూర్తిగా కోల్పోతారు. స్వావలంబనశీలత. మీరు స్వయంగా కనుగొనడానికి కావలసిన స్వేచ్ఛను ప్రసాదిస్తుంది. మీరు పోల్చి చూస్తున్నప్పుడు ఆ స్వేచ్ఛ మీకు లభించదు.

**ప్రశ్న: గౌరవమర్యాదలు యివ్వడంలో భయం అనే అంశ కూడా వుంటుందా?**

**కృష్ణమూర్తి:** మీరు ఏమని అనుకుంటున్నారు, మీ అభిప్రాయం ఏమిటి? మీ టీచరుకి, మీ తల్లితండ్రులకి, మీ గురువుగారికి మీరు మర్యాద చూపినప్పుడు, మీ నవుకరుకి అమర్యాద చూపినప్పుడు – మీ దృష్టిలో ఏ ప్రాముఖ్యమూ లేని మనుష్యులను మీరు తన్ని పంపినపుడు – మీ కంటే పైన వున్నవారివి, అధికారులవి, రాజకీయ వేత్తలవి, బడానాయకులవి బూట్లు తొడుక్కున్న కాళ్ళని మీరు నెత్తిమీద పెట్టుకున్నప్పుడు అందులో భయం అనే అంశ లేదూ? బడానాయకుల నుండి, టీచరు నుండి, పరీక్షాధికారి నుండి, ప్రొఫెసరు నుండి, మీ తల్లిదండ్రులనుండి, రాజకీయవేత్త లేదా బ్యాంక్ మేనేజరునుండి మీరు ఏదో పొందాలని ఆశిస్తారు. అందుకని మీరు వారంటే గౌరవమర్యాదలు చూపుతారు. కాని, పేద ప్రజలు మీకు ఏం యివ్వగలరు? అందుకని పేదవారిని మీరు ఉపేక్షిస్తారు, వారిని అసహ్యించుకుంటారు. వీథిలో వారు మీకు ఎదురు వచ్చినా వారిని పట్టించుకోరు. వారివైపు కన్నెత్తి చూడను కూడా చూడరు. చలికి తట్టుకోలేక వారు వణికిపోతున్నారనే సంగతి కాని, వాళ్ళు మురికిగానూ, ఆకలితోనూ వున్నారనేది కాని మీకు పట్టదు. కాని, బడానాయకులకు, దేశంలో వున్న గొప్పవారికి, మీకు వున్నది చాలా కొంచెమయినా అందులోనే వారికి ఏదయినా ముట్టజెప్పాలని చూస్తారు; ఆ విధంగా వారు మీపై తమ అనుగ్రహం చూపి, మరికొన్ని కటాక్షాలు ప్రసాదిస్తారనే ఉద్దేశ్యంలో మీరు అట్లా ప్రవర్తిస్తారు. ఇందులో నిస్సంశయంగా భయపు అంశ వున్నది, వున్నది కదూ? ప్రేమభావం లేదు. మీ హృదయంలో ప్రేమభావం వున్నట్లయితే ఏమీ లేనివారికీ, అన్నీ కలిగివున్నవారికి కూడా గౌరవమర్యాదలు చూపుతారు; కలిగినవారంటే భయపడనూ పడరు, లేనివారంటే ఉపేక్షా చూపరు. ప్రతిఫలం పొందాలనే ఆశతో మర్యాద చేయడం భయం వలన కలిగిన ఫలితం. ప్రేమభావంలో భయం వుండదు.

★ ★ ★

# అధ్యాయం 17

మన జీవితాల్లో, మన కార్యకలాపాల్లో, మన ఆలోచనలలో క్షీణస్థితి రావడానికి గల అనేక కారణాలను మనం పరీక్షిస్తూ వచ్చాం; యీ క్షీణతకు ప్రధాన కారణాల్లో ఒకటి సంఘర్షణ అని కూడా గమనించాం. శాంతి కూడా, మనం సాధారణంగా తీసుకొనే అర్థంలో, వినాశనానికి ఒక కారణం కాదూ? మనసు ద్వారా శాంతిని సాధించి తీసుకొని రాగలుగుతామా? మనసు ద్వారా కనుక శాంతి కలుగుతే, అది కూడా కలుషితత్వానికి, క్షీణతకు దారి తీయదూ? మనం కనుక జాగరూకతతోను, గమనింపుతోను వుండకపోతే, 'శాంతి' అనే శబ్దం ఒక యిరుకయిన కిటికీ వలె తయారవుతుంది; దాని ద్వారా మనం లోకంవైపు చూసి, అర్థం చేసుకొనడానికి ప్రయత్నిస్తాం. ఒక యిరుకైన, సన్నని కిటికీనుండి చూస్తే ఆకాశంలో కొంతభాగమే కనబడుతుంది; అనంతమయిన విశాల ఆకాశాన్ని చూడలేము, అందులోని మహత్తర సౌందర్యమూ గోచరం కాదు. కేవలం శాంతిని సాధించాలని ఆరాటపడినంత మాత్రాన శాంతిని సాధించడం సాధ్యంకాదు; యీ ఆరాటం ఒక మానసిక ప్రక్రియ అని చెప్పడానికి ఏ మాత్రం సంశయించనక్కరలేదు.

ఇది అర్థం చేసుకోవడం కొంచెం కష్టమవచ్చు. అయితే సాధ్యమయినంత సులభంగా, స్పష్టంగా వివరించడానికి ప్రయత్నిస్తాను. ప్రశాంతంగా వుండటం అంటే ఏమిటో అర్థం చేసుకున్నప్పుడు బహుశ ప్రేమభావంలోని ప్రాధాన్యత కూడా మనం అవగాహన చేసుకోగలుగుతాం.

శాంతి అనేది మనసు ద్వారా, తర్కం ద్వారా సాధించవలసినది అని మనం అనుకుంటాం; అది అటువంటిదేనా? ఆలోచనలను ఏదో ఒక రకంగా నిమ్మళింపజేయడం ద్వారా కాని, ఏదో ఒక విధమయిన అదుపు ఆజ్ఞల్లో పెట్టడం ద్వారా కాని, అధికారంతో అణచాలని చూడటం ద్వారా కాని శాంతిని తీసుకురావటం జరుగుతుందా? మన అందరమూ శాంతిని కోరుతాం; మనలో చాలామందికి శాంతి అంటే మనల్ని వొంటరిగా వదలడం, యితరులు మనల్ని తొందరచేయక పోవడం, జోక్యం కలిపించుకోకపోవడం. అందుకని మన మనసు చుట్టూ మనమే ఒక గోడను, మన అభిప్రాయాలతో ఒక గోడను నిర్మించుకుంటాం.

ఇది అవగాహన చేసుకోవడం మీకు చాలా అవసరం; ఎందుకంటే మీరు పెరిగి పెద్దవారవుతున్నకొద్దీ యుద్ధానికి, శాంతికి సంబంధించిన అనేక సమస్యలను మీరు ఎదుర్కోవలసి వుంటుంది. శాంతి అంటే మనసు వెంటాడి, చేజిక్కించుకొని, మాలిమి చేసుకోవలసిన ఒక విషయమా? మనలో చాలామంది శాంతి అని అనుకునేది నిజంగా కదలిక లేకపోవడం వలన మురిగిపోయే ప్రక్రియ వంటిది; మెలమెల్లగా

కుళ్ళిపోవడం వంటిది. కొన్ని ఊహలు జతచేసి పెట్టుకొని వాటిని వదలకుండా పట్టుకొని వ్రేలాడటం ద్వారానో, అంతర్గతంగా భద్రత, రక్షణ అనే గోడలను, అలవాట్లు, నమ్మకాలు అనే గోడను నిర్మించుకొనో శాంతిని నెలకొల్పుకోవచ్చు అని మనం అనుకుంటాం; శాంతి అంటే ఒక సూత్రాన్ని అనుసరించడం, ఒక ప్రత్యేకమయిన వైఖరిని, ఒక ప్రత్యేకమయిన అభిలాషను, యిచ్ఛను అలవరచుకోవడం అంతే, అని అనుకుంటాం. ఇతరుల నుండి కలిగే తొందరలు లేకుండా, జీవించాలని మనం కోరుకుంటాం; అందుకని యీ విశాల విశ్వంలో లేదూ మన బ్రతుకుల్లోనే ఒక మారుమూలలను ఎన్నుకుంటాం; అందులోకి కష్టపడి దూరి కూర్చుంటాం; స్వయం నిర్మితమయినే ఆ అంధకార కారాగారంలోనే జీవిస్తూ వుంటాం. మనలో చాలామందిమి భార్యతో, భర్తతో, తల్లితండ్రులతో, స్నేహితులతో గల పరస్పర సంబంధాలలో కోరుకునేది యిదే. మనకి తెలియకుండానే మనం ఏ విధంగా అయినా సరే శాంతిని సాధించాలని నిశ్చయించుకుంటాం, అందుకని దానిని వెంటాడుతాం.

కాని, మనసు ఎప్పటికయినా శాంతిని సాధించగలుగుతుందా? అన్ని అలజడులకు జన్మస్థానం అసలు మనసే కదా? మనసు చేయగలిగినది కేవలం సేకరించడం, పోగు చేయడం, తిరస్కరించడం, నిర్ధారణ చేయడం, జ్ఞాపకం పెట్టుకోవడం, వెంటాడటం. నిస్సందేహంగా శాంతి అవశ్యకమయినదే; శాంతి లేకుండా మనం సృజనాత్మకంగా జీవించలేము కాబట్టి. అయితే, మనసు చేసే పోరాటాల ద్వారా, తిరస్కృతుల ద్వారా, త్యాగాల ద్వారా సాధించగలిగిన విషయమా శాంతి అంటే? నేను దేనిని గురించి మాట్లాడుతున్నానో మీకు అవగాహన అవుతున్నదా?

చిన్నవయసులో వున్నప్పుడు మనం అసంతుష్టిగా వున్నా, పెరిగి పెద్దవాళ్ళం అవుతున్నకొద్దీ, మనం చాలా వివేకం తెచ్చుకొని, అప్రమత్తంగా కనుక వుండకపోతే జీవితానికి నిరాసక్తంగా లొంగిపోవడం వంటి నిర్లిప్తతకు యీ అసంతుష్టి ఏదో విధంగా దారి తీయిస్తుంది. మనసు నిరంతరం తనకు మాత్రమే ప్రత్యేకం అయిన ఒక అలవాటుని, ఒక నమ్మకాన్ని, కాంక్షని వెతుక్కుంటూ వుంటుంది; తాను అందులో జీవిస్తూ, లోకంతో ఏ పేచీ లేకుండా వుండాలని అనుకుంటుంది కాబట్టి. అయితే మనసు శాంతిని పొందలేదు; ఎందుకంటే – అది ఎప్పుడూ కాలానికి సంబంధించి మాత్రమే అంటే గడచిన కాలానికి గాని, వర్తమానానికి లేదా భవిష్యత్తుకి గాని సంబంధించి మాత్రమే ఆలోచించగలుగుతుంది; అప్పుడు ఎట్లా వున్నది, ప్రస్తుతం వున్న స్థితి, యికముందు ఎట్లా వుండబోతున్నది. మనసు తన భేషజాలను, తన అలవాట్లను, తన నమ్మకాలను తానే నిరంతరంగా ఖండిస్తూ, దోషనిర్ణయం చేస్తూ, విమర్శిస్తూ, పోల్చి చూస్తూ, ఆరాటపడుతూ వుంటుంది; అటువంటి మనసు ఎన్నటికీ శాంతిగా వుండలేదు. అది తానే శాంతి అని పేరు పెట్టుకున్న ఒక స్థితిలోనికి తనని తాను వంచించుకొననూ గలదు; అయితే అది శాంతి కాదు. మాటలు, వాక్యాలు పునశ్చరణ చేసుకుంటూ గాని మరొకరిని అనుసరిస్తూ గాని జ్ఞానాన్ని పోగుచేసుకుంటూ గాని మనసు తనని తాను సమ్మోహపరచుకొన గలుగుతుంది. అయినా అది ప్రశాంతంగా వుండలేదు, ఎందుకంటే, యిటువంటి

మనసే అలజడులకు కేంద్రం కాబట్టి. మనసు దాని సహజ స్వభావం చేత కాలస్వరూపమే; అందువల్ల ఆలోచించే యీ మనసు, లాభనష్టాలు బేరీజువేసే యీ మనసు, యుక్తులు పన్నే, పోల్చి చూసే యీ మనసు శాంతిని సాధించే సామర్థ్యం కలది కాదు.

తర్కం ఉపయోగించడం వల్ల వొనగూడేదికాదు శాంతి అంటే. అయినా కూడా, మీరు పరిశీలించినట్లయితే, వ్యవస్థీకృత మతాలను పరిశీలించినట్లయితే యీ మనసు ద్వారా శాంతిని సాధించడం అనేదానిలో అవి పడి కొట్టుమిట్టాడుతున్నాయి అని తెలుసుకుంటారు. యుద్ధం ఎంత వినాశనకరమయినదో నిజమయిన శాంతి అంత సృజనాత్మకమయినది, అంత స్వచ్ఛమయినది; అటువంటి శాంతిని పొందాలంటే మీరు సౌందర్యాన్ని అవగాహన చేసుకొని తీరాలి. అందువల్లనే, మనం చాలా చిన్న వయసులో వున్నప్పుడు మన చుట్టుప్రక్కల సౌందర్యమయంగా వుండటం చాలా ముఖ్యం – సక్రమమయిన, పొంకమయిన కొలతలలో నిర్మించిన భవనాల సౌందర్యం, పరిశుభ్రతలోని సౌందర్యం, పెద్దల మధ్య నడిచే స్థిమితమైన సంభాషణలలోని సౌందర్యం వంటివి. సౌందర్యం అవగాహన చేసుకోవడంలోనే ప్రేమభావం గురించి తెలుసుకుంటాం; సౌందర్యావగాహనలోనే హృదయ శాంతి వున్నది.

శాంతి హృదయానికి సంబంధించినది, మనసుకు సంబంధించినది కాదు. శాంతిని తెలుసుకోవడానికి సౌందర్యం అంటే ఏమిటో కనుగొని తీరాలి. మీరు మాట్లాడే తీరు, ఉపయోగించే పదాలు, మీ హావభావాలు – వీటికి చాలా ప్రాముఖ్యం వున్నది, వీటి ద్వారానే మీరు మీ హృదయగత సంస్కారాన్ని తెలుసుకొనగలుగుతారు. సౌందర్యాన్ని నిర్వచించలేము; దానిని మాటల్లో వివరించలేము. మనసు చాలా నెమ్మదిగా, ప్రశాంతంగా వున్నప్పుడు మాత్రమే దానిని అవగాహన చేసుకొనగలుగుతాం.

కాబట్టి, మీరు చిన్నవయసులో వున్నప్పుడే, సున్నితంగా వున్నప్పుడే, మీరు – మీరే కాకుండా, మీ బాధ్యతను పట్టించుకున్నవారు కూడా – ఒక సౌందర్యమయమయిన వాతావరణాన్ని సృష్టించవలసిన ఆవశ్యకత వున్నది. మీరు దుస్తులు ధరించే తీరు మీరు నడిచే తీరు, కూర్చునే విధానం, ఆహారం భుజించే పద్ధతి – యీ విషయాలన్నీ, మీ గురించిన సమస్త విషయాలు చాలా ముఖ్యమయినవి. మీరు పెరిగి పెద్దవాళ్ళవుతుంటే జీవితంలోని వికృతమయిన విషయాలను కూడా అంటే వికృతమయిన భవనాలను; ద్వేషభావం, యీర్ష్య, ఆకాంక్ష, క్రౌర్యం నింపుకున్న వికృతమయిన మనుష్యులను కూడా చూస్తూ వుంటారు; మీ హృదయంలో కనుక సౌందర్య గ్రహణశక్తి నెలకొని, స్థిరపడి వుండకపోతే యీ బ్రహ్మాండమయిన లోకం అనే ప్రవాహం మిమ్మల్ని సునాయాసంగా తనలోనికి లాక్కొని వెళ్ళిపోతుంది. అప్పుడు మీరు మనసు ద్వారా శాంతిని పొందడానికి సాగించే అంతులేని పోరాటంలో చిక్కుకొని పోతారు. మనసే శాంతి అంటే యిదీ అని చూపే ఒక ఊహను కల్పన చేస్తుంది; దానిని అందుకోవాలని ఆరాటపడుతుంది; దీని మూలంగా మాటల జాలంలో, విచిత్ర అభిలాషల జాలంలో, మాయల జాలంలో చిక్కుకొనిపోతుంది.

ప్రేమభావం వున్నప్పుడు మాత్రమే శాంతి కలుగుతుంది. భద్రత ద్వారా, ఆర్థికమయిన లేదా యితరమయిన భద్రత ద్వారా, సిద్ధాంతాల్లో నమ్మకం ద్వారా,

పూజా పురస్కారాల, శబ్దాల పునశ్చరణల ద్వారా మీరు శాంతిని సాధిస్తే మాత్రం అందులో సృజనాత్మకత వుండదు; యీ లోకంలో శాంతి కోసం సమూలమయిన విప్లవం తీసుకొనిరావలసినంత తక్షణావశ్యకత ఏమీ లేదు. అటువంటి శాంతి సంతుష్టి చెంది వూరుకోవడానికి, లొంగిపోయివుండే నిర్లిప్తతకూ దారి తీస్తుంది. అయితే, మీలో ప్రేమభావం, సౌందర్యం అంటే అవగాహన వున్నప్పుడు, కేవలం మనసు కల్పించుకున్న ఊహాచిత్రం వంటిది కాని శాంతిని మీరు పొందుతారు. ఈ శాంతి మాత్రమే సృజనాత్మకత కలిగివున్న శాంతి; యిది మాత్రమే గందరగోళాన్ని తొలగించి మీ లోపల ఒక క్రమతను తీసుకొని రాగలుగుతుంది. అయితే యీ శాంతి, దానిని కనుగొనడానికి చేసే ప్రయత్నాల ద్వారా పొందకలిగేది కాదు. మీరు సదా అప్రమత్తంగా వున్నప్పుడు, వికృతం, సౌందర్యం రెండింటి యెడల, జీవితంలోని మంచీ, చెడు, యింకా యితర ఒడిదుడుకులన్నింటి యెడల మీరు స్పందించ కలిగివున్నప్పుడు, అది – ఆ శాంతి కలుగుతుంది. శాంతి ఔన్నత్యం కలది, అనంతంవరకు విస్తరించినది; హృదయం నిండుగా వున్నప్పుడు మాత్రమే దానిని అవగాహన చేసుకోగలుగుతారు.

**ప్రశ్న: మనకంటె అధికులముందు మనకు ఎందుకు చిన్నతనంగా వుంటుంది?**

**కృష్ణమూర్తి:** ఎవరిని మీరు మీకంటె అధికులుగా పరిగణిస్తున్నారు? జ్ఞానం ఆర్జించిన వారినా? తెలుసుకున్నవారినా? బిరుదులూ, డిగ్రీలు వున్నవారినా? ఎవరివద్దనుండి అయితే మీరు ఏదో ఒక రకమయిన ప్రతిఫలంగాని, పదవిగాని కోరుకుంటున్నారో వారు అధికులని అనుకుంటున్నారా? ఒకరిని అధికులు అని మీరు అనుకున్న మరుక్షణమే మరొకరిని తక్కువవారుగా మీరు పరిగణించడం లేదూ?

మనం ఎందుకు అధికులనీ, అల్పులనీ విభజనలు చేస్తూ వుంటాం? మనం ఏదయినా కావాలని కోరుకున్నప్పుడే యిటువంటి దానికి ఉనికి ఏర్పడుతుంది, అవును కదూ? తెలివితేటల్లో నేను మీకంటె తక్కువగా భావిస్తాను; మీకున్నంత సంపదగానీ, శక్తిసామర్థ్యాలు కానీ నాకు లేవు; మీరు ఎంత సంతోషంగా కనబడుతున్నారో అంత సంతోషంగా నేను లేను, లేదా నాకు మీవద్ద నుండి ఏదో కావాలి; అందువల్ల నేను మీకంటే అల్పుడినని భావిస్తాను. నేను మీరంటే యీర్ష్య పడినప్పుడు, నేను మిమ్మల్ని అనుకరణ చేయాలని ప్రయత్నించినప్పుడు, మీనుంచి నేనేదయినా కావాలని కోరుకున్నప్పుడు, ఆ క్షణమే నేను మీకంటె తక్కువవాడిగా మారిపోతాను; ఎందుకంటే – నేను మిమ్మల్ని ఒక ఎత్తయిన పీఠంమీద కూర్చోబెట్టాను; నేనే మీకు ఒక అధికమయిన విలువ కల్పించాను. కాబట్టి మానసికంగా, అంతర్గతంగా ఆధిక్యభావాన్ని, అల్పభావాన్ని రెండింటినీ నేనే సృష్టిస్తున్నాను; కలిగినవారికీ లేనివారికీ మధ్యన అసమానత అనే భావాన్ని నేనే సృష్టిస్తున్నాను.

మానవజాతిలో ఒక్కొకరికీ వుండే శక్తి సామర్థ్యాలలో విపరీతమయిన అసమానతలు

వున్నాయి, వున్నాయా లేదా? జెట్ విమానపు నమూనాను తయారుచేసే వ్యక్తి వున్నాడు, నాగలితో పొలాన్ని దున్నే వ్యక్తి వున్నాడు. మేధాపరంగా, వాచాపరంగా, శారీరకంగా ఒక్కొక్క వ్యక్తికి వుండే శక్తిసామర్థ్యాలలో అపారమయిన అంతరాలు వుండటం అనేది అనివార్యమయిన సంగతి. అయితే చూడండి, కొన్ని కొన్ని పనులకు మనం బ్రహ్మాండమయిన ప్రాధాన్యతను కల్పిస్తాం. గవర్నరు, ప్రధానమంత్రి, నూతన విషయాలు కనిపెట్టిన పరిశోధకుడు, వైజ్ఞానికుడు మొదలయినవారు ఒక నవుకరు కంటె మహత్తరమయిన ప్రాధాన్యం కలవారుగా మనం పరిగణిస్తాం; అందువల్ల ఒక్కొక్కరు నిర్వహించే పని వలన అంతస్తు, హోదా ఏర్పడుతున్నాయి. కొన్ని ప్రత్యేకమైన పనుల నిర్వహణకు మనం యీ విధంగా హోదా, అంతస్తు ఆపాదించినంత వరకు, అసమానత్వం అనేది వుండితీరుతుంది; శక్తి సామర్థ్యాలు వున్నవారు, లేనివారి మధ్యనగల అంతరం దాటరానిదిగా తయారవుతూనే వుంటుంది. పనికి తగిలించివుంచిన హోదాను పీకిపారేస్తే, అప్పుడు ఒక నిజమయిన సమానత్వభావాన్ని కలుగజేయడానికి ఆస్కారం వున్నది. అయితే దీనికి ప్రేమభావం వుండితీరాలి; ఎందుకంటే ప్రేమభావం మాత్రమే అల్పత్వం, అధిక్యం అనే భావాలను నిర్మూలించగలదు.

ఈ లోకం అంతా వున్నవారు అంటే ఐశ్వర్యవంతులు, అధికారం గలవారు, సమర్థులు, అన్నీ కలిగివున్నవారు – లేనివారుగా విభజింపబడి వున్నది. మనుష్యుల నడుమన 'వున్నవారు', 'లేనివారు' అనే యీ విభజన అనేది లేని ఒక లోకాన్ని ఆవిష్కరించడం సాధ్యమేనా? వాస్తవంలో జరుగుతున్నది యిది: యీ చీలికను చూసి – ధనికులకు, పేదవారికి, అధిక శక్తి సామర్థ్యాలు వున్న మనిషికీ, శక్తి సామర్థ్యాలు తక్కువగానో, అసలే లేకుండానో వున్న మనిషికీ నడుమన వున్న యీ అఖాతాన్ని చూసి, రాజకీయవేత్తలు, ఆర్థిక శాస్త్రజ్ఞులు యీ సమస్యను ఆర్థిక, సామాజిక సంస్కరణల ద్వారా పరిష్కరించాలని ప్రయత్నిస్తున్నారు. అది కొంతవరకు బాగానే వుంది. అయితే విరోధభావం, యీర్ష్య, కార్పణ్యం – వీటి పూర్తి ప్రక్రియను గురించి మనం అవగాహన చేసుకోనంతకాలం నిజమయిన మార్పు పూర్తిగా ఎప్పటికీ జరగదు; ఎందుకంటే యీ ప్రక్రియను అవగాహన చేసుకున్నప్పుడు మాత్రమే, అది సమాప్తమయినప్పుడు మాత్రమే, మన హృదయాలలో ప్రేమభావం చోటు చేసుకోగలుగుతుంది.

**ప్రశ్న: ఒక పక్కన ప్రతిక్షణం మన పరిసరాలకు వ్యతిరేకంగా పోరాడుతూ మన జీవితాలలో శాంతి సాధించడం అనేది సాధ్యమేనా?**

**కృష్ణమూర్తి:** మన పరిసరాలు అంటే ఏమిటి? మన పరిసరాలు అంటే సమాజం; అంటే మనం పెరిగిన యీ దేశపు ఆర్థిక, మత, జాతీయ, వర్గ వాతావరణంతో కూడిన పరిసరాలు; వాటితో పాటుగా శీతోష్ణస్థితి కూడా. మనలో చాలామందిమి మన పరిసరాలకు తగినట్లుగా యిమిడి పోవడానికి మనల్ని సవరించుకోవాలని ప్రయాసపడుతూ వున్నాం; ఎందుకంటే – ఆ పరిసరాల నుండే

ఒక ఉద్యోగం సంపాదించాలని ఆశ పడతాం, ఆ సమాజం నుండి కలిగే ప్రయోజనాల లబ్ధి పొందాలని ఆశపడతాం కాబట్టి. అయితే, ఆ సమాజ నిర్మాణం దేనితో జరిగింది? దానిని గురించి మీరు ఎప్పుడయినా ఆలోచించారా? మీరు నివసించే ఆ సమాజం వైపుకి వెళ్ళి, మిమ్మల్ని దానికి అనుగుణంగా సర్దుబాటు చేసుకోవడానికి ప్రయత్నిస్తున్న ఆ సమాజానికి సమీపంగా వెళ్ళి ఎప్పుడయినా పరిశీలించి చూశారా? ఆ సమాజం మతం అనే పేరుతో పిలువబడే కొన్ని నమ్మకాల, సంప్రదాయాల ఆధారంగా, కొన్ని ఆర్థిక విలువల ఆధారంగా తయారయింది; అవును కదూ? మీరూ ఆ సమాజంలోని వారే. ఆ సమాజానికి అనుగుణంగా సర్దుబాటు చేసుకోవడానికి మీరు ప్రయాసపడుతున్నారు. అయితే, యీ సమాజం ఆర్జన పరత్వానికి ఫలితంగా ఏర్పడినది; యీర్ష్య, భయం, అత్యాశ, స్వంతం చేసుకోవడానికి ఆరాటం, ఎప్పుడో ఒకసారి కనబడే ప్రేమభావం – వీటి ఫలితంగా ఏర్పడినది. మీరు తెలివితేటలతోను, నిర్భీతితోను, ఆర్జన పరత్వానికి విరుద్ధంగాను వుండాలని కోరుకున్నప్పుడు యిటువంటి సమాజానికి అనుగుణంగా మిమ్మల్ని మీరు సర్దుబాటు చేసుకోగలరా? నిజంగా చేసుకోగలరా?

నిస్సందేహంగా మీరు ఒక నవ్య సమాజాన్ని సృష్టించుకోవాలి; అంటే అర్థం, ఒక వ్యక్తిగా మీరు ఆర్జన పరత్వం నుండి, యీర్ష్య నుండి అత్యాశ నుండి విముక్తి చెందాలి; జాతీయభావాల నుండి, దేశభక్తి భావాల నుండి, ఆధ్యాత్మికతను సంకుచిత పరచడం నుండి కూడా మీరు విముక్తి పొందాలి. అప్పుడు మాత్రమే ఒక నూతనమయిన దానిని, సంపూర్ణంగా నవ్యనూతనమయిన ఒక సమాజాన్ని సృష్టించడం సాధ్యం అవుతుంది. అయితే, మీరు ఆలోచనా రహితంగా ప్రస్తుతపు సమాజానికి అనుగుణంగానే మిమ్మల్ని మీరు సర్దుకోవాలని ప్రయాస పడినంత కాలం మీరు యింకా పాత పద్ధతినే, అంటే యీర్ష్య, అధికారం, పరువు ప్రతిష్ఠలు, నమ్మకాలు మొదలయిన కలుషితపరచే వాటితో కూడిన పాత పద్ధతినే అనుసరిస్తున్నారన్నమాట.

కాబట్టి, మీరు చిన్నవయసులో వున్నప్పుడే యీ సమస్యలను అవగాహన చేసుకోవడం ఆరంభించి, మీ అంతరంగంలో నిజమయిన స్వేచ్ఛను పొందడం చాలా ముఖ్యం; అప్పుడే మీరు ఒక నూతన ప్రపంచాన్ని, ఒక నూతన సమాజాన్ని, మనిషికీ మనిషికీ మధ్య ఒక నూతన సంబంధ బాంధవ్యాన్ని సృష్టించగలుగుతారు. ఇది చేయడంలో మీకు దోహదపడటమే విద్యావిధానం యొక్క అసలయిన ధర్మం.

**ప్రశ్న: మనం బాధలు ఎందుకు పడవలసి వస్తున్నది? వ్యాధుల నుండి మృత్యువు నుండి మనం విముక్తిని పొందలేమా?**

**కృష్ణమూర్తి:** పరిసరాలను పరిశుభ్రంగా వుంచుకొనే ఆధునిక పద్ధతుల ద్వారా, సక్రమమయిన నివాస వసతుల ద్వారా, పుష్టికరమయిన ఆహారం ద్వారా మనిషి కొన్ని వ్యాధులనుండి విముక్తి చెందడం ఆరంభమయింది. శస్త్ర చికిత్స ద్వారా, యింకా అనేక చికిత్సా విధానాల ద్వారా పుట్టుకురుపు (కేన్సర్) వంటి నయం

చేయలేని వ్యాధులకు కూడా వైద్యశాస్త్రం చికిత్స కనిపెట్టడానికి ప్రయత్నం చేస్తున్నది. సమర్ధుడయిన వైద్యుడు రోగాన్ని ఉపశమింపజేయడానికి, నివారణ చేయడానికి శాయశక్తులా ప్రయత్నిస్తుంటాడు.

ఇక మృత్యువు – జయించగలమా? ఇంత చిన్న వయసులోనే మీకు మృత్యువుని గురించి యింత ఆసక్తి వుండటం చాలా ఆశ్చర్యకరంగా వుంది. మీ ధ్యాస ఎందుకు యీ విషయంపై మళ్ళింది? మీకు చుట్టుప్రక్కల ఎక్కడ చూసినా మృత్యువే కనబడుతుండటం వల్లనా? – శ్మశానాలు, శవాన్ని నది వద్దకు మోసుకొని పోవడం; మీకు మృత్యువు ఒక చిరపరిచితమయిన దృశ్యం అయి, మిమ్మల్ని ఎప్పుడూ వదలకుండా అంటిపెట్టుకొని వుంటున్నది; యిందువల్ల మృత్యువు అంటే మీకు భీతి.

మీలో మీరే బాగా తలపోసుకుంటూ మృత్యువు యొక్క అంతరార్థం యేమిటి? అనేది అవగాహన చేసుకోకపోతే, యీ మృత్యువు అనే సమస్యకు సమాధానం తెలుసుకోవడానికి, ఒక మతబోధకుని వద్దనుండి మరొక మతబోధకుని వద్దకు, ఒక నమ్మిక నుండి మరొక దానికి, ఒక విశ్వాసం నుండి మరొక దానికి అంతులేకుండా మీరు తిరుగుతూనే వుంటారు. మీకు అర్థం అవుతున్నదా? మరొకరిని యీ ప్రశ్న అడుగుతూ వుండకండి. మీరే స్వయంగా యీ విషయంలోని సత్యం ఏమిటి అనేది తెలుసుకోవడానికి ప్రయత్నించండి. మనంతట మనం తెలుసుకోవడం, స్వయంగా కనుగొనడం చేయకుండా, అసంఖ్యాకమయిన ప్రశ్నలు వేయడం క్షుద్రమయిన మనసుకు వుండే స్వభావాన్ని సూచిస్తుంది.

చూడండి, జీవితాన్ని వదలకుండా అంటిపెట్టుకొని వ్రేలాడాలనుకుంటున్నప్పుడే మృత్యువు అంటే భయంగా వుంటుంది. జీవితం అనే సంపూర్ణ ప్రక్రియను అవగాహన చేసుకోవడం అంటే చనిపోవడం యొక్క అంతరార్థాన్ని కూడా అవగాహన చేసుకోవడం. మృత్యువు అంటే కేవలం ఎడతెగకుండా వుండటానికి సమాప్తి పలకడమే; కొనసాగించలేకపోవడమంటే మనకు భయం; అయితే ఎప్పుడూ ఎడతెగకుండా కొనసాగేది సృజనాత్మకమయినది కానేకాదు. ఆలోచించి చూడండి; సత్యం అనేది ఏమిటో మీరే కనుగొనండి. మిమ్మల్ని మృత్యుభయం నుండి విముక్తి చేసేది సత్యం ఒక్కటే; మీ మత సిద్ధాంతాలూ కాదు, పునర్జన్మలో, మరోలోకంలో జీవితంపైన మీకుండే విశ్వాసాలూ కాదు.

★ ★ ★

# అధ్యాయం 18

మనం చిన్నవయసులో వున్నప్పుడు, పెద్దతరంవారికి దుర్భరంగా ఉండే జీవన సంఘర్షణలు, చింతలు, వస్తూ పోతూ వుండే మోద ప్రమోదాలు, భౌతిక విపత్తులు, మృత్యుభయం, మానసికమయిన వక్రతలు మనలో చాలామంది మీద బహుశ అంతగా ప్రభావం చూపవు. చిన్న వయసులో వున్నప్పుడు మనలో చాలామంది జీవన సంగ్రామ రంగం పైకి యింకా అప్పుడే అడుగుపెట్టి వుండరు. కాని, మనం పెరిగి పెద్దవాళ్ళమవుతుంటే ఒక్కసారిగా సమస్యలు, దుర్భర వేదనలు, సందేహాలు, ఆర్థికమైన, అంతరంగ సంబంధమయిన పోరాటాలు అన్నీ మనల్ని చుట్టుముట్టడం ఆరంభిస్తాయి; అప్పుడు జీవితపు అంతరార్థం ఏమిటి అనేది తెలుసుకోవాలనుకుంటాం; అసలు జీవితం అంతా దేనికోసమో తెలుసుకోవాలనుకుంటాం. ఈ సంఘర్షణలు, బాధలు, పేదరికం, విపత్తులు ఏమిటి అని ఆలోచనలో పడతాం. కొంతమంది మంచి పరిస్థితుల్లో వుండటం, మరికొంతమంది అట్లా లేకపోవడం ఎందుకో తెలుసుకోగోరుతాం; ఒక మనిషి ఆరోగ్యంగా, తెలివి తేటలు కలిగి, జన్మతః ప్రతిభ కలిగి, శక్తి సామర్థ్యాలు కలిగి ఎందుకు వున్నాడో, మరొకడు ఎందుకు లేడో తెలుసుకోవాలనుకుంటాం. మనం చాలా తేలికగా యీ విషయంలో సంతృప్తి పడ్డామంటే ఏదో ఒక ప్రాతిపదిక సూత్రంలోనో, మరొక సిద్ధాంతంలోనో, నమ్మకంలోనో త్వరలోనే చిక్కుకొని పోయామని అర్థం; మనకు ఒక సమాధానం దొరుకుతుంది, కాని అది అసలయిన సమాధానం కానేకాదు. జీవితం వికారంగా, బాధాకరంగా, దుఃఖపూరితంగా వున్నదని మనం గ్రహిస్తాం; దీనిని గురించి విచారణ చేయడానికి మనం బయలుదేరుతాం; అయితే యీ విచారణ కొనసాగిస్తూ పోవడానికి తగినంత స్వావలంబనశక్తి, సత్తువ, వివేకం, నిష్కాపట్యం లేకపోవడం వలన, త్వరలోనే మనల్ని తృప్తిపరుస్తూ సంశయనివృత్తి చేసే సిద్ధాంతాల్లోనో, నమ్మకాల్లోనో, ఏదో ఒక రకమయిన ఊహా ప్రతిపాదనలోనో, ధర్మసూత్రాల్లోనో చిక్కుకొని పోతాం. క్రమక్రమంగా మన నమ్మకాలు, సిద్ధాంతాలు విశ్వాసాలు లోతుగా వ్రేళ్ళూనుకొనిపోయి, సుస్థిరపడిపోతాయి; ఎందుకంటే వాటి వెనకాల అజ్ఞేయమైనదానిని గురించి అంటే మనకు తెలియనిదానిని గురించి ఒక నిరంతర భయం మనలో వుంటుంది కాబట్టి. ఆ భయంవైపు మనం సూటిగా ఎన్నడూ చూడం; దానినుండి మనం పక్కకు తిరిగిపోయి మన నమ్మకాల్లో ఆశ్రయం వెతుక్కుంటాం. ఈ నమ్మకాలను – హిందూ, బౌద్ధ, క్రిస్టియను నమ్మకాలను – పరీక్షించినట్లయితే అవి ప్రజలను విభజిస్తున్నాయని తెలుసుకుంటాం. ఒక్కొక్క సిద్ధాంతానికి లేదా నమ్మకానికి చెందిన సూత్రావళితో పాటుగా ఒక పూజావిధుల

కార్యక్రమం, కొన్ని నిర్బంధాల పట్టిక వుంటాయి; అవి మనసును బంధిస్తాయి, మనిషిని మనిషి నుండి విడదీస్తాయి.

అందువలన, సత్యం ఏది అని తెలుసుకోవాలని, యీ దురవస్థలన్నింటికి, యీ పోరాటానికి, యీ బాధకు ఏమిటి అంతరార్థం అనేది తెలుసుకోవాలని మనం ఒక విచారణ చేయడంతో ఆరంభిస్తాం; చివరకు కొన్ని నమ్మకాలను, పూజావిధులను, సిద్ధాంతాలను పట్టుకొని తేలుతాం. నమ్మకాన్ని పక్కకు త్రోసివేసి, విచారణ చేసి తెలుసుకొనే స్వీయసామర్థ్యం మనకు లేదు, జనసత్త్వాలు లేవు, నిష్కాపట్యం మనలో లేదు; అందువలన నమ్మకం మన జీవితాల్లో క్షీణత్వానికి ఒక దోహదకారిగా పని చేయడం ఆరంభం అవుతుంది.

నమ్మకం చెడుకే దారి తీస్తుంది; ఎందుకంటే నమ్మకం వెనుక, ఆదర్శ పూరితమయిన నీతిసూత్రాల వెనుక, 'నా' అనే అహం నక్కి వుంటుంది. ఇది నిరంతరం పెద్దగా పెరిగిపోతూ మరింత శక్తివంతమవుతూ వుంటుంది. దేవునిలో నమ్మకం వుండటమే మతం అని మనం అనుకుంటాం. నమ్మకం కలిగివుండటాన్నే ఆధ్యాత్మికత అని మనం పరిగణిస్తాం. మీరు కనుక నమ్మకపోతే మిమ్మల్ని ఒక నాస్తికుడుగా ఎంచి, సమాజం మిమ్మల్ని ఖండిస్తుంది. ఒక సమాజం దేవునిలో నమ్మకం లేనివాళ్ళని నిందిస్తే, మరొక సమాజం నమ్మేవారిని ఖండిస్తుంది. అవి రెండూ సమానమయినవే.

కాబట్టి మతం అంటే నమ్మకంతో ముడిపడినది అయిపోయింది; యీ నమ్మకం మనసుకు హద్దులు గీస్తుంది; ఇక ఆపైన మనసుకు ఎన్నడూ స్వేచ్ఛ వుండదు. అయితే స్వేచ్ఛలో వున్నప్పుడు మాత్రమే సత్యం అంటే ఏమిటి అనేది, దైవం అంటే ఏమిటి అనేది మీరు గ్రహించగలుగుతారు, అంతేకాని నమ్మకం ద్వారా మాత్రం కాదు; ఎందుకంటే యీ నమ్మకమే దైవం అంటే ఎట్లా వుండాలో సత్యం అంటే ఏదయి వుండాలో అనే ఒక ఊహా చిత్రాన్ని మీలో ప్రవేశపెడుతుంది. దైవం అంటే ప్రేమభావం అనీ, దైవం అంటే మంచితనం అనీ, దైవం అంటే యింకా అదనీ, యిదనీ మీరు నమ్ముతుంటే, మీ యీ నమ్మకమే మిమ్మల్ని దైవం అంటే ఏమిటి అనే దానిని, సత్యం అంటే ఏది అనే దానిని అవగాహన చేసుకోకుండా నిరోధిస్తుంది. కాని, చూడండి, మీరేమో యిటువంటి నమ్మకంలోనే పడి మిమ్మల్ని మీరే మరచిపోవాలని చూస్తారు; మిమ్మల్ని మీరే పరిత్యాగం చేసుకోవాలని కోరుకుంటారు; మీరు మరొకరికంటే మించిపోవాలని కోరుకుంటారు. మీ లోలోపల జరుగుతున్న ఒక నిరంతర పోరాటాన్ని ఎక్కడిదక్కడ వదిలేసి, పుణ్యసంపాదన వెనుక పరుగులు పెడతారు.

మీ జీవితం ఒక నిరంతర పోరాటం; అందులో దుఃఖం, బాధలు, ఆకాంక్షలు, క్షణికమైన సుఖ, సంతోషాల రాకపోకలు వుంటాయి; అందుకని మనసుకు ఒక బ్రహ్మాండమయినది ఏదయినా వదలకుండా పట్టుకొని వ్రేలాడటానికి కావాలి; అది తనను అంటే మనసును అధిగమనించినదయి వుండాలి, దానితో తాను తాదాత్మ్యం చెందాలి అని కోరుకుంటుంది. అటువంటి దానికే మనసు దైవం అనో, సత్యం అనో పేరు పెడుతుంది; నమ్మకం ద్వారా, గాఢ విశ్వాసం ద్వారా, హేతుబద్ధం

చేయడం ద్వారా, అనేక రూపాలలో వుండే క్రమశిక్షణ ద్వారా ఆదర్శపూరితమయిన నీతిసూత్రాల ద్వారా దానితో తాను తాదాత్మ్యం చెందుతుంది. కాని యీ బ్రహ్మాండమైనది, ఊహాగానాలకు తావు కల్పించే యిది, నిజంగా 'నా'లో ఒక భాగమే, 'నా'లో తయారయినదే; మనసు జీవితపు అల్లకల్లోలాలనుండి తప్పించుకోవాలనే కోరికతో దీనిని చిత్రకల్పన చేసింది.

మనమందరమూ ఒక్కొక్క దేశంతో మనల్ని అభేదంగా కలిపివేసుకుంటాం – ఇండియాతో, యింగ్లండుతో, జర్మనీతో, రష్యాతో, అమెరికాతో – యిట్లాగ. మీరు మిమ్మల్ని ఒక హిందువుగా తలచుకుంటారు. ఎందుకని? మీరు యిండియాతోనే ఎందుకు అభేదంగా కలిపి చెప్పుకుంటారు? మీరు ఎప్పుడయినా యీ సంగతి ఆలోచించారా? మీ మనసులను ఆకట్టుకున్న యీ మాటల వెనుకకుపోయి చూశారా? ఒక నగరంలోనో, ఒక చిన్న పట్నంలోనో నివసిస్తూ, మీ పోరాటాలు, మీ కుటుంబ కలహాల మధ్యన ఒక నికృష్టమయిన జీవితం గడుపుతూ, అసంతృప్తితో, సంతోషలేమితో, దుఃఖంతో వుంటూ, యిండియా అనే పేరుగల ఒక దేశంతో మీరు తాదాత్మ్యం చెందుతున్నారు. ఇది మీకు ఒక విశాలభావాన్ని, ఒక విశిష్టతను, ఒక మానసిక తృప్తిని యిస్తుంది; అందుకని "నేను ఒక యిండియనును (భారతీయుడిని)" అని మీరు అంటారు; పైగా దీనికోసం మీరు చంపడానికి, చనిపోవడానికి, అవిటి వారవడానికీ సిద్ధంగా వుంటారు.

ఇదే విధంగా, మీరు నిరంతరం మీ లోపల మీతోనూ, యితరులతోనూ పోరాటం చేస్తూ వుండే చాలా అల్పమనస్కులు కాబట్టి, మీరు గందరగోళంలోనూ, దుర్భర వేదనలతోనూ, అనిశ్చితంగానూ వుంటారు కాబట్టి, మృత్యువు వున్నదనే సంగతి మీకు తెలుసు కాబట్టి, ఆవలగా ఎక్కడో వున్న దానితో మిమ్మల్ని తాదాత్మ్యం చేసుకుని, దానిని దైవం అని పిలుస్తారు. దైవం అని పిలిచే దానితో తాదాత్మ్యం చెందడం ద్వారా మీకు ఒక బ్రహ్మాండమయిన ప్రాముఖ్యత కలిగినట్లు భావిస్తారు; దానితో మీరు సంతోషపడతారు. కాబట్టి ఒక బ్రహ్మాండమయిన దానితో మీరు తాదాత్మ్యం చెందడం అనేది ఒక స్వీయవిస్తృతీకరణ అంటే స్వార్థ ప్రయోజన ప్రక్రియ; యిది కూడా 'నా' అనే అహం పడుతున్న ప్రయాసే.

మనకు సాధారణంగా తెలిసినంతవరకు మతం అంటే రకరకాల నమ్మకాలతో, మూఢ విశ్వాసాలతో, పూజా పురస్కారాలతో, అంధాచారాలతో కూడుకున్నది అని; విగ్రహాలను, మంత్రతంత్రాలను, గురూజీలను పూజించడం అని; యిదంతా మనల్ని ఏదో పారమార్థిక లక్ష్యంవైపు తీసుకొనిపోతుందని తలుస్తాం. ఈ పారమార్థిక లక్ష్యం కూడా మనం చేసుకున్న విచిత్ర కల్పనే; మనకు కావలసినది యిదే; మనల్ని సంతోషపెడుతుందని మనం అనుకుంటున్నది, మరణంలేని స్థితిని ప్రసాదిస్తానవే అభయహస్తం యిచ్చేది యిదే. ఏ సందిగ్ధత లేని ఒక స్థితికొరకు వుండే యీ కాంక్షలో చిక్కుకొనిపోయి మనసు మూఢవిశ్వాసాలతో, పురోహితుల ఆర్భాటాలతో, అంధాచారాలతో విగ్రహారాధనలతో కూడిన మతాన్ని సృష్టిస్తుంది; ఇక అక్కడే కదలకుండా ఆగిపోయి మురిగిపోతుంది. అదేనా మతం అంటే? మతం

అంటే నమ్మకానికి సంబంధించిన విషయమా? యితర వ్యక్తుల అనుభవాలను, వారు నిర్ధారణ చేసినవాటిని స్వీకరించడానికి లేక తెలుసుకోవడానికి సంబంధించిన విషయమా? మతం అంటే కేవలం నీతి సూత్రాలను ఆచరణలో పెట్టడమా? మీకు తెలుసా, యీ నీతిసూత్రాలను పాటించడం ఒక విధంగా చూస్తే సులభమే – యిది చేయడం, అది చేయకుండా వుండటం. ఈ నీతి విధానాన్ని మీరు వూరికే అనుకరణ చేసెయ్యొచ్చు. అయితే అటువంటి నీతివిధానం వెనుక దౌర్జన్యపూరితమయిన అహం, పెద్దగా ఎదుగుతూ, విస్తృతమవుతూ, అధికారం చలాయిస్తూ నక్కి వుంటుంది. మతం అంటే యిదా?

సత్యమంటే ఏమిటి అనేది మీరు కనిపెట్టాలి; ఎందుకంటే అసలు ముఖ్యమయిన సంగతి అదే – మీరు ధనవంతులా, పేదవారా అనేది కాదు, మీరు పెళ్ళి చేసుకొని, పిల్లలతో సుఖంగా వున్నారా అనీ కాదు; యివన్నీ ఏదో ఒకరోజు సమాప్తం అవుతాయి; మృత్యువు అనేది ఒకటి తప్పనిసరిగా వున్నది. అందువలన, ఏ విధమయిన నమ్మకమూ లేకుండా సత్యమంటే ఏమిటి అనేది, దైవం అంటే ఏమిటి అనేది మీరు స్వయంగా తెలుసుకోవడానికి తగిన జవసత్త్వాలు, స్వావలంబన శక్తి, అంతఃస్ఫూర్తి మీకు వుండి తీరాలి. నమ్మకం మీ మనసుకు విముక్తి కలిగించదు; నమ్మకం కలుషితం చేస్తుంది, బంధిస్తుంది. అంధకారంలో పడవేస్తుంది. తన స్వంత బలంద్వారా, తన స్వీయసామర్థ్యంద్వారా మాత్రమే మనసు విముక్తిని పొందగలుగుతుంది.

ఏ రకమయిన నమ్మకంతో గాని, నీతి సూత్రాల నమూనాతోగాని, పరువు మర్యాదల నమూనాతోగానీ బంధింపబడని వ్యక్తులను తయారు చేయడం, విద్యావిధానం యొక్క విద్యుక్త ధర్మాలలో ఒకటని గట్టిగా చెప్పవచ్చు. నీతిమంతంగాను, మర్యాదస్థులలాగానూ అవాలని ఎప్పుడూ ఆరాటపడుతూ వుంటుంది యీ 'నా' అనేది. నిజంగా ఆధ్యాత్మికత గల వ్యక్తి, నిజమైన ధార్మికుడు ఎవరంటే – దైవం ఏమిటి అనేది, సత్యం అంటే ఏమిటి అనేది ఆవిష్కరించుకొనేవాడు; తానే నేరుగా అనుభవాన్ని పొందేవాడు. ఏ రకమయిన నమ్మకం వల్లగాని, పూజాపునస్కారాల వల్లగాని, మరొకరిని అనుసరించడమో, పూజించడమో చేయడంవల్ల కాని ఆ నేరుగా, సూటిగా అనుభవాన్ని పొందడం అనేది సాధ్యంకాదు. నిజంగా ఆధ్యాత్మికత గల మనసు ఏ గురువుల అవసరం లేకుడా స్వేచ్ఛగా వుంటుంది. ఒక వ్యక్తిగా మీరు పెరిగి పెద్దవారయి మీ జీవితం మీరు జీవిస్తున్నప్పుడు, క్షణక్షణమూ సత్యాన్ని కనుక్కోగలుగుతారు; ఆ విధంగా మీరు స్వేచ్ఛగా వుండటానికి చేతనయివుంటారు.

లోకంలో వుండే ప్రాపంచిక విషయాలనుండి విముక్తి చెంది వుండటమే ఆధ్యాత్మికత దిశగా పయనించడంలో ప్రథమ సోపానం అని చాలామంది అనుకుంటారు. కాదు. ఇది అత్యంత సునాయాసంగా చేయవచ్చు. ప్రథమ సోపానం ఏమిటి అంటే, పూర్తిగా, సంపూర్ణంగా, స్వతంత్రంగా ఆలోచించుకొనడానికి స్వేచ్ఛకలిగి వుండటం; అంటే నమ్మకంతో బంధించబడకుండా, పరిస్థితుల వల్ల, పరిసరాల వల్ల అణగారిపోకుండా వుండటం; ఆ విధంగా శక్తిసామర్థ్యాలుకల, జవసత్త్వాలు గల, స్వీయ సామర్థ్యంపై ఆధారపడగల ఒక సమన్వయత్వం పొందిన

వ్యక్తి అవుతారు మీరు. అప్పుడు మాత్రమే మీ మనసు స్వేచ్ఛగా, నిష్పక్షపాతంగా, నిర్నిబద్ధతతో వుండి, దైవం అంటే ఏమిటి అనేది తెలుసుకొనగలుగుతుంది. ఈ ప్రాథమిక ఉద్దేశ్యం కోసమే ఏ విద్యా కేంద్రమయినా నిజానికి నడుపుతూ వుండాలి; అక్కడికి వచ్చే ప్రతి వ్యక్తికి యథార్థాన్ని ఆవిష్కరించుకునే స్వేచ్ఛను పొందడానికి సహాయపడటం చేయాలి. అంటే అర్థం ఏ ఒక్క ప్రత్యేక విధానాన్ని అనుసరించకపోవడం; ఏ నమ్మకాన్ని, పూజావిధులను పట్టుకొని వ్రేలాడకపోవడం, ఏ గురువును పూజించకపోవడం. వ్యక్తి తన ప్రజ్ఞను, తన తెలివిని ఏదో ఒక రూపంలో వుండే క్రమశిక్షణతో, ప్రతిరోధంతో, బలవంతంతో, నిర్బంధంతో కాకుండా, స్వేచ్ఛామార్గం ద్వారా జాగృతం చేసుకోవాలి. స్వేచ్ఛ మూలంగా కలిగిన తెలివి లేదా వివేకం ఆధారంగా మాత్రమే వ్యక్తి మనసుకు అవలగా, అతీతంగా వున్నదానిని ఆవిష్కరించుకొనగలుగుతాడు. ఆ అపారత్వాన్ని – ఏ పేరుకూ అందనిదానిని, అవధులు లేనిదానిని, మాటలలో కొలిచి చూపలేనిదానిని, యీ మనసుతో సంబంధంలేని ఒక ప్రేమభావాన్ని తనలో కలిగివున్న దానిని – దానిని నేరుగా అనుభవించి తీరాలి. మనసు దానిని ఊహించనయినా ఊహించలేదు; అందుకు, మనసు చాలా నెమ్మదిగా, అత్యంతమైన నిశ్చలత్వంతో, ఏ కోరికల ఒత్తిడి, కాంక్షా లేకుండా వుండాలి. అప్పుడే దైవం అని కాని, సత్యం అని కాని పిలువదగినది గోచరం అయే అవకాశం వుంది.

**ప్రశ్న: విధేయత అంటే ఏమిటి? అర్థం చేసుకోకపోయినా మనం ఆదేశాన్ని విధేయతతో పాటించవలసిందేనా?**

**కృష్ణమూర్తి:** మనలో చాలామంది చేసేది అదేకదూ? తల్లిదండ్రులు, టీచర్లు, పెద్దవారు అందరూ, "యిది చేయండి" అంటారు. వాళ్ళు ఆ మాటను మర్యాదగా నయినా అంటారు, లేదూ క్రపుచ్చుకొని అయినా అంటారు; మనం భయపడుతూ వుంటాం కాబట్టి విధేయత చూపుతాం. ప్రభుత్వాలు, సైన్యంలో వారు కూడా మనతో యిట్లాగే ప్రవర్తిస్తారు. మనం చిన్నతనం నుండీ, అదంతా ఏమిటో ఎందుకోసమో తెలియకపోయినా, చెప్పిన మాట శిరసావహించేటట్లుగా శిక్షణ పొంది వుంటాం. మన తల్లితండ్రులు ఎంత ఎక్కువ ఆధిపత్యం చలాయించేవారయితే, ప్రభుత్వం ఎంత నిరంకుశంగా ప్రవర్తించేదయితే అంత ఎక్కువగా మనల్ని చిన్నతనం నుండీ నిర్బంధం చేసి, వారి యిష్టానుసారంగా మనల్ని రూపు దిద్దుకుంటారు. మనల్ని చేయమని చెప్పినవి ఎందుకని చేయాలో అర్థం చేసుకోకుండానే విధేయతతో మనం అవి చేసేస్తాం. మనం ఏం ఆలోచించాలో కూడా వాళ్ళు మనకి చెప్తారు. ప్రభుత్వానికి, స్థానిక అధికారులకు సమ్మతంకాని ఏ ఒక్క ఆలోచన కూడా మనలో లేకుండా మన మనసులను వారు కడిగి వేసేస్తారు. ఆలోచించడం, తెలుసుకొనడం ఎట్లా చేయాలో మనకి ఎప్పుడూ నేర్పించరు; దానికి సహాయమూ చేయరు, మనం చేయవలసిందల్లా విధేయంగా వుండటమే. మతాచార్యుడు మనకి ఏది ఎట్లా వుండాలో చెప్తాడు; మతగ్రంథం యిది యింతే అని చెప్తుంది; మన లోలోపల వున్న భయమే మనల్ని విధేయంగా వుండమని నిర్బంధిస్తుంది; మనం విధేయత

కనుక చూపకపోతే మనలో ఒక గందరగోళం కలుగుతుంది, మనం దారీ, దిక్కూ తోచకుండా అయిపోతాం.

మనం విధేయంగా ఎందుకు వుంటామంటే, మనం చాలా ఆలోచనారహితంగా వుంటాం కాబట్టి. మనం ఆలోచించడానికి యిష్టపడం; ఎందుకంటే ఆలోచిస్తే అలజడి రేగుతుంది; ఆలోచించాలంటే మనం ప్రశ్నించుకోవాలి, తరచి చూసుకోవాలి, మనంతట మనమే స్వయంగా తెలుసుకోవాలి. పెద్దవారికి మనం యిట్లా తరచి చూడటం యిష్టం వుండదు; మన ప్రశ్నలు వినే సహనం వారికి వుండదు. వాళ్ళు వారి కలహాలతో, వారి ఆకాంక్షలతో, వారి నిర్హేతుకమైన అభిప్రాయాలతో, 'యివి చేయవచ్చు, యివి చేయకూడదు'లతో కూడిన నీతిసూత్రాలు, పరువు మర్యాదలతో తీరికలేకుండా వుంటారు; చిన్న వయసులో వున్న మనం తప్పు చేస్తామేమోనని భయపడుతూ వుంటాం; ఎందుకంటే మనకూ పరువు మర్యాదలు కావాలని కోరుకుంటాం. మనందరం ఒకే మాదిరి దుస్తులు ధరించి, ఆ విధంగా ఒకే మాదిరిగా కనిపించాలని కోరుకుంటాం కదూ? భిన్నంగా వుండేది ఏదీ మనం చేయాలనుకోము; స్వతంత్రంగా ఆలోచించాలనుకోము; అందరికీ ఆవలగా ఒక్కరమే నిలబడాలనుకోము; ఎందుకంటే యిదంతా మనలో చాలా అలజడిని కలిగిస్తుందని; అందుకని 'గుంపులో గోవిందా'గా వుంటాం.

మన వయసు ఏదయినా సరే, మనలో చాలామందిమి విధేయత చూపుతాం; అనుసరిస్తాం, నకలుగా తయారవుతాం; ఎందుకంటే – అనిశ్చితంగా వుండటం అంటే మనం అంతర్గతంలో భయపడుతుంటాం కాబట్టి. ఆర్థికంగానూ, నీతికి సంబంధించిన విషయాల్లోనూ ఒక నిశ్చితత్వాన్ని మనం కోరుకుంటాం. అందరిచేతా మనం చేసేవాటికి ఆమోదం పొందాలని కోరుకుంటాం. ఒక సురక్షితమయిన స్థానంలో వుండాలని, మన చుట్టూ గోడలు కట్టుకొని మూసేసుకొని కూర్చుంటాం; కష్టాలు, బాధలు, వేదనలు మనపైన పడకూడదని, మనం వాటిని ఎదుర్కోవలసి రాకూడదని కోరుకుంటాం. భయభీతి అనేదే, చేతనమయినదో, అచేతనంలోనిదో – ఏదయినాసరే, యీ భయమే మన యజమానికి, నాయకుడికి, మతాచార్యుడికి, ప్రభుత్వానికి మనల్ని విధేయంగా చేస్తున్నది. శిక్షిస్తారేమో అనే భయమే యితరులకు హాని కలిగించేది ఏదీ మనం చేయకుండా మనల్ని నిరోధిస్తున్నది. కాబట్టి మనం చేసే పనులన్నింటికీ, మన అత్యాశలకు, వ్యాపకాలకు వెనకాల నిశ్చితత్వం కొరకు, అసందిగ్ధత కొరకు వుండే కోరిక నక్కివుంటుంది. సురక్షితంగా, ధీమాగా వుండాలనే యీ కోరిక నక్కివుంటుంది. భయం నుండి విముక్తి చెందకుండా కేవలం విధేయంగా వుండటంలో ఏమాత్రం అర్థం లేదు. ఈ భయాన్ని గురించి ప్రతి రోజూ ఎరుకగా, అప్రమత్తంగా వుండటం, వివిధ రకాలయిన మార్గాల్లో అది తనను ఎట్లా బహిర్గతం చేసుకుంటుందో గమనించడం – అదే అర్థవంతమయినది; భయంనుండి విముక్తి కలిగినప్పుడే అవగాహన అనే అంతర్గుణమూ, జ్ఞానాన్ని, అనుభవాన్ని పోగుచేసివుంచని ఆ ఏకాంతత్వమూ అనేవి వుండటానికి అవకాశం వుంటుంది.

★ ★ ★

# అధ్యాయం 19

మనం పెరిగి పెద్దవాళ్ళమయ్యాక, చదువు అని మనం అంటున్నది ముగించుకొని పాఠశాలను వదిలిపోయాక , అనేక సమస్యలను మనం ఎదుర్కోవలసి వస్తుంది. ఏ వృత్తిలో మనం చేరాలి? ఎందులో చేరుతే సఫలత చెందిన భావం కలిగి సంతోషంగా వుంటాం? ఏ వృత్తిలో, ఏ ఉద్యోగంలో చేరుతే మనం యితరులను మన లాభంకోసం వుపయోగించుకోవడం లేదని, యితరులను నిర్దాక్షిణ్యంగా చూడటం లేదని భావించగలుగుతాం? కష్టనిష్ఠురాలు, విపత్తులు, మృత్యువు వంటి సమస్యలను మనం ఎదుర్కొనవలసి వస్తుంది. ఆకలి, అధిక జనాభా, శరీర వాంఛలు, బాధ, సుఖం యివన్నీ మనం అవగాహన చేసుకోవలసి వస్తుంది. మన జీవితంలోని ఎన్నో గందరగోళమయిన విషయాలతో, మరెన్నో పరస్పర విరుద్ధమయిన విషయాలతో మనం తలపడవలసి వస్తుంది; మనిషికీ, మనిషికీ మధ్యన వుండే, పురుషునికీ, స్త్రీకీ నడుమ వుండే పేచీలు, చికాకులు; లోలోపల వుండే సంఘర్షణలు, బయట ప్రపంచంతో చేసే పోరాటాలు – యింకా యిటువంటివి ఎన్నో. ఆకాంక్ష, యుద్ధం, సమరోత్సాహం – వీటిని, మనం గ్రహించగలిగిన దానికంటే మరింత ప్రాముఖ్యం కలిగిన విషయం, శాంతి అని మనం పిలిచే ఆ అపూర్వమయిన దానిని – వీటన్నింటినీ మనం అవగాహన చేసుకోవలసి వస్తుంది. మతం యొక్క విశిష్టత ఏమిటి – అది కేవలం నిరాధారమైన ఊహాగానం కాదు, ప్రతిమలను ఆరాధించడం కాదు; అతి విచిత్రమయినది, సంక్లిష్టమయినది, ప్రేమ అని మనం పిలిచే ఆ విషయాన్ని – వీటన్నింటి తాత్పర్యం మనం అవగాహన చేసుకోవలసి వుంటుంది. జీవితపు సౌందర్యం అంటే ఒక ఎగురుతున్న పక్షి – అదే కాదు, ఒక బిచ్చగాడు, మురికిలో, కుళ్ళులో బతికే పేదవారు, మనుష్యులు నిర్మించిన యీ వికృతమయిన భవనాలు, దుర్వాసన భరితమయిన వీధులు, అంతకంటే దుర్వాసన నిండిన దేవాలయం – వీటన్నింటినీ సున్నితత్వంతో చూడవలసి వుంటుంది. ఈ సమస్యలన్నీ మనం ఎదుర్కొని తీరాలి. ఎవరిని అనుసరించాలి, ఎవరిని అనుసరించకూడదు, అసలు మనం ఎవరినయినా అనుసరించాలా అనే ప్రశ్నను కూడా మనం ఎదుర్కొనవలసి వస్తుంది.

మనలో చాలామంది అపేక్షించేదల్లా కాస్తంత మార్పు అక్కడ, కాస్తంత మార్పు యిక్కడ తీసుకొనిరావడంలోనే; దానితోనే మనం తృప్తిపడతాం. మనం పెద్దవాళ్ళమవుతున్న కొద్దీ గాఢమయిన, సమూలమయిన మార్పులు రావాలని చాలా తక్కువగా కోరుకుంటాం; మార్పులు అంటే మనం భయపడతాం కాబట్టి. సంపూర్ణమయిన రూపాంతరీకరణం గురించి మనం ఆలోచించం; పైపై మార్పుల గురించే ఆలోచిస్తాం; మీరు బాగా పరికించి చూసినట్లవుతే యీ పైపై మార్పులు

అసలు ఒక మార్పే కాదని తెలుసుకుంటారు. అది ఒక సమూలమయిన విప్లవం కానేకాదు. మునుపు వున్నదానినే మరో రూపంలో కొనసాగించడం, అంతే. మీ స్వీయ సంతోషాలు, దురవస్థల నుండి అనేకుల సంతోషాలు, దౌర్భాగ్యాల వరకు; మీ స్వీయ ఆకాంక్షలు, స్వార్థపూరితమయిన ఆరాటాల నుండి యితరుల ఆకాంక్షలు, ప్రేరణలు, ఆరాటాల వరకు ఎన్నో తెలుసుకోవలసి వుంటుంది. ఎంతో పోటీని, మీలోనూ, యితరులలోను వుండే కలుషితత్వాన్ని, మనసు క్షీణత చెందడాన్ని, ఖాళీ హృదయాలను – యిటువంటివి యింకా ఎన్నో మీరు ఎదుర్కోవలసి వస్తుంది. ఇవన్నీ మీరు తెలుసుకోవాలి; మీరే స్వయంగా ఎదుర్కొని, అవగాహన చేసుకోవాలి. కాని, దురదృష్టవశాత్తు, మీరు దీనికి సిద్ధంగా లేరు.

పాఠశాలను వదిలే సమయానికి మనం అవగాహన చేసుకున్నది ఏమిటి? కాస్తంత జ్ఞానాన్ని పోగుచేసుకొని వుంటాం; యిక్కడికి వచ్చినప్పుడు ఎట్లా వున్నామో అంతే మందకొడిగానూ, అంతే ఖాళీగానూ, అంతే బుద్ధిహీనంగానూ వుండిపోతాం. మన చదువులు, పాఠశాలకు హాజరవడం, టీచర్లతో మనకు ఏర్పడిన పరిచయాలు యివన్నీ జీవితంలోని సంక్లిష్టమయిన సమస్యలను అవగాహన చేసుకోవడానికి మనకు ఏమాత్రం దోహదపడలేదు. అధ్యాపకులు మందకొడిగా వుంటారు. మనమూ వారిలాగే మందకొడిగా తయారవుతాం. వారు భయపడుతూ వుంటారు, మనమూ భయపడుతూ వుండిపోతాం. కనుక యిది మన స్వీయ సమస్య. బయట ప్రపంచంలోకి పరిణతి చెందిన స్థితిలో, గాఢమైన ఆలోచనా శక్తితో, నిర్భీతితో ప్రవేశించి, వాటి ఆధారంగా జీవితాన్ని వివేకంతో, తెలివితో మీరు ఎదుర్కొనగలగాలంటే, అప్పుడు దీని బాధ్యత మీ మీద, మీతోపాటు అధ్యాపకుల మీద కూడా వున్నది.

ఇప్పుడు, యీ సంకీర్ణమయిన సమస్యలన్నింటికీ సమాధానం కనిపెట్టడం చాలా ముఖ్యమైన సంగతి అని తెలుస్తూనే వున్నది; అయితే, వీటికి సమాధానం లేదు. మీరు చేయగలిగినదల్లా ఏమిటంటే, అవి ఉత్పన్నమయినప్పుడు వాటిని తెలివితేటలతో ఎదుర్కోవడమే. దయచేసి యిది అవగాహన చేసుకోండి. వెంటనే ఒక సమాధానం కావాలని మీరు కోరుకుంటారు, అది సహజమే, అవును కదూ? పుస్తకాలు చదవడం వలన, మరొకరిని అనుసరించడం వలన, జీవితంలోని యీ అతి సంక్లిష్టమయిన, యీ అతి సున్నితమయిన సమస్యలన్నింటికీ సమాధానం కనిపెట్టవచ్చని మీరు అనుకుంటారు. నమ్మకాలను, సిద్ధాంతాలను మీరు చేరదీస్తారు; కాని అవి సమాధానాలు కావు. ఎందుకంటే, యీ సమస్యలు మీవంటి మీ తోడి మానవులు సృష్టించినవే కాబట్టి. అతి భయంకరమైన యీ నిర్దయాత్మకత, ఆకలిబాధ, క్రూరత్వం, నికృష్టత, కుళ్ళూ, మురికి – యిదంతా మీవంటి మానవులు తయారు చేసినవే. వీటికోసం సమూలమయిన రూపాంతరీకరణం తీసుకొని రావాలంటే మీరు మానవ హృదయాన్ని, మనసును అవగాహన చేసుకోవాలి; అంటే మిమ్మల్నే అన్నమాట. కేవలం ఒక పుస్తకంలో దీనికి సమాధానం కొరకు వెతకడం, ఏదో ఒక రాజకీయ విధానంతోనో ఆర్థిక విధానంతోనో – అది ఎంత ఆశావహంగా కనిపించినప్పటికీ, దానితో మీరు పూర్తిగా తాదాత్మ్యం

చెందడం, అంధాచారాలతో కూడిన ఏదో ఒక మతమౌఢ్యాన్ని ఆశ్రయించడం, ఒక గురువుగారిని అనుసరించడం - వీటిలో ఏ ఒక్కటీ యీ మానవతా సమస్యలను అవగాహన చేసుకోవడానికి మీకు ఉపకరించదు; ఎందుకంటే వీటిని సృష్టించినది మీరూ, మీ వంటి యితరులే, యితర మానవులే కాబట్టి. వాటిని అవగాహన చేసుకోవాలంటే మిమ్మల్ని మీరు - క్షణక్షణమూ, రోజు రోజూ, ఒక యేటిపై మరో యేడు - అవగాహన చేసుకుంటూ వుండాలి; దీనికిగాను మీకు వివేకం అవసరం; అశేషమైన అంతర్దృష్టి, ప్రేమభావం, సహనం అవసరం.

కనుక, మీరు తెలివి లేదా వివేకం అంటే ఏమిటి అనేది తెలుసుకొని తీరాలి, తెలుసుకోవద్దూ? ఈ మాటను మీరంతా చాలా తరచుగా, యధేచ్ఛగా వాడుతూ వుంటారు; అయితే కేవలం తెలివిని గురించి మాట్లాడినంత మాత్రాన మీరు వివేకవంతులు అయిపోరు. రాజకీయవేత్తలు ఎప్పుడూ, "వివేకం", "సమన్వయత్వం", "నూతన సంస్కృతి", "ఐక్య ప్రపంచం" అనే మాటలను పదే పదే పునశ్చరణ చేస్తూ వుంటారు; అయితే అవి వట్టి అర్థహీనమైన శబ్దాలు మాత్రమే. అందుకని, నిజంగా అవగాహన చేసుకోకుండా, వాటి అంతర్భావం ఏమిటో తెలుసుకోకుండా మాటలను ఉపయోగించకండి.

తెలివి, ప్రజ్ఞ లేదా వివేకం అంటే ఏమిటో తెలుసుకుందామని మనం ప్రయత్నిస్తున్నాం - కేవలం దాని నిర్వచనం కాదు, అది ఏ నిఘంటువులోనయినా దొరుకుతుంది; దానిని తెలుసుకోవడం, మానసికంగా అనుభవించడం, అవగాహన చేసుకోవడం మనకి అవసరం. ఆ వివేకం కనుక వున్నట్లయితే, మనం పెరుగుతున్న కొద్దీ, మన జీవితాల్లోవుండే బ్రహ్మాండమయిన సమస్యలతో తలపడటానికి మనలో ప్రతి ఒక్కరికీ అది సహాయపడుతుంది. ఆ వివేకం లేనట్లయితే, మనం ఎంత చదివినా, అధ్యయనం చేసినా, జ్ఞానం పోగుచేసుకున్నా, సంస్కరణలు చేసినా, సామాజిక విధానంలో అక్కడక్కడ చిన్న చిన్న మార్పులు చేసినా, నిజమయిన రూపాంతరీకరణం అంటే సంపూర్ణమయిన మార్పు జరగదు; చిరకాలం కొనసాగే సంతోషమూ వుండదు.

సరే, వివేకం అంటే అర్థం ఏమిటి? దాని అర్థం నేను తెలుసుకోబోతున్నాను. మీలో కొంతమందికి బహుశ యిది కఠినంగా వుండవచ్చు; అయితే కేవలం మాటలను వినాలనే ప్రయత్నంలోనే పూర్తిగా పడిపోకండి. అంతకంటే నేను మాట్లాడిన దానిలోని విషయాన్ని గ్రహించడానికి ప్రయత్నించండి. వివేకం అంటే అసలు ఎట్లా వుంటుంది, దాని లక్షణం ఏమిటి అనేది మీ మనసులో తెలుసుకోవడానికి ప్రయత్నించండి. ఇప్పుడు మీరు వివేకం ఏమిటి అనే భావాన్ని మీ మనోగతంలో తెలుసుకుంటే మీరు పెరిగి పెద్దవాళ్ళవుతుంటే, యింకా యింకా స్పష్టంగా నేను చెప్పేదానిలోని ముఖ్యమైన అంతర్భావాన్ని మీరు తెలుసుకుంటారు.

జ్ఞానాన్ని, సమాచారాన్ని, అనుభవాలను ఆర్జించడం ద్వారా కలిగిన ఫలితమే వివేకం అని మనలో చాలామంది అనుకుంటారు. బాగా ఎక్కువగా జ్ఞానం, ఎక్కువగా అనుభవం వుండటం ద్వారా జీవితాన్ని తెలివిగా ఎదుర్కొనవచ్చని మనం అనుకుంటాం. కాని, జీవితం అనేది చాలా అద్భుతమయినది; అది

ఎప్పుడూ ఒకచోట కదలకుండా నిలబడి వుండదు; నదిలాగా అది నిరంతరం ప్రవహిస్తూ వుంటుంది, నిశ్చలంగా వుండనే వుండదు. చాలా ఎక్కువ అనుభవం, ఎక్కువ జ్ఞానం, ఎక్కువ పుణ్యం, ఎక్కువ వస్తుసంపద సేకరించడం ద్వారా వివేకవంతుల మవుతామని మనం అనుకుంటాం. అందుకనే మనం బాగా జ్ఞానం పోగుచేసుకున్నవారిని, పండితులను, భాగ్యవంతులను, బాగా అనుభవం పండినవారిని గౌరవిస్తాం. అయితే, వివేకం అనేది 'మరింత ఎక్కువ'కు ఫలితంగా సిద్ధించేదా? ఈ ఎక్కువగా కలిగి వుండటం, ఎక్కువగా కావాలని కోరుకోవడం అనే ప్రక్రియ వెనుక వున్నది ఏమిటి? ఎక్కువగా కావాలని కోరుకోవడంలో మన అక్కర పూర్తిగా పోగుచేసుకోవడం మీదనే వుంటుంది; వుంటుంది కదూ?

సరే, మీరు జ్ఞానం, అనుభవం సంపాదించి పెట్టుకున్నాక ఏమవుతుంది? ఇక తరువాత మీకు కలిగే అనుభవానికి 'మరింత' అనే మాట జోడించి పెట్టుకోవడమే తప్ప మీరు నిజంగా అనుభవాన్ని అనుభవిస్తూ వుండరు. ఎప్పుడూ దానిని సేకరించుకుంటూ వుంటారు; యీ సేకరణ అంతా మనసు జరిపే ప్రక్రియ; యీ మనసే 'మరింత'కు కేంద్రం. అంటే యింకా ఎక్కు వెక్కువగా కావాలనుకోవడానికి కేంద్రం. ఇదే యీ 'మరింత' అనేదే 'నేను' అనే అహం. స్వార్థంతో తనను మూసివేసుకుంటుంది యీ మనసు. పోగుచేయడమే దాని పని – అనుకూలార్థంలో కాని, ప్రతికూలార్థంలో కాని. అంటే కొన్ని అనుభవాలను కూడబెట్టుకోవడం, కొన్ని అనుభవాలను వ్యతిరేకించడం. ఇట్లా పోగు చేసుకున్న అనుభవంతో మనసు జీవితంతో తలపడుతుంది. ఇట్లా పోగు చేసుకున్న అనుభవంతో మనసు జీవితంతో తలపడటంలో మనసు మళ్ళీ 'మరింత' కోసమే తపన పడుతుంది; కాబట్టి మనసు అనుభవించనే అనుభవించదు, కేవలం సేకరణ మాత్రమే చేస్తుంది. మనసు కేవలం సేకరించే సాధనంగా వున్నంతవరకు నిజంగా అనుభవించడం వుండనే వుండదు. అనుభవంలో నుండి ఏదో పొందాలని, మరింతగా ఆర్జించాలని మీరు సదా ఆలోచిస్తూ వుంటే, మీరు అనుభవాన్ని ఎట్లా నిరాటంకంగా ఆహ్వానించగలుగుతారు?

కనుక, పోగుచేసుకుంటూ, సేకరణ చేసుకుంటూ వున్న మనిషి, 'మరింత' కావాలని కోరుకుంటూ వుండే మనిషి జీవితాన్ని నవ్యనూతనమయినదిగా అనుభవించనే లేదు. మనసు 'మరింత'ను గురించి పట్టించుకోకుండా వున్నప్పుడే, పోగుచేసుకోవడం గురించి పట్టించుకోకుండా వున్నప్పుడే, మనసుకు వివేకం కలిగి వుండటం అనేది సాధ్యమవుతుంది. మనసు 'మరింత' గురించే తాపత్రయపడుతున్నప్పుడు, తరువాత జరిగే ప్రతి అనుభవమూ 'నా' తన చుట్టూ తాను నిర్మించుకున్న స్వార్థం అనే గోడను మరింత మందంగా తయారుచేస్తుంది; అహంభావాన్ని పెంచే యీ ప్రక్రియ అన్ని సంఘర్షణలకూ కేంద్రం అవుతుంది. దయచేసి జాగ్రత్తగా వినండి. అనుభవం మనసును విముక్తం చేస్తుందని మీరు అనుకుంటారు. కాని అట్లా జరగదు. మీ మనసు పోగుచేయడం గురించే, 'మరింత' గురించే పట్టించుకుంటున్నంతవరకు మీకు కలిగే ప్రతి అనుభవమూ మీలోని అహంభావాన్ని, మీలోని స్వార్థపరత్వాన్ని, స్వార్థాపేక్షతో మూసుకొనిపోయిన మీ ఆలోచనా విధానాన్ని మరింతగా బలపరుస్తుంది.

తన నుండి, 'నా' నుండి నిజమయిన విముక్తి కలిగినప్పుడే 'వివేకం' అనేది

సాధ్యమవుతుంది. అంటే, మనసు 'మరింత' కోసం ఒత్తిడి చేసే కేంద్రంగా పనిచేయడం మానివేసినప్పుడే, మనసు యింతకంటే గొప్పదయిన, విశాలమయిన, విస్తృతమయిన అనుభవంకోసం పడే కాంక్షలో చిక్కుకొని వుండటం ఆగిపోయినప్పుడే 'నా' నుండి విముక్తి కలుగుతుంది, వివేకం అనేది సాధ్యమవుతుంది. వివేకం అంటే కాలపు భారాన్నుండి, ఒత్తిడి నుండి విముక్తి, అవును కదూ? ఎందుకంటే 'మరింత' అంటేనే దాని అంతర్భావం కాలం లేదూ వ్యవధి; 'మరింత' కోసం ఒత్తిడి చేయడానికి మనసు కేంద్రంగా వున్నంతవరకు అది (మనసు) కాలానికి కలిగిన ఫలితంగా జనించినదే. కాబట్టి 'మరింత'ను పెంచి పోషించడం వివేకం కాదు. ఈ ప్రక్రియనంతా అవగాహన చేసుకోవడం అంటే స్వీయజ్ఞానం పొందడం. పోగుచేసి వుంచే కేంద్రం లేకుండా తను ఏమిటి అనేది తానే తెలుసుకున్నప్పుడు, ఆ స్వీయజ్ఞానంలో నుండి వివేకం ఉద్భవిస్తుంది; ఆ వివేకం, సృజనాత్మకమైన ఆ ప్రజ్ఞ జీవితాన్ని ఎదుర్కొన కలుగుతుంది.

మీ జీవితంవైపే కళ్ళు బాగా విప్పి చూడండి. ఎంత స్తబ్దంగా, ఎంత మూర్ఖంగా, ఎంత సంకుచితంగా వున్నదో; ఎందుకంటే మీరు సృజనాత్మకంగా లేరు కాబట్టి. మీరు పెరిగి పెద్దవాళ్ళయ్యాక మీకు పిల్లలు కలుగవచ్చును; కాని అది సృజనాత్మకంగా వుండటం కాదు. మీరు అధికార యంత్రాంగంలో ఒక భాగమయి వుండవచ్చు; కాని అందులో జీవచైతన్యం లేదు, వున్నదా? అది నిర్జీవమయిన దినసరి కార్యక్రమం, మహా విసుగెత్తించే పని. మీ జీవితం చుట్టూ భయం అనే కంచె వున్నది; కనుకనే ఆధిపత్యం, అనుకరణ వున్నాయి. సృజనాత్మకంగా వుండటం ఏమిటో అది మీకు తెలియదు. సృజనాత్మకత అంటే నా అర్థం చిత్ర లేఖనం, కవితలు అల్లడం, పాటలు పాడగలిగి వుండటం అనికాదు. సృజనాత్మకత లోపలి లోతుల్లో వుండే స్వభావ లక్షణాన్ని గురించి నేను చెప్పేది; దానిని ఒకసారి కనిపెట్టామంటే అది ఒక శాశ్వతమైన మూల స్రోతస్సుగా, ఒక ఎండిపోని నిరంతర ప్రవాహంగా వుండిపోతుంది; దీనిని వివేకం ద్వారా మాత్రమే కనిపెట్టగలుగుతారు. ఈ మూల స్రోతస్సుకు కాలంతో సంబంధం లేదు. అయితే, మనసు 'నా'కు కేంద్రంగా వున్నంతవరకు; స్వార్థానికి, అంతులేకుండా 'మరింత' కోసం అర్థిస్తూ వుండే సత్వానికి కేంద్రంగా వున్నంతవరకు, కాలరహితమైనదానిని మనసు తెలుసుకోలేదు.

ఇదంతా మీరు అవగాహన చేసుకుంటే – వట్టి మాటలరూపంలో కాదు; లోతుగా, అంతరంగంలో అవగాహన చేసుకుంటే – అప్పుడు జాగృతమయిన ప్రజ్ఞతో పాటు ఒక సృజనాత్మక శక్తి కలుగుతుంది. అదే యథార్థం, అదే దైవం; దీనిని గురించి ఊహాగానాలు చేసి ప్రయోజనం లేదు, దీనిని గురించి ధ్యానం చేసీ ప్రయోజనం లేదు. ధ్యానం అభ్యాసం చేయడం ద్వారా కాని, 'మరింత' కోసం ప్రార్థనలు సలపడం ద్వారా కాని, 'మరింత' నుండి తప్పించుకొని పారిపోవడం ద్వారా కాని మీరు దీనిని ఏనాటికీ పొందలేరు. మీ మనసు యొక్క స్థితిగతులను, ప్రతిరోజూ క్షణక్షణమూ మీలో పుట్టుకొని వచ్చే కార్పణ్యం, అసూయ, యింకా యితర సంకీర్ణమయిన ప్రతిచర్యలను అవగాహన చేసుకున్నప్పుడే ఆ యథార్థం ఆవిర్భవిస్తుంది. ఈ విషయాలన్నీ అవగాహన చేసుకోవడంలో కలిగే ఒక స్థితిని

ప్రేమ అని అనవచ్చేమో! ఆ ప్రేమభావమే ప్రజ్ఞ అంటే వివేకం అంటే; అదే కాలరహితమయిన, కాలంతో సంబంధంలేని ఒక సృజనాత్మక శీలత్వాన్ని కలిగిస్తుంది.

ప్రశ్న: ఒకరిపై మరొకరం ఆధారపడి వుండటం అనే పునాది కలది సమాజం. వైద్యుడు రైతుమీద ఆధారపడతాడు, రైతు మళ్ళీ వైద్యునిమీద ఆధారపడతాడు; అటువంటప్పుడు మనిషి పూర్తిగా సర్వస్వతంత్రుడుగా ఎట్లా వుండగలుగుతాడు?

కృష్ణమూర్తి: జీవితం అంటేనే పరస్పర సంబంధాలు. చివరకు 'సన్యాసి'కి కూడా యితరులతో పరస్పర సంబంధాలు వుంటాయి; అతను ప్రపంచాన్ని త్యజించవచ్చుగాక! అయినా, ప్రపంచంతో సంబంధం వుంటూనే వుంటుంది. పరస్పర సంబంధాల నుండి మనం తప్పించుకొని పోలేము. మనలో చాలామందికి సంఘర్షణలు ఉత్పన్నమయ్యే మూలకేంద్రమే యీ పరస్పర సంబంధం. పరస్పర సంబంధంలో భయం వుంటుంది; ఎందుకంటే, మానసికంగా మనం మరొకరిపై, అంటే భర్తపైనో, భార్యపైనో, తల్లి లేదా తండ్రిపైనో, లేదా స్నేహితుడిపైనో ఆధారపడతాం కాబట్టి. ఒక వ్యక్తికీ అతని తల్లితండ్రులకి మధ్యనే కాకుండా, ఒక వ్యక్తికీ అతని సంతానానికీ మధ్యనే కాకుండా యీ పరస్పర సంబంధం అనేది వ్యక్తికి అధ్యాపకుడితోనూ, వంటవాడితోనూ, నవుకరుతోనూ, గవర్నరుతోనూ, కమాండరు (సేనాధిపతి)తోనూ, యింకా సమాజం అంతటితోనూ కూడా వుంటుంది; యీ అన్యోన్య సంబంధాన్ని మనం అవగాహన చేసుకోనంతవరకు భయం, దోపిడీ తత్వాలను వృద్ధిచేసే మానసిక పరాధీనత్వం నుండి విముక్తి వుండదు. విముక్తి వివేకం ద్వారా మాత్రమే కలుగుతుంది. వివేకం లేకుండా పరస్పర సంబంధాల నుండి స్వాతంత్ర్యం లేక విముక్తి కావాలని కోరుకోవడం ఎండమావి కోసం పరుగులు పెట్టడం వంటిది.

కాబట్టి, పరస్పర సంబంధాలలో వుండే మన మానసిక పరాధీనత్వాన్ని అవగాహన చేసుకోవడం ముఖ్యమైన సంగతి. హృదయంలోను, మనసులోను దాగివున్న విషయాలను వెలికి తీయడంలో, మన ఒంటరితనాన్ని, మనలోని ఖాళీతనాన్ని అవగాహన చేసుకోవడంలో విముక్తి వున్నది. అయితే, విముక్తి కలిగేది సంబంధ బాంధవ్యాల నుండి కాదు; సంఘర్షణ, దుర్భరవేదన, బాధ, భయాలకు కారణమయిన మానసిక పరాధీనత్వం నుండి విముక్తి కలుగుతుంది.

ప్రశ్న: సత్యం మనకు ఎందుకు రుచించదు?

కృష్ణమూర్తి: నేను చాలా అందంగా వున్నానని నేను అనుకుంటూ వుంటాను; నేను అందంగా లేనని మీరు అంటారు; అదే నిజానికి వాస్తవం కావచ్చు. అయితే, నాకు ఆ మాట రుచిస్తుందా? చాలా చాతుర్యం కలవాడినని, చాలా తెలివయిన వాడినని నేను అనుకుంటాను; అదే నిజానికి వాస్తవం కావచ్చు. అయితే నాకు ఆ మాట రుచిస్తుందా? చాలా చాతుర్యం కలవాడినని, చాలా తెలివయిన వాడినని నేను అనుకుంటాను; మీరేమో నేను వట్టి వెర్రిబాగులవాడినని అంటారు; అప్పుడది నాకు రుచించదు, చాలా వెగటుగా అనిపిస్తుంది. ఇక మీకు – నా మూర్ఖత్వాన్ని

ఎత్తి చూపడంలో మీకు ఒక విధమయిన తృప్తి, సుఖం కలుగుతాయి, అవును కదూ? మీ అతిశయాన్ని యిది కాస్త ఎగదోస్తుంది; మీరు ఎంత చాతుర్యం కలవారో చూపిస్తుంది. కాని, మీకు మీలోని మూర్ఖత్వం కేసి మాత్రం సూటిగా చూడటం యిష్టం వుండదు. మీరు వున్న స్థితి నుంచి మీరు తప్పించుకొని పారిపోవాలని చూస్తారు; మీనుంచి మీరే దాగివుందామని చూస్తారు; మీ లోపలి ఖాళీతనాన్ని, ఒంటరితనాన్ని మూసివుంచాలని చూస్తారు. కనుక, మీరు నిజంగా ఎటువంటివారో ఏమిటో అది ఎన్నటికీ పైకి చెప్పని స్నేహితుల కోసం వెతుక్కుంటారు. ఇతరులు అసలు ఏమిటో అది వారికి, అంటే ఆ యితరులకు తెలియజెప్పాలని మీరు కోరుకుంటారు; అయితే ఆ యితరులు మీరు ఏమిటో అది తెలియజెప్పితే మీకు అది యిష్టం వుండదు, మీకు రుచించదు. మీ లోపలి స్వభావాన్ని బహిరంగపరచేది ఏదయినా దానినుండి మీరు తప్పించుకొని పారిపోవాలని చూస్తారు.

**ప్రశ్న: ఇప్పటివరకు అధ్యాపకులు ఏ సందిగ్ధత లేకుండా, అలవాటుగా వస్తున్న తీరులో బోధిస్తూ వచ్చారు; అయితే యిక్కడి ప్రసంగాలు విన్న తరువాత, యిక్కడ జరిగిన చర్చల్లో పాల్గొన్న తరువాత వారిలో ఒక సందిగ్ధత చోటుచేసుకున్నది. ఇటువంటి పరిస్థితులలో ఎట్లా ప్రవర్తించాలో తెలివిగల విద్యార్థికి తెలుసును; కాని అటువంటి తెలివితేటలు లేని విద్యార్థులు ఏం చేయాలి?**

కృష్ణమూర్తి: టీచర్లు దేనిని గురించి సందిగ్ధతతో వున్నారు? ఏం బోధించాలి అనే విషయంలో కాదు కదా? ఎందుకంటే గణితం, భూగోళం, మిగిలిన పాఠ్యాంశాలు అన్నీ సాధారణంగానే, మునుపటి లాగానే కొనసాగిస్తూ వుండవచ్చును. వాళ్ళ సందిగ్ధత వీటిని గురించి కాదు. విద్యార్థితో ఎట్లా వ్యవహరించాలనే విషయంలోనే వారి సందిగ్ధత, అంతే కాదూ? విద్యార్థికీ తమకూ గల పరస్పర సంబంధాలలో వారిక సందిగ్ధం, అనిశ్చితత్వం. కొద్ది కాలం క్రితం వరకు, వారు ఎప్పుడూ విద్యార్థితో తమకు గల సంబంధ బాంధవ్యాలను గురించి ప్రత్యేకంగా పట్టించుకోనేలేదు; వాళ్ళు చేసేదల్లా వూరికే తరగతికి రావడం, బోధించడం, వెళ్ళిపోవడం. అయితే, యిప్పుడు తాము ఒకవేళ విద్యార్థిని విధేయంగా వుంచడానికి అధికారం ఉపయోగించడం ద్వారా అతనిలో భయాన్ని సృష్టిస్తున్నామా అన్న విషయం గురించి ఆందోళన పడుతున్నారు. విద్యార్థిని తాము అణచివేస్తున్నామా, అతని అంతఃస్ఫూర్తిని ప్రోత్సహిస్తున్నామా, లేదా, అతనికి సరిపోయే వృత్తివ్యాపకం యేదో తెలుసుకోవడానికి తోడ్పడుతున్నామా లేదా అనీ కళవళపడుతున్నారు. సహజంగానే యివన్నీ కలసి వారిలో ఒక సందిగ్ధతను కలిగిస్తున్నాయి. అయితే టీచరులో కాని, విద్యార్థిలో కాని సందిగ్ధత అనేది తప్పనిసరిగా వుండవలసిందే; అతను అంటే టీచరు కూడా తరచి చూడవలసిందే, అన్వేషించవలసిందే. మొదటి నుండి చివరి వరకు జీవితం అనే సంపూర్ణ ప్రక్రియ అంటే యిదే, అవును కదూ? – ఏ ఒక్కచోటా ఆగి, "నాకు తెలుసు" అని అనడం కానేకాదు.

ప్రజ్ఞావంతుడు అయిన వ్యక్తి ఎప్పుడూ చలనం లేకుండా నిలిచిపోడు, "నాకు తెలుసు" అని ఎన్నడూ అనడు. అతను ఎప్పుడూ తరచిచూస్తూ, ఎప్పుడూ సందిగ్ధతతో, ఎప్పుడూ పరిశీలిస్తూ, అన్వేషిస్తూ, తెలుసుకుంటూ వుంటాడు. "నాకు తెలుసు" అని ఏ క్షణంలో అంటాడో ఆ క్షణంలోనే అతడు నిర్జీవుడయిపోయినట్లే లెక్క. మనలో చాలామందిమి, చిన్నవాళ్ళమయినా సరే, పెద్దవాళ్ళమయినా సరే, సంప్రదాయం, నిర్బంధం, భయం కారణంగా, అధికార యంత్రాంగం కారణంగా, మన మతంలోని అర్థంలేని అవకతవకల కారణంగా – యిప్పటికే జీవచైతన్యం లేని, జవసత్వాలు లేని, స్వావలంబనం లేని నిర్జీవులుగా అయిపోయాము. కాబట్టి అధ్యాపకుడు కూడా తెలుసుకొని తీరాలి. తనలోవున్న అధికార యంత్రాంగతత్వపు లక్షణాలను తానే స్వయంగా తెలుసుకోవాలి; యితరుల మనసులను నిర్జీవం చేయడమూ మానుకోవాలి; యిది చాలా కఠినమైన ప్రక్రియ. దీనికి అపారమైన సహనంతో కూడిన అవగాహన అవసరం అవుతుంది.

కనుక తెలివిగల విద్యార్థి అధ్యాపకునికి సహాయం చేయాలి; టీచరు కూడా విద్యార్థికి తోడ్పడాలి. వీరిద్దరూ అంతగా తెలివితేటలు లేని, మందకొడిగా వున్న బాలుడు లేదా బాలికకు సహాయం అందించాలి. అన్యోన్య సంబంధం అంటే అదీ. నిజానికి టీచరు తానే స్వయంగా సందిగ్ధతతో వున్నప్పుడు, తరచి చూస్తూ వున్నప్పుడు, ఆయన తప్పకుండా మరింత ఓర్పుగా, మరింతగా ముందు వెనుకలు ఆలోచిస్తూ, మరింత సహనంతో, ఆపేక్షతో మందకొడిగావున్న విద్యార్థిని చూసుకుంటాడు; ఆ విధంగా విద్యార్థిలో వివేకాన్ని మేలుకొల్పుతాడు.

**ప్రశ్న: రైతు తన శారీరక బాధలకు చికిత్సకోసం వైద్యుడిమీద ఆధారపడతాడు. ఇదికూడా పరాధీనమయిన సంబంధం కిందకు వస్తుందా?**

**కృష్ణమూర్తి:** ఇప్పటివరకు మనం పరిశీలించిన దాని ప్రకారం నేను మానసికంగా మీపైన అధారపడితే మీతో నా సంబంధం భయం అనే పునాదితో నిర్మించబడిందని అర్థం; భయం అనేది వున్నంతవరకు పరస్పర సంబంధాలలో పరాధీనత వుంటుంది, స్వాతంత్ర్యం వుండదు. భయంనుండి మనసును విముక్తం చేయడం అనే సమస్య చాలా జటిలమైనది.

చూడండి, యీ ప్రశ్నలన్నింటికి ఒకరు ఏం సమాధానాలు చెప్పారు అన్నది ప్రధానం కాదు; మీరు స్వయంగా నిరంతరమయిన విచారణ శీలత్వంతో, ఒక విషయంలోని సత్యం ఏమిటి అనేది తెలుసుకోవడం ప్రధానం. అంటే – ఒక నమ్మకంలో గాని, ఒక తాత్త్విక ధోరణిలో గాని చిక్కుకొని పోకుండా వుండటం. నిరంతరమయిన విచారణశీలత్వమే అంతఃస్ఫూర్తిని కలుగజేస్తుంది, వివేకాన్ని మేలుకొల్పుతుంది. కేవలం ఒక సమాధానంతో సంతృప్తి చెందడం అనేది మనసును మందకొడిగా తయారుచేస్తుంది. కాబట్టి వూరికే అంగీకరించడం కాకుండా, ఎల్లప్పుడూ లోతుగా తరచి చూస్తూ, విచారణ చేస్తూ, జీవితం అంటే సంపూర్ణమయిన అర్థం ఏమిటి అనేదానిని మీరే స్వయంగా, స్వేచ్ఛగా కనిపెట్టడం చాలా ముఖ్యమయిన విషయం.

# అధ్యాయం 1

**మీకు** అసలు చదువు ఎందుకు నేర్పిస్తున్నారా అని నేను ఆలోచిస్తూ వున్నాను. మీకు తెలుసా చదువు ఎందుకోసమో? మీకు తగినంత వయసు రాగానే మీ తల్లితండ్రులు మిమ్మల్ని స్కూలుకు పంపుతారు. మిమ్మల్ని స్కూలుకు ఎందుకు పంపుతున్నారో బహుశ వాళ్ళకు తెలిసి వుంటుంది; కాని మీరు స్కూలుకు ఎందుకు వస్తున్నారో మీకు తెలుసా? మీకూ మీ తల్లితండ్రులకీ తెలిసినదల్లా ఏమిటంటే మీరు స్కూలుకి వెళ్ళితీరాలి, విద్యని అభ్యసించాలి అని, అంతే!

సరే, విద్యని అభ్యసించడం అంటే అర్థం ఏమిటి? మీరు ఎప్పుడయినా అది ఆలోచించారా? దాని అర్థం ఏదో విధంగా పరీక్షలు పాసు అయి, ఆ తరువాత పెళ్ళి చేసుకొని, ఏదో ఒక ఉద్యోగం సంపాదించుకొని, ఆ ఉద్యోగం మీకు నచ్చినా సరే, నచ్చకపోయినా సరే, ఆ ఉద్యోగంలోనే జీవితాంతం కొనసాగుతూ వుండటమేనా? అదేనా విద్యాధ్యయనం అంటే?

మీరు రకరకాల స్కూళ్ళలో చదువుకుంటారు, విద్యని అభ్యసిస్తారు, అంటే గణితం, చరిత్ర, భూగోళ శాస్త్రం, విజ్ఞాన శాస్త్రం మొదలయినవి నేర్చుకుంటారు, ఎందుకు? మీరు ఎప్పుడయినా ప్రశ్నించుకున్నారా? ఆ తరువాత జీవనోపాధి సంపాదించుకోవడానికి మాత్రమేనా? విద్యాధ్యయనానికి వున్న ఉద్దేశం యిదేనా? విద్యాధ్యయనం అంటే కేవలం పరీక్షల్లో కృతార్థులవడం అనేదేనా, మీ పేరుకి చివరన కొన్ని అక్షరాలు తగిలించుకోవడం మాత్రమేనా, లేక అది పూర్తిగా విభిన్నమయిన మరొకటా?

మీరు మీ చుట్టూరా పరికించి చూసినట్లయితే ప్రపంచం ఎంత అసహ్యకరమయిన అవస్థలో వున్నదో గ్రహిస్తారు. తినడానికి తగినంత తిండికూడా లేకుండా, సెలవు రోజు అనేది లేకుండా, ప్రతిరోజూ పొద్దున లేచిన దగ్గిర్నుండీ రాత్రి వరకు కష్టపడి పనిచేసే పేదవారిని మీరు చూశారా? ఇంకో పక్కన మీ తల్లితండ్రులు విలాసవంతమయిన కార్లలో క్లబ్బులకు వెళ్ళి, సౌఖ్యాలు అనుభవిస్తూ వుంటారు. జీవితం అంటే అదే, అవును కదూ? పేదలూ వున్నారు, ధనికులూ వున్నారు; రోగగ్రస్తులు వున్నారు, మంచి ఆరోగ్యవంతులూ వున్నారు; ప్రపంచమంతటా యుద్ధాలు వున్నాయి, దుర్భరమైన వ్యధలున్నాయి, రకరకాలయిన కష్టాలు వున్నాయి. మీరు చిన్నవయసులో వున్నప్పుడే వీటన్నింటిని గురించి ఆలోచించడం ఆరంభించవద్దూ? కాని చూడండి, విపరీతమయిన సంఘర్షణలు, దుఃఖం, బాధలు, యుద్ధాలతో కూడివున్న, విశాలంగా పరచుకొనివున్న యీ జీవితాన్ని ఎదుర్కొనేందుకు మిమ్మల్ని సిద్ధపరచడానికి మీ స్కూళ్ళు మీకు ఏ సహాయమూ చేయడం లేదు; దీనంతటినీ గురించి మీతో

ఎవరూ మాట్లాడరు. వాళ్ళు మీకు పైపై విషయాలు మాత్రమే చెప్తారు. కాని అది సరిపోదు, సరిపోతుందా?

విద్యాధ్యయనం అంటే మిమ్మల్ని కేవలం ఒక ఉద్యోగం సంపాదించగలిగేలా తయారుచేయడం కాదని గట్టిగా చెప్పవచ్చు. మిమ్మల్ని జీవితానికై సిద్ధపరచడానికి అది మీకు తోడ్పడాలి. మీరు ఒక గుమాస్తాగా చేరవచ్చును; ఒక గవర్నరో, విజ్ఞాన శాస్త్రవేత్తో అవవచ్చును. అయితే, అసలు పరిపూర్ణమైన జీవితం అంటే అది మాత్రమే కాదు.

జీవితం అంటే అన్ని రకాలయిన విషయాలూ వుంటాయి. జీవితం మహా సముద్రం వంటిది. సముద్రం అంటే మీరు పైపైన చూసే ఉపరితలం మాత్రమే కాదు, అవునా? అది బ్రహ్మాండమయిన లోతు కలది; అందులో అసంఖ్యాకమయిన ప్రవాహాలు వుంటాయి; అనేక రకాల జీవరాశులతో అది నిండి వుంటుంది; యీ జీవకోటిలో ఎన్నో రకాల చేపలు వుంటాయి; చిన్న చేపలను తిని జీవించే పెద్ద చేపలూ వుంటాయి. ఇదంతా కలిసి సముద్రం; సంతోషాలు, బాధలు, అపూర్వమైన నూతన పరిశోధనలు, అసంఖ్యాకమైన ధ్యానసాధన విధానాలు, యింకా జనావళి అంతా ఆనందం కోసం చేసే అన్వేషణ – ఇవన్నీ కలిసినది జీవితం అవుతున్నది; కాని మీరు యిందుకు సిద్ధపడిలేరు. స్కూల్లో వున్నప్పుడు యీ విషయాలన్నింటిని గురించి మీతో ఎవరూ మాట్లాడరు. ఒక్కొక్క తరగతిలో అలవికానంతమంది బాలురు, బాలికలు వుంటారు; టీచరు ధ్యాస అంతా మీరు పరీక్షలు పాసు కావడానికి సహాయం చేయడం పైనే వుంటుంది; అతనికి మీ మనసులను సందేహ నివృత్తంగా చేయడంలో ఆసక్తి వుండదు. అయితే, విద్యాధ్యయనం అంటే మనసును సమాచారంతో కూరి నింపే ప్రక్రియ కానేకాదు. మీకు చదవడం వస్తే, ఏదో ఒక విజ్ఞాన సర్వస్వం (ఎన్‌సైక్లోపీడియా) చేజిక్కించుకొని మీకు కావలసిన సమాచారమంతా సంపాదించవచ్చు. కనుక, విద్యాధ్యయనం అంటే కేవలం కొన్ని విషయాలు నేర్చుకోవడం, కొన్ని పరీక్షల్లో ఉత్తీర్ణులవడం నుంచి పూర్తిగా విభిన్నమయినదని నేను అనుకుంటున్నాను.

చూడండి, మనం భయపడుతున్నంతవరకు, మనం విద్యావంతులం కాలేదన్నట్లే అనుకోవాలి. భయం అంటే ఏమిటో మీకు తెలుసా? మీరు భయపడుతున్నారనేది మీకు తెలుస్తుంది. చిన్న పిల్లలు భయపడుతుంటారు, పెద్దవారూ భయపడుతుంటారు, మీరంతా భయపడుతూ వుంటారు; మనం యిట్లా భయపడుతున్నంత కాలం మనం విద్యావంతులం కానట్లే, తెలివితేటలు లేనట్లే. విద్యాధ్యయనం అంటే కేవలం మనసుని సమాచారంతో కూరి నింపడం మాత్రమే కాదు; యీ జీవితం అనే మహా సంక్లిష్టతను భయం అనేది లేకుండా అవగాహన చేసుకోవడానికి విద్యార్థికి సహాయం చేయడం.

మీ అధ్యాపకులంటే మీరు భయపడుతూ వుంటారు; మీ తల్లిదండ్రులన్నా, మీ పెద్ద అన్నగారన్నా, మీ అత్తయ్య లేక పెద్దమ్మ లేదూ మరొకరు అంటే మీరు భయపడుతూ వుంటారు, భయపడతారు కదూ? వయసులో పెద్దవారయిన వారికి మిమ్మల్ని శిక్షించడమో, మిమ్మల్ని దూరంగా త్రోసివేయడమో, మీ గదిలోనే

వుండమని అజ్ఞాపించడమో చేసే అధికారబలం వుంటుంది; కనుక స్కూల్లోనూ, యింట్లోనూ కూడా మనం ఎప్పుడూ భయపడుతూ వుండే విధంగా శిక్షణ యిస్తారు. మన జీవితాలను భయమే రూపుదిద్దుతూ వుంటుంది. పసితనం నుండి చనిపోయేవరకు మనం భయపడుతూనే వుంటాం. భయం అనేది ఏం చేస్తుందో మీకు తెలుసా? మీరు భయపడుతూ వున్నప్పుడు మిమ్మల్ని మీరు ఎప్పుడయినా పరిశీలించుకున్నారా? మీ పొత్తికడుపు గట్టిగా అవడమూ, చెమటలు పోయడం, పీడకలలు రావడం గమనించారా? మీకు ఎవరంటే భయమో, ఆ మనుష్యులతో వుండాలంటే మీకు యిష్టం వుండదు, అవును కదూ? బెదిరిపోయిన జంతువులాగా తప్పించుకొని పారిపోవాలని మీరు చూస్తారు. చూడండి, అటువంటి భయంతో మనం స్కూలుకి, కాలేజికి వెళతాం; అటువంటి భయంతోనే కాలేజిని వదిలి, మనం జీవితం అని పిలిచే యీ అద్భుతమైన విషయాన్ని, యీ బ్రహ్మాండమయిన లోతుగల విశాలమయిన ప్రవాహాన్ని ఎదుర్కొంటాం. కనుక, నాకు ఏమనిపిస్తుందంటే, విద్యావిధానంలో అత్యంత ప్రాముఖ్యం యివ్వలవసినది ఏమిటంటే, భయాన్నుండి విముక్తి పొందడానికి మన విద్యాధ్యయనం జరిగేటట్లుగా చూడటం; ఎందుకంటే, భయం మన మనసులను మందకొడిగా తయారు చేస్తుంది; మన ఆలోచనా విధానాన్ని అవకరం చేస్తుంది; భయం అంధకారాన్ని తయారుచేస్తుంది; మనం భయపడినంతకాలం ఒక నూతన ప్రపంచాన్ని మనం సృష్టించలేము. నేను మాట్లాడేది మీకు అవగాహన అవుతున్నదా, లేదూ యిదంతా మీరు యింతకు మునుపు ఎన్నడూ వినని సంగతి అని అనిపిస్తున్నదా?

మీకు తెలుసా, మీ కుటుంబానికి అవతలగా వున్న ప్రపంచంలో, మీ యింటికి బయట వున్న ప్రపంచంలో, బొంబాయికంటే ఆవలగా వున్న ప్రపంచంలో, యూరపులో, అమెరికాలో, రష్యాలో బ్రహ్మాండమైన మారణాయుధాలు సిద్ధపరుస్తున్నారని. ప్రపంచం ఒక భయంకరమైన దశగుండా ప్రయాణిస్తున్నది; రాజకీయవేత్తలందరూ, నాయకులందరూ తికమకపడుతున్నారు; అయినా మేము అట్లా ఏమీ తికమకపడటం లేదు అని అంటున్నారు; యీ యుద్ధాలు ఎప్పుడూ వుండేవే, ఏదో ఒక రకమయిన విపత్తు ఎప్పుడూ వుంటూనే వుంటుంది అని వాళ్ళు అంటున్నారు. కనుక ప్రస్తుతం ప్రపంచం సౌందర్యమయమైనది ఏమీ కాదు, నివసించడానికి సౌఖ్యమైన ప్రదేశమూ కాదు; చాలా చిన్నవయసులో వున్న మీకు సవ్యమైన తీరులో కనుక విద్య గరుపకపోతే, సహజంగానే మీరు కూడా యింత బాధామయంగా, యింత వ్యథాపూరితంగా, యింత గందరగోళంగా వున్న ప్రపంచాన్నే మళ్ళీ సృష్టిస్తారు. కాబట్టి సంపూర్ణంగా విభిన్నమయిన మరో ప్రపంచాన్ని – మనమందరం సంతోషంగా కలిసి మెలసి నివసించే ఒక ప్రపంచాన్ని; ధనికులూ, పేదలూ అనేవారు లేని ప్రపంచాన్ని; అధికారబలం, అంతస్థు, ఆకర్షణశక్తి అన్నీ చేజిక్కించుకున్న రాజకీయవేత్తలు కానీ, చనిపోయేవరకు క్షణం తీరుబడి లేకుండా కష్టపడి పనిచేస్తున్నా జీవితంలో ఏ ఆశాలేని దౌర్భాగ్యులు కానీ లేని ఒక ప్రపంచాన్ని – మీరు సృష్టించాలంటే మీ విద్యాధ్యయనం ఏవిధంగా వుండాలో తెలుసుకోవడం చాలా ప్రధానమయిన విషయం కాదూ?

ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించవలసినది మీరే, పెద్దవాళ్ళు కాదు; ఎందుకంటే పెద్దవాళ్ళు యీ ప్రపంచాన్ని అస్తవ్యస్తంగా చేసి పెడుతున్నారు. మీరు సవ్యమైన తీరులో విద్యాధ్యయనం చేస్తే మీరే ఒక నూతన లోకాన్ని సృష్టించగలుగుతారు. ఇది మీ చేతులలోనే వుంది తప్ప, రాజకీయ వేత్తల, మతాచార్యుల చేతులలో లేదు. మీరు సవ్యమైన విద్యాధ్యయనం చేస్తే ఒక రమణీయమయిన ప్రపంచాన్ని సృష్టించగలుగుతారు – యిండియా అనే ప్రపంచం, యూరప్ అనే ప్రపంచం కాదు, మన అందరికీ చెందిన ప్రపంచం, మీకూ, నాకూ; మనమందరం కలిసిమెలసి సంతోషంగా నివసించే ప్రపంచం. అటువంటి ప్రపంచాన్ని సృష్టించడమనేది మీమీదే ఆధారపడివున్నది, మరెవ్వరిమీదా కాదు అని నేను మీకు రూఢిగా చెప్తున్నాను; అందువల్లనే మీరు ఏ విధంగా విద్యాధ్యయనం చేయాలి, ఎటువంటి రకమయిన టీచర్లు మీకు వుండాలి అనేవి చాలా ప్రధానమయిన విషయాలు; టీచరు కనుక భయపడుతూ వుంటే, అతని విద్యార్థులు కూడా భయపడేవారుగానే తయారవుతారు. టీచరు కనుక సంకుచితంగా, అల్పంగా, చిన్న మనసుతో వుండి, కేవలం సమాచారాన్ని మాత్రమే మీకు అందజేస్తూ వుంటే,-అప్పుడు మీరు కూడా చాలా చిన్నవైన, కుంచించుకుపోయిన మనసులతో తయారై, జీవితం అంటే ఏమిటి అనే అవగాహన లేకుండానే పెరిగి పెద్దవాళ్ళవుతారు.

కాబట్టి సవ్యంగా విద్యాధ్యయనం చేయడం చాలా ప్రధానమయిన సంగతి, అంటే అర్థం స్వేచ్ఛగా పెరిగి పెద్దవాళ్ళు అవడం; మీ తల్లిదండ్రులన్నా, మీ టీచర్లన్నా, ప్రజాభిప్రాయం అన్నా భయపడుతూవుంటే, మీ నాయనమ్మ ఏమంటుందో అని మీరు భయపడుతూ వుంటే మీరు స్వేచ్ఛగా వుండలేరు. భయపడుతూ వుంటే మీరు స్వేచ్ఛగా ఎన్నటికీ వుండలేరు. టీచర్లు యీ భయం అనే సమస్య సంగతి ఆలోచించనే లేదని మీరు స్కూళ్ళలో గమనించే వుంటారు; ఎందుకంటే – మీ చేత ఒక పని చేయించడానికి మంచితనం అని అంటుంటారే దాని ద్వారా కాని, క్రమశిక్షణా విధానం ద్వారా గానీ, ఏదో ఒక రూపంలో మిమ్మల్ని నిర్బంధపెట్టిన మరుక్షణంలోనే – వెంటనే అది భయాన్ని సృష్టిస్తుంది. నేనే ఒక టీచరుని అనుకోండి, మీ చేత బాగా చదివించాలని మిమ్మల్ని మరో విద్యార్థితో పోల్చిచూస్తాను, ఆ మరొక బాలికకు లేదా బాలునికి వున్నంత తెలివితేటలు మీకు లేవు అని అంటాను, ఆ విధంగా మిమ్మల్ని పూర్తిగా నాశనం చేస్తున్నాను, చేస్తున్నాను కాదూ? ప్రస్తుతం మన స్కూళ్ళలో మనకు పరీక్షలు వున్నాయి; వాటిలోనే భయం అనేది పుట్టి పెరుగుతుంది; మనకు గ్రేడుల విధానం కూడా వున్నది, అంటే అర్థం విద్యార్థిని ప్రతిసారీ మరొక విద్యార్థితో పోల్చి చూడటం అన్నమాట; అందువల్ల చాతుర్యం వున్న బాలికకు లేదా బాలునికి బాగా ప్రాముఖ్యం వుంటుంది తప్ప, ఒక వ్యక్తిగా విద్యార్థికి కాదు. చదువులో బాగా చురుకుగా వుండే విద్యార్థి, పరీక్షలు ఉత్తీర్ణమవడంలో ప్రత్యేకమయిన కుశలత వున్న విద్యార్థి తక్కిన విషయాల్లో ఒకవేళ మూర్ఖుడిలాగా వుండవచ్చు, బహుశ నిజంగానే మూర్ఖుడయి వుండవచ్చు కూడా.

మార్కులు యివ్వడం, గ్రేడులు చేయడం, పోల్చి చూడటం, మంచితనం ద్వారాకానీ, బెదిరింపు ద్వారాగానీ ఏదో రకంగా నిర్బంధాలు పెట్టడం – భయానికి

ఆలవాలమవుతాయి; చిన్నతనంలో యిటువంటి భయంలో చిక్కుకొని పోవడం వల్లనే తక్కిన జీవితమంతా కూడా భయంతోనే ప్రయాసపడుతుంటాం. పెద్దవారు జీవితం ఎడల తమకు వున్న వైఖరిని అనుసరించి ఒక రకమైన విద్యావిధానాన్ని తయారుచేస్తారు; యిది పాత పద్ధతికి చేసిన పునరుద్ధరింపే, అందువలన నూతన జీవన విధానం అనేది వుండటం లేదు. ఈ కారణం వల్లనే యింకా చిన్నవయసులో వున్నప్పుడే యీ విషయాలన్నీ మీరు ఆలోచించడం చాలా ముఖ్యం అని నేను భావిస్తున్నాను. నేను చెప్పేది మీకు అర్థం అవకపోతే దీనిని గురించి మీ టీచర్లను అడగండి. వారు అనుమతించినట్లయితే – యీ విషయాలను గురించి ఆలోచించడానికి – ఆపైన మీరు నిజంగా యీ భయంనుండి విముక్తి చెందగలరేమో చూడండి. భయం అనేది లేనప్పుడు మీరు యింకా బాగా చదవగలరు. మీరు ఫలానాది చేసి తీరాలని మిమ్మల్ని నిర్బంధించడం లేదని మీరు భావించినప్పుడు, మీకు నిజంగా ఎందులో ఆసక్తి వున్నదో మీరు తెలుసుకుంటారు; ఆపైన మీ తక్కిన జీవితమంతా మీకు నిజంగా చాలా ప్రీతికరమైన పనినే మీరు చేస్తుంటారు; ఒక ఉద్యోగం చేసి తీరాలి అని అనుకుంటూ మీరు ఒక దుర్భరమైన గుమాస్తాగా అవడం కంటే యిది ఎంతో మేలు. మీ తల్లితండ్రులు తప్పక చేయమన్నారు కాబట్టి, లేదూ సమాజం విధించింది కాబట్టి ఒక పనిని చేయడం అనేది వట్టి పిచ్చితనం; ఒక పనిని మీ చేతులతో, మీ మనసుతో చేరడం మీకు నిజంగా ప్రీతిపాత్రమైనది అయితే ఆ ప్రేమభావం ద్వారానే మీరు ఒక నూతన ప్రపంచాన్ని సృష్టిస్తారు. అయితే, మీరు భయపడుతూవుంటే మాత్రం 'నూతన ప్రపంచాన్ని' తయారు చేయలేరు, అందువలన చిన్నవయసులో వున్నప్పుడే మీలో ఒక తిరుగుబాటు తత్త్వం వుండాలి.

తిరుగుబాటు అంటే మీకు అర్థం అవుతున్నదా? మీరు బాల్యం నుండి ప్రాయంలోకి ఎదుగుతున్నప్పుడు, తల్లితండ్రుల రూపంలో, టీచర్లు, సంప్రదాయం, యిరుగుపొరుగువారు, మీరు పెరిగిన సంస్కృతి, సమాజం మొదలయిన రూపాల్లో జీవితం మిమ్మల్ని నొక్కి అణచి వుంచుతూ వుంటుంది; యిదంతా మిమ్మల్ని ఒక చెరసాల లాగా బంధిస్తుంది, 'అది' కోరినది మీరు చేయాలని నిర్బంధిస్తుంది, అందువల్ల మీరు మీరుగా ఎప్పటికీ వుండలేకపోతారు. మీరు స్వేచ్ఛగా వుండటానికి, అందువలన భయం లేకుండా ఆలోచించుకోవడానికి, జీవించడానికి, తద్వారా మీరే స్వయంగా ప్రేమభావం అంటే ఏమిటో తెలుసుకోవడానికి విద్యావిధానం మీకు తోడ్పడటం చాలా ముఖ్యం కదూ? మీ తల్లితండ్రులు మిమ్మల్ని నిజంగా ప్రేమిస్తూ వుంటే, వారు యీ విధమైన విద్యావిధానాన్ని అమలులోకి తీసుకొని వస్తారు, మీరు స్వేచ్ఛగా వుండేటట్లు చూస్తారు; భయం లేకుండా జీవించడానికి, ఎదగడానికి స్వేచ్ఛ, సంతోషంగా వుండటానికి స్వేచ్ఛ వుండేటట్లు చూస్తారు. అయితే ప్రపంచంలో అటువంటి తల్లితండ్రులు చాలా కొద్దిమందే వున్నారు; ఎందుకంటే, చాలామంది తల్లితండ్రులు పిల్లలు యిది చేయాలి, అది చేయకూడదు అనీ, వాళ్ళ తల్లితండ్రుల మాదిరిగానే వాళ్ళూ అయితీరాలి అని, లాయరుగానో, పోలీసో, వ్యాపారస్థుడో అట్లా ఏదో ఒకటి అయితీరాలి అనీ అంటూ వుంటారు.

ఈ సంకీర్ణమయిన సమస్యలన్నింటిని అర్థం చేసుకోవడం నిజంగానే చాలా కష్టం. తెలివి వున్నప్పుడే మనం ఎదుగుతున్నకొద్దీ వీటిని మనం అవగాహన చేసుకోగలుగుతాం. మనం చిన్నవయసులో వున్నప్పుడే తెలివి లేదా, ప్రజ్ఞ కలగాలి; అంటే అర్థం ముందుగా టీచరు తను స్వయంగా యిదంతా అవగాహన చేసుకోవాలి. కాని, చాలా కొద్దిమంది టీచర్లకి యిది అర్థం అవుతుంది, ఎందుకంటే, వారిలో చాలామందికి విద్యాబోధన కేవలం ఒక ఉద్యోగం మాత్రమే. ఇంకా ఎక్కువ డబ్బు సంపాదించే ఉద్యోగం ఏదీ వారికి దొరక్కపోవడం వల్ల, "టీచరు వృత్తి చాలా గొప్పది" అని అంటుంటారు. అంటే, మిమ్మల్ని విద్యావంతుల్ని చేయడంలో కానీ, అసలు విద్యాబోధనలోనే కానీ వారికి ఆసక్తి లేనేలేదని అర్థం.

కాబట్టి, మీరు బాల్యంలో వున్నప్పుడే అంటే చిన్న బాలుడుగానో, బాలికగానో వున్నప్పుడే, యిందులోని సత్యాన్ని తెలుసుకోవాలి, పెంపుడు జంతువు మాదిరి సాధువుగా వుండటానికి వీల్లేదు. నేను మాట్లాడేది మీకు అర్థం అవుతున్నదని ఆశిస్తాను, ఎందుకంటే, యిదంతా చాలా క్లిష్టమయిన విషయం, దీనిని గురించి మీకు మీరుగా చాలా ఆలోచించడం అవసరమయిన విషయం యిది. ప్రపంచం ఛిన్నాభిన్నం అయి పోతున్నది, ముక్క చెక్కలయిపోతున్నది, యుద్ధాలు జరుగుతున్నాయి, ఆకలి బాధలు, ఘోర వేదనలు వున్నాయి; ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించడం మీ చేతులలో వుంది. అయితే, మీలో కనుక తిరుగుబాటు తత్త్వం అనేది లేకపోతే మీరు ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించలేరు; మీలో కనుక ప్రజ్ఞని అవకరం చేసే భయం వున్నట్లయితే మీలో యీ తిరుగుబాటు తత్త్వం కలగలేదు.

**ప్రశ్న: నేను సంతోషంగా వుండటానికి కావలసినవన్నీ నాకు వున్నాయి, అయితే యితరులకు అవి లేవు. ఎందువలన యిట్లా వుంది?**

**కృష్ణమూర్తి:** ఎందువల్ల యిట్లా వున్నదని మీరు అనుకుంటున్నారు? మీకు మంచి ఆరోగ్యం, దయగల తల్లితండ్రులు, తెలివయిన మెదడు వుండవచ్చు, అందుకని మీరు సంతోషంగా వున్నారని అనుకుంటున్నారు; అందుకు విరుద్ధంగా మరొకరు అనారోగ్యం, దయావిహీనులైన తల్లితండ్రులు, తెలివితేటలు లేని మెదడు వున్నవారు చాలా దుఃఖంలో వున్నామని అనుకోవచ్చు. సరే, యిది యిట్లా ఎందుకు వున్నది? మరొకరు విచారంగా వుండటమూ, మీరు సంతోషంగా వుండటమూ ఎందువల్ల? సంతోషం అంటే సంపద, కార్లు, మంచి యిళ్ళు, శుభ్రమైన ఆహారం, దయగల తల్లితండ్రులు కలిగివుండటమేనా? అదేనా మీరు సంతోషంగా వుండటం అని అంటూ వుండేది? ఇవన్నీ లేని వ్యక్తి విచారంగా, బాధపడుతూ వున్నట్లేనా? కనుక సంతోషం అంటే మీ అర్థం ఏమిటి? ఈ విషయం తెలుసుకోవడం చాలా ముఖ్యం; అవును కదూ? సంతోషం అనేది పోల్చి చూడటంలో వుంటుందా? నేను మాట్లాడుతున్నది మీకు అర్థం అవుతున్నదా, లేదూ యిది చాలా క్లిష్టంగా అనిపిస్తున్నదా?

"ఫలానా వారు మనంత భాగ్యవంతులు కారు" అని మీ తల్లితండ్రులు అనడం మీరు వినలేదూ? పోల్చి చూడటం వలన మనకు ఏదో వున్నది, అనే భావం మనలో కలుగుతుంది, అది ఒక సంతృప్తి చెందిన భావాన్ని మనకు యిస్తుంది, యివ్వదూ? ఒక వ్యక్తి చాతుర్యం కలిగి వుంటే, అంతగా చాతుర్యంలేని మరొకరితో తనని పోల్చిచూసుకొని, ఆ వ్యక్తి చాలా సంతోషిస్తాడు. అంటే గర్వంగా భావించడం ద్వారా, పోల్చి చూసుకోవడం ద్వారా మనం చాలా సంతోషంగా వున్నామని మనం అనుకుంటాం; అయితే తనకంటే కాస్త తక్కువగా కలిగివున్న వ్యక్తితో తనను పోల్చుకొని సంతోషపడే వ్యక్తి మనుష్యుల్లో కల్లా మహా దౌర్భాగ్యుడు; ఎందుకంటే అతని కంటె ఎక్కువ కలిగివుండి, పై మెట్టులో వున్నవారు ఎవరో ఒకరు ఎప్పుడూ వుంటూనే వుంటారు. ఇది యిట్లాగే వుంటూ వుంటుంది. పోల్చి చూడటం వల్ల కలిగేది సంతోషం కాదని గట్టిగా చెప్పచ్చు. సంతోషం అనేది దీనికి పూర్తిగా విభిన్నమయినది; దానిని వెతికి పట్టుకోవడానికి అది ఒక వస్తువుకాదు. మీరు ఏదయినా ఒక పనిని – ఆ పని చేయడం అంటే మీకు నిజంగా ప్రేమ కాబట్టి – చేస్తూ వుంటే, సంతోషం కలుగుతుంది. అంతే తప్ప, మీకు సంపద లభిస్తుందని, మిమ్మల్ని ఒక ప్రముఖ వ్యక్తిగా తీర్చిదిద్దుతుందని ఆ పనిని చేసినందువల్ల సంతోషం లభించదు.

## ప్రశ్న: మనలో వుండే భయాన్ని పోగొట్టుకోవాలంటే ఏది మార్గం?

కృష్ణమూర్తి: మొట్టమొదట మీరు దేనిని గురించి భయపడుతున్నారో ఆ సంగతి తెలుసుకోవాలి, తెలుసుకొని తీరాలి కదూ? మీకు మీ తల్లితండ్రులంటే భయం వుండవచ్చు, టీచర్లంటే భయం; పరీక్షల్లో ఉత్తీర్ణత పొందలేమనే భయమో, మీ చెల్లెలు, అన్న లేదూ మీ పొరుగువారు ఏమంటారో అనే భయమో వుండవచ్చు; చాలా గొప్ప పేరున్న మీ తండ్రి అంత మంచివాడిలాగా, అంత చాతుర్యం కలిగి మీరు లేరేమో అనే భయం మీకు వుండవచ్చు. ఎన్నో రకాల భయాలు వున్నాయి, ఒక వ్యక్తి దేనిని గురించి భయపడుతున్నాడో అది ఏమిటి అనేది అతడు తెలుసుకోవాలి.

సరే, మీరు దేనిని గురించి భయపడుతున్నారో మీకు తెలుసా? అది మీకు తెలిస్తే, ఆ భయం నుండి మీరు పారిపోవాలని చూడకండి, ఎందుకు మీరు భయపడుతున్నారో తెలుసుకోండి. మీ భయాన్ని ఎట్లా పోగొట్టుకోవాలో తెలుసుకోవాలనుకుంటే, దాని నుండి తప్పించుకొని పారిపోకూడదు, దానిని ఎదుర్కోవాలి; దానిని అట్లా ఎదుర్కోవడం అనేదే మీరు దానినుండి విముక్తి చెందడానికి సహాయపడుతుంది. భయంనుండి మనం పారిపోతున్నంతవరకు, మనం దానివైపు సూటిగా చూడలేం; మనం ఆగి భయంవైపు తేరిపార చూస్తున్న మరుక్షణమే ఆ భయం కరిగిపోవడం ఆరంభిస్తుంది.

మీలో ఎన్నో లెక్కలేనన్ని ప్రశ్నలు పుట్టుకొస్తూ వుండవచ్చు, కాని అడగడానికి మీరు మొహమాటపడుతున్నారేమో. నేను మిమ్మల్ని ఒక ప్రశ్న అడగవచ్చునా?

మీరు పెరిగి పెద్దవాళ్ళయాక ఏం చేయాలనుకుంటున్నారు? మీకు తెలుసా? ఆడపిల్లల సంగతి సరే, చాలా సులభం; పెళ్ళి చేసుకోవాలనుకుంటారు, అది అందరికీ తెలిసినదే; అయితే పెళ్ళి చేసుకున్నాక అయినా మీరు ఏం చేయాలనుకుంటున్నారు? మీలో ఏవయినా ఆకాంక్షలున్నాయా? ఆకాంక్ష అంటే ఏమిటో మీకు తెలుసునా? అంటే ఏదో ఒక విషయంలో గొప్ప పేరు సంపాదించడం, అంతేకదూ? ఒక ఆదర్శాన్ని పెట్టుకొని, "నేను రాముడిలాగానో, సీతలాగానో లేదా గాంధీజీ లాగానో అవాలనుకుంటున్నాను" అని అనే వ్యక్తి కూడా ఆకాంక్షలు వున్నవాడే. ఏదో ఒక విధమయిన ఆకాంక్షపరత్వం మీలోనూ వున్నదా?

సరే, దీనికి అర్థమేమిటి? మీలో ఎందుకు ఆకాంక్షపరత్వం వున్నది? ఇది కొంచెం కఠినంగా అనిపించవచ్చు, కాని, జీవితంలోని సమస్యల్లో యిదీ ఒకటి, కాబట్టి మీరు దీనిని గురించి ఆలోచించి తీరవలసిందే. ఇది ఎందుకో నేను చెప్తాను. మన అందరిలోనూ ఆకాంక్షపరత్వం వున్నది; ప్రతివారూ ఏదో ఒక రూపంలో ఆకాంక్షను కలిగి వున్నవారే. దీనివలన ఏం జరుగుతుందో మీకు తెలుసా? దీని కారణంగా మనం ఒకరికొకరం ప్రతికూలంగా తయారవుతాం. మనం ఎప్పుడూ భాగ్యవంతులమవాలనో, కీర్తి సంపాదించాలనో, యింతకంటే చాతుర్యంగా వుండాలనో ప్రయాస పడుతూ వుంటాం; నేను మీకంటే గొప్పవాడినవాలని కోరుకుంటాను, మీరు నాకంటే గొప్పగా వుండాలని కోరుకుంటారు. కనుక ఆకాంక్ష అంటే నిజంగా ఏమిటంటే, మనం ఏది కాదో అది అవడానికి ప్రయత్నించడం అన్నమాట. ఏది అసలు ప్రధానమైన విషయం? మనం ఏది కాదో అది అవడానికి ప్రయత్నించడమా, మనం ఏమిటి అనేది అవగాహన చేసుకోవడమా? మొట్టమొదట మనవైపు మనమే సూటిగా చూసుకొని, మనం అసలు ఏమిటి అనేది అవగాహన చేసుకోవడం ఆరంభించడమే మనం తప్పక చేయవలసినది.

చూడండి, మనలో చాలా మందిమి ఆదర్శవాదులం; ఆదర్శవాదులు ఎప్పుడూ కృత్రిమ వేషధారులే అయివుంటారు. ఎందుకంటే, వాళ్ళు ఎప్పుడూ తాము ఏది కాదో అది అవాలని ప్రయత్నిస్తూ వుంటారు. నేను ఒక మూర్ఖుడిని అయివుండి, చాలా చాతుర్యం సంపాదించాలని ప్రయాసపడుతూ వుంటే అందరూ అది చాలా అద్భుతమైన విషయం అని అనుకుంటారు. అయితే మూర్ఖుడు తాను చాతుర్యం సంపాదించాలని ఎంత బాగా ఉపాయాలు నేర్చుకున్నా, ఆ విధంగా తెలివి కలవాడిగా అవడం మాత్రం జరగదు. అట్లా కాకుండా, నేను మూర్ఖుడిని అని నేను తెలుసుకుంటే, సరిగ్గా ఆ జ్ఞానమే తెలివితేటలకు ఆరంభం అవుతుంది – వట్టి చాతుర్యం సంపాదించడం కంటే యిది ఎన్నో రెట్లు నయం. మీకు అర్థం అవుతున్నదా?

నాలో త్వరగా విషయగ్రహణం చేసే శక్తి లేకపోతే సాధారణంగా ఏమవుతుంది? స్కూల్లో తరగతి గదిలోని చివరి వరుసలో నన్ను కూర్చోబెడతారు. ఇటువంటి పని చేయడం టీచరుకే తలవంపులు, ఎందుకంటే – తరగతిలో తక్కినవారు ఎంత ముఖ్యులో, నేనూ అంత ముఖ్యుడినే. నన్ను తక్కిన చాతుర్యంగల విద్యార్థులతో

పోల్చి చూసి, తరగతి గదిలో వెనుకగా కూర్చోబెట్టడం టీచరు అవివేకతను తెలుపుతుంది; ఎందుకంటే – పోల్చి చూడటం వలన నన్ను పూర్తిగా నాశనం చేసి వేసేస్తున్నారన్నమాట.

అయితే, మన విద్యావిధానం అని మనం అనుకుంటున్న దానిలోను, మన సంస్కృతి అంతటిలోనూ సామ్యాసామ్యాలు చూడటమే పునాదిగా వున్నది. ఫలానా అమ్మాయిలాగానో, ఫలానా అబ్బాయిలాగానో, మీరు కూడా అంత బాగా చదవాలి అని టీచర్లు ఎప్పుడూ అంటూ వుంటారు, అందుకని మీరూ వాళ్ళంత చాతుర్యం సంపాదించాలని ప్రయాసపడుతూ వుంటారు. అప్పుడు మీకు ఏమవుతుంది? రోజురోజుకీ మీలో చింతలు ఎక్కువవుతాయి, శరీరంలో అనారోగ్యం మొదలవుతుంది, మానసికంగా అలసిపోతారు. అట్లా కాకుండా, టీచరు కనుక మిమ్మల్ని ఎవరితోనూ పోల్చి చూడకుండా, "చూడు బాబూ, నీవు నీలాగే వుండు, నీకు ఎందులో ఆసక్తి వున్నదో, ఎందులో నీకు శక్తి సామర్థ్యాలు వున్నాయో కనిపెడదాం. ఎవరినీ అనుకరించకు, రాముడిలాగా, సీతలాగా, గాంధీజీలాగా అవాలని ప్రయత్నించకు, నీవు ఎట్లా వున్నావో అట్లాగే వుండు, అక్కడినుండే ఆరంభించు" అని అంటే – టీచరు కనుక ఆ విధంగా అంటే, అప్పుడు ముఖ్యమైనవారు మీరే, మరొకరు ఎవరో కాదు. ప్రతి వ్యక్తీ ముఖ్యుడే; విద్యార్థిని ఎక్కువ చాతుర్యంగల మరొకరితో పోల్చిచూడటం ద్వారా టీచరు యితనిని చిన్నబుచ్చినట్లు అవుతుంది, యితనిని మరింత అల్పునిగానో, మరింత తెలివిహీనుడిగానో చేయడం అవుతుంది. మీరు ఏమిటి అనేది మీరే స్వయంగా తెలుసుకొనడానికి తోడ్పడటమే టీచరు చేయవలసిన ధర్మం. మరొకరు ఎవరితోనో మిమ్మల్ని పోల్చి చూస్తున్నట్లయితే, టీచరు మీకు ఆ తోడ్పాటు యివ్వలేదు. పోల్చి చూడటం అనేది మిమ్మల్ని నాశనం చేస్తుంది, కనుక మరొకరితో మిమ్మల్ని పోల్చుకోకండి. తక్కినవారు ఎంతటి వారో మీరూ అంతవారే. మీరు ఏమిటి అనేది అవగాహన చేసుకోండి, యిక అక్కడినుండి మీరు వున్నస్థితికంటె సంపూర్ణంగా, అంతకంటె స్వేచ్ఛగా, అంతకంటె విశాలంగా ఎట్లా వుండాలో తెలుసుకోవడం ఆరంభించండి.

**ప్రశ్న: తల్లితండ్రులకి తమ పిల్లవాడంటే నిజంగా ప్రేమ కనుక వుంటే అతను ఏది చేస్తున్నా వాళ్ళు అతనిని ఆపరు అని మీరు అన్నారు. కాని, పిల్లవాడికి శుభ్రంగా వుండటం యిష్టం లేకపోతేనూ, అతని ఆరోగ్యానికి మంచిది కానిదేదయినా తింటూ వుంటేనూ అతనిని వారు ఆపాలి కదా?**

కృష్ణమూర్తి: తల్లితండ్రులు తమ పిల్లలను ప్రేమించినట్లయితే, పిల్లలకు యిష్టమొచ్చినవన్నీ వాళ్ళని చేయనిస్తారు అని ఎప్పుడయినా నేను అన్నానని అనుకోను. సరే! యిది చాలా క్లిష్టమయిన ప్రశ్న, కాదూ? నేను నా కొడుకుని ప్రేమిస్తే, సహజంగానే అతను భయపడుతూ వుండడానికి ఏ కారణమూ లేకుండా నేను చూస్తాను – యిది నిజంగా మహా కష్టసాధ్యమయిన పని, అయినా సరే. నేను మునుపు చెప్పినట్లు పిల్లవాడికి భయం నుండి విముక్తి కావాలంటే అతనిని

మరొకరితో పోల్చి చూడకూడదు, అతనిని పరీక్షలకు గురి చేయకూడదు. నేను పిల్లవాడిని ప్రేమిస్తున్నట్లయితే అతనికి స్వేచ్ఛను యిస్తాను, అతనికి యిష్టమొచ్చినవన్నీ చేయడానికి కాదు – ఎందుకంటే, మనకి యిష్టమొచ్చినట్లు చేయడం అనేది వట్టి అవివేకం అనిపించుకుంటుంది కాబట్టి, – అతనిలో తెలివిని పెంచి పోషించే స్వేచ్ఛను యిస్తాను; అప్పుడు ఆ తెలివి అతనికి ఏం చేయాలో తెలుపుతూ వుంటుంది.

తెలివి వుండాలంటే స్వేచ్ఛ వుండితీరాలి. మిమ్మల్ని ఎవరో ఒక ఆదర్శ నాయకుని లాగా అవమని అదే పనిగా పోరుతూ వుంటే మీరు స్వేచ్ఛగా వుండలేరు. ఎందుకంటే, అప్పుడు ఆ నాయకుడే ముఖ్యుడు కాని, మీరు కాదు కాబట్టి. మీకు పరీక్షలు వున్నప్పుడు పొత్తికడుపులో నొప్పి వస్తుంది కదూ? కంగారుగానూ, అదుర్దాగానూ అనిపిస్తుంది కాదూ? ఒక యేడు తరువాత మరొక యేడు యీ విధమైన ఘోర సంకట పరిస్థితిని మీరు ఎదుర్కొంటూ వుండాలి, దీనివలన మీ తక్కిన జీవిత కాలమంతా మీరు ఎట్లా అయిపోతారో తెలుసునా? పెద్దవాళ్ళు మీరు భయం లేకుండా పెరగాలని అంటారు. అయితే దానికి ఏమీ విలువ లేదు, అవి వట్టి మాటల మూటలు; ఎందుకంటే – మిమ్మల్ని పరీక్షలకు గురిచేసి, మిమ్మల్ని మరొకరితో పోల్చి చూసి మీలో భయాన్ని వృద్ధి చేస్తూ వుండేది వారే.

మనం బాగా చర్చించుకోవలసిన యింకొక విషయం ఏమిటంటే – క్రమశిక్షణ; అట్లాగని మనం దానికి పేరు పెట్టుకున్న విషయం. క్రమశిక్షణ అంటే నా అర్థం ఏమిటో మీకు తెలుసునా? మీ బాల్యం నుండీ మీరు ఏం చేయవలసినదీ చెప్తూ వుంటారు. మీరు అది అట్లాగే చేసి తీరవలసిందే, తప్పదు. మీరు పొద్దునపూట పెందలాడే ఎందుకు లేవాలో, ఎందుకని శుభ్రంగా వుండాలో మీకు వివరించి చెప్పాలన్న శ్రద్ధ ఎవరికీ వుండదు. తల్లిదండ్రులు కానీ, టీచర్లుకానీ యీ విషయాలన్నీ మీకు వివరించి చెప్పరు. ఎందుకంటే – దీనికి కావలసిన ప్రేమగానీ, వ్యవధానంగానీ, ఓరిమిగానీ వాళ్ళకి వుండవు; వాళ్ళు కేవలం, "ఇది చేయి, లేకపోతే నేను నిన్ను శిక్షిస్తాను" అని అంటారు. కనుక మనకు తెలిసినంతవరకు విద్యాధ్యయనం అంటే భయాన్ని మనసుల్లో జొరపెట్టడంగా వుంది. భయం వున్నప్పుడు మీ మనసులో తెలివి ఎట్లా వుండకలుగుతుంది? మీరు భయపడుతూ వున్నప్పుడు మీలో యితరుల ఎడల ప్రేమభావం ఎట్లా వుంటుంది? యితరుల ఎడల గౌరవం ఎట్లా చూపుతారు? గొప్ప పేర్లు వున్నవారిని, ఖరీదయిన కార్లు వున్నవారిని మీరు గౌరవించి మర్యాద చేయవచ్చు; కాని మీ నవుకరుని మీరు గౌరవించరే, పైగా నాలుగు తన్ని పంపిస్తారు కూడా. ఒక గొప్పవాడు కనుక మీ వైపులకు వస్తే మీరంతా అతనికి నమస్కారాలు చేస్తారు, అతని కాళ్ళు కూడా పట్టుకుంటారు, దీనినే గౌరవించడం అంటారు; కాని యిది గౌరవించడం కాదు, భయం వలన మీరు అతని పాదాలు పట్టుకుంటున్నారు. ఒక పేదవాడి పాదాలు మీరు తాకరు, తాకుతారా? మీరు అతనిని గౌరవంగా చూడరు, ఎందుకంటే, అతను మీకు ఏమీ యివ్వలేడు కాబట్టి. కనుక మన విద్యాధ్యయనం అంతా భయాన్ని పెంచి పోషించడమో, దానిని యింకా దృఢతరం చేయడమో తప్ప మరేమీ కాదు. ఇది చాలా ఘోరమయిన సంగతి, అవును కదూ? ఇట్లా భయం వున్నంతవరకు ఒక నూతన ప్రపంచాన్ని మనం ఎట్లా సృష్టించగలం? సృష్టించలేము. అందుకనే మీరు

చిన్నవయసులో వున్నప్పుడే యీ భయం అనేది లేకుండా మనమంతా నిజమైన విద్యాధ్యయనం చేయడానికి పూనుకోవడం మనందరికీ చాలా ముఖ్యమైన సంగతి.

ప్రశ్న: జీవితంలో ఆదర్శాలు వుండటం ముఖ్యం కాదా?

కృష్ణమూర్తి: ఇది చాలా మంచి ప్రశ్న, ఎందుకంటే మీకందరికీ ఆదర్శాలు వుంటాయి. అహింస అనే ఆదర్శమో, శాంతి అనే ఆదర్శం, రాముడు, సీత, గాంధీజీలను ఆదర్శంగా తీసుకోవడమో మీకు వుంటుంది, వుంటుంది కదూ? అంటే అర్థం ఏమిటి? మీరు ముఖ్యం కాదు, ఆ ఆదర్శమే చాలా ముఖ్యం అని కదూ? రాముడు చాలా చాలా ముఖ్యుడు, కాని పాపం, మీరు మాత్రం ముఖ్యం కాదు, అందుకని మీరు అతనిని అనుకరిస్తారు. మీరు అపేక్షించేది ఎప్పటికీ ఒక వ్యక్తికో, ఒక భావానికో నకలుగా తయారవుదామని. నేను యింతకు ముందు చెప్పినట్లుగా ఆదర్శవాది పట్టి మాయవేషధారి; ఎందుకంటే, అతను తన వున్నస్థితిలో వుండటానికి బదులు, తను ఏమిటో అది అవగాహన చేసుకోవడానికి బదులు, తను ఏది కాదో అది అవడానికి ఎప్పుడూ ప్రయత్నిస్తుంటాడు.

చూడండి, ఆదర్శవాదం అనేది నిజంగా చాలా సంక్లిష్టమయిన సమస్య, దీనిని గురించి ఆలోచించమని మిమ్మల్ని ఎప్పుడూ ప్రోత్సహించలేదు కాబట్టి, దీనిని మీరు అవగాహన చేసుకోలేదు; దీనిని గురించి ఎవ్వరూ మీతో చర్చించలేదు. మీ పుస్తకాలు అన్నీ, మీ టీచర్లు అందరూ చెప్పేది ఒకటే; వార్తాపత్రికలు, యితర పత్రికలు కూడా మీకు ఆదర్శాలు వుండి తీరాలని, మీరు యీ హీరోలాగానో, ఆ నాయకుడి లాగానో వుండాలి అనే చెప్తుంటాయి, దీనివల్ల అయేదేమిటంటే – మీ మనసు అనుకరణ చేసే ఒక కోతిలాగా తయారవుతుంది, వూరికే బోలెడు మాటలు చిలుకలాగా మళ్ళీ మళ్ళీ పలికే గ్రామఫోను రికార్డులాగా అవుతుంది. అందుకని మీరు అన్నింటికీ సమ్మతం చూపడం పనికిరాదు; అన్నింటినీ ప్రశ్నించడం ఆరంభించాలి, తెలుసుకోవాలి; అయితే మీరు లోలోపల భయపడుతూ వుంటే ప్రశ్నించలేరు. ప్రతి దానినీ ప్రశ్నించడం అంటే తిరుగుబాటు చేయడం అన్నమాట, అంటే ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించడం. అయితే చూడండి, మీ టీచర్లకు, మీ తల్లిదండ్రులకు మీరు తిరుగుబాటు చేయడం యిష్టం వుండదు; వారు మిమ్మల్ని తమ అదుపు ఆజ్ఞల్లో వుంచుకోవాలనీ, తమ నమూనాల్లోనే మిమ్మల్ని తీర్చిదిద్దుకోవాలనీ, తమ మూసల్లో మిమ్మల్ని తయారు చేయాలనీ కోరుకుంటారు; అందువలన జీవితం ఒక అసహ్యమైనది, అందవిహీనమైనదిగానే కొనసాగుతూ వుంటుంది.

ప్రశ్న: మేము చిన్నవాళ్ళం కదా, ఎట్లా ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించగలం?

కృష్ణమూర్తి: మీరు చిన్నగా వుంటే నూతన ప్రపంచాన్ని సృష్టించలేరు. కాని, మీ జీవితమంతా యిట్లాగే చిన్నగా మీరు వుండిపోరు. ఉండిపోతారా? మీరు భయపడుతూవుంటే చిన్నగానే వుండిపోతారు. మీరు శరీరం పెద్దగా

పెంచుకోవచ్చు, పెద్ద కారు, ఉన్నతమైన హోదా పొందవచ్చు, కాని మీరు లోలోపల భయపడుతూ వుంటే ఎన్నటికీ నూతన ప్రపంచాన్ని సృష్టించలేరు. అందుకనే ప్రజ్ఞతో, భయం లేకుండా మీరు ఎదగడం, స్వేచ్ఛలో పెరిగి పెద్దవాళ్ళు అవడం చాలా ముఖ్యం. అయితే స్వేచ్ఛలో ఎదగడం అంటే స్వేచ్ఛగా వుండటం కొరకు మనల్ని క్రమశిక్షణలో పెట్టుకోవడం మాత్రం కాదు.

**ప్రశ్న: పిల్లలను భయరహితంగా చేయాలంటే ఎటువంటి విద్యావిధానం వుండాలి?**

**కృష్ణమూర్తి:** ఒక విధానం, ఒక పద్ధతి అనగానే ఏం చేయాలి, ఎట్లా చేయాలి అని ఆదేశించడం అందులో అంతర్భాగంగా వుంటుంది; అది మిమ్మల్ని భయరహితంగా చేస్తుందా? ఏదయినా ఒక రకానికి చెందిన విధానం ద్వారా మిమ్మల్ని తెలివిగా, భయం లేకుండా విద్యావంతులను చేయగలమా? మీరు చిన్నవయసులో వున్నప్పుడు స్వేచ్ఛగా పెరిగి పెద్దవాళ్ళవాలి; అయితే మిమ్మల్ని స్వేచ్ఛగా వుంచడానికి ఒక విధానం అంటూ లేదు. ఒక విధానం లేదా ఒక ప్రణాళిక అనగానే మనసును ఒక నమూనాకు అనుగుణంగా మలచడం అందులో అంతర్భాగంగా వుంటుంది, అంతేకదూ? అంటే అర్థం, మిమ్మల్ని ఒక చట్రంలో పెట్టి బిగించి వేయడం, మీకు స్వేచ్ఛను యివ్వకపోవడం. ఒక విధానాన్ని మీరు విశ్వసించిన మరుక్షణం నుండి మీరు అందులో నుండి బయటకు అడుగు వేయడానికి కూడా సాహసించలేరు, ఆపైన బయటకు అడుగు పెడదామనే ఆలోచనే భయాన్ని పుట్టిస్తుంది. కనుక, నిజంగా చెప్పాలంటే విద్యాధ్యయనానికి ఒక విధానం అంటూ లేదు. అసలు ప్రధానమయినవి ఏమిటంటే, టీచరు, విద్యార్థి; అంతేకాని విధానం కాదు. నేను మిమ్మల్ని భయంనుండి విముక్తులను చేయాలంటే ముందుగా నేను స్వయంగా భయంనుండి విముక్తుడిని అయి వుండాలి కదా! తరువాత నేను మిమ్మల్ని పరిశీలించాలి; నేను శ్రమ తీసుకొని అన్ని విషయాలనూ మీకు వివరించాలి, చెప్పాలి, యీ ప్రపంచం ఎటువంటిదో మీకు తెలియజెప్పాలి; యిదంతా చేయాలంటే నాకు మీరంటే ప్రేమభావం వుండాలి. మీరు స్కూలుని గాని, కాలేజిని గాని వదిలి వెళ్ళేటప్పుడు మీరు భయం లేకుండా తయారై వెళ్ళాలి అనే భావం ఒక టీచరుగా నాలో వుండితీరాలి. నాలో నిజంగా యీ భావం కనుక వున్నట్లయితే, మీరు భయం లేకుండా వుండటానికి నేను సహాయం చేయగలుగుతాను.

**ప్రశ్న: ఒక ప్రత్యేక పద్ధతిలో పరీక్షించకుండా బంగారానికి వుండే గుణాన్ని తెలుసుకోవడం సాధ్యమవుతుందా? అట్లాగే, ఏదో ఒక పరీక్షలాంటిది లేకుండా ప్రతి పిల్లవాడిలో వుండే శక్తిసామర్థ్యాలు ఎట్లా తెలుసుకోగలుగుతారు?**

**కృష్ణమూర్తి:** పిల్లల శక్తిసామర్థ్యాలు పరీక్షల ద్వారా నిజంగా తెలుసుకోగలుగుతామా? పరీక్ష అంటే వుండే భయం వలన, కంగారువలన ఒక పిల్లవాడు పరీక్షలో తప్పిపోవచ్చు; మరొకపిల్లవాడు దీనివలన అంతగా ప్రభావితం అవకపోవడం వలన

ఎట్లాగో నెగ్గుకొని రావచ్చు. అట్లా కాకుండా, ప్రతి పిల్లవాడిని, ప్రతిరోజూ, వారం అంతా కనిపెట్టి వుండి, అతని నడత, శీలం పరిశీలిస్తూ వుంటే, అతను ఆటల్లో ఎట్లా పాల్గొంటాడు, ఎట్లా మాట్లాడుతాడు, అతను వేటిలో ఆసక్తి చూపుతున్నాడు, అతను ఎట్లా చదువుతాడు, ఏం ఆహారం తీసుకుంటాడు – యివి పరిశీలించినట్లయితే, అప్పుడు ఆ బాలుడిని గురించి మీరు తెలుసుకోవడం ఆరంభిస్తారు; ఏ పరీక్షల అవసరమూ లేకుండానే అతని శక్తిసామర్థ్యాలు ఏమిటో మీకు తెలుస్తాయి. అయితే, మనం యీ విషయాలన్నీ ఎప్పుడూ ఆలోచించనేలేదు.

ప్రశ్న: సర్! నూతన ప్రపంచం అంటే మీ అభిప్రాయం ఏమిటి?

కృష్ణమూర్తి: నూతన ప్రపంచాన్ని గురించి నాకు ఏ అభిప్రాయమూ లేదు. నాకు కనుక ఏదో ఒక ఊహ 'నూతన' ప్రపంచం గురించి వుంటే అది అప్పుడు 'నూతనం' అవదు. ఈ మాట వట్టి చతురోక్తిలాగా చెప్పినది కాదు, యిది వాస్తవం. నాలో దీనిని గురించి ఒక అభిప్రాయం కనుక వున్నట్లయితే, ఆ అభిప్రాయం నా పరిశీలన వలన, నా అనుభవం వలన ఏర్పడినది, అవునా కాదా? నేను నేర్చుకున్నదానిలో నుండి, నేను చదివిన వాటిలోనుండి అది జన్మించి వుంటుంది; యితరులు నూతన ప్రపంచం అంటే ఎట్లా వుండాలి అని చెప్పినదానిలో నుండి పుట్టి వుంటుంది. కనుక, మనసు సృష్టించినది కనుక అయితే 'నూతన' ప్రపంచం 'నూతనం'గా ఎన్నటికీ వుండలేదు, ఎందుకంటే – మనసు పాతదే కాబట్టి. రేపు ఏమి అవబోతున్నదో మీకు తెలియదు, తెలుస్తుందా? రేపు ఆదివారం కాబట్టి స్కూలు వుండదని మీకు తెలుసు, సోమవారంనాడు మీరు మళ్ళీ స్కూలుకు వెళతారు; అయితే స్కూలుకు వెలుపల ఏం జరుగబోతున్నది, మీలో ఏయే మనోభావాలు కలుగబోతున్నాయి, మీరు ఏయే రకాల విషయాలు చూడబోతున్నారు – యివన్నీ మీకు తెలియవు, తెలుస్తాయా? ఎందుకంటే, రేపు ఏం జరుగబోతున్నదో, ఆ మరునాటి ఉదయాన ఏం జరుగబోతున్నదో మీకు తెలియదు కాబట్టి. అది జరిగినప్పుడు నూతనంగా వుంటుంది. నూతనమయిన దానిని ఎదుర్కోగలగటమే మనకు ప్రధానమయిన విషయం.

ప్రశ్న: మనం ఏం సృష్టించాలని కోరుకుంటున్నామో మనకు తెలియకపోతే ఒక నూతనమయినదానిని మనం ఎట్లా సృష్టించగలుగుతాం?

కృష్ణమూర్తి: సృష్టించడం, సృజించడం అంటే అర్థం ఏమిటి అనేది తెలియకపోవడం చాలా విషాదకరం, అవును కదూ? మీలో ఒక మనోభావం కలిగినప్పుడు, మీరు భావించే దానిని మాటలలో పెట్టవచ్చును. మీరు ఒక అందమైన వృక్షాన్ని చూసినట్లయితే, ఒక కవిత – వర్ణిస్తూ ఒక కవిత వ్రాయవచ్చు, ఆ చెట్టును వర్ణిస్తూ కాదు, ఆ చెట్టు మీలో జాగృతం చేసినదానిని గురించి వర్ణిస్తూ. ఆ మనోభావం నూతనమయినది, అది సృజనాత్మకమయినది; అయితే దానిని మీరు కలిగించుకోలేరు, అది మీలో కలుగుతుంది; అంతే.

ప్రశ్న: పిల్లలు యీ విషయాలన్నీ గంభీరంగా ఆలోచించి తీరాలా? అట్లా చేస్తే ఆ తరువాత వాళ్ళు యిక ఎప్పటికయినా సుఖ సంతోషాలతో వుండగలుగుతారా?

కృష్ణమూర్తి: ఇప్పుడు మీరు గంభీరంగా ఆలోచించడం లేదా? అయితే రోజంతా మీరు గంభీరంగా వుండలేరు, వుండగలరా? సమయమంతా మీరు ఆటలతో గడపలేరు, రోజంతా మీరు నిద్రపోలేరు, రోజంతా మీరు చదువులోనూ గడపలేరు. ఆడుకోవడానికి ఒక సమయం వుంటుంది, గంభీరంగా వుండటానికి ఒక సమయం వుంటుంది; యీ సమావేశం గంభీరమైన విషయాల కోసమే ఏర్పాటయింది; అయితే, మీరు కనుక గంభీరమయిన విషయాలు ఆలోచించదలుచుకోకపోతే ఏమీ ఫరవాలేదు, మిమ్మల్ని ఎవరూ నిర్బంధించబోవడం లేదు.

★ ★ ★

# అధ్యాయం 2

మనం భయాన్ని గురించి మాట్లాడుకుంటూ వున్నాం; మనం మతం అని చెప్పుకునేది నిజంగా యీ భయం కారణంగా జనించిన ఫలితమని మీకు తోచడం లేదూ? మీ తల్లిదండ్రులు, మీ తాతయ్య, నాయనమ్మ, మీ బంధువులు దేవాలయానికి వెళ్ళడం, విగ్రహాన్ని పూజించడం, 'గీత' నుండి కాని, మరో పవిత్ర గ్రంథం నుండి కాని సూక్తులు పునరుక్తి చేయడం లేదా ఏవో పూజా పురస్కారాలు చేయడం మీరు గమనించే వుంటారు. ఈ పనులన్నీ చేయడం, ఏదో ఒక దానిలో నమ్మకం కలిగివుండటం, దీనినే మతం అని వాళ్ళు పిలుస్తారు. అయితే మీరూ యిదేవిధంగా అనుకుంటున్నారా? దేవాలయానికి వెళ్ళడం, చేత్తో చేసిన విగ్రహం పాదం వద్ద పూవులు వుంచడం, ప్రతిరోజూ క్రమం తప్పకుండా ఏవో పూజలూ పురస్కారాలూ చేయడం, మీరు చనిపోయేదాకా ఒక సంవత్సరం తరువాత మరొక సంవత్సరం యిదే విధంగా చేయడం - అదేనా మతం అంటే?

చేతితో తయారుచేసిన వస్తువుని పూజించడం మతం కాకపోతే, అప్పుడు మనసుతో తయారుచేసిన దానిని పూజించడం మతం అవుతుందా? మీరు దేవాలయంలో ప్రవేశించగానే ఎవరో ఒక శిల్పి రాతితో చెక్కిన విగ్రహం మీకు అక్కడ కనిపిస్తుంది. ఈ ప్రతిమ ముందు జనం పూవులు వుంచుతారు, దాని మీద నీళ్ళు చల్లుతారు, దానికి వస్త్రాలు కప్పుతారు; దానినే వాళ్ళు మతం అని పిలుస్తారు, యివి చేయకపోవడం మతంలో విశ్వాసం లేకపోవడం అని వాళ్ళు అనుకుంటారు.

మనకు దైవం అంటే కూడా ఒక అభిప్రాయం వున్నది; ఆ అభిప్రాయాన్ని మనసే సృష్టించింది, అవును కదూ? విగ్రహాన్ని కూడా మనసు చేతి సహాయంతో తయారు చేస్తుంది; దైవం అనే ఊహని మనసు తయారు చేసుకొని, అది ఒక అద్భుతమైన విషయంలాగా, పూజించవలసిన పవిత్రమైన రూపంలాగా తన వద్ద పెట్టుకుంటుంది. ఈ ఊహ, రూపం రెండూ మనసు తయారు చేసినవే, కాదూ? ఇవి దైవం కాదని తెలుస్తూనే వున్నది, ఎందుకంటే - మనసే వీటిని కొత్తగా కల్పించింది కాబట్టి. యూరప్‌లో మనిషి రూపంలో చెక్కిన శిల్పాన్ని, దుస్తులు లేకుండా ఒక క్రాసుమీద మేకులతో కొట్టి వుంచడం మీరు చూస్తారు; యీ ఆకృతిని వాళ్ళు పూజిస్తారు. ఇక్కడ యిండియాలో యిటువంటిదే మనం యింకో పద్ధతిలో చేస్తాం. ఇండియాలో కాని, యూరప్‌లోకాని, అమెరికాలో కాని ఒక ప్రతిమకు ప్రార్థనలు చేస్తాం, ఒక ఊహను పూజిస్తాం; క్రమక్రమంగా మతం అని పిలుస్తామే, దానిని మనం నిర్మిస్తాం - యిదే మనసు కల్పించిన మతం.

చూడండి, మనం ఒంటరిగా వుండాలంటే భయపడతాం; మనకి సహాయం చేయడానికి ఎవరో ఒకరు కావాలని కోరుకుంటాం. మీ వయసులో వున్నప్పుడు తల్లిగాని, తండ్రిగాని, తాతగాని మనకు సహాయం చేయాలని మనం కోరుకుంటాం, మనం పెరిగి పెద్దవాళ్ళం అయ్యాక కూడా యింకా ఎవరో ఒకరు మనకి సహాయం చేయాలని కోరుకుంటాం, ఎందుకంటే – జీవితం చాలా కఠినమయినది కాబట్టి; అతి శక్తిమంతుడని మనం అనుకుంటున్న తండ్రి (దైవాన్ని 'ఫాదర్' అని క్రైస్తవులు అంటారు – అను.) మనల్ని కాపాడాలని మనం కోరుకుంటాం, మనం ఏం చేయాలో చెప్పాలని కోరుకుంటాం. కనుక ఒంటరిగా వుండాలంటే వుండే భయం వలన, ఎవరూ సహాయం చేయరేమోననే భయం వలన, మనం ఒక దైవంలో, మనకు అతడు సహాయం చేస్తాడని అనుకుంటూ – అతనిలో నమ్మకం వుంచుతాం; అయితే – యిదంతా కూడా మనసు చేసిన కల్పనే కదూ, అవును కదూ? మనం భయపడుతూ వున్నాం కాబట్టి, ఏది తప్పు, ఏది ఒప్పు అని చెప్పి దారి చూపించాలని కోరుకుంటాం కాబట్టి, మనం పెరిగి పెద్దవాళ్ళమవుతున్నప్పుడు మతం అనేది ఒకటి సృష్టించుకుంటాం; అయితే యిది మతం ఏ మాత్రం కాదు. మతం వీటన్నింటికంటె సంపూర్ణంగా విభిన్నమయినదని నేను అనుకుంటాను, ఆ నిజమయిన దానిని కనుగొనాలంటే మనిషి కల్పన చేసిన దీనినుండి మనం విముక్తం అయితీరాలనేది స్పష్టమే కదా! మీరు తెలుసుకోగలుగుతున్నారా? దైవం అంటే ఏమిటి అనేది తెలుసుకోవడానికి, సత్యమయిన దానిని కనుగొనడానికి మనిషి తన మీద తనే స్వయంగా విధించుకున్న కుహనా మతపు కృత్రిమ తతంగాల నుండి విముక్తి చెంది తీరాలి. మీరు సంపూర్తిగా భయం నుండి విముక్తి చెందినప్పుడు మాత్రమే సత్యమయిన దానిని కనుగొనగలుగుతారు. అంటే అర్థం మీరు పెరిగి పెద్దవాళ్ళవుతూ ప్రపంచంలోకి అడుగు పెట్టినప్పుడు, మీరు దేనిని గురించి భయపడుతున్నారో అనేది తెలుసుకొని, దానినుండి తప్పించుకొని పారిపోవడం చేయకుండా, మీ మనసు అనే బీరువా అరలనుండి దానిని బయటకు తీసి, పరికించి చూసే ప్రజ్ఞ, తెలివి మీకు వుండితీరాలి.

మనలో చాలమందిమి ఒంటరిగా వుండాలంటే భయపడతాం. మనం ఎప్పుడయినా వంటరిగా నడుచుకుంటూ (వాకింగ్‌కి) వెళతామా? చాలా అరుదుగా. మనతో పాటు నడవడానికి మనకి ఎప్పుడూ మరొకరు తోడు కావాలి. ఎందుకంటే, మనం ఆపకుండా ఏదో ఒకటి మాట్లాడుతూ వుండాలని కోరుకుంటాం, ఎవరో ఒకరికి ఒక కథ చెప్పాలని అనుకుంటాం, మనం ఎప్పుడూ మాట్లాడుతూనే వుంటాం; మాటలు, మాటలు, మాటలతోనే కాలమంతా గడుపుతాం; కనుక మనం ఎప్పుడూ ఒంటరిగా వుండలేము, వుండలేము కదూ? మనం పెరిగి పెద్దవాళ్ళమయ్యాక, ఒంటరిగా నడిచి వెళ్ళగలిగినప్పుడు, అనేకమయిన క్రొత్త విషయాలు కనుగొంటాం. మనలోని ఆలోచనా ధోరణులు ఏమిటి అనేది స్వయంగా కనిపెడతాం; ఆ పైన మనం చుట్టూ వున్నవన్నీ పరిశీలించడం ఆరంభిస్తాం – బిచ్చగాడిని, మూర్ఖుడిని, చాతుర్యంగల మనిషిని, భాగ్యవంతులను, పేదవారిని; చెట్లు, పక్షులు, ఆకుమీద మెరిసే కాంతికిరణాలు వీటన్నింటిని గురించిన ఎరుక మనలో కలుగుతుంది. మీరు

ఒంటరిగా బయటకు వెళ్ళినప్పుడే మీరు యివన్నీ చూడగలుగుతారు. ఒంటరిగా వుంటూ వున్నప్పుడు త్వరలోనే మీరు భయపడుతున్నారని మీకు తెలుస్తుంది. మనం భయపడుతూ వున్నాం కాబట్టే మతం అని మనం పిలిచే యీ విషయాన్ని మనం కొత్తగా కల్పన చేశాం.

దైవాన్ని గురించి, అతనిని ఏ విధంగా అందుకోవాలనే దానిని గురించి అసంఖ్యాకమయిన పుటలలో గ్రంథాలు రచించారు; అయితే దీనంతటికీ పునాది భయమే. మనిషి భయపడుతూ వున్నంతవరకు, అతను సత్యమయినది ఏదీ కనుగొనలేడు. మీరు చీకటి అంటే భయపడుతుంటే బయటకు వెళ్ళడానికి సాహసించరు, అందుకని ముఖం మీదకు దుప్పటి లాక్కుని నిద్రపోతారు. బయటకు వెళ్ళి పరికించడానికి, సత్యమయినది ఏది అని తెలుసుకోవడానికి భయం నుండి విముక్తి వుండాలి, వుండి తీరాలి కదూ? కాని చూడండి, భయం నుండి విముక్తి చెందడం అనేది చాలా కష్టమయిన సంగతి. చాలా మంది పెద్దవారు భయం నుండి మీరు విముక్తి చెందడమనేది మీరు పెద్దవారయాకే సాధ్యమని అంటారు, మీరు జ్ఞానం సేకరించాక, మీ మనసుని క్రమశిక్షణలో పెట్టడం నేర్చుకున్నాకే భయం నుండి విముక్తి చెందగలుగుతారని వారు అంటారు. స్వేచ్ఛ అనేది బహుదూరంగా ఎక్కడో చివరగా వుంటుంది, ఆరంభంలో వుండదని వాళ్ళు అనుకుంటారు. అయితే స్వేచ్ఛ అనేది తప్పకుండా బాల్యం నుండే ఆరంభం కావాలి, లేదంటే యిక ఎప్పటికీ మీరు స్వేచ్ఛగా వుండలేరు.

చూడండి, తాము ఒక ప్రక్కన భయపడుతూ వుంటూ, పెద్దవారు మిమ్మల్ని క్రమశిక్షణలో పెడతారు; యిది తప్పు, అది ఒప్పు అని మీకు చెప్తారు; ఇది చేయండి, అది చేయకూడదు అని మిమ్మల్ని ఆదేశిస్తారు; యితరులు ఏమంటారో అన్నది మీరు యోచించాలి అని మీతో చెప్తారు; యింకా యిట్లాగే ఎన్నో. మిమ్మల్ని ఒక గాడిలో, ఒక చట్రంలో, ఒక నమూనాలో యిమిడిపోయేటట్లుగా చేయడానికి రకరకాల కట్టుబాట్లు వుంటాయి, దీనినే క్రమశిక్షణ అంటారు. చాలా చిన్నవయసులో వుండటం వలన, మీ లోపల వుండే మీ భయాల వలన మీరు అందులో యిమిడి పోతారు; అయితే దీనివలన మీకు ఏ ప్రయోజనమూ వుండదు, ఎందుకంటే – అందులో యిమిడిపోయాక యిక మీరు అవగాహన అనేది చేసుకోలేరు.

సరే, యిప్పుడు మరొక వైపు నుండి చూడండి. మిమ్మల్ని క్రమశిక్షణలో పెట్టకపోతే, మిమ్మల్ని అదుపు ఆజ్ఞల్లో పెట్టకపోతే, మిమ్మల్ని అణచివుంచకపోతే, మీకు యిష్టమైనవే మీరు చేస్తారా? మీరు ఫలానాది చేయాలి అని చెప్పడానికి ఎవరూ లేకపోతే, అప్పుడు మీరు మీ యిష్టానుసారం ప్రవర్తిస్తారా? బహుశ ప్రస్తుతం అట్లాగే ప్రవర్తిస్తారేమో, ఎందుకంటే మిమ్మల్ని నిర్బంధించడం, అణచివేయడం, ఒక చట్రంలో బిగించివేయడం మీకు బాగా అలవాటయిపోవడం వల్ల, వాటికి పూర్తిగా విరుద్ధంగా చేయాలని మీరు అనుకుంటారు. కాని, బాల్యం నుండీ, మీరు స్కూలుకు వెళ్ళడం ఆరంభించిన మొట్టమొదటి రోజులనుండీ, టీచరు మీతో అన్ని విషయాలూ మాట్లాడుతూ, చర్చిస్తూ వుంటాడని అనుకుందాం; మీరు యివి చేసితీరాలి అని చెప్పడని అనుకుందాం – అప్పుడు మీరు ఎట్లా స్పందిస్తారు? మీరు

స్కూల్లో చదువు ఆరంభించిన మొట్టమొదటి రోజులనుండీ టీచరు మీకు స్వేచ్ఛగా వుండటం అనేది మొదటి నుండీ చేయవలసినది అనీ, ఎప్పుడో చనిపోయేముందు చేసే చిట్టచివరిది కాదు అనీ మీకు నిర్దేశం చేసి చూపాడనుకోండి – అప్పుడు ఏమవుతుంది?

ఇందులో వుండే కష్టం ఏమిటంటే, స్వేచ్ఛగా వుండాలంటే అపారమైన తెలివి వుండవలసిన అవసరం వుంటుంది; స్వేచ్ఛగా వుండటం – మీకు నిజంగా ప్రీతికరమైనవి ఏవో అవి చేసే స్వేచ్ఛ – అంటే ఏమిటో మీకు యింకా తెలియకపోవడం వలన, మీకు తెలివిని గురించిన తీరు తెన్నులు కనిపెట్టడానికి మీ టీచరు సహాయం చేయడం అతని ధర్మం. భయం నుండి విముక్తిని కలిగించేది తెలివి. భయం వున్నంతవరకు మీపైన మీరే ఒక క్రమశిక్షణను విధించుకుంటూ వుంటారు; నేను యిది చేయాలి, అది చేయకూడదు, నేను నమ్మాలి, నేను అనుగుణంగా వుండాలి, నేను పూజ చేయాలి – ఇంకా యిట్లాంటివే. ఈ స్వయం శిక్షణ అంతా భయంలో నుండి పుట్టుకొచ్చినదే, భయం వున్నచోట తెలివి లేదా వివేకం అనేది వుండదు.

కనుక, విద్యాధ్యయనం అంటే సవ్యంగా చెప్పాలంటే పుస్తకాలు చదవడం, పరీక్షల్లో ఉత్తీర్ణులవడం, ఉద్యోగం సంపాదించడం మాత్రమే కాదు. విద్యాధ్యయనం అంటే అదొక విభిన్నమైన ప్రక్రియ; అది మీరు జన్మించిన క్షణం నుండీ మీరు చనిపోయే క్షణం వరకు విస్తరించి వుంటుంది. మీరు అసంఖ్యాకమయిన పుస్తకాలు చదివివుండవచ్చు, చాలా యుక్తిపరులయి వుండవచ్చు, కాని కేవలం చాతుర్యం, యుక్తి విద్యాధ్యయనానికి గుర్తు అని నేను అనుకోను. మీరు కనుక కేవలం చాతుర్యం కలవారయితే జీవితంలోని అనేకం మీరు పోగొట్టుకుంటారు. మీరు దేనిని గురించి భయపడుతున్నారో అది తెలుసుకోవడం, దానినుండి పారిపోకుండా, దానిని అవగాహన చేసుకోవడం అన్నింటికన్న ప్రధానమయిన విషయం. మీ మనసు ఒత్తిడి చేసే అన్ని రకాలయిన కోర్కెలనుండి విముక్తి చెందినపుడు, అది అసూయపడకుండా, ఆర్జనపరత్వంలో మునిగితేలకుండా వున్నప్పుడు, అప్పుడు మాత్రమే దైవం అంటే ఏమిటో తెలుసుకోగలుగుతుంది. అందరూ దైవం అంటే యిది అని చెప్పేది కాదు దైవం అంటే. దైవం అంటే దీనికి పూర్తిగా విభిన్నమయినది – మీరు అవగాహన చేసుకున్నప్పుడు, మీకు భయం లేనప్పుడు అది ప్రత్యక్షంగా అంటే నేరుగా తెలుస్తుంది.

కనుక, మతం అంటే నిజంగా ఒక విద్యాధ్యయనపు ప్రక్రియ, అవును కదూ? మతం అటే ఏది విశ్వసించాలి, ఏది విశ్వసించ కూడదు అనే విషయం కాదు; పూజా పురస్కారాలు చేయడం కాదు; ఏవో కొన్ని అంధ విశ్వాసాలను పట్టుకొని వేలాడటం కాదు; అవగాహన చేసుకొనే తీరులను మనకి మనమే అధ్యయనం చేసే ఒక ప్రక్రియ; ఆ విధంగా మన జీవితం అపూర్వమయిన సంపన్న సమృద్ధతను చేకూర్చుకుంటుంది, ఆపైన మనం భయపడుతూ వుండం, ఆ తరువాత సగటు మానవులలాగా వుండిపోము. ఒక నూతన ప్రపంచాన్ని మనం అప్పుడే సృష్టించగలుగుతాం.

రాజకీయవేత్తలు, మతాధికారులు, నూతన ప్రపంచపు సృష్టి యువకుల చేతిలోనే

వున్నదని అంటారు. మీరు వినలేదూ? బహుశ కొన్ని వందలసార్లు వినివుంటారు. కాని, మీరు స్వేచ్ఛగా వుండేటటువంటి విద్యను వారు మీకు బోధించరు; ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించాలంటే స్వేచ్ఛ వుండితీరాలి. పెద్దవారు తమ స్వంత అభిప్రాయాల నమూనాలకు అనుగుణంగానే మీకు విద్య గరపుతారు. వాళ్ళు యీ విషయం అంతా ఘోరమైన అస్తవ్యస్త స్థితిలో పడవేశారు. ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించవలసింది మీరే, చిన్నతరంవారే అని వాళ్ళు అంటారు; మళ్ళీ వాళ్ళే మిమ్మల్ని ఒక పంజరంలో పెట్టి వుంచుతారు, పెడతారు కదూ? మీరు ఒక యిండియన్‌గా వుండాలి, పార్శీగా వుండాలి లేదా మరొకటిగా అనీ వాళ్ళు మీతో చెప్తారు – మీరు కనుక వాళ్ళ అభిప్రాయాలను అనుసరిస్తే ప్రస్తుతం వున్నలాంటిదే అయిన ప్రపంచాన్నే మళ్ళీ మీరు సృష్టిస్తారని గట్టిగా చెప్పవచ్చు. మీరు స్వేచ్ఛలో మాత్రమే ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించగలరు; భయంలో నుండి కాదు, అంధ విశ్వాసంలో నుండి కాదు; నూతన ప్రపంచం ఫలానా తీరులో వుండాలని కొంతమంది చెప్పిన మాటలు పునాదిగా చేసుకొని కాదు.

చిన్నవయసులో వున్న మీరు అంటే, రాబోయే తరం ఒక సంపూర్ణంగా విభిన్నమయిన ప్రపంచాన్ని తీసుకొని రాగలుగుతారు; అయితే మీరు స్వేచ్ఛగా వుండటానికి తగిన విద్యాధ్యయనం చేసినప్పుడు మాత్రమే, మీకు ప్రీతికరంకానివి, మీకు అవగాహన కానివి చేయమని మిమ్మల్ని నిర్బంధించనప్పుడు మాత్రమే యిది సాధ్యమవుతుంది. అందుకోసమే మీరు చిన్న వయసులో వున్నప్పుడే, నిజమయిన విప్లవకారులుగా అవాలి – అంటే అర్థం, ప్రతిదానికీ అంగీకారం చూపకుండా, సత్యం ఏది అనేది మీరే కనుగొనడానికి అన్ని విషయాలను తరచి చూడటం. అప్పుడు మాత్రమే మీరు ఒక నూతన ప్రపంచాన్ని సృష్టించకలుగుతారు. లేదంటే, మీరు మరొక పేరుతో పిలిచినా సరే, దుర్భరవేదనలతో, విధ్వంసంతో నిండిన యీ ప్రపంచాన్నే, యిప్పటివరకు యీ విధంగానే ఆగకుండా అస్తిత్వంతో వుంటూ వున్న ప్రపంచాన్నే, యికముందు కూడా శాశ్వతంగా కొనసాగేటట్లు మీరు చేస్తారు.

అయితే సాధారణంగా మనం చిన్నవయసులో వున్నప్పుడు ఏం జరుగుతూ వుంటుంది? అమ్మాయిలు పెళ్లిళ్ళు చేసుకుంటారు, పిల్లల్ని కంటారు, క్రమంగా వడిలి, రాలిపోతారు. అబ్బాయిలు పెరిగి పెద్దవాళ్ళయ్యాక, జీవనోపాధి సంపాదించాలి కాబట్టి, ఉద్యోగాలు వెతుక్కుంటారు; ఆ ఉద్యోగాలకు అనుగుణంగా వారు లొంగిపోయి వుంటారు; వారికి యిష్టం వున్నా సరే లేకపోయినా సరే, ఒక వృత్తిని చేపట్టవలసిన నిర్బంధానికి లోనవుతారు; పెళ్ళి చేసుకొని వుండటం వల్ల, సంతానం కలగడం వల్ల వారి బాధ్యతలు వారిని యీడ్చుకొని వెళుతూ వుంటాయి, అందువల్ల తమకు పెద్దవారు చెప్పినట్లే చేయవలసి వస్తుంది. కాబట్టి తిరుగుబాటు తత్త్వం, విచారణ చేసే తత్త్వం, అంతర్గతంలో అన్వేషించాలని వారికి వుండే విప్లవాత్మకమయిన భావాలన్నీ అణగారిపోతాయి, ఎందుకంటే – జీవితభారం వారికి తలకు మించినదవుతుంది కాబట్టి. వారు ఆఫీసుకి వెళ్ళాలి, అక్కడ ఒక పై అధికారి వుంటాడు; అతడు యిది చేయమనీ, అది చేయమనీ అంటే అవి చేసితీరాలి; యిక క్రమక్రమంగా విచారణ శీలత్వం, తిరుగుబాటు చేసే భావాలు, పూర్తిగా విభిన్నమయిన జీవిత విధానాన్ని

సృష్టించాలనే ఉత్సాహం అన్నీ సంపూర్ణంగా హరించుకొని పోతాయి. అందువల్లనే మొదటి నుండీ, బాల్యం నుండీ ఆరంభం చేసుకొని పైదాకా తిరుగుబాటు తత్త్వం వుండటం అనేది చాలా ముఖ్యం.

చూడండి, మతం, నిజమయిన మతం అంటే దైవాన్ని కనుగొనడానికిగాను చేసే తిరుగుబాటు; అంటే అర్థం, సత్యమయినది తానే స్వయంగా ఆవిష్కరించుకోవడం. మనం పవిత్ర గ్రంథాలు అని చెప్పుకొనేవాటిని, అవి ఎంత ప్రాచీనమయినవి అయినా, ఎంత పూజనీయమైనవి అయినా సరే, వాటిని కేవలం అంగీకరించడం కాదు మతం అంటే.

**ప్రశ్న: విద్యావిధానం గురించి రచించిన మీ పుస్తకంలో ఆధునిక విద్యావిధానం పూర్తిగా అపజయం పొందినట్లుగా సూచించారు. దీనిని మీరు వివరించాలని కోరుతున్నాను.**

**కృష్ణమూర్తి:** సర్! అది అపజయం కాదా? మీరు బయటకు వీధిలోకి వెళ్ళినప్పుడు పేదవాడిని చూస్తున్నారు, భాగ్యవంతుడిని చూస్తున్నారు; మీరు మీ చుట్టూరా పరికించి చూసినప్పుడు, ప్రపంచమంతటా కూడా యీ విద్యావంతులం అని చెప్పుకునే వారందరూ పోట్లాడుకుంటూ, కయ్యాలాడుకుంటూ, యుద్ధాలలో ఒకరిని మరొకరు చంపుకుంటూ వుండటం చూస్తారు. ప్రస్తుతం సమస్త మానవులకూ ఆహారం, దుస్తులు, ఆశ్రయం సమకూర్చడానికి తగినంత శాస్త్రవిజ్ఞానం మనవద్ద వున్నది; అయినా మనం అందరికీ అన్నీ సమకూర్చడం లేదు. ప్రపంచంలో వున్న రాజకీయవేత్తలు, యితర నాయకులు అందరూ విద్యావంతులే; వారికి బిరుదులు, డిగ్రీలు, టోపీలు, గౌన్లు వున్నాయి; వారిలో డాక్టర్లు, శాస్త్రజ్ఞులు వున్నారు. అయినా వీరంతా కలిసి మనిషి సుఖసౌఖ్యాలతో నివసించగల ప్రపంచాన్ని సృష్టించలేదు. కాబట్టి ఆధునిక విద్యావిధానం అపజయం పొందింది; పొందినట్లు కాదూ? మీరు కనుక అదే పాత పద్ధతిలో విద్యని అభ్యసించడంలోనే తృప్తి చెందేటట్లయితే, మీరూ జీవితాన్ని మరో ఘోరమయిన తప్పులతడకగా చేసివేస్తారు.

**ప్రశ్న: మా తల్లితండ్రులు మా మేలు కోరుతుంటారు. కాబట్టి, వారు అనుకున్న ప్రణాళికలో మేము ఎందుకు యిమిడిపోగూడదో నేను తెలుసుకోవచ్చునా?**

**కృష్ణమూర్తి:** మీరు మీ తల్లితండ్రులు తయారు చేసిపెట్టిన పథకాల్లో, అవి ఎంత యోగ్యత కలవి అయినాసరే, ఎంత మహత్వ పూర్ణమయినవి అయినా సరే, ఎందుకు యిమిడిపోవాలి? మీరు వట్టి బంకమట్టి ముద్దలు కారు; వట్టి యిసుక సిమెంటు మిశ్రమం కాదు, ఒక మూసలో మిమ్మల్ని అచ్చుపోయడానికి. మీరు కనుక అందులో యిమిడిపోతే, మీరు ఏమయిపోతారు? అందరూ అంటూ వుంటారే మంచి అమ్మాయి అనీ, మంచి అబ్బాయి అనీ, అట్లా అవుతారు; ఆ తరువాత ఏమిటి? మంచిగా వుండటం అంటే అర్థం ఏమిటో మీకు తెలుసునా? మంచితనం

అంటే కేవలం సమాజం చెప్పినట్లు చేయడం కాదు, మీ తల్లితండ్రులు చెప్పినట్లు చేయడమూ కాదు. మంచితనం అనేది వీటికంటె పూర్తిగా విభిన్నమయినది కదూ? మీకు తెలివి, వివేకం వున్నప్పుడే, మీలో ప్రేమభావం వున్నప్పుడే, మీలో భయం లేనప్పుడే మంచితనం అనేది ఊపిరి పోసుకుంటుంది. మీరు భయపడుతూ కనుక వుంటే మంచితనంగా వుండలేరు. సమాజం మీనుండి కోరినది చేసి మీరు పరువు మర్యాదలు పొందవచ్చు – అప్పుడు మీకు సమాజం పూలదండ వేస్తుంది, మీరు ఎంత మంచివారు అని పొగుడుతుంది; అయితే పరువు మర్యాదలు కలిగి వుండటం మాత్రమే కాదు మంచిగా వుండటం అంటే.

చూడండి, మనం చిన్నవయసులో వున్నప్పుడు యిమిడిపోవాలని కోరుకోము; అయితే మరో పక్కన మంచిగా వుండాలనీ కోరుకుంటాం. అందరితో సౌజన్యంగా, సరసంగా వుండాలనీ కోరుకుంటాం, ఔదార్యంతో వుండాలనీ, దయగల పనులు చేయాలనీ కోరుకుంటాం; అయితే వీటన్నింటికి అర్థం మనకు తెలియదు; మనం 'భయపడుతూ వుంటాం' కాబట్టి 'మంచిగా' వుంటాం. మన తల్లితండ్రులు, 'మంచిగా వుండు' అని మనతో అంటారు, మనలో చాలామందిమి మంచిగా వుంటాం; అయితే యిటువంటి 'మంచితనం' అంటే మాత్రం మనకోసం పెద్దవారు తయారుచేసి ప్రణాళికలను అనుసరించి జీవించడమే.

**ప్రశ్న: అధునిక విద్యావిధానం అపజయం పొందిందని మీరు అంటున్నారు. అయితే రాజకీయవేత్తలు కనుక విద్యావంతులు కాకపోతే, వారు యింతకంటే మంచి ప్రపంచాన్ని సృష్టించి వుండేవారని మీరు అనుకుంటారా?**

**కృష్ణమూర్తి:** ఈ విధమయిన విద్యను వారు ఎన్నడూ అభ్యసించి కనుక వుండకపోతే, వారు యింతకంటే మంచి ప్రపంచాన్ని సృష్టించి వుండలేరు అనీ నేను గట్టిగా చెప్పలేను. ప్రజలను పరిపాలించడమంటే అర్థం ఏమిటి? రాజకీయవేత్తలు అసలు చేయవలసినది అదే కదా – ప్రజలను పరిపాలించడం. కాని, వారికి ఆకాంక్షాపరత్వం ఎక్కువ, వారికి అధికారబలం కావాలి, హోదా కావాలి; అందరూ వారికి గౌరవమర్యాదలు యివ్వాలి అని అనుకుంటారు; తాము నాయకులు అవాలి, తమకే అగ్రాసనం కావాలి అని కూడా కోరుకుంటారు; వారు ప్రజలను గురించి ఆలోచించడం లేదు, తమని గురించో, తమ పార్టీలను గురించో వాళ్ళు ఆలోచిస్తూంటారు; పార్టీలు అంటే విస్తరింపబడిన వారి స్వార్థ ప్రయోజనాలే. ఇండియాలో నివసిస్తున్నా, జర్మనీలో, రష్యాలో, అమెరికాలో, చైనాలో ఎక్కడ నివసిస్తున్నా సరే మానవులు మానవులే; అయితే చూడండి, దేశాలను బట్టి మానవులను విభజించడంవలన, మరింత ఎక్కువమంది రాజకీయవేత్తలకు పెద్ద పెద్ద పదవులు లభిస్తాయి, అందువలన ప్రపంచం అంతా కలిపి ఒక్కటే అని ఆలోచించడంలో వారికి ఆసక్తి వుండదు. వారు 'విద్యావంతులే', వారికి చదవడం వచ్చు, వాదించడం తెలుసు, మంచి పౌరులుగా వుండటం గురించి వారు తుదీ మొదలూ లేకుండా మాట్లాడగలరు – అయితే, అగ్రాసనం మాత్రం వారికే యిచ్చితీరాలి. ప్రపంచాన్ని విభజించడం, యుద్ధాలను సృష్టించడం – అదేనా మనం

విద్యావిధానం అని పిలిచేది? ఇదంతా రాజకీయవేత్తలు ఒక్కరే చేయడం లేదు; మనం అందరమూ చేస్తున్నాం. కొంతమందికి యుద్ధం కావాలి, ఎందుకంటే అది వారికి లాభాలు తెచ్చిపెడుతుంది కాబట్టి. అందువల్ల సవ్యమయిన విద్యాధ్యయనం పొందవలసినది ఒక్క రాజకీయనాయకులు మాత్రమే కాదు.

ప్రశ్న: అయితే సవ్యమైన విద్యావిధానం అంటే మీ అభిప్రాయం ఏమిటి?

కృష్ణమూర్తి: నేను యిప్పుడే, యింతకు ముందే చెప్పాను. సరే, మీకు మళ్ళీ వివరిస్తాను. ఆధ్యాత్మికత కలవాడు, ధర్మనిరతుడు అంటే ఒక దేవుడిని, చేతితో కాని, మనసుతోకాని చేసిన ప్రతిమను పూజించే వాడు అని అర్థం కానేకాదు; సత్యం అంటే ఏది, దైవం అంటే ఏమిటి అని నిజంగా విచారణ చేసేవాడు ధర్మచింతనాపరుడు; అటువంటివాడే నిజమైన విద్యావంతుడు. అతను ఏనాడూ ఒక స్కూలుకు వెళ్ళి వుండకపోవచ్చును, అతని వద్ద పుస్తకాలు లేకపోవచ్చును, అతనికి కనీసం చదవడం కూడా రాకపోవచ్చును. అయితే అతను భయంనుండీ, తన అహంభావం నుండీ, తన స్వార్థపరత్వం నుండీ, ఆకాంక్షాపరత్వం నుండీ తన్నుతాను విముక్తి చేసుకుంటూ వుంటాడు. కనుక విద్యాధ్యయనం అంటే కేవలం ఎట్లా చదవాలి, ఎట్లా లెక్కలు కట్టాలి, వంతెనలు ఎట్లా నిర్మించాలి, అణుశక్తిని వినియోగించే నూతన మార్గాలు కనిపెట్టడానికిగాను ఏవిధంగా శాస్త్రపరిశోధనలు చేయాలి, యిటువంటివే యింకా ఎన్నో నేర్చుకొనే ఒక ప్రక్రియ కాదు. మనిషి తనలోవున్న అల్పత్వంనుండి, అవివేకపూరితమయిన తన ఆకాంక్షలనుండి విముక్తి పొందడానికి ప్రధానంగా సహాయం చేయడమే విద్యావిధానం నెరవేర్చవలసిన ధర్మం. ఆకాంక్షాపరత్వం, అది ఏ విషయంలో అయినాసరే, పూర్తిగా అవివేకమయినదీ, అల్పమయినదీ – గొప్ప ఆకాంక్షలు అనేవి లేనే లేవు. ఇక, విద్యాధ్యయనం అంటే భయం లేకుండా స్వేచ్ఛగా పెరిగి పెద్దవాళ్ళవడానికి విద్యార్థికి సహాయం చేయడం అని కూడా అర్థం, అవును కదూ?

ప్రశ్న: ఈ విధంగా ప్రతి మనిషినీ విద్యావంతుడిని ఎట్లా చేయగలుగుతాం?

కృష్ణమూర్తి: ఈ విధంగా విద్యాధ్యయనం చేయాలని మీరు అనుకోవడం లేదా?

ప్రశ్న: కాని ఎట్లాగ?

కృష్ణమూర్తి: మొట్టమొదట యిది చెప్పండి. మీరు ఆ విధంగా విద్యాధ్యయనం చేయాలని కోరుకుంటున్నారా లేదా? ఎట్లాగ అని అడగకండి, ఆ విధంగా మీరు చదువుకోవాలి అనే మనోభావం మీలో కలిగించుకోండి. ఈ తీవ్రమైన మనోభావం మీలో కలిగితే, మీరు పెద్దవారు అవుతున్నకొద్దీ, యితరులలో యీ భావం కలగడానికి మీరు తోడ్పడతారు, తోడ్పడరూ? సర్, యిటు చూడండి; ఏదయినా ఒక ఆట ఆడాలని మీకు గట్టిగా అనిపిస్తే మీతోపాటు ఆడడానికి యితరులను మీరు త్వరలోనే సమకూర్చుకుంటారు. అదే విధంగా, మనం యిప్పుడు చర్చిస్తున్న మార్గంలో విద్యాధ్యయనం చేయాలని నిజంగానే మీకు తీవ్రంగా అనిపిస్తే, అప్పుడు అటువంటి విద్యను సమకూర్చే, సక్రమమైన టీచర్లతో కూడిన ఒక

స్కూలును తయారుచేయడానికి మీరు తోడ్పడతారు. కాని, మనలో చాలామందిమి నిజంగా అటువంటి విద్యాధ్యయనం చేయాలని కోరుకోము, అందుకని, "అటువంటిది ఎట్లా తీసుకొని రాగలము?" అని అడుగుతూ వుంటాం. ఎవరో మరొకరు ఆ ప్రశ్నకు సమాధానం యివ్వాలని ఎదురు చూస్తాం. అయితే, మీరందరూ కనుక - యిప్పుడు వింటున్న ప్రతి విద్యార్థి - టీచర్లు కూడా కలుస్తారని ఆశిస్తున్నాను, - అటువంటి విద్యావిధానం కావాలని కోరుకుంటే, అప్పుడు మీరు దానికోసం ఒత్తిడిచేసి అడిగి, అది జరిగేటట్లు చూస్తారు.

ఒక సాధారణమయిన వుదాహరణే తీసుకోండి. చూయింగ్‌గమ్ అంటే ఏమిటో మీకు తెలుసు, తెలియదూ? మీరందరూ చూయింగ్‌గమ్ కావాలని కోరుకుంటూ వుండటం వల్లనే ఉత్పత్తిదారులు అది ఉత్పత్తి చేస్తున్నారు; అయితే మీరు కనుక అక్కర్లేదనుకుంటే ఉత్పత్తిదారులు దివాలా తీస్తారు. అదే విధంగా, అయితే మరొక భిన్నమైన స్థాయిలో, మీరందరూ యిట్లా అంటే - "మాకు సవ్యమైన విద్య కావాలి, వ్యవస్థీకృత హత్యలకు దారితీసే యీ కుహనా విద్య మాకు వద్దు" - యీ విధంగా కనుక అంటే, నిజంగా మీ లోపలి ఉద్దేశం కూడా అదే అయితే, సవ్యమైన మార్గంలో వుండే విద్యావిధానాన్ని మీరు తీసుకొని రాగలుగుతారు. అయితే చూడండి, మీరు యింకా వయసులో చాలా చిన్నవారు, చాలా భయపడుతూ వుంటారు, అందుకోసమే దీనిని సృష్టించడానికి మీకు సహాయం చేయడం చాలా ముఖ్యమయిన సంగతి.

ప్రశ్న: సవ్యమయిన విద్య కావాలని నేను కోరుకుంటున్నప్పుడు, నాకు టీచర్లు అవసరమా?

కృష్ణమూర్తి: నిస్సందేహంగా అవసరం. సహాయం చేయడానికి మీకు టీచర్ల అవసరం వున్నది, లేదంటారా? అయితే, సహాయం అంటే ఏమిటి? మీరు ప్రపంచంలో ఒంటరిగా బ్రతకడం లేదు, అవును కదూ? మీతోటి విద్యార్థులు వున్నారు, మీ తల్లితండ్రులు వున్నారు, పోస్ట్‌మేన్, పాలు తీసుకొని వచ్చే మనిషి మీరందరూ అవసరమే. ఈ ప్రపంచంలో జీవించడానికి మనమందరం ఒకరికొకరం సహాయం చేసుకుంటాం. అయితే మీరు కనుక, "టీచరు పవిత్రమయినవాడు, ఆయన వుండే స్థాయి ఒకటి, నా స్థాయి మరొకటి" అని అంటే, అప్పుడు అటువంటి సహాయం సహాయం కానేకాదు. బోధనను తన గర్వాన్ని పెంపు చేసుకోవడానికిగాని, తన స్వంత భద్రత కోసమైగాని వుపయోగించుకుంటూ వుండనప్పుడే టీచరు సహాయకారిగా వున్నట్లు అవుతుంది. టీచరు, అతను యిక ఏ పనీ చేయలేదు కాబట్టి బోధనను చేపట్టడం కాకుండా, అతనికి బోధించడం అంటే ప్రీతికరం అవడం వలన బోధనను చేపట్టి వుంటే, అప్పుడు అతను విద్యార్థి భయం లేకుండా ఎదగడానికి సహాయం చేస్తాడు. దీనికి అర్థం ఏమిటంటే - పరీక్షలు వుండవు, గ్రేడులు వుండవు, మార్కులూ వుండవు. మీరు సవ్యమైన విద్యావిధానం సృష్టించాలనుకుంటుంటే, అది సృష్టించడానికి మీకు సహాయం చేయడానికి అటువంటి టీచర్ల అవసరం

వున్నది; కాబట్టి టీచర్లు తాము స్వయంగా సవ్యమయిన విద్యావంతులయి వుండటం అనేది చాలా ముఖ్యం.

**ప్రశ్న: ఆకాంక్షలన్నీ అవివేకమయినవే అయితే మనిషి పురోగమనం ఎట్లా చెందుతాడు?**

**కృష్ణమూర్తి:** పురోగమనం అంటే ఏమిటో మీకు తెలుసా? చూడండి, కాస్త ఓర్పుతో మెలమెల్లగా మనం యీ విషయాన్ని పరిశీలించుదాం. పురోగమనం అంటే ఏమిటి? మీ రెప్పుడయినా దానిని గురించి ఆలోచించారా? యూరప్ వెళ్లాలంటే, పడవలో పక్షం రోజులు ప్రయాణంచేసి అక్కడికి చేరడానికి బదులు, విమానంలో కొద్ది గంటల్లో చేరగలిగినప్పుడు అది పురోగమనం అవుతుందా? చాలా వేగంగా వెళ్ళే ప్రయాణ సాధనాలు, ప్రసార సాధనాల్లో నూతన ఆవిష్కరణలు, మరింత పెద్దవయిన తుపాకుల తయారీ, ఒకరినొకరు నాశనం చేసుకోవడానికి ఘనమైన, మేలురకం మార్గాలు కనిపెట్టడం, ఒకరి తరువాత ఒకరిని బాణాలతో కొట్టిచంపడానికి బదులుగా ఒకే ఒక అణుబాంబుతో వేలాది ప్రజలను హతమార్చడం – దీనిని మనం పురోగమనం అంటాం, అంటాం కదూ? కనుక సాంకేతికమయిన అర్థంలో పురోగమనం సాధించామా? కానీ, ఇంకే దిశలోనైనా పురోగమించామా? యుద్ధాలు ఆపగలిగామా? ప్రజలు యింకా ఎక్కువ దయగా, ఎక్కువ ప్రేమభావం కలిగి, మరింత దాతృత్వం వుండి, ఎక్కువ లోతుగా ఆలోచించకలిగి, క్రౌర్యం తగ్గించుకొని వున్నారా? అవునని కాని, కాదనికాని మీరు చెప్పనక్కరలేదు; అయితే యీ వాస్తవాలవంక ఒకసారి పరికించి చూడండి. శాస్త్రవిజ్ఞాన రంగంలో, భౌతిక రంగంలో మనం బ్రహ్మాండమయిన పురోగమనాన్ని సాధించాం, కాని, అంతర్గతంగా మనం చలనం లేకుండా నిలిచిపోయాం; అవును కదూ? మనలో చాలామందికి విద్యాధ్యయనం అంటే ముక్కాలిపీటకు ఒక కాలు మాత్రమే పొడిగించినట్లుగా తయారయింది; దానివలన మనకు సమతుల్యం లేదు; అయినా సరే మనం పురోగమనం గురించి మాట్లాడతాం, వార్తాపత్రికలన్నింటి నిండా యిదే వుంటుంది.

**ప్రశ్న: నాకొక స్నేహితురాలు ఉంది. ఆమె తన తల్లిదండ్రులని ద్వేషిస్తుంది, ఎందుకంటే, ఆమె ప్రేమించే ఒక వ్యక్తినుండి వాళ్లు ఆమెను విడదీశారు; నేను ఆమెకు ఎట్లా సహాయం చేయగలను?**

**కృష్ణమూర్తి:** ఇది చాలా జటిలమైన ప్రశ్న, అవును కదూ? చూడండి, జీవితం అంటే అంత తేలికయినది కాదు; అందులో కొంతభాగం మరీ క్రూరంగా కూడా వుంటుంది. తమ పిల్లలని గురించి ఏమాత్రం పట్టించుకోని దయావిహీనులైన తల్లితండ్రులు వుంటారు. ఒకవేళ వారు అక్కర చూపించినా, వారికి కావలసినదల్లా పిల్లలు వారికి విధేయంగా వుండటం, అనుకరించడం, తల్లిదండ్రులు కోరినవన్నీ తు–చ తప్పకుండా చేయడం. అందువలన క్రమక్రమంగా పిల్లలలో ప్రతిరోధభావం పేరుకొనిపోతుంది, అవును కదూ? తండ్రి కనుక తెలివికలవాడయి వుండి, తండ్రి దగ్గర లేనప్పుడు తల్లి మూర్ఖంగా పట్టుబట్టే మనిషి అయితే, లేదా తల్లి బదులు

తండ్రి ఆ విధంగా ప్రవర్తించినా, పిల్లలు ఆ తల్లి అంటేనో, తండ్రి అంటేనో ప్రతిఘటన, విరోధభావం పెంచుకుంటారు. మీ స్నేహితురాలి ఎడల యింకొంత అవగాహన చూపి, మరికొంత ఆపేక్ష చూపించి, మీరు, నేను మాట్లాడుకున్న విషయాలను గురించి, మీరు స్వయంగా అర్థం చేసుకున్న వాటిని గురించి, ఆమెకు నెమ్మదిగా, దయగా వివరించి చెప్పండి. బహుశ ఆ విధంగా ఆమెకి సహాయం చేయగలరేమో!

చూడండి, మీకు ఒక అన్యాయం జరిగింది అని అనుకున్న క్షణంనుండీ, మీకు మరొకరిపై ద్వేషం కలిగిన క్షణం నుండీ మీరు అసహ్యించుకొనే ఆ వ్యక్తి కంటే అది మీకే ఎక్కువ హాని కలిగిస్తుంది, ఎందుకంటే – ఆ మనోభావం మీ లోపల కుళ్ళిపోతున్న ఒక గాయంవలె తయారవుతుంది; అయితే యిదంతా చిన్నపిల్లలకు, యువకులకు అవగాహన అవడం చాలా కష్టం. పిల్లలకి తెలిసినదల్లా అల్లరి, హాయిగా ఆటలూ, పాటలూ. వాళ్ళు అట్లాగే వుండాలి మరి; తల్లితండ్రులు కనుక తమ పిల్లవాడిని ఒక ప్రత్యేకమయిన నమూనాలోనో, మూసలోనో నిర్బంధిస్తే అది ఆ పిల్లవాడిలో అతి తీవ్రమయిన ప్రతికూలతనూ, అంధవైరాన్ని సృష్టిస్తుంది; అతను పెద్దవాడు అవుతున్నకొద్దీ దీనికి ప్రతిగా ఎవరో ఒకరిపై కచ్చ తీర్చుకుంటూ వుంటాడు. ఇదంతా మీరు అవగాహన చేసుకోవడం ఆరంభిస్తే, మీ స్నేహితురాలితో యిదంతా చర్చించి, ఆమె యీ విధమయిన ద్వేషం, విరోధభావం తన లోపల పెంచుకోకుండా బహుశ మీరు సహాయం చేయగలరేమో!

ప్రశ్న: విద్యార్థికి నిర్వచనం ఏమిటి?

కృష్ణమూర్తి: ఒక నిర్వచనం తెలుసుకోవడం అనేది చాలా సులభం, సులభమే కదూ? మీరు చేయవలసినదల్లా ఏమిటంటే, ఒక నిఘంటువును తీసుకొని, సరియైన చోట తెరవడం; అప్పుడు అదే సమాధానం తెలుపుతుంది. అయితే మీరు కోరేది అటువంటి రకం నిర్వచనం కాదు, అవునా? మీకు దానిని గురించి మాట్లాడాలని వుంది. అసలయిన విద్యార్థి అంటే ఏమిటో మీకు తెలుసుకోవాలని వుంది. పరీక్షల్లో ఉత్తీర్ణుడయి; ఒక ఉద్యోగం సంపాదించుకొని, ఆ పైన పుస్తకాలన్నీ మూసివేసిన వ్యక్తి అసలయిన విద్యార్థి అవుతాడా? విద్యార్థిగా వుండటం అంటే అంతరార్థం జీవితాన్ని అధ్యయనం చేయడం, మీ పాఠ్యప్రణాళికకు ఆవశ్యకమయిన కాసిని పుస్తకాలు మాత్రమే చదవడం కాదు; కొంతకాలం మాత్రమే కొన్ని విషయాలు మాత్రమే కాకుండా జీవిత పర్యంతం ప్రతి ఒక్కటీ పరిశీలించే శక్తి సామర్థ్యాలని కూడా అంతర్భావం. విద్యార్థి అంటే కేవలం పుస్తకాలు చదివేవాడు మాత్రమే కాదు, జీవితంలోని అన్ని కార్యకలాపాలను – బాహ్యమయినవి, అంతర్గతమయినవి – అన్నింటినీ, "ఇది సరియైనది, అది సరికాదు", "ఇది ఒప్పు, అది తప్పు" అని అనకుండా పరిశీలంచే సామర్థ్యం కలిగినవాడు అని గట్టిగా చెప్పవచ్చు. మీరు దేనినయినా ఖండిస్తున్నట్లయితే దానిని సరిగ్గా పరిశీలించలేరు, పరిశీలించ కలుగుతారా? పరిశీలించాలంటే ఖండించకుండా, మరొక దానితో పోల్చిచూడకుండా మీరు అధ్యయనం చేయాలి. మిమ్మల్ని మరొకరితో పోల్చిచూస్తే, అప్పుడు నేను మిమ్మల్ని అధ్యయనం చేస్తున్నట్లు కాదు, కాదు కదూ? నేను మిమ్మల్ని మీ

చిన్నతమ్ముడితోనో, మీ పెద్ద అక్కయ్యతోనో పోల్చిచూస్తే, అప్పుడు మీ అక్కయ్యకో, మీ తమ్ముడికో ప్రాముఖ్యం యిచ్చినట్లవుతుంది, కాబట్టి నేను మిమ్మల్ని అధ్యయనం చేయడం లేదని అర్థం.

అయితే, మన విద్యావిధానం అంతా పోల్చిచూడటమే. మీరు ఎప్పుడూ అంతులేకుండా మిమ్మల్ని కాని, మరొకరిని కాని ఎవరో ఒకరితో – మీ గురువుతోనో, మీ ఆదర్శంతోనో, చాలా చాతుర్యంగల మీ నాన్నగారితోనో, ఒక గొప్ప రాజకీయవేత్తతోనో లేదూ మరొకరితోనో – పోల్చిచూస్తూ వుంటారు. ఈ విధమయిన పోల్చిచూడటం, ఖండించడం అనే ప్రక్రియలు మీరు పరిశీలించడాన్ని, అధ్యయనం చేయడాన్ని నిరోధిస్తాయి. కనుక నిజమయిన విద్యార్థి అంటే పోల్చిచూడకుండా, ఆమోదించకుండా, ఖండించకుండా జీవితంలోని ప్రతి ఒక్కదానినీ బాహ్యంగానూ, అంతర్గతంగానూ పరిశీలించేవాడు. అతడు శాస్త్ర సంబంధమయిన విషయాలను పరిశోధన చేయగలిగిన సమర్థుడే కాకుండా, తన మనసులో జరిగేవాటిని, తన లోపలి భావాలను శాస్త్ర సంబంధమైన అంశాలను పరిశీలించడం కంటే యిది మరింత కఠినమయినది – పరిశీలించగలిగి కూడా వుంటాడు. తన మనసులో జరిగే కార్యకలాపాలనన్నింటినీ తనే అవగాహన చేసుకోవడానికి అపారమయిన అంతర్దృష్టి, ఖండించడం అనేది లేని అశేషమయిన విచారణ శీలత్వం కావలసి వుంటాయి.

**ప్రశ్న: ఆదర్శ వాదులంతా మాయవేషధారులు అని మీరంటున్నారు, అసలు ఆదర్శవాది అని మీరు ఎవరిని అంటారు?**

**కృష్ణమూర్తి:** ఆదర్శవాది అంటే ఎవరో మీకు తెలియదా? నాలో హింస, దౌర్జన్యం వున్నప్పుడు నా ఆదర్శం అహింసాత్మకంగా వుండటం అని నేను అనవచ్చు; అయితే, నాలో దౌర్జన్యం వున్నది అనే వాస్తవం మాత్రం అట్లాగే వుండిపోతుంది. ఆదర్శం ఏమిటి అంటే యిక ముందు ఏదో ఒక నాటికి నేను అవబోతానని ఆశించేది. నేను అహింసాత్మకంగా అవాలంటే ఎన్నో సంవత్సరాలు పట్టవచ్చు; యీలోగా నేను హింసాత్మకంగానే వుండిపోతాను – అది అసలు యథార్థం. హింసాత్మకంగా వుండి, నేను అహింసాత్మకంగా అవాలని సర్వదా ప్రయత్నిస్తూ వుంటాను, యిదేమో కృత్రిమం; మరి యిది కపట వేషం కాదా? నాలోని హింసను అవగాహన చేసుకొని, దానిని అంతం చేసుకొనడానికి బదులు, నేను మరొకటి ఏదో అవాలని ప్రయత్నిస్తున్నాను. తను ఏమిటో, తను వున్న స్థితి ఏమిటో అట్లా కాకుండా మరొకటి అవాలని ప్రయత్నిస్తున్న మనిషి తప్పకుండా మాయవేషధారే. ఇది ఎటువంటిదంటే, నేను నా ముఖానికి ఒక ముసుగు తగిలించుకొని, "నేను కాదు, మరొకరిని" అని నేను అనడం వంటిది; ఆ ముసుగు వెనకాల వున్నది నిజంగా నేనే, నా ముఖమే. అట్లా కాకుండా యీ హింస అనే ప్రక్రియ అంతా క్షుణ్ణంగా తెలుసుకొని, అవగాహన చేసుకొనగలిగితే, అప్పుడు హింసనుండి విముక్తి చెందే అవకాశం వుంది.

★ ★ ★

# అధ్యాయం 3

**మీరు** చిన్నవయసులో వున్నప్పుడు, అన్ని విషయాలను గురించి అంతా తెలుసుకోవాలని మీకు కుతూహలంగా వుంటుంది; సూర్యుడు ఎందుకు ప్రకాశిస్తాడు, నక్షత్రాలు అంటే ఏమిటి అనేవి, యింకా చంద్రుడిని గురించి, మన చుట్టూ వున్న ప్రపంచం గురించి అన్నీ తెలుసుకోవాలనీ వుంటుంది; అయితే మనం పెరిగి పెద్దవాళ్ళం అవుతున్నకొద్దీ, జ్ఞానం ఏ మనోస్పందనా లేని వట్టి సమాచార సేకరణగా మాత్రమే తయారవుతుంది. మనం ఏదో ఒక అంశంలో ప్రత్యేక నిపుణులం అవుతాం; యీ విషయం గురించి, ఆ విషయం గురించి చాలా తెలుసుకుంటాం; మన చుట్టూ వున్న వాటిని గురించి మాత్రం – వీథిలో వున్న బిచ్చగాడు, కారులో వెళ్ళిపోతున్న భాగ్యవంతుడు వంటి వాటిని గురించి చాలా తక్కువ ఆసక్తి చూపుతాం. ప్రపంచంలో సంపదలు, పేదరికం అనేవి ఎందుకున్నాయో తెలుసుకోవాలనుకుంటే, మనం దానికి విశదమయిన సమాధానం కనుగొనగలుగుతాం. ప్రతి సందేహానికి సమాధానపరిచే ఒక వివరణ వుంటుంది, యీ వివరణ మనలో చాలామందిని తృప్తిపరచినట్లే కనబడుతుంది. మతం విషయంలో కూడా యీ విధంగానే చెప్పచ్చు. సమాధానపరిచే వివరణలతో మనం తృప్తి చెందుతాం; అన్నింటినీ వివరించి సమాధానం చెప్పేసెయ్యడమే జ్ఞానం అని మనం అంటాం. విద్యాధ్యయనం అని మనం అనేది యిదేనా? మనం తెలుసుకొనడం ఎట్లాగ అనేది నేర్చుకుంటున్నామా, మన మనసులను జోకొట్టి ఆపైన తరచి చూసి తెలుసుకోవలసిన అవసరం లేకుండా వుండటానికి వట్టి వివరణాత్మక సమాధానాలు, నిర్వచనాలు, సిద్ధాంతాలు కావాలని కోరుకుంటున్నామా?

మన పెద్దవారు మనకు అన్నీ వివరించి చెప్పి వుండవచ్చు, కాని దానితో మనలోని ఆసక్తి దాదాపుగా చచ్చిపోయిందనే చెప్పాలి. మనం పెరిగి పెద్దవాళ్లం అవుతున్న కొద్దీ జీవితం మరింత సంకీర్ణంగాను, చాలా కఠినంగానూ తయారవుతుంది. తెలుసుకొనవలసిన విషయాలు ఎన్నో వుంటాయి, ఎంతో దుర్భర వేదన, బాధలు వుంటాయి. ఇదంతా – యీ సంక్లిష్టత అంతా చూసి వివరణాత్మకమైన ఒక సమాధానం సంపాదించి, యిక అంతా పరిష్కరించి వేశామని మనం అనుకుంటాం. ఒకరు చనిపోతారు, దానిని గురించి ఒక వివరణ యివ్వబడుతుంది; కనుక బాధను వివరణ ద్వారా మొద్దుబారేటట్లు చేస్తాం. మనం చిన్న వయసులో వున్నప్పుడు సాధారణంగా యుద్ధం అనే మాట అనగానే దానికి వ్యతిరేకంగా తిరగబడతాం. కాని, పెద్దవాళ్ళం అవుతున్నకొద్దీ యుద్ధం ఎందుకు జరగాలో యిచ్చే ఆ వివరణను అంగీకరిస్తాం, ఆపైన మన మనసులేమో మొద్దుబారిపోతాయి.

మనం చిన్నవయసులో వున్నప్పుడు వివరణలతో, సమర్థింపులతో తృప్తిచెందకుండా, వివేకంతో ఎట్లా వుండాలో తెలుసుకొని, ఆపైన విషయాలను గురించిన సత్యం ఏది అని తెలుసుకోవడం ప్రధానం; స్వేచ్ఛగా కనుక లేకపోతే మనం తెలివిగా వుండలేం. వృద్ధులమూ, వివేకవంతులమూ అయాకే స్వేచ్ఛ కలుగుతుందని అంటారు, కాని మనం యింకా చిన్నవయసులో వున్నప్పుడే స్వేచ్ఛ తప్పక వుండవలసిన అవసరం వుంది. స్వేచ్ఛ అంటే మనకు యిష్టం వచ్చినది చేయడానికి స్వేచ్ఛకాదు; మన లోపలి సహజేచ్ఛలను, ప్రేరణలను గురించి బాగా లోతుగా అవగాహన చేసుకునే స్వేచ్ఛ వుండాలి. భయం లేని ఒక స్వేచ్ఛ వుండి తీరాలి. అయితే సమర్థిస్తూ చేసే వివరణల ద్వారా భయం నుండి విముక్తి కలగదు. మృత్యువును గురించి, మృత్యువు అంటే వుండే భయం గురించి మనకు ఎరుక వుంది. మృత్యువును గురించి సమర్థిస్తూ చేసే వివరణ ద్వారా మరణించడం అంటే ఏమిటో తెలుసుకోగలమా, మృత్యుభయంనుండి విముక్తి కలుగుతుందా?

మనం పెద్దవాళ్ళం అవుతున్నకొద్దీ చాలా సరళంగా అంటే సంక్లిష్టత లేకుండా ఆలోచించే శక్తి సామర్థ్యాలు కలిగివుండటం ముఖ్యం. సరళత, సరళ శీలత్వం అంటే ఏమిటి? సరళ శీలత్వం గల మనిషి ఎవరు? ఒక తపస్విలాగా జీవితం గడిపేవాడా? చాలా తక్కువగా వస్తువులు స్వంతానికి కలిగివున్నవాడా? – అతను నిజంగా సరళత్వం కలిగినవాడా? సరళత్వం అంటే యింతకంటే పూర్తిగా విభిన్నమయినది కాదూ? సరళత్వం అంటే మనసుకు, హృదయానికీ చెందినది. మనలో చాలామందిమి సంక్లిష్టమయిన మనుష్యులం. మనకు అనేకమయిన కోర్కెలు, కాంక్షలు వుంటాయి. ఉదాహరణకి మీరు మీ పరీక్షలు పాసుకావాలని కోరుకుంటుంటారు, మీకు ఒక మంచి ఉద్యోగం దొరకాలని కోరుకుంటుంటారు; మీకు ఆదర్శాలు వుంటాయి, మంచి సౌశీల్యం పెంపొందించుకోవాలని కోరుకుంటారు; యింకా ఎన్నో. మనసు అనేకమయినవి కావాలని ఒత్తిడి చేసి అడుగుతుంటుంది; ఇదంతా సరళ శీలత్వం కిందకు వస్తుందా? ఇది తెలుసుకోవడం చాలా ముఖ్యం కదూ?

సంకీర్ణమయిన మనసు ఒక విషయంలోని సత్యాన్ని తెలుసుకోలేదు, ఏది నిజమయినది అనే సంగతి తెలుసుకోలేదు – అదే మనకు వున్న సంకటం. బాల్యం నుండి మనం అనుకూలంగా లొంగివుండటానికి శిక్షణ పొంది వుంటాం తప్ప సంక్లిష్టత్వం నుండి సరళ శీలత్వానికి ఏ విధంగా తగ్గించుకోవాలో మనకు తెలియదు. చాలా సరళంగానూ, సూటిగాను వున్న మనసు మాత్రమే నిజమైనదానిని, సత్యాన్ని తెలుసుకొనగలుగుతుంది. మనం ఎక్కువగా, యింకా ఎక్కువగా జ్ఞానం సంపాదిస్తాం కాని, మన మనసులు మాత్రం ఎన్నడూ సరళంగా వుండవు; సరళంగా వుండే మనసు మాత్రమే సృజనాత్మకంగా వుంటుంది.

మీరు ఒక చెట్టును రంగులలో చిత్రంగా గీసినపుడు మీరు చిత్రించేది ఏమిటి? చెట్టు ఎట్లా కనబడుతుందో – తన ఆకులతో, తన కొమ్మలతో, తన మొదలుతో పూర్తిగా అన్ని విశేషాలతో – ఆ చెట్టు బొమ్మను మాత్రమే మీరు చిత్రిస్తున్నారా? లేదూ ఆ చెట్టు మీలో జాగృతం చేసిన మనోభావాలలో నుండి చిత్రాన్ని చిత్రిస్తున్నారా? చెట్టు మీకు ఏదయినా చెప్పినట్లయితే, అందించినట్లయితే ఆ

ఆంతరికమైన అనుభవం ద్వారా మీరు చిత్రిస్తారు; మీ మనోభావం అత్యంత సంకీర్ణంగా వుండి వుండవచ్చు; మీరు చిత్రించిన చిత్రం మాత్రం గొప్ప సరళ శీలత్వంలో నుండి జనించినదై వుంటుంది. మీరు చిన్నవయసులో వున్నప్పుడు, మీ వద్ద మీకు కావలసిన సమాచారం ఎంతో వున్నా మీ మనసును చాలా సరళంగా, కల్మషరహితంగా, స్వచ్ఛంగా వుంచుకోవడం చాలా అవసరం.

**ప్రశ్న: సవ్యమయిన తీరులో మేము అందరం విద్యావంతులం అయితే భయం నుండి విముక్తి చెందుతామా?**

**కృష్ణమూర్తి:** భయం నుండి విముక్తి చెందడం చాలా ముఖ్యం, ముఖ్యమే కదూ? వివేకం ద్వారా తప్ప మరేవిధంగానూ మీరు భయం నుండి విముక్తి చెందలేరు. కనుక, ముందుగానే భయాన్ని ఎట్లా వదుల్చుకుందామా అనికాక వివేకవంతంగా ఎట్లా వుండాలో మనం తెలుసుకుందాం. వివేకవంతంగా వుండటం అనేది మనం అనుభవించగలిగితే అప్పుడు భయాన్ని వదుల్చుకోగలగటం ఎట్లా అనేది తెలిసిపోతుంది. భయం అనేది ఎప్పుడూ మరొకదాని మూలంగా అయివుంటుంది; దానికి స్వతంత్రమైన అస్తిత్వం లేదు; అంటే తనంతట తనే ఏ కారణం లేకుండా వుండదు. మృత్యువు అంటే మనకు భీతి వుంటుంది, అనారోగ్యం అంటే భయం, పోగొట్టుకోవడం అంటే భయం, తల్లితండ్రులు ఎడల భయం, యితరులు ఏమంటారో అని భయం, యింకా యితరమయినవి; ఇప్పుడు సమస్య ఏమిటంటే, భయాన్ని ఎట్లా వదిలించుకోవాలని కాదు; భయాన్ని ఎట్లా అవగాహన చేసుకోవాలి, ఎట్లా ఎదుర్కోవాలి, ఆపైన దానికి ఆవలగా ఎట్లా దాటిపోవాలి అన్నది.

సరే, విద్య మనలో వివేకం కలగడానికి ఏవిధంగా సహాయం చేస్తుంది? వివేకం అంటే ఏమిటి? పరీక్షల్లో ఉత్తీర్ణులవడానికి సంబంధించినదా, చాతుర్యంతో వుండటమా? మీరు చాలా పుస్తకాలు చదివి వుండవచ్చు, ఎంతో శక్తి సామర్థ్యాలు కలిగి వుండవచ్చు, అయితే యిదంతా మిమ్మల్ని వివేకవంతులుగా చేస్తుందా? లేదూ మీరు సమన్వయత్వం చెందివున్నప్పుడు మాత్రమే మీలో వివేకం ఉదయిస్తుందా? మనలో అనేకమైన వేరువేరు అంశాలు వుంటాయి, అవి అన్నీ కలిపితేనే మనం; ఒక్కొక్క సమయంలో మనం ఆగ్రహావేశంలో వుంటాం, యీర్ష్యాభావంతో ఒకసారి, దౌర్జన్యపూరితంగా మరోసారి వుంటాం, మరికొన్ని సమయాల్లో అణకువగా, ఔదార్యంగా, ప్రశాంతంగా వుంటాం. వేరు వేరు క్షణాలలో వేరు వేరు వ్యక్తులలాగా ప్రవర్తిస్తాం; మనం ఎప్పుడూ మొత్తంగా వుండం, ఎప్పుడూ సంపూర్ణంగా సమన్వయం చెంది వుండం, వుంటామా? ఒక మనిషికి అనేకమైన కోర్కెలు వున్నప్పుడు అతను అంతర్గతంగా అనేక వ్యక్తులుగా ముక్కలయిపోయి వుంటాడు.

ఈ సమస్యతో మనం నేరుగా వ్యవహరించాలి. సమస్య ఏమిటంటే భయాన్ని పోగొట్టుకోవడానికిగాను ఏ విధంగా వివేకవంతంగా వుండాలి అనేది. మీ బాల్యం నుండీ కనుక మీకు ఏ కష్టం కలిగినా సరే, యితరులు మీతో దానిని గురించి

చక్కగా చర్చించి వుంటే, ఆ విధంగా మీ అవగాహన అనేది కేవలం నోటి మాటల రూపంలో కాకుండా, జీవితాన్ని సంపూర్ణంగా పరికించకలిగేందుకు తోడ్పడివుంటే, అప్పుడు అటువంటి విద్య మీలో వివేకాన్ని జాగృతం చేయగలుగుతుంది, తద్వారా మీ మనసును భయాన్నుండి విముక్తం చేయగలుగుతుంది.

**ప్రశ్న: ఆకాంక్షలు కలిగివుండటం అవివేకమయినది, క్రూరమైనది అని మీరు అన్నారు. సవ్యమయిన విద్యని అభ్యసించాలనే ఆకాంక్ష వుండటం కూడా అవివేకమయినది, క్రూరమైనదేనా?**

కృష్ణమూర్తి: మీరు ఆకాంక్ష పడుతున్నారా? అసలు ఆకాంక్షాపరత్వం అంటే ఏమిటి? మీరు మరొకరిని మించిపోయి వుండాలని కోరుకుంటే, మరొకరి కంటే ఎక్కువ మార్కులు తెచ్చుకోవాలని కోరుకుంటే – దానిని ఆకాంక్షాపరత్వం అని మనం తప్పకుండా అనాలి. ఒక చిన్న రాజకీయవేత్తకు తానొక గొప్ప రాజకీయవేత్త అవాలని కోరుకోవడంలో ఆకాంక్ష వుంది; కాని సరియైన తీరులో విద్యని అభ్యసించాలని కోరుకోవడంలో ఆకాంక్షాపరత్వం వున్నదా? ఒక పనిని ఆ పని మీకు ప్రీతికరమయినది కాబట్టి చేస్తుంటే అది ఆకాంక్ష అవుతుందా? మీరు రచనలు చేస్తున్నా, చిత్రాలు గీస్తున్నా, కీర్తి ప్రతిష్ఠలు సంపాదించడంకోసం కాకుండా, మీకు రచించడం అంటే, చిత్రాలు గీయడం అంటే ప్రీతి కాబట్టి చేస్తుంటే – అది ఏ విధంగానూ ఆకాంక్షాపరత్వం కాదు. మీరు యితర రచయితలతో, చిత్రకారులతో మిమ్మల్ని పోల్చుకున్నప్పుడు, మీరు బాగా పైకి పోవాలని, అందరికంటే ముందుకు పోవాలనీ అనుకున్నప్పుడు, అప్పుడు ఆకాంక్షాపరత్వం వున్నదని చెప్పవచ్చు.

కాబట్టి మీరు ఒక పనిని అది చేయడం అంటే మీకు నిజంగా ప్రేమ, ప్రీతి కాబట్టి చేస్తూ వుంటే అది ఆకాంక్షాపరత్వం కాదు.

**ప్రశ్న: సత్యము, శాంతి కనుగొనాలని కోరుకునేవారు సన్యాసం స్వీకరిస్తారు; కాబట్టి సన్యాసిలో సరళశీలత్వం వుంటుంది.**

కృష్ణమూర్తి: శాంతి కావాలని కోరుకుంటున్నప్పుడు ఆ వ్యక్తికి సరళశీలత్వం అంటే తెలిసివుంటుందా? ఒక సన్యాసిగానో, సాధువుగానో మారితేగాని వ్యక్తికి సరళత్వం వున్నట్లు కాదా? శాంతి అనేది మనసుకి సంబంధించినది కాదని గట్టిగా చెప్పవచ్చు. నేను శాంతి కోరుకుంటూ, నా మనసులోనుండి దౌర్జన్యపూరితమయిన ఆలోచనలన్నీ తోసివేసెయ్యడానికి ప్రయత్నిస్తే, అది నాకు శాంతిని కలిగిస్తుందా? నాలో కనుక చాలా కోర్కెలు వుండి, నాకు ఎటువంటి కోరికా వుండకూడదు అని నేను అంటే, నేను ప్రశాంతంగా వుండగలుగుతానా? మీరు ఏదయినా కోరుకున్న మరుక్షణంలోనే మీలో సంఘర్షణ, పోరాటం బయలుదేరుతాయి. కోరుకోవడం అనే సంపూర్ణ ప్రక్రియను మీరు స్వయంగా అవగాహన చేసుకున్నప్పుడు సరళ శీలత్వం అనేది ఉదయిస్తుంది.

**ప్రశ్న: సవ్యమయిన మార్గంలో మేము విద్యావంతులమయితే, మేము భయం నుండి విముక్తి చెందుతాము. తప్పు మార్గం ద్వారా విద్యావంతులం అయితే మేము భయపడుతూ వుంటాం. ఇది నిజమేనా?**

**కృష్ణమూర్తి:** అది నిజమే అని స్పష్టంగానే తెలుస్తున్నది కదూ, అవునా కాదా? మనమందరమూ ఏదో ఒక దానిని గురించి భయపడుతునే వుంటాం కదూ? ప్రతివారూ ఒక్కొక్క విషయం గురించి భయపడుతుంటారు – ప్రజాభిప్రాయం గురించి, మృత్యువు గురించి, వ్యాధులను గురించి; ఇది స్పష్టంగా కనబడుతున్న వాస్తవం.

**ప్రశ్న: మీరు అన్నట్లు ప్రతివారూ భయపడుతూ వుంటే, అప్పుడు ఎవ్వరూ మహాత్ములూ కారు, వీరులూ కారు. అంటే - యీ ప్రపంచంలో అసలు గొప్పవారు లేనేలేరా?**

**కృష్ణమూర్తి:** దీనిని కేవలం తార్కికవాదంతో తర్కించడం అనాలి, అవును కదూ? గొప్ప వ్యక్తులు, మహాత్ములు, వీరులు, నాయకులు – వీరిని గురించి మనం ఎందుకు పట్టించుకోవాలి? మీరు ఏమిటి అనే విషయం మాత్రమే ప్రధానమయినది. మీరు భయపడుతూ కనుక వుంటే, మీరొక అందవికారమయిన ప్రపంచాన్ని సృష్టిస్తారు. అదీ అసలు సమస్య, గొప్పవారు వున్నారా లేరా అని కాదు.

**ప్రశ్న: వివరణ అనేది మంచిది కాదు అని మీరు అన్నారు. మరి మేము యిక్కడికి వచ్చింది వివరణ కోసమే. ఇది మంచిది కాదా?**

**కృష్ణమూర్తి:** వివరణాత్మక సమాధానాలు మంచివి కాదని నేను అనలేదు. వివరణలతో మీరు తృప్తి చెందకూడదని నేను అన్నాను.

**ప్రశ్న: ఇండియా భవిష్యత్తును గురించి మీ అభిప్రాయం ఏమిటి?**

**కృష్ణమూర్తి:** ఏ అభిప్రాయమూ లేదు, నాకు బొత్తిగా ఏ అభిప్రాయమూ లేదు. ఇండియాకు, ఇండియా అనే ఒక దేశంగా ప్రాముఖ్యం వున్నదని నేను అనుకోను. మనకు ప్రధానమైనది ప్రపంచం. మనం చైనాలో నివసిస్తున్నా, జపానులో అయినా, యింగ్లండులో, యిండియాలో లేదూ అమెరికాలో అయినా, "నా దేశం నాకు చాలా ముఖ్యమయినది" అని మనం అంటూ వుంటాం, అంతేకాని – ప్రపంచం అంతటినీ కలిపి మొత్తంగా ఎవరూ చూడటంలేదు; అంతు లేకుండా యుద్ధాలు మళ్ళీ మళ్ళీ జరుగుతూ వుండటం గురించే చరిత్ర గ్రంథాలన్నీ నిండివుంటాయి. మనల్ని మనం మానవులుగా పరిగణించుకుంటూ అవగాహన చేసుకోవడం ఆరంభిస్తే, అప్పుడు బహుశ ఒకరినొకరం చంపుకోవడం నిలిపివేసి, యుద్ధాలు అనేవే జరగకుండా చేస్తామేమో! కాని, జాతీయతా భావాలు అనేవి కలిగి వున్నంతవరకు, మన దేశం గురించి మాత్రమే మనం ఆలోచిస్తున్నంతవరకు ఒక భయంకరమైన ప్రపంచాన్నే మనం సృష్టిస్తూ వుంటాం. ఒక్కసారి మనం కనుక యీ భూమి 'మనది',

ఖా నేలమీద మనమందరం సుఖసంతోషాలతో, శాంతితో జీవించవచ్చును అనే సంగతి గ్రహించినట్లయితే, అప్పుడు మనమందరం కలిసి నవ్యనూతనమైన దానిని నిర్మించవచ్చు; కాని మనం మనల్ని గురించి యిండియన్లు అని, జర్మన్లు అని, రష్యన్లు అని మాత్రమే ఆలోచించుకుంటూ, యితరుల నందరినీ విదేశీయులు అని పరిగణిస్తూ వుంటే, అప్పుడు శాంతి అనేది వుండదు, ఏ నూతన ప్రపంచాన్నీ సృష్టించలేము.

**ప్రశ్న: ఈ ప్రపంచంలో గొప్పవారు చాలా కొద్దిమంది వున్నారని మీరు అన్నారు. అప్పుడు మీరు ఎవరు?**

**కృష్ణమూర్తి:** నేను ఎవరినయినా ఫరవాలేదు. ఆ విషయం ప్రధానం కాదు. ముఖ్యమైన సంగతి ఏమిటంటే – యిక్కడ చెప్పిన విషయాలలో సత్యం ఏమిటి, అసత్యం ఏమిటి అనేది తెలుసుకొనడం. ఫలానావారు చెప్పారు కాబట్టి ఫలానా విషయం ముఖ్యమయినది అని కనుక మీరు అనుకుంటే, మీరు నిజంగా సరిగా వినడం లేదని అర్థం; సత్యమయినది ఏదో, అసత్యమయినది ఏదో మీరు స్వయంగా కనుగొనడానికి ప్రయత్నించడం లేదని అర్థం.

అయితే చూడండి, మనలో చాలా మందిమి మనమే స్వయంగా – సత్యమైనదేమిటో అని మనకు మనమే స్వయంగా – తెలుసుకోవాలంటే భయపడుతూ వుంటాం, అందువల్లనే మరొకరు చెప్పినదానిని అట్లాగే ఆమోదించి వేసేస్తాం. ముఖ్యమైన సంగతి ఏమిటంటే – ప్రశ్నించడం, పరిశీలించడం; అంగీకరించడం కానేకాదు. దురదృష్టవశాత్తు మనలో చాలామందిమి మనం చాలా గొప్పవాళ్ళు అని పరిగణిస్తున్న వాళ్ళు చెప్పింది మాత్రమే వింటాం; బాగా స్థాపించుకొని పోయిన అధిపత్యానికి, ఉపనిషత్తులకు, గీతకు, మరొకదానికి మాత్రమే చెవి ఒగ్గుతాం. పక్షుల పాటలను, సముద్రం చేసే ధ్వనిని, ఒక భిక్షకుని మాటలను ఎన్నడూ వినవే వినం. అందువల్ల బిచ్చగాడు ఏమంటున్నాడో మనకు తెలియకుండా పోతుంది – బిచ్చగాడు చెప్పేదానిలో సత్యం వుంటే వుండవచ్చును; భాగ్యవంతుడు చెప్పేదానిలో, అధికారంలో వున్న మనిషి చెప్పే మాటల్లో సత్యం ఏమాత్రం లేకపోనూవచ్చును.

**ప్రశ్న: తెలుసుకోవాలనే విపరీతమయిన కుతూహలంవల్ల మేము పుస్తకాలు చదువుతాం. చిన్న వయసులో వున్నప్పుడు మీరు కుతూహలం చూపించేవారు కారా?**

**కృష్ణమూర్తి:** కేవలం పుస్తకాలు చదవడంతోనే మీరు స్వయంగా సత్యాన్ని కనుక్కోగలరని అనుకుంటున్నారా? ఇతరులు చెప్పింది పునశ్చరణ చేయడంవల్ల నూతనమయినది ఏదయినా కనిపెట్టగలరా? లేదూ అన్వేషించడం ద్వారా, సందేహించడం ద్వారా, దేనికీ అంగీకరించకుండా వుండటం ద్వారా మాత్రమే మీరు నూతనమయినది కనిపెట్టగలుగుతారా? మనలో చాలామందిమి ఫిలాసఫీ (తత్త్వశాస్త్రం) గురించి ఎన్నో పుస్తకాలు చదువుతాం. ఈ చదవడం వల్ల మన

మనసులు ఒక ప్రత్యేక ఆకారంలో తమను మలచుకుంటాయి - దీనివల్ల మనం స్వయంగా ఏది సత్యం, ఏది అసత్యం అనే విషయం కనుగొనాలంటే చాలా క్లిష్టంగా వుంటుంది. మనసుని ఒకసారి ఒక విధంగా రూపుదిద్ది వుంచాక, విపరీతమైన ప్రయాసపడితే తప్ప సత్యాన్ని ఆవిష్కరించుకోలేదు.

**ప్రశ్న: భవిష్యత్తును గురించి మనం పట్టించుకోవడం అవసరం కదూ?**

**కృష్ణమూర్తి:** భవిష్యత్తు అంటే మీ అర్థం ఏమిటి? ఇరవై లేక యాభై సంవత్సరాల తర్వాత అనా - భవిష్యత్తు అంటే మీరు అనుకునేది అదేనా? అనేక సంవత్సరాల దూరంలో వున్న భవిష్యత్తు చాలా అనిశ్చితమైనది, అవును కదూ? ఏం జరగబోతున్నదో మీకు తెలియదు, కనుక దానిని గురించి వ్యాకుల పడటం వలన, ఆందోళన చెందడం వలన లాభమేమిటి? ఒక యుద్ధం జరగవచ్చు, అంటువ్యాధులు ప్రబలిపోవచ్చు; ఏదయినా సంభవించవచ్చు; కాబట్టి భవిష్యత్తు అనేది అనిశ్చితం, అది అజ్ఞేయం (తెలియరానిది). ప్రస్తుతం మీరు ఎట్లా జీవిస్తున్నారు, ఏం ఆలోచిస్తున్నారు, ప్రస్తుతంలో మీ మనోభావాలు ఏమిటి అనేవి మాత్రమే ప్రధానమైన విషయాలు. వర్తమానం అంటే యీ రోజు చాలా చాలా ముఖ్యమైనది; రేపూ కాదు, యిరవై సంవత్సరాల తర్వాత జరగబోయేదీ కాదు; వర్తమానాన్ని అవగాహన చేసుకోవాలంటే అశేషమయిన తెలివి కావాలి.

**ప్రశ్న: మనం చిన్నవయసులో వున్నప్పుడు ఆటలతో, అల్లరితో గడుపుతూ వుంటాం. మనకి ఏది మంచిదో మనకే అన్నివేళలా తెలియకపోవచ్చు. తన కొడుకు మంచికోసమే తండ్రి కనుక సలహా యిస్తే, అప్పుడు కొడుకు తండ్రి సలహాను పాటించవద్దా?**

**కృష్ణమూర్తి:** 'మీరు' ఏమనుకుంటున్నారు? నేను తండ్రిని కనుక అయితే, నా కొడుకు నిజంగా తన జీవితంలో ఏం చేయాలనుకుంటున్నదీ మొదట నేను తెలుసుకోవాలి, తెలుసుకోవద్దా? తండ్రికి తన కొడుకును గురించి అతనికి సలహా యివ్వగలిగినంత బాగా తెలుసునా? తండ్రి తన కొడుకును బాగా పరిశీలించాడా? తన పిల్లవాడిని పరిశీలించడానికే వ్యవధిలేని తండ్రి ఆ పిల్లవాడికి ఏమని సలహా యివ్వగలడు? తండ్రి తన కొడుకుకు మార్గదర్శకత్వం వహించాలి అని అనడం వినడానికి చాలా బాగుంటుంది; కాని తండ్రికి తన కొడుకును గురించి ఏమీ తెలియకపోతే అప్పుడు ఏం చేయాలి? ప్రతి పిల్లవాడికి తన స్వంతమైన అభిలాషలు, అభినివేశాలు, శక్తిసామర్థ్యాలు వుంటాయి; వాటిని పరిశీలించాలి; ఒక నియమిత కాలంలో, ఒక నియమిత ప్రదేశంలో మాత్రమే కాదు, అతని బాల్యదశ జరుగుతున్నంతకాలం పరిశీలిస్తూనే వుండాలి.

**ప్రశ్న: క్రిందటిసారి మీరు ఆదర్శవాది ఒక మాయవేషధారి అని అన్నారు. మనం ఒక భవనం నిర్మించాలని కోరుకున్నప్పుడు మనకి ముందుగా దానిని**

**గురించి ఒక ఊహ, యోచన వుండాలి. అదేవిధంగా ఒక నూతన ప్రపంచాన్ని మనం సృష్టించాలంటే ముందుగా మనకి ఒక ఆదర్శం వుండవద్దా?**

**కృష్ణమూర్తి:** మనం నిర్మించదలుచుకున్న ఒక భవనం గురించి ఒక ఊహ, యోచన కలిగివుండటం, ఏదయినా ఒక విషయంలో ఆదర్శపూరితమయిన భావాలు వుండటం ఒకటి కాదు. అవి రెండూ నిస్సందేహంగా వేరు వేరు విషయాలు.

**ప్రశ్న: మన స్వదేశపు క్షేమాన్ని లక్ష్యంగా పెట్టుకొనడంద్వారా, మానవాళి క్షేమాన్నికూడా మన లక్ష్యంగా చేసుకున్నట్లే కదా? మొత్తం మానవాళి క్షేమాన్ని తనకు లక్ష్యంగా చేసుకోవడం అనేది సామాన్య మానవుడికి అందుబాటులో వున్న విషయమా?**

**కృష్ణమూర్తి:** ఒక దేశపు క్షేమం కొరకు కృషి చేయడంలో యితర దేశాలను నష్టపరుస్తే, అది దోపిడీ తత్త్వానికీ, సామ్రాజ్యవాద తత్త్వానికీ దారి తీస్తుంది. ప్రత్యేకంగా మన స్వదేశాన్ని గురించి మాత్రమే మనం ఆలోచిస్తున్నంతవరకు అది సంఘర్షణను, యుద్ధాన్ని సృష్టించకమానదు.

మానవాళి క్షేమాన్ని ప్రధాన లక్ష్యంగా పెట్టుకోవడం సామాన్య మానవుడికి అందుబాటులోనిదేనా అని మీరు అడిగినప్పుడు సామాన్యమానవుడు అంటే మీ అర్థం ఏమిటి? మీరూ, నేనూ సామాన్య మానవులం కామా? సామాన్య మానవుడి కంటే మనం భిన్నంగా వున్నామా? మనలో అంతటి అసామాన్యమయిన విషయం ఏముంది? మనమంతా మామూలు సాధారణ మానవులమే, కామూ? మనకు పరిశుభ్రమయిన దుస్తులు వున్నంత మాత్రాన, బూట్లు వేసుకున్నంత మాత్రాన, కార్లు వున్నంత మాత్రాన అవి లేనివారికంటె మనం భిన్నంగా వున్నామని మీరు అనుకుంటున్నారా? మనం అందరమూ సాధారణమయిన మనుష్యులమే - యిది కనుక మనం నిజంగా అవగాహన చేసుకుంటే మనం ఒక విప్లవాన్నే తీసుకొని రాగలుగుతాం. మన ప్రస్తుత విద్యావిధానంలోని దోషాల్లో యిది ఒకటి; మనం చాలా ప్రత్యేకమయిన వారిమనే భావం, మనం వీధిలో మనిషి లేదా సామాన్యుడు అని పిలుస్తుంటామే అటువంటివారికంటే ఎత్తుగా, చాలా ఉన్నతమైన పీఠంమీద వున్నామనే భావం మనలో యిది కలిగిస్తున్నది.

★ ★ ★

# అధ్యాయం 4

స్కూలు వదిలిపెట్టి వెళ్ళిన తరువాత, మనిషి జీవితపు ఆ పైభాగంలో సుఖమూ, సంతోషమూ కలగడం చాలా అరుదని నేను అనుకుంటున్నాను. ఇక్కడి నుండి వెళ్ళిపోయాక మీరు భయంకరమైన సమస్యలను ఎదుర్కోవలసి వస్తుంది; యుద్ధం అనే సమస్య, వ్యక్తిగత సంబంధాలలో సమస్యలు, మత సంబంధమయిన సమస్య, పౌరులుగా సమస్యలు, సమాజంలోపల ప్రతిక్షణం జరిగే సంఘర్షణలు మొదలైనవి. మిమ్మల్ని యీ సమస్యలన్నీ ఎదుర్కొనడానికి సిద్ధం చేయలేనిది, ఒక సత్యమయిన, సుఖసంతోషమయమైన ప్రపంచాన్ని తయారు చేయలేనిది అయిన విద్యావిధానం ఒక బూటకపు విద్యావిధానమని నాకు అనిపిస్తున్నది. విద్యార్థుల మనసులను సంకుచితం చేసి, ఆ విధంగా వారి దృష్టికోణాన్ని, వారి సుఖసంతోషాలను పరిమితం చేసేటటువంటి సామాజిక ప్రభావాలలో, పరిసరాల ప్రభావాలలో వారు చిక్కుకొని పోకుండా కాపాడటం విద్యాబోధన తప్పకుండా నెరవేర్చవలసిన కర్తవ్యం; మరీ ముఖ్యంగా సృజనాత్మకమయిన భావప్రకటనకు అవకాశం వున్న స్కూలు తప్పక నిర్వర్తించవలసిన కర్తవ్యం.

కాలేజీలో ప్రవేశించబోతున్న వారందరూ, మన అందరినీ సవాలు చేసే అనేక సమస్యలు వుంటాయని తామే స్వయంగా తెలుసుకోవాలి అని నాకు అనిపిస్తున్నది. అత్యంతమయిన నిర్దుష్టత కలిగిన వివేకం మీకు వుండటం అనేది ముఖ్యంగా మీరు ఎదుర్కొనబోయే ప్రపంచంలో చాలా ప్రధానమైన అవసరం. అయితే, యీ వివేకం బయటి ప్రభావాల ద్వారా కాని, పుస్తకాల ద్వారా కాని కలగదు. ఈ సమస్యలను గురించిన ఎరుక కలిగి, వాటిని ఎదుర్కోగలిగినపుడు యిది, వివేకం – కలుగుతుందని నేను అనుకుంటున్నాను. ఈ ఎదుర్కొనడం అనేది వ్యక్తిగతంగా కాని, పరిమితమయిన స్థాయిలో కాని, ఒక అమెరికనుగా, హిందువుగా, కమ్యూనిస్టుగా కాని అయివుండకూడదు; ఒక విషయంలో వున్న సత్యమైన యోగ్యతను ఒక ప్రత్యేక సిద్ధాంతం సహాయంతోకాని, తాత్త్విక ధోరణిని అనుసరించి కాని వ్యాఖ్యానించకుండా, వున్నది వున్నట్లుగా గ్రహించాలి. అటువంటి బాధ్యతను స్వీకరించే శక్తిసామర్థ్యాలు కలిగిన ఒక మనిషిగా సమస్యలను ఎదుర్కొనకలిగినపుడు వివేకం ఉదయిస్తుందని నేను అనుకుంటున్నాను.

కేవలం జ్ఞానాన్ని కాని, సాంకేతిక శిక్షణను కాని యివ్వడం కాకుండా, మనలో ప్రతి ఒక్కరినీ మానవ సమస్యలను అవగాహన చేసుకొని, వాటిని ఎదుర్కొనడానికి సిద్ధపరచడం విద్యావిధానం ముఖ్యంగా చేయవలసినది కదూ? ఎందుకంటే –

గమనించండి – జీవితం అంటే చాలా సునాయాసమైనది ఏమీ కాదు. మీరు చాలా సంతోషంగా యిక్కడ కాలం గడిపివుండవచ్చు; సృజనాత్మకంగా గడిపి వుండవచ్చును; యీ కాలంలో మీరు ఎంతో పరిణతి చెంది వుండవచ్చును; కాని మీరు స్కూలు వదిలి వెళ్ళాక ఎన్నో విషయాలు సంభవించడం ఆరంభిస్తాయి, మిమ్మల్ని చుట్టుముట్టి బంధిస్తాయి; వ్యక్తిగతమైన సంబంధ బాంధవ్యాలే కాకుండా, సామాజిక ప్రభావాలు, మీ లోపల వున్న మీ భయాలు, జీవితంలో విజయం సాధించాలనే అనివార్యమయిన ఆకాంక్ష – యివన్నీ మిమ్మల్ని కొన్ని పరిమితులకు లోనుజేస్తాయి.

ఆకాంక్షాపరత్వం వుండటం ఒక శాపం అని నేను అనుకుంటున్నాను. ఆకాంక్షాపరత్వం అంటే స్వార్థప్రయోజనానికి, స్వార్థపరత్వానికి మరో రూపం; అందువలన అది సగటు మనస్తత్వాన్ని పెంచుతుంది. ఆకాంక్షాపరత్వంతో నిండివున్న ప్రపంచంలో ఏ ఆకాంక్ష లేకుండా జీవించడం – అంటే, ఒక అంశాన్ని నిజంగానే, దానికోసమే ప్రేమించడం; ప్రతిఫలం కొరకుగాని, ఫలితం కొరకుగాని ఆశించకుండా – ఇది చాలా కఠినమయిన పని; ఎందుకంటే ప్రపంచమంతా, మీ స్నేహితులు, మీ బంధువులు అందరూ, ప్రతి ఒక్కరూ – విజయం సాధించాలని, సఫలత చెందాలని, తాము గొప్పవారు అవాలని పోరాడుతుంటారు. ఇదంతా అవగాహన చేసుకొని, దానినుండి విముక్తం అవడం, మీరు నిజంగా ప్రేమించేదానిని, మీకు ప్రీతికరమయిన దానిని చేయడం – అది ఎటువంటి పని అయినా సరే, ఎంత అల్పమైనదయినా సరే, ఏమాత్రం గుర్తింపులేని పని అయినా సరే – "అది" ఒక మహత్తరమయిన గుణాన్ని జాగృతం చేస్తుందని నేను అనుకుంటాను. ఇది ప్రశంసను కాని, పరిహారాన్నికాని ఎన్నడూ కోరదు, ఏ పనులనయినా అచ్చంగా వాటికోసమే చేస్తుంది, కాబట్టి సగటుతనం ప్రభావంలో చిక్కుకొని పోకుండా వుండగల దృఢత్వం, శక్తిసామర్థ్యాలు దానికి వుంటాయి.

మీరు చిన్నవయసులో వున్నప్పుడే యిదంతా తెలుసుకోవడం చాలా ముఖ్యమని నేను అనుకుంటున్నాను; ఎందుకంటే పుస్తకాలు, వార్తాపత్రికలు, టెలివిజన్, రేడియో నిరంతరంగా విజయలక్ష్మిని పూజించడాన్నే నొక్కి వక్కాణిస్తూ వుంటాయి; ఆ విధంగా అవి ఆకాంక్షాపరత్వాన్ని, పోటీ మనస్తత్వాన్ని ప్రోత్సహిస్తాయి; యివి సగటు మనసులను పెంచి పోషిస్తాయి. మీలో ఆకాంక్షాపరత్వం వున్నప్పుడు, మీరు వుండేది అమెరికాలో కానివ్వండి, రష్యాలో, యిండియాలో ఎక్కడయినా సరే, సమాజంలోవున్న ఒక రకమయిన నమూనాకు అనుగుణంగా మిమ్మల్ని సర్దిపుచ్చుకుంటున్నారన్నమాట! కాబట్టి మీరు పైపై స్థాయిలో మాత్రమే అంటే ఒక కృత్రిమమైన స్థాయిలో మాత్రమే జీవిస్తుంటారు.

మీరు పాఠశాలను వదిలి కాలేజిలో ప్రవేశించి, తపైన ప్రపంచాన్ని ఎదుర్కొంటున్నప్పుడు, రకరకాల ప్రభావాలకు లొంగిపోకుండా వుండటం, మీ తలలు వంచి వాటిని అంగీకరించకుండా వుండటం చాలా ముఖ్యం అని నాకు అనిపిస్తున్నది. సౌజన్య శీలత్వంతో, గొప్ప అంతర శక్తితో వాటిని, ఆ ప్రభావాలను ఎదురుకొని,

205-11

వున్నవి వున్నట్లుగా వాటిని అవగాహన చేసుకొని, వాటిలోని అసలయిన ప్రాధాన్యం, వాటి విలువ ఏమిటో తెలుసుకోవాలి. అప్పుడే మీరు ప్రపంచంలో మరికొంత వైరుధ్యం సృష్టించకుండా వుంటారు.

కాబట్టి నిజమయిన పాఠశాల అంటే తన విద్యార్థుల ద్వారా ప్రపంచానికి శుభ దీవెనలు అందివ్వాలి. ప్రపంచానికి యీ శుభ దీవెనలు చాలా అవసరమే; ఎందుకంటే – అది మహా ఘోరమయిన స్థితిలో వుంది; అయితే మనం వ్యక్తిగతంగా అధికారంకోసం ప్రాకులాడనప్పుడు, మన స్వంతమయిన ఆకాంక్షలు సఫలీకృతం చేసుకోవడానికి ప్రయత్నించనప్పుడు, మనల్ని నిలవేసే అసంఖ్యాకమయిన సమస్యలను స్పష్టంగా అర్థం చేసుకున్నప్పుడు మాత్రమే యీ శుభ దీవెనలు అందివ్వడం సాధ్యమవుతుంది. దీనికి అపారమైన వివేకం అవసరం అవుతుంది. అంటే, ఏదో ఒక పద్ధతికి చెందిన నమూనాను అనుసరించి ఆలోచించకుండా, తనకు తను స్వేచ్ఛగా వుండి, ఆ విధంగా సత్యమయినదానిని గ్రహించి, అసత్యమయిన దానిని ప్రక్కకి తోసివేసే శక్తిసామర్థ్యాలు గల మనసు అని అసలయిన అర్థం.

★ ★ ★

# ఈ పుస్తకం గురించి..

అపూర్వమైన సునిశితత్వంతో మనిషి మనసు
లోతులను తరచిచూసి ప్రపంచమంతటినీ దిగ్భ్రాంతి పరిచారు
జిడ్డు కృష్ణమూర్తి. తమ తాత్త్విక ఆలోచనలతో
దేశవిదేశాలలో అన్ని వయసుల వారినీ వుత్తేజితం చేశారు.
అసంఖ్యాకులను తమ ప్రసంగాలతో వుర్రూతలూగించారు.
ఆంగ్లంలో చేసిన ఆయన ప్రసంగాలన్నీ
గ్రంథరూపంలో వచ్చాయి. అద్భుతమైన ప్రజాదరణ పొందాయి.
పేదరికం, ద్వేషం, సంకుచితత్వం, హింస, అసూయ,
యుద్ధాలు, పోటీలు లేని ఒక నవ్యనూతనమైన ప్రపంచాన్ని
నిర్మించుకొనే క్రొత్త తరాలను తయారుచేయాలని
అభిలషించారాయన. ఆ లక్ష్యంతో నెలకొల్పిన విద్యాలయాల్లో
ప్రధానంగా విద్యార్థులను వుద్దేశిస్తూ చేసిన
ప్రసంగాల సంపుటి 'లైఫ్ అహెడ్' కు యిది అనువాదం.
ఒక్క విద్యార్థులనే కాదు, టీచర్లనేకాదు
ఈ జీవితం అంతా ఏమిటీ? అని తెలుసుకోవాలని
కోరే చిన్నా, పెద్దా అందరినీ వుద్యోగులు, కళాకారులు,
గృహిణులు, రచయితలు ప్రతి ఒక్కరినీ
ఆసక్తితో చదివించి, ఆలోచింపజేసే 'ముందున్న జీవితం'
మీ ముందు వున్నది. తెలుసుకోండి! అద్భుతమైన
యీ జీవితాన్ని గురించి.

● జె. కృష్ణమూర్తి ★ జీవితం ●

# జె. కృష్ణమూర్తి





# ముందున్న జీవితం